# చైనా (అ)గమనం




డాక్టర్ యస్. జతిన్ కుమార్

ప్రచురణ
భారత–చైనా మిత్రమండలి, హైదరాబాద్

# చైనా (ఆ)గమనం

## వ్యాస సంకలనం


రచన

**డాక్టర్ యస్. జతిన్ కుమార్**



ప్రచురణ

**భారత-చైనా మిత్రమండలి**

హైదరాబాద్

# చైనా (ఆ)గమనం, వ్యాసాల సంకలనం
## డాక్టర్ యస్.జతిన్ కుమార్

ప్రచురణ: భారత–చైనా మిత్రమండలి, హైదరాబాద్

ఇ–బుక్ తయారి : అక్టోబరు 2019

**వివరాలకు:**

**డా॥యం.మోహన్‌రెడ్డి,** ప్రధాన కార్యదర్శి,

**భారత–చైనా మిత్రమండలి**

నోవా ఇయన్‌టి హాస్పటల్, ఎర్రమంజిల్ మెట్రోస్టేషన్ దగ్గర,
సోమాజిగూడ, హైదరాబాద్–500489, తెలంగాణ.
ఫోన్: 9393022444 / 9866132427

**డాక్టర్ యస్.జతిన్ కుమార్**

ఇంటి నెంబర్: 48–452/1, జనహిత ప్రాంగణం, గణేశ్‌నగర్,
చింతల్, హెచ్.ఎమ్.టి. రోడ్, హైదరాబాద్–500054, తెలంగాణ.
ఫోన్: 9849806281

**బుక్ మేకింగ్ : నూతన్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్**

# వ్యాసాల వరుస

# 1.

## నా మాట...

జనచైనా రాజ్యం 1949 అక్టోబరు 1న ఆవిర్భవించింది. అంటే ఇప్పటికి 70 సంవత్సరాలు గడిచాయి. నవచైనా పుట్టుక, ఎదుగుదల ఆ దేశప్రజలకే కాక ప్రపంచానికంతా, మరీ ముఖ్యంగా సామ్యవాద శక్తులకు స్ఫూర్తినిచ్చిన చరిత్ర ప్రాముఖ్యత కలిగిన ఒక పరిణామం.

ఈ 70వ వార్షికోత్సవం సందర్భంగా ఆ దేశ గమనాన్ని పరిశీలించి, మానవ సమాజాలు నేర్చుకోవలసిన పాఠాలు, ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాల వికాసానికి దారిచూపే సూచనలు గ్రహించాలనే భావంతో ఈ వ్యాస సంపుటిని మీముందు వుంచుతున్నాను.

ఈ 70 సంవత్సరాలలో జనచైనా ప్రపంచం దృష్టిని ఆకర్షించింది. ఆసక్తిని కలిగించింది. ఘనమైన విజయాలు సాధించి, స్వతంత్రమైన, సంపద్వంతమైన, బలమైన దేశంగా ఎదిగింది. చైనాను సర్వోన్నతంగా తీర్చిదిద్దాలనే తమ కలను సాకారం చేసుకునే దీక్షతో ఆ దేశ ప్రజలు ముందడుగు వేస్తున్నారు. ఒక కొత్త చరిత్రను రచిస్తున్నారు.

అసాధారణమైన అభివృద్ధి, పరస్పర సహకారము సహాయము, ప్రాంతీయ, అంతర్జాతీయ సుస్థిరత, భద్రత, దేశ సార్వభౌమత్వ రక్షణ సూత్రాలు అనుసరించటం, అంతర్జాతీయ చట్టాలనూ, వాటి క్రమాన్ని గౌరవించటం, బహుధృవ ప్రపంచాన్ని, సరికొత్త అంతర్జాతీయ విధానాలకు రూపకల్పన చేయటం, సమానత్వం, పరస్పర ప్రయోజనం, ఇరుపక్షాలకీ గెలుపు బాటలో నడిపించే సూత్రాల ఆధారంగా, ఐక్య రాజ్య సమితి ఆమోదించిన లక్ష్యాలు, ప్రయోజనాలకు అనుగుణంగా దేశాలమధ్య సంబంధాలు నెలకొల్పడం – మానవజాతి సంయుక్తంగా, ఉమ్మడి అభివృద్ధి లక్ష్యాలుగల భవిష్యత్ సమాజ నిర్మాణానికి ఎకంకావటం అనేవి చైనానుండి వర్తమాన ప్రపంచం అనువర్తించుకోవలసిన విధానాలు.

ఈ వ్యాసాలలో చైనా ప్రగతిని పరిశీలించటంలో కొన్నిచోట్ల మనదేశ స్థితిగతులను పోల్చి చూడటం జరిగింది. అనుకున్నంత వేగంతో మనదేశం పురోగమించక పోవటం, జరిగిన అభివృద్ధిఫలాలు సైతం సామాన్య మానవుడికికాక బడాపెట్టుబడిదారీ, బడాభూస్వామ్య

పాలకవర్గాల చేతుల్లోనే చిక్కుకుపోయి వుండటం అనేది కబోదులకు కూడా కనిపించే వాస్తవం. మన స్థితి కొంత నిరాశాజనకంగా వున్నా, ఆ స్థితినుంచి బయటపడటానికి మనం ఏం చేయాలి అనే ఆలోచన కల్పించటమే ఈ వ్యాసాల లక్ష్యం. చైనాను ప్రశంసించటమో, మన అభివృద్ధిని లెక్కచేయకపోవటమో కాదు.

ఈ వ్యాసాలలో చైనాలోని ప్రజల జీవనస్థితిగతులను నిర్ణయిస్తున్న అంతర్గత, వ్యవస్థాగత అంశాలను పరిశీలించాను. అయితే, అంతర్జాతీయ రంగంలో చైనా నిర్వహిస్తున్న పాత్రను, ఇతర దేశాలతో కలిగివున్న సంబంధాలను సిద్ధాంతరూపంలోనూ, రేఖామాత్రంగానూ మాత్రమే ప్రస్తావించాను. ఇరు దేశాల ప్రజల మధ్య సదవగాహన పెరగటానికి జీవన స్థితిగతులను తెలుసుకోవటం అవసరమనే ఉద్దేశంతోనే ప్రధానంగా ఈ అంశాలపై దృష్టిసారించటం జరిగింది.

వారిది నియంతృత్వమనీ కనుక వాళ్లు అనుకున్నది కఠినంగానైనా అమలు చేస్తారనీ, అందువల్ల వారు వేగవంతంగా అభివృద్ధి చెందుతున్నారని ఒక ప్రచారం వున్నది. మనది ప్రజాస్వామ్యమనీ, స్వేచ్ఛగా నెమ్మదిగా జరుగుతున్న అభివృద్ధి అని మన పాలకులు అంటారు. చైనా సాధిసున్న అభివృద్ధి ప్రాధాన్యతను గుర్తించ నిరాకరించటం, అభివృద్ధిలో మనం వెనుకబడి వుండటాన్ని సమర్థించుకోవటమే ఈ ప్రచార లక్ష్యం. వాస్తవంలో భారతదేశంలో బడాబూర్జువా, బడా భూస్వామ్య దోపిడి స్వేచ్ఛగా కొనసాగుతోంది. వీరికి సేవ చేసే శక్తులకు మన ప్రజాస్వామ్యంలో పెద్దపీట వేశారు. ఈ దోపిడీలను వ్యతిరేకించే శక్తులకు ఎటువంటి ప్రజాస్వామ్యమూ లేదు. చైనాలో ఈ రెండురకాల దోపిడి శక్తులనుంచి విముక్తి సాధించి, జనతా ప్రజాస్వామ్యాన్ని ఏర్పరచి సోషలిస్టు నిర్మాణం సాగిస్తున్నారు. కనుక వారి పథకాలు, ప్రణాళికల ప్రయోజనాలు సమాజానికీ, అంతిమంగా ప్రజలకీ చెందుతున్నాయి. వ్యవస్థల పరంగా ఈ రెండు దేశాల మధ్య వున్న ఈ మౌలిక అంతరాన్ని పరిగణించకుండా వారు అమలు చేసే కొన్ని పథకాలను ఇక్కడ అనుసరించినా వాటి ఫలితం మన ప్రజలకు వుపయోగకరంగా వుంటుందని చెప్పలేము. ప్రజల సంక్షేమం కోసమని చెబుతూ ఆ పథకాలను ఇక్కడి దోపిడి శక్తులు తమకు లాభకరంగా వుండేలా అమలుచేస్తారని గుర్తించాలి. ముందు జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని సాధించకుండా భారతసమాజం తన ప్రజల శక్తియుక్తులను సమాజ అభివృద్ధికి వినియోగించుకోజాలదు. మేమూ చైనా పద్ధతులనే అనుసరిస్తున్నామని చెప్పుకున్నా సోషలిస్టు అభివృద్ధిని అందుకోజాలదు.

మన వార్తాసమాచార, ప్రసారమాధ్యమాలలో చైనాపట్ల శత్రుభావము, దుర్భ్రమలు, అవహేళనలు, వక్రీకరణలు ఎక్కువగా కనిపిస్తాయి. చైనా వ్యతిరేక ప్రచారం పెద్దయెత్తున సాగుతూవుంటుంది. ఆ ప్రభావం ప్రజల ఆలోచనలపై వుంటుంది కూడా. అసలు ఆ దేశంలో ఏం జరుగుతోంది అనే ఆసక్తిగల పాఠకులకు, ప్రజలకు చైనావారి వాదనలను, వారి పత్రికలలో వచ్చిన విశ్లేషణలను తెలియజేయటంవల్ల పరిస్థితిని సమగ్రంగా, సరిగా అవగాహన చేసుకునే వీలుంటుందనే భావంతో ఈ సంపుటిని మీ ముందుకు తెస్తున్నాను.

మన ప్రజల సంక్షేమంపట్ల అనురక్తి, దేశం పట్ల ఆసక్తి, జాతి ఔన్నత్యంపట్ల తపనగల దేశభక్తిపరులందరూ, మరో మంచి ప్రపంచపు కలల పిపాసులందరూ ఈ వ్యాసాలలోని ప్రధాన ఉద్దేశ్యాన్ని గ్రహిస్తారని, మన దేశ భవిష్యత్తును ప్రజానందకరంగా మలచుకునే కృషికి కంకణధారులవుతారనీ ఆశిస్తూ....

# మరో మాట...

ఇవి గత కొంతకాలంగా రాస్తూవస్తున్న వ్యాసాలు, గ్లోబల్ టైమ్స్, బీజింగ్ రివ్యూ వంటి పత్రికలలో వచ్చిన వ్యాసాలకు స్వేచ్ఛానువాదాలు, అనుసరణలు. కొన్ని ప్రత్యేక సందర్భాలలో రాసినవి. నేను రెండుసార్లు చైనాలో పర్యటించిన సందర్భంగానూ, భారత దేశంలో పర్యటించిన కొందరు చైనా ప్రతినిధులతో వ్యక్తిగతంగా జరిపిన సంభాషణల సందర్భంగానూ పొందిన అనుభవాలు వ్యాసాలుగా రాశాను. కొన్ని వ్యాసాలలోని విషయాలు పాతవిగా అనిపిస్తాయి. కొన్ని పరిస్థితులలో మార్పులు కూడా వచ్చాయి. అయినప్పటికీ ఆయా సందర్భాలలో అంతర్గతంగానూ, అంతర్జాతీయంగానూ వారు ఎలాంటి విధానాలు అవలంబించారనే అవగాహన కల్పించటమే ప్రధానం కనుక వాటిని ఈ సంకలనంలో చేర్చటం జరిగింది. ఇంటర్నెట్‌లో పొందుపరిచివున్న సమాచారం, అంతర్జాతీయ సంస్థలు ప్రకటించిన గణాంకాలు, ఆయా సందర్భాలలో చైనా నాయకుల ఉపన్యాసాల సారాంశాలను విరివిగా వాడుకోవటం జరిగింది. మా సంస్థ కార్యవర్గ సమావేశాలలో చేసిన చర్చల సారాంశాలను, కార్యదర్శి నివేదికలోని అంశాలను కూడా పొందుపరచటం జరిగింది. మన పాఠకుల సౌకర్యం కోసం అనువాదాలకు తోడుగా కొన్ని వివరణలు అదనంగా కూర్చటం జరిగింది. అయితే అన్నిచోట్లా మూలాన్ని (సోర్స్) ఉల్లేఖించటం సాధ్యంకాలేదు.

ఈ వ్యాసాలలో కొన్ని ఇంతకుముందు పత్రికలలో, 'ఆంధ్రజ్యోతి'లోను, ప్రధానంగా 'ఉపాధ్యాయ ప్రగతి' (మాసపత్రిక)లోను ప్రచురించటం జరిగింది. వీటిని ప్రచురించి ఆదరించిన ఆ పత్రికాధిపతులకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను. వీటిని చదివి, కొన్ని సరిదిద్ది మెరుగుదలకై సూచనలు ఇచ్చిన మిత్రులకు, మా సంస్థ బాధ్యులకు నా కృతజ్ఞతలు. ఈ వ్యాసాలు పుస్తక రూపంలో మొదటిసారే ప్రచురిస్తున్నా, ఇంతకుముందు అచ్చయినవాటిలో కొన్నిటిని కత్తిరించి, విస్తరించి, తాజా గణాంకాలుచేర్చి ప్రచురించటం జరుగుతోంది. కనుక ఇది రెండవకూర్పుగానే భావించాలి. ఈ వ్యాసాలను ప్రస్తుతం పుస్తకరూపంలో ప్రచురిస్తున్న భారత-చైనా మిత్రమండలికి ప్రత్యేకించి నా సహచర కార్యవర్గానికి మనసారా నా కృతజ్ఞతలు. ఈ కృషి మీ అవగాహనను విశాలం చేస్తుందని భావిస్తూ, మైత్రీ ఉద్యమానికి మీ అండదండలు ఆశిస్తూ...

**- డాక్టర్ యస్.జతిన్ కుమార్**

# 2.

# మన దేశాభివృద్ధికి, ప్రపంచ శాంతికి భారత-చైనా మైత్రి ఒక చారిత్రక అవసరం

*(భారత-చైనా మిత్రమండలి జాతీయ మహాసభలు, 2016 సందర్భంగా రాసిన కరపత్రాలు, పత్రికా ప్రకటనల ఆధారంగా ఈ ప్రసంగవ్యాసం)*

---

ఈ 21వ శతాబ్దంలో ప్రపంచం, శాస్త్ర సాంకేతిక రంగాలలో అనూహ్యమైన విజయాలను సాధించటం ద్వారా, మౌలికవసతులు, రాకపోకలు, సమాచారపంపిణీలను అద్భుతంగా నిర్వహించుకోవటం ద్వారా శరవేగంగా పురోగమిస్తోంది. ప్రపంచస్థాయిలో ఇతరులతో సత్సంబంధాలు నెలకొల్పుకోవటం, పరస్పరం ఇచ్చిపుచ్చుకోవటం అన్ని దేశాలకు అత్యవసరంగాను, తప్పనిదిగాను మారిపోయింది.

మరోవంక సంఘర్షణలు, యుద్ధాలు అనాగరిక విచ్ఛిన్నతకు దారితీస్తున్నాయి. బీదరికం, అనారోగ్యం వ్యాపిస్తున్నాయి. మానవజాతి అనేక విషమపరిస్థితులను, దు:ఖాలను ఎదుర్కొంటోంది. జీవావరణంలో, పర్యావరణంలో అనేక అవాంఛనీయమైన మార్పులు పెద్ద ఎత్తున కొనసాగుతున్నాయి. ఈ ప్రపంచం ఇంకా గతకాలపు తప్పిదాలు, పొరపాట్ల అడుసులో దిగబడిపోయే వుంది.

సామ్రాజ్యవాదులు, అగ్రరాజ్య దురహంకారవాదులు, ఆధిపత్యవాదులు తమ దోపిడిని స్థిరపరుచుకోవటానికి, విభజించి పాలించటమనే తమ గత కాలపు సిద్ధాంతాలను మరింత పట్టుదలతో అనుసరిస్తూనే వున్నారు.

ఈ స్థితిలో సౌమనస్యం, సామరస్యం గల ప్రపంచమనేది మానవజాతికి సుదూర స్వప్నంగానే మిగిలివుంది. సాధించుకోవలసిన కర్తవ్యంగానే వుంది. అయితే ప్రపంచ చరిత్రలోనే మొట్టమొదటిసారిగా అన్ని ఖండాల ప్రజలు తమ భవిష్యత్తుపై ఎంతో ఆశతోను, విశ్వాసంతోను వున్నారు. ఎందుకంటే రోజురోజుకూ క్షీణిస్తున్న సామ్రాజ్యవాద అధికార

ప్రాభవాన్ని, వాళ్ళు కళ్ళారా చూస్తున్నారు. అదే సమయంలో సామరస్యం, శాంతియుత సహజీవనం అన్న పతాకను చేబూని, 'సమిష్టి ప్రగతికోసం సమాజం' అన్న నినాదనాదం ఆలపిస్తూ అంతర్జాతీయరంగంలో బలంగా అడుగులు వేస్తూన్న జనచైనాను వారు గమనిస్తున్నారు.

ప్రపంచంలోని శాంతికాముక ప్రజలు, దేశాలు, చైనా ఆలపిస్తున్న ఈ తాత్విక గీతంతో గొంతు కలుపుతున్నారు. మానవజాతి చిరకాల స్వప్నమయిన సామరస్య ప్రపంచాన్ని సాకారం చేయటానికి కలసి కదంతొక్కుతున్నారు. చైనా పరపతి, ప్రాభవాలతో, రోజురోజుకీ అభివృద్ధి చెందుతున్న దేశాలమధ్య సయోధ్య, పరస్పర సహాయసహకారాలు ఇనుమడిస్తున్నాయి. అంతేకాదు, అభివృద్ధి చెందిన దేశాలలో సైతం కొందరు చైనాతో కలిసి నడవక తప్పని పరిస్థితికి తలవొగ్గుతున్నారు.

యధాతథస్థితిని కోరుకునే ఆధిపత్యవాదులు, విచ్ఛిన్నకర శక్తులు రోజురోజుకీ బట్టబయలవుతూ, భయాందోళనలకు గురవుతున్నారు. వీళ్ళు ఎదుగుతున్న చైనాను ప్రపంచానికి ఒక పెద్ద ముప్పుగా చూపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. కానీ శాంతికాముక ప్రపంచం ఈ దుష్ప్రచారాన్ని నమ్మటం లేదు.

ఆవిర్భవించిన నాటినుండీ నవచైనా తాను ఎన్నుకొన్న సోషలిస్టు మార్గంలో గణనీయమైన విజయాలను సాధిస్తూ కృతనిశ్చయంతో ముందుకు సాగుతోంది. అమెరికా, తదితర పాశ్చాత్య పెట్టుబడిదారీ దేశాలు నిత్యం ఎదుర్కొంటున్న సంక్షోభాలకు, కానరాని పరిష్కారాలకు తావులేకుండా చైనా పురోగమనం సాగిస్తున్నది. అందువల్లే ప్రపంచం ఎంతో ఆసక్తిగా చైనా వైపు చూస్తూన్నది. ఆసియా మౌలిక వసతుల అభివృద్ధికై బ్యాంకు – సమిష్టి అభివృద్ధి కోసం ఉమ్మడి కృషి, One Belt-One Road (OBOR) వంటి కొత్త ప్రతిపాదనలతో ప్రపంచ అభివృద్ధికి చైనా చొరవ తీసుకుంటున్నది. పరస్పర ప్రయోజనకరమయిన ఈ విధానాలు ప్రపంచాన్ని అబ్బుర పరుస్తున్నాయి.

మరి అమెరికావంటి సామ్రాజ్యవాద శక్తులు మాత్రం తమ పాత పద్ధతులలోనే ఈ ప్రపంచాన్ని ఇంకా కొత్తకొత్త రాజకీయ మిలటరీ కూటములుగా విభజించటం, పునర్విభజించటం ద్వారా పెత్తనం కొనసాగించుకునే దుశ్చింతలోనే మునిగివున్నాయి. ఈ ఆధిపత్యవాదులకు వత్తాసుపలికే మేధావిగణం కూడా చైనా మీద కట్టుకథలు అల్లడం, పుకార్లు వ్యాపింప చేయడంలో నిమగ్నమై వున్నారు. చైనాదేశం చేస్తూన్న వాణిజ్యవ్యాపారాలను, అందిస్తూన్న పెట్టుబడి సాయాలను కూడా వాళ్ళు వక్రీకరిస్తున్నారు. ఆఫ్రికా తదితర పేదదేశాలతో చైనా వర్తకవ్యాపారాలను, ఆయా దేశాలలో చైనా పెడుతున్న పెట్టుబడులను – చైనాలో తలయెత్తిన నయాసామ్రాజ్యవాద ధోరణిగానూ, పేదదేశాల వనరులను

దోచుకుంటున్న దోపిడిదారుగాను చిత్రిస్తున్నారు. ఇది ప్రజలకు చాలా హానికలిగించే విషప్రచారం. అయితే మూడవ ప్రపంచదేశాలు ఈ మాటలు నమ్మటానికి సిద్ధంగా లేవు. ఆయా దేశాలకు తమవైన ఎన్నో చారిత్రక అనుభవాలు వున్నాయి. వాళ్ళకు ఏది సామ్రాజ్యవాద దోపిడియో బాగాతెలుసు. చైనా ఇస్తూన్న పరస్పర ప్రయోజనంగల సహకారం, తమ దేశ అంతర్గత విషయాలలో జోక్యం చేసుకోకపోవటం అన్న విధానంలోని సౌకర్యాన్ని, చైనా నిజాయితీని వాళ్ళు బాగా అర్థం చేసుకున్నారు. అందుకే ఆయా దేశాలు సామ్రాజ్యవాదుల బెదిరింపులను, లాలింపులను లెక్కచేయకుండా చైనావెంట నడవడానికి సిద్ధపడుతున్నాయి.

ఈ పరిస్థితులలో భారతదేశం మాత్రం అన్నిరంగాలలో అంతర్జాతీయ అవకాశాలు కోల్పోతోంది. అమెరికాలాంటి అగ్రదేశాల ప్రయోజనాలకు, వారి వ్యూహాత్మక లక్ష్యాలకు అనుకూలంగా వ్యవహరించటం ద్వారా మన దేశ ప్రయోజనాలను కాలరాస్తోంది ఇక్కడి పాలకవర్గం.

అమెరికా అగ్రరాజ్యం దక్షిణ చైనా సముద్ర వివాదంలాంటి కొత్త కొత్త వివాదాలను, కొత్త ఉద్రిక్తప్రాంతాలను, అనేకచోట్ల యుద్ధవాతావరణాన్ని సృష్టిస్తోంది. అంతేకాదు భారత దేశాన్ని తమ వ్యూహచక్రంలో చేరమని ప్రోత్సహిస్తోంది. కాంగ్రెసు నాయకత్వంలోని గత UPA ప్రభుత్వం చెప్పిన 'తూర్పుకు చూద్దాం' అన్న విధానంకానీ NDA ప్రభుత్వం ప్రకటించిన 'తూర్పు వైపు పని చేద్దాం' అన్న విధానంకానీ, అంతర్జాతీయంగా అమెరికా తీసుకున్న 'ఆసియాలో కేంద్రీకరిద్దాం' లేక 'ఆసియాయే ఇరుసు' అన్న విధానానికి తోడ్పడేందుకు రూపొందించినవే. చైనాకు వ్యతిరేకంగా ఆసియా పసిఫిక్ ప్రాంతంలో అమెరికా, జపాన్, ఆస్ట్రేలియా, ఫిలిప్పీన్సు, వియత్నాంవంటి దేశాలతో ఇండియా జట్టుకట్టేందుకు ఉద్దేశించినవే.

భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని కొత్త ప్రభుత్వం, అగ్రరాజ్య ప్రయోజనాలకు, వారి ఆదేశాలకు లోబడకుండా వుండటం, ఇరుగుపొరుగు దేశాలతో స్నేహసంబంధాలు నెలకొల్పుకోవటం తమ విధానంగా ప్రకటించుకొంది. ఈ వుద్దేశాలు నిజం కావాలంటే ఈ ప్రభుత్వచర్యలు కూడా వారి మాటలకు అనుకూలంగా ఉండాలి. తమమీద వున్న అన్నిరకాల సామ్రాజ్యవాద సంకెళ్ళను బద్దలుకొట్టుకొని బయటకురాకుండా, జాతీయ ప్రయోజనాలను కాపాడుకోవటం, స్వతంత్ర విధానాలు అవలంబించటం అసాధ్యం.

అయితే గత UPA ప్రభుత్వానికి భిన్నంగా NDA ప్రభుత్వం కొన్ని సానుకూలచర్యలు తీసుకున్నట్లు మనం గమనించవచ్చు. దేశరక్షణకు భంగకరమనే పేరిట చైనా పెట్టుబడులు మన దేశంలోకి రాకుండా గతంలో పూర్తిగా నిరోధించారు. ఆ నియమనిబంధనలు కొంత సడలించి చైనా పెట్టుబడులను ఆహ్వానిస్తోంది ప్రస్తుత ప్రభుత్వం.

అయితే అగ్రరాజ్య దురహంకార విధానాలకు వంతపాడుతూ వారితో జతకట్టడం, అదే సమయంలో చైనాతోసహా పొరుగురాజ్యలతో సత్సంబంధాలు నెలకొల్పుతామనటం పరస్పర విరుద్ధంగా వున్నాయి. ఇవి ఒకదానితో ఒకటి పొసగని విషయాలు.

సర్వసత్తాక, స్వతంత్రదేశంగా తన అభివృద్ధిపథాన్ని తానే నిర్వహించుకోవాలనే భారత ప్రజల ఆకాంక్ష ఇంకా పూర్తి చేసుకోవలసిన కర్తవ్యంగా మిగిలేవుంది. చైనాతో పూర్తిస్థాయి మైత్రీసంబంధాలను నెలకొల్పుకోవటంలో వస్తున్న ఆటంకాలను అధిగమించవలసే వుంది. ఎదురవుతున్న సమస్యలను పరిష్కరించుకోవలసే వుంది.

1. ప్రపంచంపై ఆధిపత్యానికై అమెరికా అనుసరిసున్న వ్యూహాలు మనదేశ ప్రయోజనాలకు హానికరమయినవి. కనుక భారత ప్రభుత్వం అమెరికా వ్యూహంనుండి బయటపడాలి. దేశాలమధ్య నిజమైన సహకారాన్ని, ఉమ్మడి ప్రయోజనాలను రక్షించే, ప్రపంచశాంతిని నెలకొల్పే ఉద్దేశంగల ప్రతిపాదనలను ఆమోదించాలి.

2. టిబెట్, దలైలామా వంటి విషయాలను చైనాతో మనకున్న మిత్రసంబంధాలను ఆటంకపరిచే సమస్యలుగా ఎదగనీయకూడదు. మన భూభాగంనుండి తమ చైనావ్యతిరేక రాజకీయ కార్యకలాపాలు కొనసాగనివ్వకూడదు.

3. సరిహద్దులలో చైనా చొరబాట్లు అనే పేరిట ఒక పథకం ప్రకారం కొనసాగిస్తూన్న చైనా వ్యతిరేక విద్వేషప్రచారాన్ని అరికట్టాలి. ప్రజలలో సదవగాహన, స్నేహభావాలు కల్పించటానికి ప్రయత్నించాలి. అలాంటి సానుకూల వాతావరణంలో సరిహద్దు వివాదాన్ని ఇరుపక్షాలకు ఆమోదమోగ్యమయిన రీతిలో, సత్వరం పరిష్కరించాలి.

ఈ కర్తవ్యనిర్వహణలో భారత-చైనా మైత్రీఉద్యమాన్ని అకుంఠితంగా కొనసాగించవలసి వుంది.



# 3.

# నేను చూసిన చైనా...

## మొదటి పర్యటన - జూన్, 2012

భారత్ చైనా మిత్రమండలి క్రియాశీల సభ్యునిగా అనేక సంవత్సరాలుగా నేను భారతదేశం చైనాతో మరింత ఉన్నతస్థాయిలో స్నేహసంబంధాలు పెంపొందించుకోవాలనే ఉద్యమ ఆకాంక్షతో పనిచేస్తున్నాను. అనేక రీతులలో చైనా గురించి అవగాహన పెంచుకుంటున్నాను. ఎప్పటికప్పుడు చైనా స్నేహశీలంతో నూతన ప్రతిపాదనలు చేస్తూన్నా, భారత ప్రభుత్వం తగినంత ఉత్సాహంతో ప్రతిస్పందించడం లేదనే విషయమూ గమనిస్తూన్నాను. భారత్ – చైనా దేశాల మధ్య మైత్రికి, అంతర్జాతీయ మానవతా దృక్పథానికి, సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధ వారసత్వానికి ఒక మేలిమి ప్రతీకగా వున్న డా॥ద్వారకానాథ్ కోట్నీస్ స్మృతిని జ్వలింపజేస్తూ, ఆ స్నేహస్ఫూర్తిని ఇరుదేశాల మధ్య తిరిగి పునరుద్ధరించుదామనే ఉద్దేశంతో భారత – చైనా సంయుక్త వైద్య బృందాల కార్యక్రమాలను ప్రతిపాదించింది చైనా. డా॥కోట్నీస్ పాల్గొన్న చైనా సహాయక వైద్యబృందం పర్యటన 70వ వార్షికోత్సవం సందర్భంగా 2008లో నూతనంగా తొలి సంయుక్త బృందం పర్యటన నిర్వహించింది. జపాన్ సామ్రాజ్యవాద దురాక్రమణను ప్రతిఘటిస్తూ చైనా ప్రజలు సాగించిన వీరోచిత పోరాటంలో గాయపడ్డ సైనికులకు, ప్రజలకు వైద్య సహాయం అందజేయటానికి మొట్టమొదటి భారతీయ వైద్య బృందం చైనాకు 1938లో వెళ్ళింది. ఐదుగురు సభ్యుల ఆ బృందంలో, నాలుగు సంవత్సరాలపాటు చైనా యుద్ధరంగంలో అవిశ్రాంతంగా పనిచేసి, చైనా ప్రజల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్న భారతీయ వైద్యుడు డా॥ద్వారకానాథ్ కోట్నీస్ అక్కడే ప్రాణాలు కోల్పోయారు. ఆయనను స్ఫూర్తిగా తీసుకుని చైనా ప్రధాని వెన్ జియాబావో భారత ప్రధాని డా॥ మన్‌మోహన్ సింగ్‌తో కలసి దీన్ని ప్రారంభించారు. 2010లో 2వ బృందం పర్యటనలు సాగాయి. అప్పుడు భారత దేశం తన అధికార సభ్యులను పంపలేదు. భారత–చైనా మిత్రమండలి ఆ కర్తవ్యాన్ని భుజాలకెత్తుకుంది. డా॥కోట్నీస్ స్మృతిని స్ఫూర్తిగా

తీసుకొని, ఆయన చూపిన అంతర్జాతీయ సహోదరత్వం, మానవత, భారత–చైనా ప్రజల మధ్య మైత్రి అన్న లక్ష్యాలకు అనుగుణంగా భారత–చైనా మిత్రమండలి (ఐసిఎఫ్ఏ), విదేశాలతో మైత్రికోసం ఏర్పడ్డ చైనా ప్రజల సంస్థ (సిపిఎఎఫ్ఎఫ్సి) ఈ పర్యటనలను సంయుక్తంగా నిర్వహిస్తున్నాయి. డా॥కొట్నీస్ శతజయంతిని పురస్కరించుకుని 5గురు సభ్యుల వైద్యబృందాన్ని చైనాకు పంపింది. దానికి సంస్థ ప్రధాన కార్యదర్శి డా॥ మోహన్‌రెడ్డి నాయకత్వం వహించారు. ప్రత్యక్షంగా తాను చూసిన విషయాలు అనేకం నాతో ఆయన పంచుకున్నారు. అప్పటినుంచీ ఆ దేశాన్ని సందర్శించాలనే ఆకాంక్ష నాలో పెరిగింది. మళ్ళీ 2012లో 3వ సంయుక్త వైద్యబృందం విధి నిర్వహణకు ఎన్నుకోబడుతున్న సందర్భంగా ప్రముఖ న్యూరోసర్జన్ డా॥రాజరెడ్డిగారు, హైదరాబాద్ నార్త్ ఐ.యమ్.ఏ. అధ్యక్షుడు డా॥సంపత్‌రావులతో పాటుగా నేనుకూడా ఆ బృందంలో చేరాను. ఈ బృందాలు ఇరుదేశాలలోనూ సంయుక్తంగా పర్యటనలు చేస్తూ, ప్రజల వైద్య అవసరాలను అధ్యయనం చేయడం, అవగాహన చేసుకోవడం, వైద్య సర్వీసుల పనితీరులను సమీక్షించడం, ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించడం జరుగుతోంది. ఈ సేవలద్వారా భారత, చైనా ప్రజల మధ్య సద్భావన, సదవగాహన, స్నేహ వాతావరణం నెలకొల్పడం జరుగుతోంది. రెండుదేశాల ప్రజలమధ్య మైత్రి ఇరుదేశాల ప్రయోజనాలకు, భారతదేశ ప్రగతికి, ప్రాదేశిక శాంతికి అత్యావశ్యకం అని భావిస్తున్న భారత–చైనా మిత్రమండలి ప్రతినిధులుగా మేము ఈ పర్యటనలో పాల్గొనటం ఒక సదవకాశంగా భావించాము. అంతర్జాతీయ విమాన రాకపోకల ఖర్చులు మేమే పెట్టుకుని అక్కడికి వెళ్ళాము. చైనాలో వారం రోజులపాటు (జూన్ 24 నుండి జూలై 2 వరకు) వైద్యబృందం సభ్యులుగా ఆ ప్రభుత్వ ప్రత్యేక అతిథ్యాన్ని పొందాము. ఈ సంయుక్త బృందాల కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తూన్న విదేశాలతో మైత్రి కోసం ఏర్పడ్డ చైనా ప్రజా సంస్థ (CPAFFC) ఈ బృందం మొత్తానికి (10మంది భారత డాక్టర్లు, 10మంది చైనా డాక్టర్లు, కొంతమంది అధికారులు) మరిచిపోలేని అతిథి మర్యాదలతో, సకలసౌకర్యాలతో వూహించలేనంత స్నేహ సౌహార్ద వాతావరణంలో ఈ కార్యక్రమం నిర్వహించింది. ఈ పర్యటన జీవితంలో మరిచిపోలేనంత మధురమైన జ్ఞాపకంగా మిగిలిపోయింది.

ఆ అధికార పర్యటనను, మేము స్వంత ఖర్చులతో విస్తరించుకొని మరికొన్ని చారిత్రక, పర్యాటక ప్రాంతాలను, మకావో, హంగ్‌కాంగ్‌లాంటి ప్రదేశాలను కూడా సందర్శించాము. మేము వ్యక్తిగత స్థాయిలో మరో వారంరోజులు ఆ దేశంలో గడిపాము. అలా ప్రభుత్వ అతిథిగాను, ఒక మామూలు పర్యాటకునిగాను కూడా నేను అనుభవం పొందాను. నేను ఇదివరకే కొన్ని విదేశీయాత్రలు చేసివుండటంవల్ల, నా బంధుమిత్రులు అనేకమంది అమెరికా, యూరప్, ఇంగ్లాండ్, చైనా దేశాలను చూసి రావటం, లేక అక్కడ నివసిస్తూ వుండటంవల్ల, ఆయా ప్రాంతాల, జీవనవైవిధ్యంపట్ల, అక్కడి పర్యాటక ప్రాంతాలపట్ల, వారి సంస్కృతీ సౌరభాలపట్ల కొంత అవగాహన కలిగివున్నాను. అంతేకాదు, ఈ పర్యటనకు వెళ్ళేముందు నా

కుమారుడు డా॥నిశాంత్ సహాయంతో ఇంటర్నెట్‌నుండి అనేక విషయాలు సేకరించి, చదువుకుని, ఒక స్పష్టమయిన పర్యటనా కార్యక్రమాన్ని రూపొందించుకున్నాము. అక్కడ ఏ విధమయిన ఇబ్బందులూ తలెత్తకుండా వీలయిన అన్ని ప్రయాణ, వసతి, పర్యాటక ఏర్పాట్లు ఇక్కడినుంచే, ముందుగానే (రిజర్వు) చేసుకొన్నాము. ట్రావెల్ ఏజెన్సీల సహకారమూ తీసుకున్నాము. మనం ఎంత స్పష్టంగా, నిర్దుష్టంగా మన కార్యక్రమం రూపొందించ గలుగుతామో కచ్చితంగా అంత నిర్దుష్టంగా ట్రావెల్ ఏజన్సీలు మనకు కావలసిన ఏర్పాట్లు చేయగలవని, మన ఖర్చులు, ఆహార వ్యవహారాలు చాల ప్రణాళికాబద్ధంగా నియంత్రించుకోవచ్చనీ నాకీ పర్యటనలో అనుభవపూర్వకంగా తెలిసింది. కేవలం ఏజెన్సీల మీద మాత్రమే ఆధారపడితే ఖర్చు తడిసి మోపెడవుతుంది.

చైనా పర్యటనలో నేను చూసినవన్నీ పూసగుచ్చినట్లు యాత్రాకథనంలా, అంతా వివరించబోవటంలేదు. ముఖ్యంగా ఈనాడు అందరికీ తెలిసిన బీజింగ్, షాంఘైవంటి పెద్ద పట్టణాలలోవున్న పర్యాటక ప్రాంతాల గురించి సవివరంగా చెప్పాలనీ భావించటం లేదు. సాధారణ పర్యాటకుని అనుభవంలోకి రాలేని, నేను కనులార గమనించిన విషయాలను మాత్రం మీ ముందు వుంచుతున్నాను.

2012 జూన్ 23 అర్థరాత్రి హైదరాబాద్ రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయం నుంచి బయలుదేరి మూడున్నర గంటల ప్రయాణం తరువాత థాయ్‌లాండ్ రాజధాని బ్యాంకాక్ సువర్ణభూమి విమానాశ్రయానికి చేరుకున్నాము. అక్కడినుంచి మరో 4.30 గంటల వాయు ప్రయాణం తర్వాత 24వ తేదీ సాయంత్రం 4.30కి బీజింగ్ అంతర్జాతీయ విమానాశ్రయం 3వ టెర్మినల్ చేరుకున్నాము. అప్పటినుంచే చైనా భూమిని లోతుగా పరిశీలించటం ఆరంభమయిపోయింది. ఈ విమానాశ్రయం ఒక బృహత్తర కట్టడం. ఆధునిక హంగులతో, నవీన నిర్మాణ రూపంలో వుంటుంది. అలంకరణలు, వస్తు ప్రదర్శనలలో చైనా సంప్రదాయ విశిష్టతల ప్రత్యేకత కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. చైనా వారి అతిథి మర్యాదలు కూడా అక్కడినుంచే మొదలైనాయి. మా కోసం CPAFFC ఉన్నతాధికారి ఒకరు వచ్చి ఎంతో ఆప్యాయంగా, మన ఇంటిమనిషే మనకోసం వచ్చాడన్నంత కలుపుగోలుగా మాతో కలసిపోయి స్వాగతం పలికాడు. విమానాశ్రయం గేటునుంచి పార్కింగ్ వరకు రైలు. అక్కడినుంచి ఆధునిక వసతులన్నీ వున్న అందమైన వాహనంలో 50 నిమిషాల్లో హోటల్ హాలీడే ఇన్ అనే నాలుగు నక్షత్రాల హోటల్‌కు చేరుకున్నాం. దారిలో పచ్చగా వ్యాపించి వున్న చెట్టూచేమా, బహుళ అంతస్తుల భవనాలు, క్రమబద్ధంగా సాగుతున్న వాహనాల బారులు చూస్తూ ఆనందించాము. అన్నట్టు అక్కడ వాహనాలు రోడ్డుకు కుడిప్రక్కన నడుపుతారు. హోటల్ రిసెప్షన్‌లోనే మా ఈ పర్యటన పర్యవేక్షకురాలు లియూ అనే మహిళా అధికారి మమ్మలను మర్యాద పూర్వకంగా కలుసుకొని కొన్ని సూచనలు ఇచ్చింది. ఉదయం 9 గంటలకల్లా అల్పాహారం ముగించుకొని హోటల్ రిసెప్షన్‌లో కలుసుకోవాలని చెప్పింది. మా వారం రోజుల కార్యక్రమం గంటలు

నిమిషాలతో సహా రాసి వుంచిన ఒక బ్రోచరు మా చేతికి ఇచ్చారు. వాళ్ళ సమయపాలన ఎంత కచ్చితంగా వుంటుందంటే ఆ తరువాత ఎప్పుడూ మాకిచ్చిన ఈ కార్యక్రమప్రణాళికలోని టైంకు ఒక నిమిషం అటూ ఇటూ తేడారాలేదు. వాళ్ళ పటిష్టమైన కార్యనిర్వాహణ శైలికి మనం తలవొంచుకోవలసిందే. ఆ రాత్రీ, ఉదయమూ మిగతా రాష్ట్రాలనుంచి వచ్చిన డాక్టర్లతో పరిచయాలు, పరామర్శలు, కొంత లోతుగా మన వైద్య బృందం కర్తవ్యం, డా॥కోట్నీస్ స్ఫూర్తి వంటి విషయాలను మాట్లాడుకున్నాం. మిగతా రాష్ట్రాల ప్రతినిధులు కేవలం డాక్టర్లుగానే వచ్చారు తప్ప ఈ వైద్యబృందం ఏర్పాటు వెనుకవున్న స్ఫూర్తి, రాజకీయ అవగాహన, చైనా దేశం ఎందుకు ఈ స్నేహవారధిని నిర్మిస్తోంది అన్న ఆలోచనకానీ తెలియనివారు అనిపించింది. వాళ్ళకు ఆయా రాష్ట్రాలలో వున్న భారత చైనా మిత్రమండలి శాఖలతో కూడా అంతగా పరిచయంలేదని తెలిసింది. అందువల్ల నేను వారికి సంస్థ గురించి, డా॥కోట్నీస్ గురించి, అంతర్జాతీయ స్నేహ సంబంధాల ప్రాధాన్యత గురించి కొంత వివరించాను. మా టీము లీడరుగా, ముందుగావచ్చిన డా॥సరాబ్‌జిత్ సింగ్ అనే పంజాబ్ దంతవైద్యుణ్ణి నియమించారు. ఆయన యువకుడు, ఉత్సాహవంతుడు, ఎంతో కలుపుగోలు మనిషి. అయితే ఇలాంటి పర్యటనలుగానీ, అధికార కార్యక్రమాల ప్రొటోకాల్స్‌గానీ అంతగా తెలియవు. మైత్రీ ఉద్యమం గురించి కూడా తెలియదు. దాంతో ఆయన మన తెలుగు ప్రతినిధుల భావాలు, సూచనలు తీసుకుని తన బాధ్యతను ఎంతో చక్కగా నిర్వహించాడు. కేవలం వైద్యులుగానేగాక మేము (పదిమంది బృందమూ) భారతీయ సంస్కృతీ రాయబారులుగా, మిత్రులుగా బాధ్యతాయుతంగా వ్యవహరించామని చెప్పక తప్పదు. దీని వల్ల చైనా డాక్టర్లు, నిర్వాహకులు మా పట్ల చూపించిన అభిమానమూ, గౌరవమూ వాళ్ళ అధికార పరిధినిమించి విస్తరించి ఒక చక్కని స్నేహపూరిత వాతావరణం నెలకొంది. ఏ అరమరికలు లేకుండా దేశాల గురించి, వృత్తివిధానాల గురించి, సాధారణ జీవితం గురించి ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నాం. సంకోచాలు, మొహమాటం లేకుండా చర్చించుకున్నాం. దీనివల్ల నాకు వారిపట్ల, ఆ సమాజం పట్ల మరింత అవగహన పెరిగింది. ప్రత్యక్షజ్ఞానం ఎంత సదవగాహన కల్పించిందో మాటల్లో చెప్పలేను.

25వ తేదీ 10 గంటలకు ఉన్నతస్థాయిలో, అధికారిక ఏర్పాట్లతో "వైద్యబృందం ప్రారంభ సమావేశం" ఒక ఉత్సవంలా జరిగింది. ఈ బృందంలో పాల్గొంటున్న చైనా డాక్టర్లు డా॥కోట్నీస్ పనిచేసిన హిబీ ప్రోవిన్స్ (రాష్ట్రం)కు చెందినవారు. వారు ఈ వారం రోజుల కార్యక్రమాలు, వారి అంచనాలు అన్నీ వివరించారు. భారత రాయబార కార్యాలయం ప్రతినిధి కూడా ఈ సభలో మాట్లాడారు. అక్కడి వైద్యరంగపు ప్రగతిచక్ర గమనాన్ని వివరించే అనేక చిత్రాలు, గణాంకాలు, ఫోటోలతో ఒక ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. ఈ సభలో రెండవ వైద్య బృందంతో హైదరాబాద్ వచ్చిన శ్రీమతి లిల్లీని కలిశాను. ముందున్న పరిచయంతో ఆవిడ మాకు చక్కటి ఆత్మీయతను పంచిపెట్టింది. మా తిండితిప్పలే కాదు, మా పోగ్రాంలో లేని

అదనపు అంశాలు. చిన్నచిన్న షాపింగులు, మ్యూజియంలు, ప్రక్కప్రక్క వున్న ప్రాంతాల సందర్శనలవంటి విషయాలలో ఎంతో సహకరించి ఏ ఇబ్బందీ రాకుండా చూసుకుంది. తర్వాత ఆరోగ్య మంత్రిత్వశాఖ అధికారులతో సమావేశం. వారి ఉపన్యాసాలు, నివేదికలు ఇంగ్లీషులోకి తర్జుమాచేసినా ఉచ్చారణ భేదంవల్ల చాలావరకు అర్థమయ్యేవి కాదు. అందుకని నేను సాధ్యమయిన అన్నిచోట్ల బ్రోచర్లు, సూచనపత్రాలు సేకరించేవాణ్ణి. అవికూడా చాల వరకు చైనాభాషలోవున్నా అక్కడక్కడ ఫోటోలు, ఇంగ్లీషు వ్యాఖ్యానాలు వున్నాయి. వైద్య సర్వీసుల గురించి కొన్ని ఇంగ్లీషు చిరుపుస్తకాలు కూడా సేకరించాను. అయితే అవన్నీ అధికారిక ప్రకటనలే కనుక వీలయినంత వరకు రకరకాల ఆసుపత్రులను, వైద్యసంస్థలను సందర్శించినప్పుడు అక్కడి రోగులతో మాట్లాడి (దుబాసీ ద్వారానే) డాక్టర్లతో పనిచేసి, కొంత విషయాన్ని అర్థం చేసుకోవాలనుకున్నాను.

ఈ పర్యటనలో మా ప్రధాన కార్యక్షేత్రం హిబే రాష్ట్రం. దాని ముఖ్యపట్టణం షిజియా జువాంగ్ నగరం. దీని జనాభా దాదాపు 20 లక్షలు. 26న 10 గంటలకల్లా బీజింగ్‌లో బయలుదేరి సాయంత్రం 4 గంటలకు అక్కడికి చేరుకున్నాం. దారి మధ్యలోనూ, అక్కడికి చేరాక రాత్రికీ చాలా పెద్దఎత్తున విందు భోజనాలు ఏర్పాటు చేశారు. ఉత్తమ స్థాయి వంటలు, ఉన్నత స్థాయి హోటళ్ళు, ఎంతో అభిరుచిని ప్రదర్శిస్తున్న అలంకరణలు, రసజ్ఞతను ప్రతిఫలించే పరిసరాలు, పరిశుభ్రత, వందల కిలోమీటర్ల రోడ్లప్రక్కన నాటిపెంచిన వృక్షసంపద, ఏమాత్రం కుదుపులు రానివ్వని రహదారులు, నియమబద్ధంగా సాగుతున్న డ్రైవింగు, చిన్నచిన్న పట్టణాలు గ్రామాలగుండా సాగిపోతున్నప్పుడు కనిపిస్తున్న జనం, వారు పనిపాటలలో నిమగ్నమై వున్నతీరు, విశేషించి దేశమంతా పెద్దఎత్తున సాగుతున్న గృహనిర్మాణ కార్యక్రమం, వందలాది క్రేన్లు, భారీ భవంతులు ఎవరూ ఏమీ చెప్పకుండానే చైనా సాధించిన అనూహ్యమైన ప్రగతిని ప్రత్యక్షంగా చాటిచెబుతున్నాయి.

27వ తారీఖున డా॥కోట్నీస్ పేర వెలసిన చైనా-భారత మైత్రీ ఆసుపత్రికి వెళ్ళాము. అక్కడ రోగులను పరీక్షించి, ఆ తర్వాత డా॥నార్మన్ బెతూన్ అంతర్జాతీయ శాంతి ఆసుపత్రికి వెళ్ళాము. ఆ మధ్యాహ్నము, రాత్రి ఈ రెండు పెద్ద హాస్పిటళ్ళ నిర్వాహకులు మాకు స్వాగతసత్కారాలు, భోజన సదుపాయాలు కల్పించారు. కోట్నీస్ ఆసుపత్రిలో దాదాపు 2వేల పడకలు వున్నాయి. నరాల జబ్బులకు, గుండె జబ్బులకు, ప్రత్యేక నిపుణులున్న స్పెషాలిటీ హాస్పిటల్ అది. అక్కడ రోజూ దాదాపు 18 నుంచి 20 వేల మంది పేషంట్లను చూస్తారు. న్యూరోసర్జరీ విభాగంలో 35 మంది న్యూరో సర్జన్లు వున్నారు. ఆర్థోపెడిక్ విభాగంలో కూడా 40 మంది డాక్టర్లు (పట్టభద్రులు) వున్నారు. ఆ తరువాత డా॥బెతూన్ ఆసుపత్రికి వెళ్ళాము. డా॥నార్మన్ బెతూన్ చరిత్ర అందరికీ తెలిసిందే కదా! కెనడానుంచి వచ్చి చైనా దేశస్తుల పోరాటంలో పాల్గొని, అంతర్జాతీయ మానవతా దృక్పథాన్ని ప్రదర్శించిన మహోన్నత మానవుడు. యుద్ధరంగంలో పనిచేస్తూనే 1939లో ఆయన రక్తంలో ఇన్ఫెక్షను సోకిన

కారణంగా ప్రాణలు కోల్పోయాడు. ఆ మహామనిషి స్మృత్యర్థం చైనా వారు ఆ యుద్ధపు రోజుల్లోనే ఆయన పేర ఒక వైద్య సంస్థను ఆరంభించారు. ఆ సంస్థలో డా॥ద్వారకనాథ్ కోట్నీస్ డైరెక్టరుగాను, అధ్యాపకునిగాను పనిచేసారు. ఈ ఇద్దరినీ గౌరవిస్తూ ఈ రెండు పెద్ద ఆసుపత్రులను నిర్వహిస్తున్నారు. ఈ నగరంలోనే ఆ ఇద్దరికి 'వీరుల ఖనన ప్రదేశం'లో స్మారక చిహ్నాలు నిర్మించి, అతి పవిత్రంగా, సగౌరవంగా నిర్వహిస్తున్నారు. ఇద్దరివీ భారీ విగ్రహాలు నెలకొల్పి నివాళులర్పిస్తున్నారు.

డా॥బెతూన్ శాంతి ఆసుపత్రి ప్రాంగణం చాల విశాలమైనది. బహుళ అంతస్తుల భవనాలు వున్నాయి. ఈ ప్రాంగణంలోనే ఒకప్రక్క డా॥కోట్నీస్ జ్ఞాపకార్థం ఒక ప్రత్యేక ప్రదర్శనశాల వుంది. ఆ ప్రదర్శనను ఎంత గౌరవంగా, ఎంత పవిత్రంగా, ఎంత హుందాగా నిర్వహిస్తున్నారో చూచి తీరవలసిందే కానీ మాటల్లో చెప్పలేము. ఆ సంస్థలలో ప్రతి అడుగులో ఈ ఇద్దరు మహనీయులపట్ల కృతజ్ఞతాభావమే కాక వారిని ఆదర్శంగా స్వీకరించాలనే పూనిక తొణికిసలాడుతూ వుంటుంది.

బెతూన్ హాస్పిటల్‌లో కూడా దాదాపు 3వేల పడకలు ఉన్నాయి. ఇది ఒకవంక సైన్యానికి మరోవంక పౌరసమాజానికి అందుబాటులో వుంది. ఈ సంస్థలో ప్రఖ్యాతులైన నిపుణులు చాలామంది వున్నారు. బృందంలోని డాక్టర్లం ఆయా డిపార్టుమెంట్లకు చెందిన డాక్టర్లతో కలసి హాస్పిటల్ అంతా సందర్శించాం. హాస్పిటల్ నిర్వహణ చాలా చక్కగా వుంది. చికిత్సావిధానాలు చాలా ఆధునికంగా ఉన్నాయి, అలాగే సంప్రదాయ పద్ధతులను కూడ అనుసరిస్తూన్నారు. ఉదాహరణకి, ఆధునికవైద్యంలో బ్రెయిన్‌ట్యూమర్ ఆపరేషను చేసి, ఆతర్వాత వాళ్ళ సంప్రదాయ పద్ధతిలో ఫిజియో వ్యాయామాలు అందించి, రోగి సత్వరంగా కోలుకునేట్లు చేస్తున్నారు. చైనా సంప్రదాయ వైద్య విభాగాలు ప్రత్యేకంగా వున్నాయి. రోగి తనకిష్టమైన విధానం ఎంచుకొని చికిత్స పొందవచ్చు. ప్రత్యేకించి ఆర్థోపెడిక్ విభాగంలో చాలా ఆధునికమైన పరికరాలతో అపరేషన్లు చేస్తూవున్నారు. ఆపరేషను థియేటర్లలోనూ చైనా తయారీ పరికరాలే ఎక్కువగా కనపడ్డాయి.

28వ తేదీ ఉదయం మేము రాజకీయ, సాంస్కృతిక విషయాలపై ఏర్పాటు చేసిన మ్యూజియం సందర్శించాము. మాతో వున్న చైనా డాక్టర్లు మొబైల్ ఫోన్లలో వున్న డిక్షనరీ ట్రాన్స్‌లేషన్ సౌకర్యాలను ఉపయోగించుకొని మాకు మ్యూజియం గురించి క్షుణ్ణంగా వివరించారు. వారు చరిత్రను ఎంత శ్రద్ధగా కాపాడుకుంటున్నారో అని ఆశ్చర్యం వేసింది. అనేక వస్తువులను ఎంత శ్రద్ధగా సేకరించారో, అంత శ్రద్ధగానూ ప్రదర్శనలో అమర్చారు. ఒక సీక్వెన్సులో దేశచరిత్ర అర్థమయ్యేలా తయారుచేశారు. అక్కడ పనిచేస్తూన్న ఉద్యోగులు, ఆఫీసర్లు, సందర్శకులపట్ల చూపిస్తున్న గౌరవం, (విదేశస్తులపట్లనే కాదు స్థానికులపట్ల కూడా) సందర్శకుల ప్రశ్నలకు వాళ్ళు సమాధానం ఇస్తూన్న తీరు, ఒక ప్రభుత్వ ఉద్యోగి ఇంత

ఆసక్తిగా, ఇంత ఉత్సాహంగా, ప్రజానుకూలంగా పని చేయగలరా అని మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. నిజానికి ఈ మ్యూజియంలోనే కాదు, ఇతర ఆఫీసులలోను, ఆసుపత్రులలోను, ఉద్యోగస్తులు, తోటీలు, ఆయాలు, నర్సులు, డాక్టర్లు ఎక్కడా రోగులను విసుక్కున్నట్లుగానీ, కసురుకున్నట్లుగానీ మాకు కనపడలేదు. నిజానికి ఒక్కో డాక్టరు మీద, నర్సు మీద పనిభారం చాలా ఎక్కువగానే వున్నట్లు అనిపించింది. పనిగంటలు నియమానుసారంగా వున్నాయి కానీ పనిభారం చాలా ఎక్కువగా వుంది.

మధ్యాహ్నం 3గంటలకు గువాంగ్ ఝూంగ్ అనే కౌంటీకి బయలుదేరాం. అంటే మన తాలూకా లేక మండల కేంద్రాల లాంటిదన్నమాట. ఈసారి రహదారి వ్యవసాయ పొలాల మధ్యనుంచి, డబుల్ లేక సింగల్ లేన్ రోడ్డు మీద సాగింది. నీటి ఇంజన్లు. చిన్నచిన్న యంత్రాలు, పరికరాలు ఉపయోగిస్తూ చేస్తూన్న వ్యవసాయ పనులు, నెత్తిన టోపీలు పెట్టుకుని పని చేసుకుంటున్న వ్యక్తులు దారి పొడుగునా కనిపించారు. ఒక్కోచోట 3-4గురు కంటే మించి లేరు. అక్కడక్కడ పశువులు, గ్రీన్ హౌసులు వున్నాయి. మన దగ్గరలాగే రోడ్డు మీద ధాన్యాలు ఆరబోసి వుండటము కనిపించింది.

గువాంగ్ ఝూంగ్ పట్టణం చేరి రాత్రి డిన్నర్‌కు సిద్ధమవుతున్న సమయంలో ఒక విషాద వార్త తెలిసింది. డా॥కొట్నీస్ భార్య గియో ఛ్వింగ్‌లాన్ ఈ రోజు మరణించింది. 1916లో జన్మించిన గియో ఛ్వింగ్‌లాన్, 96 సంవత్సరాల వయసులో చైనా ఈశాన్య భాగంలోవున్న దాలియన్ పట్టణంలో మరణించింది. మేము ఇప్పుడున్నది ఉత్తర చైనాలో. ఇక్కడినుంచి అక్కడకు దాదాపు 12గంటల ప్రయాణం. డా॥కోట్నీస్ ఈ ప్రాంత ప్రజల హృదయాల్లో చిరంజీవిగా వున్న వైనం, ఆయనకు లభిస్తూన్న గౌరవ మర్యాదలు చూసి ఆయన స్మారక చిహ్నాలతో గడిపిన మాకు "గియో ఛ్వింగ్‌లాన్ అంత్యక్రియలలో పాల్గొంటే బాగుండును" అని అనిపించింది. కానీ అధికార కార్యక్రమాల మధ్యలో వున్నాం కనుక అది సాధ్యం కాదని భావించి, మా బృందం అక్కడే ఒక సంతాప సభ జరిపి, మా సంతాప సందేశం పంపించాము. మనం చైనాలో వున్నపుడు ఇలా జరిగిందే అనే చిన్న విచారభావన అలుముకుంది అందరిలో.

29 జూన్ ఉదయం కౌంటీ హాస్పిటలుకు వెళ్ళాము. ఇది 260 పడకల ఆసుపత్రి. ఆర్థోపెడిక్ విభాగంలో 30 పడకలున్నాయి. తాలుకా స్థాయిదే కానీ మన జిల్లా హస్పిటల్స్ కంటే ఎన్నో రెట్లు ఉన్నత స్థాయిలో వుంది. దాదాపు అందరు స్పెషలిస్టులు వున్నారు. ఇక్కడ మేము రోగులను పరీక్షించాము, వార్డులు చూశాము. చైనా వైద్యవిధానంలో ఉచిత సేవ అనేది లేదని తెలుసు గదా! (ఇప్పుడే కాదు చారిత్రకంగా కూడా వైద్యానికి ప్రజలు ఖర్చుపెట్టవలసే వుండింది. జనచైనా ఆవిర్భావం తరువాత కొద్దికాలం మాత్రం ఉచితంగా సేవలందించాలని అభిలషించారు కానీ అది సాగలేదు. ప్రతి హాస్పిటలు తన స్వంత ఆర్థిక వనరులు సమకూర్చుకోవాలి. స్వయంపోషకంగా వుండాలి. తన అభివృద్ధికి కావలసిన ఆర్థిక వనరులు

కూడా సంపాదించుకోవాలి! అందువల్ల మార్కెట్ సూత్రాలు అనుసరిస్తున్నట్టుగా అనిపించింది. ఆధునిక వైద్యంలోని సాంకేతిక ప్రగతిని, పరీక్షలు చేసి రోగ నిర్ధారణ చేసే విధానాన్ని క్రిందస్థాయి హాస్పిటల్సు వరకు తీసుకువెళ్ళారు. గతంలోలాగ నాడిపట్టుకుని చూసి మందులు ఇచ్చే పద్ధతులను అనుసరించటం లేదు. పేషంట్లు కూడా పరీక్షలు, వసతులు ప్రామాణికంగా, వుండాలనే భావిస్తున్నారు. పైకి మన హాస్పిటల్స్ లాగానే కనిపించినా, అక్కడ ప్రైవేటు వైద్యవిధానం చాల తక్కువగా లభ్యం కావటంవల్ల, సదుపాయాలు అన్నీ ప్రభుత్వ సంస్థలే కలిగించవలసిన ఆవశ్యకత వుండటంవల్ల, ఆ వ్యవస్థలు మన దగ్గరికన్నా ఎక్కువ బాధ్యతాయుతంగా పనిచేస్తున్నాయి. ఎప్పటికప్పుడు మెరుగుపరచు కోవడానికి ప్రయత్నిస్తున్నాయి. 2009లో చైనాలో ప్రసవానంతర మహిళలకు, శిశువులకు ఉచిత వైద్యసేవలు అనే పథకం ప్రవేశపెట్టారు. కానీ దాని అమలు జరగవలసినంత శ్రద్ధగా జరగలేదనీ ప్రభుత్వం నిర్ణయించిన లక్ష్యాలు చేరుకోలేకపోయారనీ హీబే తదితర రాష్ట్రాలలో చేసిన సర్వేలో తెలిసింది. పిల్లల పోషణ గురించి 35% తల్లులకు మాత్రమే సలహాలు ఇచ్చారనీ 25% స్త్రీలు ఈ సలహాలు అనవసరమని భావించి సర్వీసు సెంటరుకు రాలేదనీ తెలిసింది. ప్రతి సేవకు రుసుము చెల్లించవలసి వున్నా, అలా చెల్లించలేని వ్యక్తులకు ప్రత్యామ్నాయంగా గ్రామకమిటీలు, వలంటరీ ఆర్గనైజేషన్లు లేక జిల్లాసంస్థలు, సహకార సంస్థలు, ఆసుపత్రులలోనే ఏర్పాటు చేసిన సహాయనిధి వంటి అనేక పద్ధతులు అవలంబించి రోగులకు అవసరమైన వైద్యాన్ని అందిస్తున్నారు. దీనివల్ల పేషంట్లు ఏదో దయాధర్మం మీద ఆధారపడినట్లు గాక తమకు కావలసిన వాటిని కచ్చితంగా డిమాండ్ చేస్తున్నారు. అలాగే వైద్యాధికారులు, హాస్పిటలు నిర్వాహకులు మన సర్కారీ దవాఖానాలలో వలే గాక శ్రద్ధగా, బాధ్యతగా, ప్రజానురక్తితో తమ విధులు నిర్వహిస్తున్నారు. ప్రాథమిక డాక్టరుకు 20 నుంచి 25వేల యువాన్ల నెల వేతనం వుంది.(1 యువాన్ = సుమారు 10 రూపాయలు) వారి సమర్థత, సీనియారిటీ, నిపుణత ఆధారంగా ప్రమోషన్లు, తగిన పారితోషికం లభిస్తాయని చెప్పారు. కనీస ప్రమాణాలు, కనీస జీతభత్యాలు (అన్ని రంగాల ఉద్యోగాలకు) నిర్ణయించబడ్డాయి. ఎప్పటికప్పుడు తమ నిపుణతను, అర్హతను పెంచుకునే అవకాశాలు కల్పించబడ్డాయి. ఈ ఆసుపత్రిలో వసూలు చేస్తున్న రుసుములు ఎలా వున్నాయో అని చూస్తే సాధారణ కన్సల్టేషనకు 10, ఎక్స్‌రే పరీక్షకు 100, రక్త పరీక్షలకు 20 నుండి 80 యువాన్లు వున్నట్టుగా తెలిసింది. మరి యం.ఆర్.ఐ. పరిక్షకు 300 యువాన్లు, అపెండిసెక్టమీ ఆపరేషనకు 3 వేలు, ఎముకలు విరిగితే 4వందల యువాన్లు తీసుకుంటున్నారు. ఇది మన ప్రైవేటు హాస్పిటల్స్‌లో కంటే కొద్దిగా తక్కువ. హాస్పిటలు భవనాలు, సమకూర్చిన వసతులు ప్రామాణికంగా వున్నాయి. ఒక్కో సాధారణ రూములో 3 పడకలు వున్నాయి. కొన్ని సింగల్ ప్రత్యేక రూములు, ఐ.సి.సి.యు. విభాగం కూడా వుంది. పేషంటు దగ్గరనుంచి నర్సింగ్ స్టేషనుకు అలారం సౌకర్యాలు, మానిటర్స్ తగినంతగా ఏర్పాటు చేసి వున్నాయి. ఆపరేషన్లు చేయించుకున్న వాళ్ళకంటే ఆపరేషన్లు అవసరం లేని సాధారణ చికిత్సలు కావలసినవాళ్ళు

అధికంగా వున్నారు. చాలా మందికి సెలైన్ ఎక్కుతుండటం చూశాము. నర్సులతోపాటు, రోగి తాలూకు బంధువులు కూడా సహాయకులుగా వుండటం, వాళ్ళు కూడా కొన్ని పనులు చేస్తూవుండటం కనిపించింది. రోగుల ఆహారాన్ని హస్పిటల్‌లోనే అందిస్తున్నారు. వివిధ వార్డులు పరిశీలించిన మేమందరం వాళ్ళ వసతుల పట్ల సంతృప్తి చెందాము. ఖర్చులు మన దగ్గర కంటే తక్కువ కాదనీ, చికిత్సా విధానం మన కంటే బాగా అభివృద్ధి చెందినదేమీకాదనీ, అయితే కొన్ని రంగాలలో (ఉదా॥ దంతవైద్యం, ప్లాస్టిక్ సర్జరీ, నరాల జబ్బులు) వారు చాలా పురోగతిని సాధించారని భావించారు మన డాక్టర్లు. మా బృందంలో ఎక్కువమంది ప్రభుత్వ డాక్టర్లుగా పనిచేసిన వాళ్ళు వుండటంతో ఇంతగాకపోయినా మనము ఇవన్నీ ఉచితంగా చేస్తున్నాము. వీళ్ళు డబ్బు ఎందుకు వసూలు చేస్తున్నారు? కమ్యూనిష్టు దేశమంటే ఫ్రీగా ఉండాలి కదా? అనే అభిప్రాయం వెలిబుచ్చారు. పేదలకు ఉచితం, లేక మన దగ్గర ప్రకటిస్తున్న సంక్షేమ పథాకాల ప్రభావంతో మనం అలా ఆలోచిస్తున్నాం కానీ నిజంగా ఈ ప్రజలు ఉచితంగా కావాలని కోరుకుంటున్నారా? అందుబాటు ధరలో, నాణ్యమైన, సత్వరమైన చికిత్సా విధానం కోరుకుంటున్నారా? అనే చర్చ నడిచింది. మేము రోగులతో మాట్లాడిన మేరకు తెలిసింది ఏమంటే వారికి మరింత సౌకర్యాలు కావాలనీ, వైద్యం అందటంలో జరుగుతున్న జాప్యాన్ని నివారించాలనీ, వైద్యం ఇంకా తమ ఇల్లు, లేక వూరికి సమీపంగా రావాలనీ, వైద్యం కోసం దూరంగా వుండే పట్టణాలకు వెళ్ళే పరిస్థితి తగ్గిపోవాలనీ వారు కోరుకుంటున్నారు. డబ్బు అనేది పరిష్కరించుకోలేని సమస్యేమీ కాదన్నారు. ఆరోగ్య భద్రతా కార్డులు, ఇన్స్యూరెన్స్ సదుపాయాల వల్ల గతంలోకంటే ప్రస్తుతం వైద్యం అందుబాటులోకి వచ్చిందనే అన్నారు. మనకూ వాళ్ళకూ మరో పోలిక కూడా కనిపించింది. గ్రామాలలో మన దగ్గర చిన్నచిన్న అనారోగ్యాలకు ఏవో గృహవైద్యాలు, చిట్కాలు, కాయా కసరూ తినటం వంటివి చేస్తుంటాము కదా! చైనాలో కూడా అలాగే దాదాపు 10, 15 రోజులు ఇంటి వద్దనే గడిపి వాటితో ఫలితం రానప్పుడే హాస్పిటలుకు వస్తున్నట్టు గమనించాము. ఆ డాక్టర్లు కూడా ఇది నిజమేననీ ప్రతియింటిలో ఒక అమ్మమ్మ లేక నాన్నమ్మ లాంటి గృహ వైద్యులు తప్పనిసరిగా సలహాలిస్తుంటారనీ, చైనా ప్రజలకు తమ సంప్రదాయ వైద్యం మీద వున్న అపారమైన నమ్మకంవల్ల ఇలాంటివి ఎక్కువగా ఆచరిస్తూ వున్నారనీ, హాస్పిటలుకు రాలేకపోవటానికి డబ్బులు లేక పోవటం కారణం కాదనీ చెప్పారు. ఇలాంటి చర్చలు, సమాచార మార్పిడితోనే భోజనం కూడా ముగించుకుని మధ్యాహ్నం ఒంటిగంటకు బయలుదేరి ఛెన్ ఝువాంగ్ అనే గ్రామానికి వెళ్ళాము. అక్కడి స్థానిక ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఉచిత రూరల్ మెడికల్ క్యాంపులో పాల్గొన్నాము. ఇండియా డాక్టర్లు వస్తున్నారని బాగానే ప్రచారం జరిగింది. మేం వెళ్ళేటప్పటికే పేషంట్లు పెద్ద సంఖ్యలోనే వచ్చి వున్నారు. ఇది అచ్చమైన పల్లెటూరు. 650 మంది జనాభా. చుట్టుపక్కల వున్న వూళ్ళ నుంచి కూడా క్యాంపు కోసం పేషంట్లు వచ్చారు. ఇక్కడి ఆరోగ్య కేంద్రంలో ఇద్దరు డాక్టర్లు వున్నారు. అందులో వొకరు గైనకాలిజిస్టు (స్త్రీ వ్యాధుల నిపుణులు). డాక్టర్లు తప్పనిసరిగా వూరికి దగ్గరిలోనే

నివాసం వుండాలి. మాములు చికిత్సలు కాక ప్రపంచఆరోగ్య సంస్థ సౌజన్యంతో నడిపే కార్యక్రమాలు వుంటాయి. వాక్సినేషను, టీకాలు, గర్భిణీ స్త్రీల కొరకు అవగాహన కార్యక్రమాలు, సంవత్సరానికి  ఒకసారయినా ఉచిత మెడికల్ క్యాంపులు నిర్వహిస్తారట. దీర్ఘకాలిక రోగాలతో బాధపడుతున్న వాళ్ళు, ముఖ్యంగా వృద్ధులు ఈ క్యాంపుకు ఎక్కువ మంది వచ్చారు. బయటినుంచి వచ్చిన డాక్టర్లు, వాళ్ళకు ఏవైన ప్రత్యేక సలహాలు ఇస్తారేమో అనే ఆశతో వచ్చినట్లు కనిపించింది. వాళ్ళ జబ్బుల గురించి వివరంగా మాకు చెప్పుకోవాలని వచ్చినట్లు అనిపించింది. గ్రామీణులు కూడా ఆధునిక వస్త్రధారణలోనే వున్నారు. 10 సంవత్సరాల క్రితం ఈ ప్రాంతంలో వైద్య సదుపాయాలు లేవనీ, ఎంతో దూరం వెళ్ళవలసి వచ్చేదనీ అన్నారు. ప్రస్తుతం వైద్యం అందుబాటులోకి వచ్చింది కానీ ఇప్పటికీ చాలా ఖర్చు అవుతుందని కొందరు అన్నారు. వాళ్ళ మాటల్లో 'ఇవి మాకు కావాలి' అనే డిమాండ్ కంటే 'ఇలా వుంటే బావుంటుంది' అనే కోరిక, సూచన మాకు కనిపించింది. అప్యాయంగా తట్టి మాట్లాడటం, మన చేతులు పట్టుకొని వాళ్ళ సమస్యలు వివరించటం, తమ వంతు కోసం ఓపికగా ఎదురుచూస్తూ కూర్చోనివుండటం వంటి లక్షణాలతో మాకు వాళ్ళు పరాయి వాళ్ళుగా అనిపించలేదు. వాళ్ళు (మాతోనూ, స్థానిక డాక్టర్లతోను) స్వేచ్ఛగా, దగ్గరగా ఫీలవుతూ మాట్లాడటం, డాక్టరును వాళ్ళొక ఆత్మీయునిగా, కుటుంబ సభ్యునిగా భావిస్తూ మాట్లాడతారనే అభిప్రాయం కలిగింది. రక్తపోటు, మధుమేహం, కీళ్ళ జబ్బులు, కంటి, పంటి సమస్యలు, ఎముకల సాంద్రత తగ్గిపోవటం వంటి సమస్యలు ఎక్కువగా కనిపించాయి. పోషకాహార లేమివల్ల వచ్చే సమస్యలు అంతగా కనిపించలేదు. మేము ఈ క్యాంపులో 2గంటలు మాత్రమే వున్నాము. ప్రజల ఆశలు అంచనాలు ఎక్కువగా వున్నాయని, మేము వాటిని తీర్చలేకపోయామని అనిపించింది. అందునా ఈ క్యాంపు సలహాలు ఇవ్వటానికే కానీ చికిత్స చేయటానికి కాదు కనుక దూరంగా వున్న పెద్ద ఆసుపత్రులకు వెళ్ళండనీ, దీనికి చికిత్స వుంటుందని మేము వివరించినా, "వూరు వదిలి వైద్యం కోసం అంతదూరం పోలేము" అనే సమాధానమే వచ్చింది. 60 సం။లు పైబడినవారు 'ఏదో ఇలా కాలక్షేపం చేద్దాములే' అని భావిస్తున్నట్టు కూడా అనిపించింది. అచ్చంగా పల్లె ప్రజలలాగానే  ఏవో చిట్కాలతో కాలం గడిపితే చాలు అని అనుకుంటున్నట్లు కూడా అనిపించింది. ఏది ఏమయినా చైనాలో వైద్యసేవలు గ్రామాలకు ఇంకా పూర్తిగా చేరలేదనీ, మండలస్థాయి వరకు జరిగిన అభివృద్ధిని గ్రామాలకు విస్తరించాలనే ప్రణాళికలు తయారవుతున్నట్లు గమనించాము. అంతేగాక చారిత్రకంగా కూడా గ్రామాలలో కనీస వైద్యసదుపాయం వుండేదికాదనీ, ప్రజలు కూడా ఏదో ఆకు, అలము తినటానికే అలవాటు పడిపోయారనీ, ప్రస్తుతం అందుబాటులోకి వస్తున్న వైద్యం స్వీకరించటానికి కూడా యువతరం ముందుకు వచ్చినంతగా వృద్ధతరం సిద్ధంగాలేరనీ, అది ఒక సాంస్కృతిక అడ్డుకట్టగా కూడా వుందని మా డాక్టరు మిత్రులు అన్నారు. అందువల్లనే గ్రామస్థాయినుండి రాష్ట్ర, కేంద్రస్థాయి ఆసుపత్రుల వరకు చైనా స్థానిక సంప్రదాయ వైద్యవిభాగాలు అందుబాటులో వుంచామని, ఈ స్థానిక వైద్యం నేర్పే కళాశాలలు,

యూనివర్సిటీలు కూడా చాలా వున్నాయని చెప్పారు. ఇలా చైనాలో ఒక సమ్మిళిత వైద్యవిధానం ప్రజలకు అందుబాటులో వుంది. కేవలం పాశ్చాత్య, ఆధునిక దృష్టితో చూస్తే కొన్ని ప్రామాణికాలు తక్కువ వున్నట్లుగా అనిపించినా, ప్రపంచ ఆరోగ్యసంస్థ నిర్ణయించిన లక్ష్యాలన్నింటినీ అధిగమిస్తూ ఈ వైద్యరంగం పురోగమిస్తోంది. ప్రజల అవసరాలను, అంచనాలను, అభిలాషలను తీర్చటానికి కృతనిశ్చయంతో ముందడుగు వేస్తోంది. గత మూడు దశాబ్దాలలో ఈ రంగంలో చైనా సాధించిన అసమాన ప్రగతి ప్రశంసనీయం. ఇంకా మెరుగుపరచటం అనేది పట్టుదలతో నిరంతర ప్రక్రియగా కొనసాగుతూనే వుంటుంది అనే అభిప్రాయం కలిగింది. మొత్తానికి వీళ్ళు మాకంటే మెరుగు అనేది మా బృందం భావన. ప్రజలు, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, అధికారవర్గం కలిసి ముప్పేటగా తమ దేశ అభ్యున్నతికి, ప్రజల సంక్షేమానికి కావల్సిన నిర్మాణకృషిని కొనసాగిస్తున్నారనీ, చిత్తశుద్ధితో, బాధ్యతాయుతంగా పనిచేస్తున్నారనీ మాకు అర్థం అయింది. తమ విధానాలను ఎప్పటికప్పుడు సమీక్షించుకుంటూ, ప్రజల విమర్శలను, ఆలోచనలను పంచుకుంటూ తగిన మార్పులతో, సంస్కరణలతో నిరంతరం జాగరూకతతో వారు ప్రయాణిస్తున్నారు. ఈ ప్రయత్నాలన్నింటా నిజమైన ప్రజాతంత్ర దృక్పథం మిళితమైవుందని గమనించాము. తప్పులను గుర్తించటం, సవరించుకోవటం, ప్రజల ఆశల్ని గమనించటం, వారి ఆకాంక్షలను పూర్తిచేయటానికి శక్తివంచనలేకుండా పనిచేయటం ద్వారా ప్రభుత్వం ప్రజలకు చేరువయ్యింది. చైనా శరవేగంతో సాధిస్తున్న ప్రగతికి ఇదే మూలకారణమని భావించాము.

30వ తారీఖు (శనివారం) ఉదయం 9గంటలకే గువాంగ్ ఝూంగ్ నుండి వీడ్కోలు తీసుకుని సాయంత్రం కల్లా బీజింగ్ చేరుకున్నాం. దాదాపుగా వైద్యబృందం అధికార కార్యక్రమాలు పూర్తయినట్లే. హిబీ రాష్ట్రంలోనే ముగింపు సమావేశం జరిగింది. ఆ డాక్టర్లు మాతో సెలవు పుచ్చుకున్నారు. ఈ వీడ్కోలు సమావేశం (Farewell) చాల ఉద్విగ్నంగా, భావోద్వేగంగా నడిచింది. “అపరిచితుల్లాగా వచ్చాము. ఆత్మీయుల్లాగ విడిపోతున్నాము” అని నేను ఆ సమావేశంలో మాట్లాడాను. “మనం కేవలం వైద్యులం మాత్రమే కాదు. ఇరుదేశాల మధ్య శాంతి, మైత్రిని కోరుకుంటున్న పౌరులం. సాంస్కృతిక రాయబారులం, స్నేహ సంధాతలం. డా॥కొట్నీస్ నెలకొల్పిన అంతర్జాతీయ మానవతా బంధాన్ని, స్నేహశీలాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళటానికి, ఇరుదేశాల ప్రజల మధ్య అవగాహన విస్తరించటానికి, సౌహార్దం పుష్పించటానికి, ఈ ప్రపంచమనే కుటుంబసభ్యులుగా మనం కృషి చేద్దాం” అని అన్నాను. మొత్తం పర్యటనలో అధికారిక ప్రొటోకాల్సు, సభలు కొంత తగ్గించి ప్రత్యక్షంగా రోగులతో మరింత ఎక్కువగా గడిపే పద్ధతిలో భవిష్యత్ కార్యక్రమాలు రూపుదిద్దుకోవాలనే సూచనచేశాను. ఏదయినా ఈ పర్యటనలు కేవలం వైద్య కార్యక్రమాలకే పరిమితం కావనీ ఇవి సుహృద్భావ పర్యటనలనేది మౌలిక అంశం. అనూహ్యమైన ఆదరణకు, వారి ఆతిధ్య సభ్యతకు మొత్తం బృందం తరపున మాటల్లో చెప్పలేని కృతజ్ఞతాభావాన్ని, ధన్యవాదాలను

కరతాళధ్వనులుగా వినిపిస్తున్నామని చెప్పి పరస్పర ఆలింగనాలతో, కన్నీటి చెమ్మతో వీడ్కోలు తీసుకున్నాము.

బీజింగ్ నగరంలో అటూ ఇటూ తిరుగుతూ అర్బన్ కమ్యూనిటీ హెల్త్ సెంటరు అని కనిపిస్తే లోపలికి వెళ్ళాం. అది ఒక చిన్న 'పోలీ క్లినిక్'లా వుంది. జనరల్ ప్రాక్టీషనరు, ఆర్థోసర్జను, గైనకాలిజిస్టు, సంప్రదాయ వైద్యులు అందుబాటులో వున్నారు. రిజిస్ట్రేషను ఫీజు 3 యువాన్లు. డా॥ సంపత్ (మా బృంద సభ్యుడు) బ్లడ్ గ్లూకోజ్ పరీక్ష చేయించుకున్నాడు. కేవలం వారి పద్ధతులు ఎలా వుంటాయో తెలుసుకుందామని. 8 యువాన్లు ఫీజు. కొద్ది కొద్ది ఇంగ్లీషు పొడిపొడి మాటలు తెలిసిన ల్యాబ్ టెక్నీషియన్ సహాయంతో ఈ పని చేసుకోగలిగాము. అక్కడ అందుబాటులో వున్న ఒక డాక్టరుతో పరిచయం చేసుకొని ఆ క్లినిక్ గురించి వివరాలు తెలుసుకున్నాం. ఉదయం సమయం కావటంతో స్టాఫంతా హాస్పిటలు శుభ్రం చేసే పనిలో వున్నారు. ఎవరి విభాగాన్ని వాళ్ళే సర్దుకుంటున్నారు. అలాగే తిరుగుతూ, రోడ్ల మీదవున్న కూరగాయలు, పండ్లు, ఆటవస్తువుల వంటి వాటి రేట్లు అడిగాము. టమాట, అరటి, మామిడి, జామకాయ వంటివి కనిపించాయి. 2, 3 యువాన్లతో సరదాగా కొన్ని పండ్లు కొని రుచిచుశాము.

7వ తారీఖు ఆదివారం, ఈ రోజు నుంచి పర్యాటక ప్రాధాన్యత వున్న స్థలాలు, కట్టడాలు, ప్రదర్శనలు చూడాలని కార్యక్రమం – అధికారిక కార్యక్రమం ముగిసినా ఈ రోజు ఒక ఆర్గనైజుడు టూరు, వాళ్ళే నిర్వహించారు. బీజింగ్ నగరం చైనా రాజధాని. 2కోట్ల జనాభాకు నివాస స్థలం (హైదరాబాద్ జనాభా సుమారు కోటి మంది). ప్రపంచ ప్రఖ్యాతి చెందిన చైనా గ్రేట్‌వాల్ , నిషిద్ధ నగరం, సమ్మర్ పాలెస్, స్వర్గ దేవాలయం (Temple of Heaven) వంటివి చూశాము. మైఖేల్ అనే పేరు గల ఇంగ్లీషు మాట్లాడే గైడు మాకు ఎన్నో విషయాలు దగ్గరుండి చూపించి వివరించాడు. తేలికగా పిలవటానికి వీలుగా తమ చైనా పేరు బదులు టూరు గైడ్లు ఇలా పేరు చెబుతారట. మా అసందర్భ, అమాయక ప్రశ్నలకు, అనుమానాలకు ఎంతో ఓపికగా, తెలివిగా, క్లుప్తంగా జవాబులు చెప్పాడు. సామాన్యుని జీవనం గురించి మా అనుమానాలు తీర్చాడు. సామాజిక, రాజకీయ, అంతర్జాతీయ అంశాలను ఒక సామాన్యుని దృష్టినుంచి వివరించాడు. 1960కి ముందు పుట్టినవాళ్ళకు మావోజెడాంగ్ అంటే దైవస్వరూపమే. ఆ తరువాత వాళ్ళకు సాంస్కృతిక విప్లవం పేరుతో ఒక తరాన్ని విచ్ఛిన్నం చేసిన జ్ఞాపకం ఆయన. 1990 తర్వాత పుట్టినవాళ్ళు ఆయనను అంతగా పట్టించుకోరు. వీళ్ళకు డెంగ్ ఆధునిక చైనా నిర్మాత. ఇక ఇప్పటి తరానికయితే ఆర్థిక ప్రగతిముఖ్యం. బాంక్ ఆఫ్ చైనాను సర్వశక్తి సంపన్నంగా భావిస్తున్నారు. ఐ.టి.రంగం, డాక్టర్లు, లాయర్లు, సివిల్ సర్వీసు అధికారులు, వ్యాపారస్తులు అధిక ఆదాయం పొందుతున్నారనీ, అందువల్ల యువతరం ఆ రంగాలలో నిపుణత సాధించే ప్రయత్నం చేస్తున్నారని తన అభిప్రాయాలు చెప్పాడు. ప్రభుత్వం పట్ల సానుకూలత లేక ప్రతికూలత గురించి అడిగితే సౌకర్యాలు

తగ్గినపుడు కాస్త ఆందోళన చేస్తారు. మా పేపర్ల నిండా విమర్శలు, కోర్కెల ప్రస్తావన చాలా వుంటుంది. అందరూ జరుగుతున్న వాటిమీద ఒక కన్నేసి వుంచుతారు. అయితే కమ్యూనిష్టు పార్టీ నాయకత్వం దేశాన్ని విముక్తం చేసిందనీ, తమ జీవితాలను చాలా బాగుపరిచిందనీ నమ్ముతారు. నాయకులంటే ప్రజలకు చాల విశ్వాసం వుంది. తమ భవిష్యత్తును ఇంకా సౌకర్యవంతంగా, సౌందర్యభరితంగా చేస్తారనే నమ్మకం వుంది. అందుకే చిన్నచిన్న ఇబ్బందులు వచ్చినా జీవితం ప్రశాంతంగా వుంది అని తన అభిప్రాయం చెప్పాడు. 'పార్టీలో వివిధ స్థాయిల నాయకత్వంలోనూ, అధికారవర్గంలోనూ కొంత అవినీతి వుంది కానీ అది జనజీవితాన్ని అస్తవ్యస్తం చేసే దశలోలేదు' అన్నాడు. 'తమ సాంఘిక హోదాను, స్థాయిని ప్రభుత్వంలో పనులు చేసుకోవటానికి కొంతమంది ఉపయోగించుకుంటూ ధనవంతులవుతున్నారు. అయితే చైనా ప్రజలు సాధారణంగా సంతృప్త జీవులు. ఊరికే ప్రతిదానికీ ఆవేశపడిపోరు. అందునా తమను నడిపిస్తున్నది ప్రజా ప్రభుత్వం అని గట్టిగా భావిస్తారు కనుక ప్రభుత్వ వ్యతిరేకత ఏమీ వుండదు' అని చెప్పాడు. కమ్యూనిజం, మార్క్సిజం వంటి వాటి గురించి అడిగితే, 'పాఠశాల విద్య నుండే మార్క్సిజం గురించి సూచాయగా వుంటుంది. కానీ సాధారణ సిలబస్‌లో అది భాగం కాదు. రాజకీయజ్ఞానం, మార్క్సిజం నేర్పేందుకు ప్రత్యేక కళాశాలలు వున్నాయి. యూనివర్సిటీ కూడా వుంది. వాటిని కోరుకునేవాళ్ళు ఆ ప్రత్యేక కోర్సులు చదువుతారు. ప్రస్తుతం చాలా మంది ప్రత్యేకంగా ఇంగ్లీషు కోర్సులు అదనంగా చదువుతున్నారు' అని యువతరం ఆలోచనల గురించి తన పరిశీలనలు స్వేచ్ఛగా మాకు చెప్పాడు. ఇలా మాట్లాడుకుంటూ రోజంతా బీజింగ్‌లో పర్యాటక ప్రాంతాలు సందర్శించాము. ఆయా ప్రాంతాలలో స్థానిక పర్యాటకులు ఎందరు వున్నారో, విదేశస్తులూ అందరున్నారు. ఆయా ప్రదేశాలలో టూరిస్టుల కోసం చేసిన ఏర్పాట్లు, సదుపాయాలు, వికలాంగులు సైతం తేలికగా చేరుకోవటానికి ప్రత్యేక దృష్టితో చేసిన మెట్లు, లిఫ్టులు, వాహనాలలో మార్పులు, వీల్ ఛైర్లు అందుబాటులో వుంచటం వంటివి ఆకట్టుకున్నాయి. ప్రజలవినోదాన్ని, విహారాన్ని సౌకర్యవంతంగా అనుభవనీయంగా చేయాలనే దృక్పథం కనిపిస్తుంది. ప్రపంచవింతలలో ఒకటైన గ్రేట్‌వాల్, 600 సంవత్సరాలు రాజుల, చక్రవర్తుల నివాసంగా వున్న నిషిద్ధ నగరం (ఫోర్‌బిడెన్ సిటీ) చూశాము. గ్రేట్‌వాల్ మహాకట్టడం నిజంగానే ఒక ఘనమైన నిర్మాణం. భూమికి 600 మీటర్లు ఎత్తున కొండల్లో ఆరున్నర మీటర్ల వెడల్పుతో, నాలుగు మీటర్ల మందం, ఏడున్నర మీటర్లు ఎత్తుగల గోడ నిర్మించటం సామాన్యమైనది కాదు. ఈగోడ మీద వెడల్పయిన రోడ్డు. ఒకేసారి 6, 7 గుర్రాలు పక్కపక్కనే నడిచిపోవచ్చు. అక్కడక్కడ వాచ్‌టవర్స్. ఒక రక్షణ దుర్గంగా నిర్మించిన ఈ కుడ్యంలో కొంతభాగాన్నైనా చైనా సందర్శించే ప్రతి యాత్రికుడు చూస్తాడు. అలాగే క్వింగ్, మింగ్ వంశపు రాజరికానికి నివాసంగా వున్న నిషిద్ధనగరం దాదాపు 9వేల గదులున్న భవన సముదాయం. 24గురు చక్రవర్తులు ఈ భవనాలనుంచే చైనాను పరిపాలించారు. ఈ మహళ్ళనిండా అంతులేని చిత్రపటాలు, చైనా కళకు ఆనవాళ్ళు, నిర్మాణ కౌశల్యానికి, శైలికి ప్రతీకలుగా,

ఆనాటి రాచరికపు ఆడంబరానికి చిహ్నాలుగా నిలబడి వుంటాయి. చైనా చరిత్ర మలుపులెన్నింటికో వేదికగా వుండిపోయింది ఈ నిషిద్ధ నగరం. అలాగే సమ్మర్ ప్యాలెస్ (వేసవి మందిరం) బీజింగ్ రాజుల వేసవి విడిది. ఆనాటి రాజుల వనవాటిక ఈనాటి ప్రజా పార్క్. దీన్ని 1888లో కట్టారట. ఇది ప్రపంచ వారసత్వ సంపదలలో ఒకటిగా గుర్తించబడింది. స్వాభావికమైన గిరులు, తరులు, సరస్సులతోపాటు మానవనిర్మితమైన పొడవైన నడవలు (కారిడార్స్), రెండువైపుల అలంకరించిన చిత్రాలు, విశాలమైన హాల్సు, దేవాలయాలు, వారధులు, కాలువలతో ఒక అత్యద్భుతమైన వనసీమలా గోచరిస్తుంది. ప్రస్తుతం ఇది ఒక వినోద కేంద్రం. మధ్యలో కున్‌మింగ్ సరస్సు. చుట్టూ వినోద కేంద్రాలు. వందలాది మంది వృద్ధులు ఈ పార్కుకు వచ్చి తీరికగా, కులాసాగా పొద్దు పుచ్చుతారు. ఆ వయసులో వాళ్ళకు కావలసిన విశ్రాంతి, వినోదం పుష్కలంగా వుంటుంది. స్నేహ బృందాలుగావచ్చి కూర్చొని ఆటలు, పాటలు, పతంగులు, వ్యాయామాలు, చిత్రాలు, సంగీత ప్రదర్శనలతో కాలంగడిపి సాయంత్రం తమ ఇళ్ళకు వెళుతుంటారు. మనలాంటి సందర్శకులకన్నా కాలక్షేపం కోసం రోజూ వచ్చే వృద్ధులే ఎక్కువగా వుంటారు. వాళ్ళు ఎంతో అభిరుచితో కళలు నేర్చుకుంటూ వుంటారు. ప్రదర్శిస్తూ వుంటారు. కావలసిన తినుబండారాలు, చాయ్, స్నాక్స్ నామమాత్రపు రేట్లకే అందుబాటులో వుంటాయి. విశ్రాంతి జీవులకు ఆ సమాజం అందించిన ఒక గొప్ప గౌరవ సూచికగానూ, ఆనందవనంగాను ఇది నన్ను ఎంతో ఆకట్టుకుంది. పగలంతా ఎంతో ఆలసిపోయినా, పట్టుబట్టి టికెట్లు సాధించి లియువాన్ థియేటరులో సా॥7.30 నుంచి 9గంటల వరకు ప్రదర్శించే బీజింగ్ ఒపేరాకు వెళ్ళాను. నాకు 'జనవాహిని కదిలింది' అనే నృత్యనాటికను మేము తయారుచేసిన రోజులనుండి (1976-78) చైనా నృత్యనాటికలు చూడాలని అభిలాష. అప్పుడు చైనా నుండి వస్తున్న పిక్టోరియల్సు, పత్రికలు చూసి అనేక భంగిమలను, కదలికలను మా నృత్యరూపకంలో మిళితం చేసుకున్నాము. ఇన్నాళ్ళకు బీజింగ్‌లో ఒక ప్రదర్శన చూడగలిగాను. అంతర్జాతీయస్థాయి ప్రదర్శన. అయితే అది సంప్రదాయ నృత్య నాటిక. బీజింగ్ ఒపేరా అనేది చైనా అభినయకళల సమాహారం అని చెప్పుకోవాలి. చైనా నాటకకళకు ఇది సారభూతరూపం అనవచ్చు. వాచకం, గానం, సంగీతం, అభినయం, శరీర విన్యాసాలు (ఆక్రాబాటిక్స్), రణవిద్యలు (మార్షల్ ఆర్ట్స్), నృత్యం ఇన్నింటిని సమపాళ్ళలో రంగరించి అత్యద్భుత ముఖాలంకరణ, వస్త్రాభరణాలతో రంగులు, పరికరాలు, ట్రిక్కులు కలిపి ఒక దేదీప్యమయిన అధ్భుతలోకంలోకి ప్రయాణింపజేసే ప్రదర్శన అని చెప్పుకోవాలి! ఇన్ని కళలను ఒకే ప్రదర్శనలో చూడగలగడం ఒక ఉద్వేగానుభూతికి గురిచేసింది.

2వ తారీఖు సోమవారం కొద్ది గంటల్లో బీజింగ్ విడిచి షాంఘై ప్రయాణం. తియానన్ మన్ స్క్వేర్ కానీ, మావో మాసోలియం కానీ చూడకపోవటం ఏమిటిని భావించి, అధికారులను ఒప్పించి, ప్రైవేటు టాక్సీ తీసుకుని తియానన్‌మన్ స్క్వేర్‌కు వెళ్ళాము. ప్రపంచంలోనే అతి పెద్ద టూరిస్టు స్క్వేర్ అంటారు దీన్ని. బీజింగ్ నగరం మధ్యలోవున్న విశాలమైన ప్రజావేదిక ఈ

చదరం. తియానన్‌మన్ అంటే 'దివ్యశాంతికి ముఖద్వారం' అని అర్థం. అక్కడ ప్రజా నాయకుల స్మారక చిహ్నంగా, 19,20వ శతాబ్దాల విప్లవ పోరాటాలలో అసువులు కోల్పోయిన త్యాగమూర్తుల చిహ్నంగా నిర్మించిన పది అంతస్తుల భారీ స్థూపం వుంది. కమ్యూనిష్టు పార్టీ చట్టసభగాను, అధికార కార్యక్రమాల ఆతిథ్య వేదికగాను ఉపయోగిస్తున్న 'ప్రజామందిరం' (Peoples' Palace) వుంది. చైనా సాంస్కృతిక శాఖ వారు నిర్వహిస్తూన్న చైనా కళలు, చరిత్రను వివరించే నేషనల్ మ్యూజియం ఇక్కడే వుంది. 1949 అక్టోబరు మొదటి తేదిన జనచైనా ఆవిర్భావాన్ని మావో జెడాంగ్ ప్రకటించింది ఈ చారిత్రక వేదిక నుండే. 1976లో మావో మరణానంతరం ఆయనకు శాశ్వత విశ్రాంతి వేదికగా, ఆయన భౌతికకాయాన్ని భద్రపరిచిన మాసోలియం వున్నది ఇక్కడే. 1989లో జరిగిన విద్యార్థుల ప్రదర్శనకు వేదిక ఈ ప్రదేశమే. పాశ్చాత్య ప్రపంచం ఈ ప్రదర్శనను కమ్యూనిష్టు వ్యతిరేక ప్రజాతంత్ర ఉద్యమ ప్రతీకగా ప్రచారం చేస్తుంది. సోమవారం సెలవుదినం కావటంతో వీటిని లోపలికి వెళ్ళి చూడలేక పోయాము. ప్రాంగణమంతా తిరిగి అమరవీరులస్థూపం దగ్గర, మావో మాసోలియం ముందు నెలకొల్పిన రెండు భారీ శిల్పాలలోని ఉద్యమవీరుల, పోరాడుతున్న సైనికుల ముఖాలలోని దీక్షను చూస్తూ, చారిత్రక అంశాలను స్ఫురణకు తెచ్చుకుని ఆ విప్లవ వీరులకు మౌనంగానే శ్రద్ధాంజలి ఘటించి తిరిగివచ్చాము. చైనాలోని ప్రతి ప్రాంతంనుండి తెచ్చిన ఏదో ఒక వస్తువు మావో మాసోలియం నిర్మాణంలో ఉపయోగించారు. అలాగే అన్ని ప్రాంతాల నుండి వచ్చిన 7లక్షలమంది శ్రమదానంలో పాల్గొని, ఈ మావో మాసోలియంను ఆయనకు జాతి సమర్పించిన స్మృతిచిహ్నంగా తీర్చిదిద్దారు. "ఒక గొప్ప మానవుడు విశ్రాంతి తీసుకుంటున్న స్థలం" అని గుర్తించి లక్షలాది మానవులు అక్కడ మావోకు నివాళులు అర్పిస్తారు. అలాగే 1911 విప్లవానంతరం రాజరికాన్ని అంతంచేసి చైనా రిపబ్లిక్‌ను స్థాపించిన జాతీయనాయకునిగా డా॥సన్‌ఎట్‌సేన్‌ను గుర్తించి ఆయన పేరున ఒక గొప్ప స్మారక మందిరాన్ని నాన్‌జింగ్‌లో ఇప్పటికీ గౌరవ ఆదరాలతో నిర్వహిస్తున్నారని తెలిసింది. అక్కడి నుంచి టాక్సీలో హోటల్‌కు చేరుకుని లంచ్‌చేసి, హోటల్‌నుండీ, నిర్వాహకుల దగ్గరనుండీ వీడ్కోలు తీసుకున్నాం.

ఈరోజు, ఇన్నాళ్ళూ మాతోవున్న మేడం లియూ జన్మదినం. తన కుటుంబ సభ్యులనుంచి ఈ వారమంతా దూరంగా వున్నది కదా, ఈరోజు ఇంటికి వెళ్ళాలని అనుకుంటోంది. ఇది మాకు తెలిసి మేము కేక్ కట్ చేయించి అందరం కలసి ఆమెకు ఒక కానుక ఇచ్చాం. దానికి ఆవిడ ఎంతో సంతోషించింది. కొందరు ప్రతినిధులు అంతకుముందే ఎయిర్‌పోర్టుకు వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోయిన వారిలో ఒక డాక్టరు హోటలు రూములో తన పర్సు మరిచిపోయారని హోటల్ వాళ్ళు తెచ్చియిచ్చారు. లియూ తన ఇంటికి ప్రయాణం మానుకొని, పర్సు తీసుకుని, మాతో కలసివచ్చి మమ్మల్ని రైల్వేస్టేషన్‌లోదించి తరువాత తను ఎయిర్‌పోర్టుకు వెళ్ళి డబ్బుల పర్సు ఆ డాక్టరుకు అందజేసింది. తన పుట్టిన రోజున ఇంటికి

వెళ్ళటం కంటే, తన డ్యూటీ కాకపోయినా, తానే వ్యక్తిగతంగా వెళ్ళి పర్సు ఇచ్చి రావటం, ఆవిడ తన పనిని ఎంత బాధ్యతగా తీసుకుందో తెలుపుతోంది.

ఈ రోజు డా॥రాజరెడ్డి గారు హైదరాబాద్ వెళ్ళిపోయారు. నేను, డా॥సంపత్‌రావు మా ప్రైవేటు టూరుకు షాంఘై బయలుదేరాం. బీజింగ్‌నుండి షాంఘైకు మా ప్రయాణం బుల్లెట్ ట్రైన్‌లో. మేడం లీయు ఎయిర్‌పోర్టుకు వెళ్ళటం కోసం మేము 2 గంటలు ముందుగా బయలుదేరవలసి వచ్చింది. ఆ రెండు గంటలు మేము రైల్వేస్టేషన్‌లో గడిపాం. రైల్వేస్టేషన్లు – విమానాశ్రయాలలాగ వున్నాయి. ఎంతో ఎత్తునవున్న పైకప్పులు, భవిష్యత్ నిర్మాణ రూపాలనిపించే భవనాలు, ఎత్తైన గేట్లు, చక్కటి పాలరాతి ఫ్లోరింగులు, అత్యంత పరిశుభ్రంగా నిర్వహించబడుతున్న ప్లాట్‌ఫాంలు, ఈ ప్రయాణమంటే ఒక విలాసం అనిపించేలా వున్నాయి. 2008లో బీజింగ్ ఒలంపిక్ క్రీడల సందర్భంలోనే ఈ రైల్వేలు మొదటిసారి నిర్మించటం జరిగింది. బీజింగ్ రైల్వేస్టేషన్ నుంచి ప్రపంచంలో అత్యాధునిక బుల్లెట్ ట్రైనులో ప్రయాణించాము. బీజింగ్–షాంఘైల మధ్యదూరం దాదాపు 1100 కి॥మీ॥. ఈ దూరం విమానంలో అయితే 2గంటలు, ఈ బుల్లెట్ (హైస్పీడు) రైలులో 5గంటలలో చేరుకోవచ్చు. మేము రాత్రి 7గంటలకు షాంఘై చేరుకుని ముందుగా బుక్‌చేసుకున్న హలీడే ఇన్ హోటలుకు వెళ్ళాము. హోటలు మొత్తంలో ఇంగ్లీషు తెలిసింది ఒక్కరికే. అతని సహాయంతో బ్రోచర్లు, సెల్‌ఫోను డిక్షనరీని వాడి రేపటి షాంఘై టూరుకు ఏర్పాట్లు చేసుకున్నాం.

చైనాలో అతి పెద్ద నగరం షాంఘై. షాంఘై జనాభా 2కోట్లకు మించి వుంటుంది. అత్యంత ఆధునిక నగరము. ప్రపంచంలోని అన్ని దేశాలను పోలిన అత్యాధునిక బహుళ అంతస్తుల భవనాలు ఎన్నో కనిపిస్తాయి. ఇది పెద్ద వ్యాపారకేంద్రం. 100 అంతస్తుల భవనం ఎక్కి చూస్తేతప్ప నగరసౌందర్యం పూర్తిగా గోచరించదు. బీజింగ్ తరతరాలుగా చైనాకు రాజధాని. అది రాజరికపు, సంప్రదాయ పట్టణమైతే షాంఘై ఇటీవలి అద్భుతం. మత్స్యకారుల చిన్న గ్రామంగా వున్న షాంఘై కొద్దికాలంలోనే ప్రపంచ ప్రసిద్ధ నగరాలలో ఒకటిగా మారటం వెనుక చైనా ప్రజల, నాయకుల సోషలిస్టు నిర్మాణ దీక్ష, ప్రణాళిక, వాటిని అమలుచేసే కార్యనిర్వహణ శక్తి, వారి ఆర్థికవ్యూహం అన్నీ కనిపిస్తాయి. ఈ నగరం హుయాంగ్ నదికి తూర్పు పడమర భాగాల్లో విస్తరించివుంది. రోడ్డుమార్గం అకస్మాత్తుగా నదీ సొరంగమార్గంగా (టన్నెల్) మారి ఆవలివడ్డుకు తీసుకువెళుతుంది. నగరం రెండు భాగాలను కలుపుతుంది ఈ సొరంగం. రాత్రిపుట ఈ నగరం తళుకుబెళుకు చెప్పనలవికాదు. ఆకాశంలోనికి చొచ్చుకుపోయి ఆ గగనసిగలో వెలుగుతున్న వెన్నెల పువ్వుల్లా రంగురంగుల దీపాల కాంతిపుంజాలు ఒక అనూహ్యమైన దృశ్య సౌందర్యాన్ని కల్పిస్తాయి.

3వ తేదీ ఉదయం యు గార్డెన్‌కు వెళ్ళాం. పురాతన కాలంనుంచీ వస్తున్న పెద్ద వనం ఇది. చైనా నిర్మాణశైలిలో అనేక మలుపులదారులతో, బ్రహ్మాండమైన పైన్ వృక్షాలతో డ్రాగన్‌ను పోలివున్న సరీసృపాకృతులతో, రకరకాల చేపల కొలనులతో అలరారుతోంది. ఈ గార్డెన్

చూడగానే మన సౌక్కసారి  చిన్నపిల్లల్లా గంతులు వేస్తుంది. ఆ పక్కనే వున్న యువాన్ బజార్ సామాన్యుల మార్కెట్‌లా కనిపిస్తుంది, వీధి తిండి, చైనా హస్తకళలు, కళాకృతులు, జనసమ్మర్ధంతో పురాతన షాంఘై వీధులను తలపిస్తుంది. అలాగే దగ్గరలో వున్న నాన్‌జింగ్ రోడ్డు ఆధునిక మార్కెట్. దీనిని కొనుగోలుదారుల స్వర్గం అంటారు. 2 కి॥మీ॥ కాలిదారిన నడుస్తూ చూస్తుంటే ఈ రోడ్డులో లేని వస్తువు ప్రపంచంలో మరెక్కడా వుండదేమో అనిపిస్తుంది. అయితే ఇక్కడ నాణ్యమైన వస్తువులెంత సమృద్ధిగా వున్నాయో, వాటి  నకిలీ, చవక వస్తువులు కూడా అంతే విరివిగా కనపడతాయి. 'నీ జేబులో డబ్బులనుబట్టి సరఫరా చేస్తాం' అంటున్నారు. రహస్యమేమీ లేదు, చెప్పే అమ్ముతారు. చాల బేరం ఆడవలసి వుంటుంది. సాధారణంగా రేట్లు 30 నుంచి 40% పెంచి చెబుతారు. ఇక ఆకర్షణలు, వ్యాపార కిటుకులు, టాక్సు ఎగవేతలు, బిల్లు లేకుండా అమ్మటం, అరుదుగా నకిలీ నోట్ల చలామణివంటివి కూడా వుంటాయి. ఇతర దేశాల పర్యాటక కేంద్రాలవద్ద లాగానే టూరిస్టుల అమాయకత్వాన్ని తమ వ్యాపారలాభంగా మార్చుకునే లాఘవమూ చూపిస్తారు. పర్యాటకులు పేరాశతోను, చవకగా కొనాలనే యావతోను నకిలీ వస్తువుల బారిన పడుతుంటారు. నది ఒడ్డును బండ్ అని పిలుస్తారు (మన ట్యాంక్‌బండ్ వంటిది). బోటింగ్, రాత్రి నదీవిహారం, అనేక ఫలహార, భోజనశాలలు, వినోద కార్యకలాపాలతో ఒక మాయాబజార్‌ను తలపిస్తుంది. ఎంటర్‌టైన్‌మెంట్, ఎమ్యూజ్‌మెంట్ పార్కుల వాతావరణానికి దగ్గరగా వుంటుంది. అయినా వేలాదిమంది ప్రజలు రాత్రి పొద్దుపోయే వరకు అక్కడే గడుపుతారు. దగ్గరలోనే ప్రపంచంలోని 2వ అతి ఎత్తయిన భవనం షాంఘై వరల్డ్ ఫైనాన్స్ సెంటర్ వుంది. మేము అలా తిరిగితిరిగి ఒక ప్రైవేటు (మోటర్ సైకిల్‌ను ఆటోలా మార్చిన) వాహనంలో రాత్రి 12 గంటలకు మా హోటలుకు చేరుకున్నాం. ఈ టూరిస్టు ప్రాంతంలో అవసరాల దృష్ట్యా కచ్చాపచ్చా ఇంగ్లీషు ముక్కలు వాడుతున్నారు. ఫారెనర్ల వినోదం కోసం, వాళ్ళ అలవాట్లను సంతృప్తి పరచటం కోసం, మసాజ్ సెంటర్లు, ఒకటోఅరో వేశ్యాగృహాలు వున్నాయి. అయితే ఇవి చాలా పరిమితమైన స్థాయిలో కొద్ది సంఖ్యలో వున్నట్టుగా తెలుస్తోంది. హోటలు వర్కర్లు, టాక్సీడ్రైవర్లు, చిన్న టీ దుకాణాల వారు రాత్రిపూట ఈ చీకటి వ్యవహారాలు నడుపుతున్నట్లుగా అర్థమయింది. బ్యాంకాక్, పారిస్, న్యూయార్క్‌వంటి నగరాలతో పోలిస్తే ఇది సముద్రంలో కాకిరెట్టంత మాత్రంగానే వుంటుందని తెల్సుకున్నాం. పారిస్ బై నైట్, బ్యాంకాక్‌లో రాత్రిళ్ళువంటి నైట్ ప్రకటనల ఆర్భాటం, ప్రచారం కనిపించలేదు. అలాగే అంత దేశం తిరిగినా టూరిస్టు ప్రదేశాల్లో తప్ప వేరెక్కడా బిక్షగాళ్ళు కనిపించలేదు. టూరిస్టులముందు ఏదో చిన్నచిన్న విద్యలు ప్రదర్శించడం, సహాయం చేయండని ప్రార్థించడం వుంది కానీ, మన నగరాలలోలాగా చుట్టుముట్టే యాచకులు కనిపించలేదు. ప్రభుత్వం ప్రత్యేకంగా యాచకుల పునరావాస కేంద్రాలు కూడా ఏర్పాటు చేసిందని, సోమరితనానికి అలవాటుపడ్డ కొందరు అక్కడినుంచి తప్పించుకు  వచ్చేస్తారని  మా టూరిస్టు గైడు అన్నాడు. షాంఘై 1849 నుండి 1943 వరకు

ఫ్రెంచి వారి ఆధీనంలో వుంది. ఆ అధికారుల జీవన విధానమూ, వారి ప్రభావమూ ఈ ప్రాంతపు జీవిత విధానం మీద వుందని కూడా అర్థం చేసుకోవాలి! ఈ నగరం అభివృద్ధిని అర్థం చేసుకోవాలంటే షాంఘై అర్బన్ ప్లానింగ్ ఎగ్జిబిషన్‌ను తప్పనిసరిగా చూడాలి! గత 50 సం॥ల నుంచీ రాబోయే 50 సంవత్సరాల వరకు షాంఘై రూపురేఖలు ఎలావున్నాయి, ఎలా వుండబోతున్నాయి అనేది నిర్ధారించి వుంది. ఫోటోలు, వీడియోలు, మీనియేచర్ మోడల్స్ ద్వారా నిర్మించి వుంచారు. ఖచ్చితంగా ఆ మాస్టర్ ప్లాను ప్రకారమే నిర్మాణాలు సాగుతున్నాయని చెప్పారు. వీటన్నింటితో పాటు మేడం టుస్సాడ్స్ మైనపు బొమ్మల మ్యూజియం చూశాం.

3వ తేదీ ఉదయం లేచి ముందుగా ఏర్పాటు చేసుకున్న టూరిస్టు బస్సులో ఝునా జువాంగ్ అనే ప్రదేశానికి వెళ్ళాము. అది షాంఘైకి 80 కి॥మీ॥ల దూరంలో వుంది. దీనిని నీటి పట్టణం (వాటర్ టౌన్) అంటారు. పాత షాంఘైని చూచినట్లు వుంటుందని అలాగే వుంచారు. దీన్ని 'చైనా వెనీస్' అని కూడ అంటారు. కాలవలు, తటాకాలు, సరస్సులు, నీటిపాయల మధ్య ఈ వూరు కట్టబడివుంది. చాలా పాతకాలంనాటి నివాసగృహాలు, వంతెనలు, పడవ ప్రయాణాలు, చూడచక్కని ప్రకృతిదృశ్యాలు, గ్రామీణ వాతావరణం, మరోవంక వ్యాపారాత్మకంగా మార్చబడిన పట్టణసొగసులు కలసి వుంటాయి. అనేక చేతివృత్తులవారి ఉత్పత్తులు, అనేక జానపద కళా ప్రదర్శనలు ఇక్కడ చూడవచ్చు. వీటి మధ్య 3 గంటలు ఎలా గడిచిపోయిందో తెలియలేదు. షాంఘైలాంటి అత్యాధునిక నగరం దగ్గరలో దానికి పూర్తిగా భిన్నమయిన పాత చైనాను పరిచయం చేసుకోవచ్చు. ఇక్కడ వున్న రాతివంతెనలు 650-700 సంవత్సరాల నాటివి. ఈ పట్టణం వయసు దాదాపు 900 సంవత్సరాలు. వెదురునారతో అల్లికలు, వెదురుపుల్లలతో కళాకృతులు తయారుచేస్తున్న వృద్ధ పనివారి కౌశల్యాన్ని చేతులు జోడించి మరీ చూస్తాము. గండోలా అని పిలిచే చిన్న పడవలలో ఆ కాలువల్లో ప్రయాణించడం ఒక చల్లని అనుభూతి. వందల షాపులు-అందరూ తమ వస్తువులు అమ్మాలనీ (అంట గట్టాలనీ) ప్రయత్నిస్తారు. ఇవ్వాళ్టి పర్యటన విశేషం ఏమంటే మేము కావాలని కేవలం చైనీయులు మాత్రమే వున్న బృందంతో కలసివెళ్ళాం. ఎవ్వరికీ ఒక్క ముక్క ఇంగ్లీషు రాదు. అలాగే చేతి సైగలు, తల వూపడాలతో రోజంతా గడిపాం. కలసి భోజనం చేశాం. కలసి తిరిగాం. కలసి కొన్ని వస్తువులు, జ్ఞాపికలు కొన్నాం. వాళ్ళు మా కోసం షాపులు తిరిగి బేరమాడి కొన్ని వస్తువులు కొనిపించారు. భాష తెలియకపోవడం ఒక అవరోధమే కానీ, భాషతో సంబంధం లేకుండా కూడా స్నేహ సంబంధం నెలకొల్పుకోవచ్చనేది ఈనాటి అనుభవం. రోజంతా అక్కడే గడిపి సాయంత్రానికి షాంఘై వచ్చి చాలా ప్రఖ్యాతి చెందిన షాంఘై ఆక్రోబాటిక్‌షో చూశాం. ఈ థియేటరు 'షాంఘై సర్కస్ వరల్డ్' చాల ఆకర్షణీయంగా వుంది. కళ్ళుచెదిరే కాస్ట్యూమ్సు, భయభ్రాంతులు కల్గించే మార్షల్ ఆర్ట్స్, వూహాతీతమయిన స్పెషల్ ఎఫెక్టులతో ఈ షో, 'ఇలాంటిది ఇదే' అన్నంత బాగా వుంది. మళ్ళీ అర్ధరాత్రి దాటాకే హోటలుకు చేరుకున్నాం.

650 గడపల పల్లెటూరు నుండి 2 కోట్లు జనభాగల షాంఘై నగరం వరకు చైనాలో వేల కిలోమీటర్లు ప్రయాణించాము. ప్రభుత్వ అతిధులుగా పంచతార హోటళ్ళ నుండి, సాధారణ పర్యాటకునిగా వీధి ఫలహారశాలల వరకు చూశాము. గొప్ప ఆడియో విజువల్ సాధనాల నుండి సైగలబాస వరకు ఉపయోగించి వీలయినంత ఎక్కువగా ప్రజలతో సంభాషించాము. జానపద గీతాలు, కళలనుండి అంతర్జాతీయ ప్రమాణాల ప్రదర్శనల వరకు చూశాము. అయితే ఇదంతా మెయిన్ లాండ్ చైనా. ప్రజా రిపబ్లిక్, సోషలిస్టు నిర్మాణమే ధ్యేయంగా ప్రకటించుకున్న వ్యవస్థ. ఇక రేపు మకావో, హాంగ్‌కాంగ్ చూడబోతున్నాము.

మకావో, హాంగ్‌కాంగ్‌లు రెండూ చైనాలో అంతర్భాగాలు. కానీ ప్రత్యేక ప్రతిపత్తిగల పాలనాప్రాంతాలు. 'ఒక దేశం-రెండు వ్యవస్థలు' అన్న అంగీకారంతో పెట్టుబడిదారీ వ్యవస్థను అనుసరిస్తున్న రెండు ప్రాంతాలు అవి. జూలై 5 ఉదయం షాంఘై పుడాంగ్ విమానాశ్రయం నుండి బయలుదేరాము. విమానం ఎక్కిన తర్వాత 2 గంటలు సేపు టేకాఫ్ కాలేదు. కారణం గాలిదారులు బిజీగా వున్నాయట. ఎక్కడా ట్రాఫిక్ జాం లేకుండా చైనా అంతా తిరిగాం. సెకెండు కూడా ఆలస్యంకాని బుల్లెట్ ట్రైనులో ప్రయాణించాం. చివరకు విమానానికి మాత్రం ఆకాశమార్గాలు బంద్ అయ్యాయి. ఏం చేసేదీలేక ఈ రెండు గంటలు గత 10 రోజుల అనుభవాలు (24 జూన్ నుండి జూలై 4 వరకు) పునశ్చరణ చేసుకుని, కాగితాల మీదికి అక్షరాలుగా పారించాను. అంతచూసిన తర్వాత నాకు ఒక్కటే అనిపిస్తోంది. జాతికి జాతి మొత్తం ఒక గొప్ప దేశాన్ని, గొప్ప వ్యవస్థను నిర్మించే కృషిలో నిమగ్నమై ఒక దీక్షలో వున్నట్టుగా వుంది. ఆర్థిక అసమానతలను, అభివృద్ధి అసమానతలను, అవినీతి ఆరోపణలను వీళ్ళు తాత్కాలిక దశలుగా భావిస్తూ, ఒక గొప్ప భవిష్యత్తును నిర్మించగలమనే నమ్మకంతో సాగుతున్నారు. తమ పార్టీ నాయకత్వం మీద, దాని మార్గదర్శకత్వం మీద అచంచల విశ్వాసంతో ఒక మహాప్రస్థానం సాగిస్తున్నారు. ఒక అసిధారావ్రతం నిర్వహిస్తున్నారు. కార్మికవర్గ సిద్ధాంతమనే కరవాలంతో తమ సమస్యలను ఖండిస్తూ, మానవాళికి మహోదయం సంరావిస్తున్నారు. ఈ సిద్ధాంతం అమలులో ఏమాత్రం తగ్గినా, అన్యవర్గ సిద్ధాంతాల ప్రభావానికి లోనయినా, నడుస్తున్న తీగ మీదనుండి జారిపడిపోయే ప్రమాదం వుంది. అభివృద్ధి సాధనకు, సమానత్వ అనుభవానికి మధ్య ఆచితూచి అడుగులు వేస్తూ కొత్తదారులు సృష్టిస్తున్న చైనా అనుభవం విజయవంతమైతే ప్రపంచానికి ఒక మార్గదర్శక పాఠం అవుతుంది. ఒకవేళ వాళ్ళు దారి తప్పిపోతే అది కూడ ప్రపంచానికి గుణపాఠం అవుతుంది. అభివృద్ధి చెందిన పాశ్చాత్య పెట్టుబడిదారీ వ్యవస్థకు 3, 4 వందల ఏళ్ళు పట్టిన అభివృద్ధిని, సాంకేతిక ప్రగతిని, అన్ని రంగాలలో ఉరకలెత్తుతున్న పురోభివృద్ధిని, చైనా ఒక అర్థశతాబ్దంలో సాధించ గలిగిందంటే దానికి కారణం, ఇది పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయ వ్యవస్థ కావటమే. స్వలాభాపేక్ష చుట్టూ తిరిగే పెట్టుబడిదారీ వ్యవస్థను తృణీకరిస్తూ, మనిషి కేంద్రంగా, మానవ

అభివృద్ధి లక్ష్యంగా, మానవత హారతిగా వర్గరహిత సమాజం వైపు, దోపిడి లేని సమాజం వైపు, సామ్యవాద నిర్మాణం వైపు జాతి ఏకోన్ముఖంగా కలసి కదలడమే.

ఇలా ఆలోచనా వలయాల్లో తిరుగాడుతుండగానే విమానం హంగ్‌కాంగ్ విమానాశ్రయం చేరుకుంది. ఈ రోజు విమానాశ్రయం దాటే పని లేదు. ఇక్కడినుంచి నేరుగా మకావో వెళ్ళటమే. దానికోసం విమానాశ్రయం నుంచే టర్బో జెట్ నౌక దగ్గరకు ఏర్పాటు చేసిన ప్రత్యేక దారిలో వెళ్ళి ఫెర్రీ చేరుకున్నాం. విమానాశ్రయం నుంచి మా సామాన్లు కూడా ఈ నౌకలోకే వచ్చేసాయి. మకావోలో వెనీషియం హోటలు చేరేసరికి సాయంత్రం ఐదయ్యింది.

మకావో హాంగ్‌కాంగ్‌కు 60కి॥మీ॥ దూరంలో పెరల్ నదికి పశ్చిమాన వుంది. మకావో జనాభా 5 లక్షలు. దీని వైశాల్యం 30 చదరపు కిలోమీటర్లు మాత్రమే వుంటుంది. జూదం, క్రీడలు, పర్యాటకం ద్వారా వచ్చే ఆదాయమే ఈ దీవికి ఆదాయ వనరు. ప్రపంచంలో ఇప్పటి వరకు అమెరికాలోని లాస్ వేగాస్ నగరం నంబర్ వన్ జూదగృహ మార్కెటుగా వుండేది. దాన్ని తోసివేసి మకావో ప్రథమ స్థానంలోకి వచ్చింది. ఇది టాక్సులు లేని స్వర్గధామం అంటారు. ఫారెన్ ఎక్స్‌చేంజ్ కంట్రోళ్ళు అంటూ ఏమీ వుండవు. ప్రపంచం నలుమూలల నుండి జూదరులు ఇక్కడకు చేరుకుంటారు. ఇదో మాయా ప్రపంచం. మనుషులలోని స్వైర ప్రవర్తనకు పట్టంగడుతూ, డబ్బు ద్వారా వచ్చే వైభవాలు, సౌఖ్యాలను అమ్మే కలలసౌధం. కలలో కూడా ఊహించలేని విలాసాలు, కులాసాలు, డబ్బు మారకం తప్ప మరే విలువలూ లేని సమయాలు, ఆ డబ్బుముందు కళలూ, కళాకారులు ఎలా సాగిలబడి వుంటారో నిరూపించే ప్రదర్శనలు, అత్యద్భుత నిర్మాణాలు, అలంకరణలు, ఒకదాన్ని మించి మరొకటి అడుగడుగునా మన కల్పనాశక్తిని ఓడించేస్తుంటాయి. ఆ కళాతిశయంలో ఒక రకం సంభ్రమానికి గురవుతాం. ఆ మందలో కలిసి గొర్రెలా తిరగటమేతప్ప, ఒక స్వంత ఆలోచనే తలెత్తకుండా ఆ వాతావరణం కమ్మేస్తుంది. తన ఆకర్షణల పంజరంలో బంధించి వేస్తుంది. ఫెర్రీ టికెట్ల దగ్గర నుండి హోటల్ బుకింగ్ వరకు ఏజెంట్లు, కమీషను వర్తకులు, విపరీతమయిన హడావుడీ, ఒత్తిడీ – ఆలోచించే సమయం కూడా ఇవ్వకుండా లాక్కువెళతాయి. జూదగృహంలో కూర్చోబెట్టే మోసకారి నక్కల జిత్తులు, చూస్తుండగానే నీ పర్సులోనే కాదు, నీ ఒంటి మీద వున్న వాటిని కూడా వొడుపుగా క్రీడల పేరుతో లాగివేసే వికృత విన్యాసాలు, అంతా చాలా పకడ్బందీగా, చాలా ఘరానాగా, స్వర్గపు పొలిమేరలనిపించే వాతావరణంలో, కళ్ళు తిప్పుకోనివ్వని లావణ్యాలు, అందాలు ఆరబోసే అతివలు, నీకే మాత్రం తెలీకుండా, ఒక తుమ్మెద పువ్వునుంచి తేనె గ్రోలినంత సుతారంగా, మధురంగా నీ జేబులు ఖాళీ చేస్తూంటారు. విచిత్రమేమంటే ఈ అనుభవం కోసమే, ఇదే ఎంజాయ్‌మెంట్ అనుకుంటూ లక్షలాదిమంది పరిగెత్తుకు వస్తుంటారు.

మేము వెళ్ళిందే ఈ క్షీణ సంస్కృతిని పరిశీలించటానికి కనుక రాత్రంతా శివరాత్రి జాగారమే. అత్యున్నత స్థాయి హోటలు వెనిషియమ్ మకావో రిసార్టులోనే దిగాము. వైశాల్యం

దృష్ట్యా ఆసియా ఖండంలోనే ఇది అతి పెద్ద హోటలు. ప్రపంచ స్థాయిలో 7వ స్థానం దీనిది. ఒక్కొక్క అంతస్తూ ఒక్కో నేపథ్యం ఆధారంగా అలంకరించబడి వుంటుంది. ఒక అంతస్తులో మొత్తం నీలాకాశంలో వెలుగులు చిమ్ముతున్న చంద్రుడు, చుక్కలు కనిపిస్తే, మరో అంతస్తు గ్రీకు పురాణాల ఆధారంగా అలంకరించబడి వుంటుంది. మరో అంతస్తు పారిస్ నగరంలా వుంటే మరో మూల ఈజిప్ట్ సాక్షాత్కరిస్తుంది, పగలోరాత్రో తెలిపే సూచికలుగానీ, గడియారాలుగానీ రిసెప్షను దగ్గర తప్ప మరెక్కడా కనపడవు. ఆ హోటలులోనికి వెళ్ళిన వాళ్ళకి సమయసందర్భాలు తెలీని, ఉష్ణశీతలాల తేడాలు రానివ్వని ఎడతెరిపిలేని వాతావరణం కల్పించి, ఒక వినోద ప్రపంచాన్ని (విశ్వామిత్ర సృష్టిలా) సృష్టించారు. ఈ కృత్రిమ ప్రపంచం సృష్టికి వాడుతున్న కరెంటు, నీటి వనరుల కోసం హైడల్‌ప్రాజెక్టునే కట్టారు. మన చుట్టూ పేర్చిన ఆకర్షణల్లో భాగంగా రకరకాల నృత్య, సంగీత, చిత్రకళా ప్రదర్శనలు అందరికీ పరిచయమైన ఇంగ్లీషు నాటకాలలోని దృశ్యాలు (రోమియో, జూలియట్ వంటివి), మ్యాజిక్ షోలు, ఫలపుష్ప ప్రదర్శనలు ఎన్నో, ఎన్నెన్నో వున్నాయి. అక్కడవున్న ఐస్‌వరల్డ్ మరో పెద్ద ఆకర్షణ. 50మంది ఈశాన్య చైనా కళాకారులు 2 నెలలపాటు శ్రమించి 10వేల భారీ మంచుదిమ్మెలను చెక్కి తీర్చిదిద్దిన మంచుబొమ్మల ప్రదర్శన అత్యంత ఆశ్చర్యకరంగా వుంటుంది. ఆ మంచుతోనే షాంఘై, పారిస్‌వంటి నగరాల ప్రతికృతులను, ప్రపంచ వింతలను మోడల్సుగా చేసి పెట్టారు. ఇది ఒక ఉదాహరణగానే చెబుతున్నా. అక్కడవున్న వేలాది ప్రదర్శనావస్తువుల వెనుక కూడా ఇంతటి కఠోరశ్రమ, కళానైపుణ్యం వున్నాయి. 5 మీటర్ల ఎత్తున అదృష్టదేవుడి శిల్పం తయారుచేసి పెట్టారు. ఈ అలంకరణలకు, ఆకర్షణలకు వాడిన 4 లక్షల బల్బులు తక్కువ విద్యుత్తును తీసుకుంటాయనీ, రిసార్టులోవున్న ఫౌంటెన్లు, కృత్రిమ కాలువల్లో పారుతున్న నీటిని రిసైక్లింగ్ చేయటంవల్ల 340 మిలియన్ లీటర్ల నీరు వృధా కాకుండా పర్యావరణహితంగా ఏర్పాటు చేసామని చెప్పుకోవడం చూస్తే పెట్టుబడిదారీ జాణతనానికి నవ్వు వస్తుంది. మొదటిసారో, రెండవసారో చూడటానికి వచ్చిన పర్యాటకులు ఈ హడావుడి ప్రపంచంలో పడికొట్టుకుపోతుంటే, ఆ పక్కనే కొంతమంది అనుభవజ్ఞులైన వృత్తి జూదరులు, చాలా ప్రశాంతంగా, నింపాదిగా, పూర్తిఏకగ్రతతో కూర్చుని గంటలుగంటలు ఆడుతుంటారు. వీరిలోనే గెలుపు గుర్రాలున్నాయని అర్థమయ్యింది. ఆస్ట్రేలియా నుంచి వచ్చిన ఒక 80ఏళ్ళ వృద్ధుడు, అతని భార్య, వాళ్ళ 60 సంవత్సరాల కుమార్తెతో మాకు పరిచయం అయ్యింది. ఈ కుటుంబం ప్రతి ఆరునెలలకు ఒకసారయినా వచ్చి 4రోజులు జూదమాడుతారట. 'డబ్బులు గెలిచినా, ఓడినా బాధలేదు. నాకిదో వినోదం, వ్యసనం. మా ముగ్గురికి ఇదో మానసిక ఊరట. మా వుళ్ళో మాత్రం మేము జూదం ఆడము' అన్నాడాయన. కాళ్ళునొప్పులు పెడుతున్నా మళ్ళీమళ్ళీ చూడంకదా అనుకుంటూ రాత్రి ఒంటిగంట వరకు ఆ రిసార్టు మూలమూలలా తిరిగి మా క్వీన్స్ సూట్ చేరుకున్నాం. చాలా అపరిచితంగా వున్న వాతావరణంలో మొత్తం మీద చాలా సంభ్రమానికి గురయ్యామనేది నిజం. మకావో చైనా రాజ్యంలో భాగమే. 1887లో మింగ్ చక్రవర్తులతో పోర్చుగీసు వారికి ఒక కౌలు ఒప్పందం

కుదిరింది. కనుక అది అనేక దశాబ్దాలపాటు పోర్చుగీసు వలసపాలనలో వుండేది. 1999 డిసెంబరు 20న పోర్చుగీసువారు దీన్ని చైనా ప్రభుత్వానికి తిరిగి ఇచ్చారు. ఈ ప్రాంతాన్ని ప్రత్యేక పరిపాలనా విభాగంగా చైనా గుర్తిస్తోంది. అందువల్ల కేవలం విదేశీ వ్యవహారాలు, రక్షణ తప్ప, చైనా ప్రభుత్వం మకావో అంతర్గత వ్యవహారాలలో ప్రమేయం కలిగించుకోవటం లేదు. ఇలాంటి ప్రత్యేకప్రాంతమే హాంగ్‌కాంగ్ కూడా. రేపు ఉదయం అక్కడికి వెళతాం. 'టైములేని ఈ గదిలో టైముకు లేవగలమా? అన్న ప్రశ్నతోనూ, మన టైము అయిపోగానే హోటలువాడు వచ్చి బయటకు నెట్టకపోతే గదా మనం ఇక్కడ వుండేది' అని నవ్వుకుంటూ పడుకున్నాం.

జూలై 7 ఉదయం మకావో మాయాప్రపంచంనుండి బయటపడి మళ్ళీ హోటలు వాళ్ళ కాంప్లిమెంటరీ వ్యానులో మకావో ఫెర్రీ పాయింట్‌కు వెళ్ళాము. ఈ సారి కోటాజెట్ నావలో హాంగ్‌కాంగ్‌లోని కౌలూన్ రేవు స్థలం చేరుకున్నాము. ముందుగానే బుక్ చేసుకున్న బి.పి. ఇంటర్నేషనల్ వారి కారు అక్కడ సిద్ధంగా వుంది. 5గంటలకల్లా హోటలు చేరుకున్నాం. హాంగ్‌కాంగ్ నగరం (దీవి) పెర్ల్ నదికి తూర్పు వైపున, దక్షిణ చైనా సముద్రానికి అభిముఖంగా వుంటుంది. 1100 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో 70 లక్షల జనాభా కలిగిన ఈ ప్రాంతం కూడా చైనాలో అంతర్భాగం. మకావోలాగానే ఇదీ ప్రత్యేక ప్రతిపత్తిగల ప్రాంతం. హాంగ్‌కాంగ్‌లో 95% హాన్ జాతి చైనీయులే వుంటారు. 1839-42 మధ్య జరిగిన నల్లమందు యుద్ధంలో చైనా ఓడిపోయి బ్రిటిష్ వాళ్ళు గెలవడంతో, అప్పుడు జరిగిన నాన్‌జింగ్ (1842) ఒప్పందం ప్రకారం హాంగ్‌కాంగ్ క్వింగ్ రాజుల చేతినుండి బ్రిటిష్ ఆధీనంలోకి వెళ్ళింది. పసిఫిక్ యుద్ధంలో జపాన్ ఈ ప్రాంతాన్ని 1942లో ఆక్రమించుకున్నది కానీ నాలుగు సంవత్సరాలలోనే బ్రిటన్ దాన్ని తిరిగి స్వాధీనం చేసుకుంది. అప్పటినుండి ఇది బ్రిటిష్‌వారి వలసగానే కొనసాగింది. దాదాపు 150 సంవత్సరాల వలసపాలన అనంతరం 1997 జూలైలో ఈ ప్రాంతాన్ని బ్రిటిష్ వాళ్ళు చైనా ప్రభుత్వానికి ఒప్పగించారు. అయితే ఇన్ని సంవత్సరాలు పరాయిపాలనలో ఉండటంవల్ల హాంగ్‌కాంగ్‌లో చైనాదేశానికి భిన్నమయిన వ్యవస్థ వేరూనుకొంది. అత్యంత లోతైన రేవుపట్టణం కావటంతో ప్రపంచంలో అతి పెద్ద నౌకా కేంద్రంగా, వ్యాపార కేంద్రంగా అభివృద్ధి అయ్యింది. విపరీతమయిన పోటీ గల, అత్యంత స్వేచ్ఛావ్యాపార కేంద్రంగా, ఆర్థిక కేంద్రంగా ఎదిగింది. 'తూర్పు పడమరల సాంస్కృతిక సమాగమ క్షేత్రం' అని హాంగ్‌కాంగ్‌ను వర్ణిస్తారు. ఈ చారిత్రక అంశాలన్నీ పరిగణించి చైనా 'ఒక దేశం - రెండు వ్యవస్థలు' అనే విధానం చేపట్టి హాంగ్‌కాంగ్‌ను ఒక ప్రత్యేక ప్రాంతంగానే పరిగణిస్తోంది. హాంగ్‌కాంగ్‌లోని ఆర్థికవ్యవస్థను, పరిపాలనా పద్ధతిని మౌలికంగా గతంలోలాగే వుంచివేశారు. డిఫెన్సు, ఫారెన్ వ్యవహారాలు మాత్రమే చైనా నిర్వహిస్తోంది. కరెన్సీతోసహా మిగతా అన్ని విషయాలలో హాంగ్‌కాంగ్ స్వతంత్ర ప్రతిపత్తిని అనుభవిస్తోంది.

కనీసం 50 ఏళ్ళపాటు హాంగ్‌కాంగ్ పరిపాలనలో మౌలిక మార్పులు, తీవ్రమయిన సంస్కరణలు ప్రవేశపెట్టనని తాను చేసిన 1984 అంతర్జాతీయ సంయుక్త ప్రకటనకు కట్టుబడి చైనా వ్యవహరిస్తోంది. ప్రస్తుతం హాంగ్‌కాంగ్ విషయాల్లో క్రియాశీలంగా వున్నప్పటికీ, జోక్యం చేసుకోని పద్ధతి అనుసరిస్తోంది చైనా. తక్కువ భూమి లభ్యతవల్ల నగరమంతా ఎత్తుగా పెరిగి ఆకాశహర్మ్యాలతో విరాజిల్లుతోంది. 90% ప్రజలు స్వంత వాహనాలు లేకుండా ప్రభుత్వ రవాణా వాహనాలనే ఉపయోగిస్తారు. చైనాకు భిన్నంగా (బ్రిటిష్ పద్ధతిలో) ఇక్కడ ఎడమ పక్కన వాహనాలు నడుపుతారు. ప్రపంచంలో అత్యంత నివాసయోగ్యమైన నగరంగా అంతర్జాతీయంగా ఎన్నిక అయ్యింది. ఈ విషయం పట్ల మా టూరు గైడు ఆశ్చర్యం వ్యక్తపరచి 'అలా అయితే మిగతా నగరాలు మరెంత ఘోరంగా వున్నాయో?' అని వ్యాఖ్యానించాడు. ఈ నగరంలోవున్న అత్యంత ఎత్తయిన నిర్మాణం, 1360 అడుగులు ఎత్తువున్న 88 అంతస్తుల ఇంటర్నేషనల్ ఫైనాన్స్ సెంటరు. దీన్ని 2003లో కట్టారు. ప్రస్తుతం దానిని మించి 118 అంతస్తులతో 1588 అడుగుల ఎత్తు వున్న ఇంటర్నేషనల్ కామర్సు సెంటరు 2010లోనే పూర్తయింది. 'స్కై 100' అనే టవరు దగ్గరికి వెళ్ళి 100వ అంతస్తునుంచి నగర అందాలు వీక్షించాము. లిఫ్టు ఒక్క నిమిషంలో వందవ అంతస్తుకు చేరుకుంటుంది. ఆతర్వాత నక్షత్రాల వీధి (స్టార్ స్ట్రీట్) అని పిలుచుకునే కూడలి దగ్గరకు వెళ్ళి విద్యుద్దీపాలతో, విద్యుత్ మాలలతో వెలిగించబడ్డ ఆ ప్రాంత సోయగాన్ని, నక్షత్రాల పుంతలా కాంతులీనుతున్న వింత సౌందర్యాన్ని చూశాము. హాంగ్‌కాంగ్‌లో మేము వున్నది కేవలం కొన్ని గంటలే. తెల్లవారుఝామున మూడు గంటలకే ఎయిర్‌పోర్టుకు వెళ్ళాలి. అందుకని కొద్దిగానే చూశాము. కేవలం మూడు గంటలు విశ్రాంతి తీసుకుని తిరుగు ప్రయాణం కోసం హాంగ్‌కాంగ్ విమానాశ్రయం చేరుకున్నాం. థాయ్ ఎయిర్‌లైన్సులో ఉదయం 7 గంటలకు బయలుదేరి, బ్యాంకాక్ మీదుగా ప్రయాణించి హైదరాబాద్ చేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది. 8వ తారీఖు ఒళ్ళు విరుచుకొని నిద్రలేస్తోంది.

ఇటు పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆర్థిక కేంద్రంగా, వాణిజ్య కేంద్రంగా తన ప్రత్యేకతను నిలబెట్టుకుంటూ, సామాన్యుల జీవనభూమికి దూరంగా, ఎత్తుల్లోకి ఎగిరిపోతున్న హంగ్‌కాంగ్, ఇదే వ్యవస్థకి పుట్టిన క్షీణసంస్కృతికి, జూద మనస్తత్వానికి పెద్దపీట వేస్తూన్న మకావో, ఈ రెండూ పెట్టుబడిదారీ ప్రపంచపు ఆర్థిక సాంస్కృతిక వ్యవస్థలకు గొప్ప ప్రతీకలైతే, అటు సామ్యవాద నిర్మాణంలో నిమగ్నమై అద్భుతాలు సృష్టిస్తున్న చైనా ప్రధాన భూభాగం, మానవాళి కలలకు, సమానతా ప్రపంచ మహోదయానికి క్రియాస్థలం. ఈ మూడు ప్రాంతాలు ఒకే దేశం కావటం ఒక విచిత్రం. రెండువారాల వ్యవధిలో ఈ విచిత్రాలన్నీ సందర్శించి, జనస్వామ్యం అంటే ఏమిటో మరింత స్పష్టంగా, తులనాత్మకంగా తెలుసుకున్న నూతన ఉత్సాహంతో, రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంలో దిగి బలమైన అడుగులతో హైదరాబాద్ చేరుకున్నాను.

## భారత, చైనా దేశాల మైత్రికి అత్యుత్తమ చిహ్నం,
## అంతర్జాతీయ మానవతాస్ఫూర్తి
# డాక్టర్ ద్వారకానాథ్ శాంతారామ్ కోట్నీస్

అంతర్జాతీయత, ఆత్మత్యాగం అనే మహోన్నత సూత్రాలకు రూపకల్పన చేసినట్లుగా జీవించిన భారతీయుడు డాక్టర్ కోట్నీస్. చైనీయుల పక్షాన ఫాసిస్టు జపాన్ వ్యతిరేక ప్రజాయుద్ధంలో పాల్గొని తన ప్రాణాలను త్యాగం చేశాడు. అందుకే ఆ దేశస్తుల గౌరవాన్ని, ప్రేమను చూరగొన్నాడు. చైనీయుల హృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోయాడు. ఆయన అవిరళ కృషి భారత చైనా ప్రజల మధ్య స్నేహ సంబంధాల సుదీర్ఘ చరిత్రను సదా తేజోవంతం చేస్తూనేవుంటుంది.

డాక్టర్ కోట్నీస్ 1910 అక్టోబరు 19న షోలాపూర్ పట్టణంలో జన్మించాడు. బ్రిటిష్ వలసపాలనకు వ్యతిరేకంగా ఆ కాలంలో జరిగే పోరాటాల్లో కోట్నీస్ తండ్రి ముందుండేవారు. దీనిమూలంగా కోట్నీస్‌లో చిన్నప్పటినుండే జాతీయభావం, దేశభక్తి వుండేవి. ఆ కాలంలో దేశంలో గంగానది వరదల్లాగా అనేకరకాల ఉద్యమాలు వచ్చాయి. అన్ని రకాల ఉద్యమాల్లో ఏది సరైనది? ఎలా జాతి విముక్తి చెందుతుంది? అని ఆలోచించి డా॥కోట్నీస్ “రివల్యూషనరి కాన్సెప్ట్ ఈజ్ ది బెస్ట్” అనే అభిప్రాయానికి వచ్చాడు. ఈ భావాల స్ఫూర్తితోనే ఆయన తాను యంబిబియస్ చదివే కాలేజీలో బ్రిటిష్ వ్యతిరేక ఆందోళనల్లో పాల్గొన్నాడు. అటువంటి ఒక ఆందోళన సందర్భంలో ఆయనను కాలేజీనుండి తొలగించారు. క్షమాపణ రాసిస్తేనే కాలేజీలో తిరిగి చేర్చుకుంటామని, లేకుంటే చేర్చుకోమని ప్రిన్సిపాల్ షరతులు విధించినా లొంగక డా॥కోట్నీస్ ఆ కాలేజీని వదిలి తన తండ్రి సహాయంతో ముంబైలోని గ్రాంట్ మెడికల్ కాలేజీలో చేరి అక్కడే తన డాక్టరు కోర్సును పూర్తి చేశాడు. కాలేజీనుండి తనను తీసివేసినట్లు కోట్నీస్ నుండి ఉత్తరం అందుకున్న ఆయన తండ్రి “ఏమీ బాధపడవద్దు” అని కోట్నీస్‌కి చెప్పి అతన్ని ఈవిధంగా వేరే కాలేజీలో చేర్పించారు. జాతీయభావం, దేశభక్తి, పట్టుదల కోట్నీస్‌కు తన కుటుంబంనుండి వారసత్వంగా వచ్చాయి.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జపాన్ సామ్రాజ్యవాదులు చైనాపై దండెత్తిన సందర్భంలో తమ విముక్తి పోరాటంలో గాయపడిన సైనికులకు సేవ చేయటానికి వైద్య బృందాన్ని పంపాలని చైనా కోరగా, ఆనాటి భారత జాతీయకాంగ్రెస్ చైనాకు అయిదుగురితో కూడిన వైద్యబృందాన్ని పంపాలని నిర్ణయించింది. డా॥కోట్నీస్‌కు ఈ విషయం తెలిసిన వెంటనే సర్జరీలో పోస్టు గ్రాడ్యుయేషన్‌ను, వ్యక్తిగత సమస్యలను పక్కనపెట్టి చైనా వెళ్ళటానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. డా॥కోట్నీస్ అప్పుడే యంబిబియస్ పాసైనందున, తనకు సీనియారిటీ లేదు కాబట్టి, ఎంపిక చేస్తారో లేదో అనే సందేహంతో వైద్యబృందం కమిటీ చైర్మన్‌ను మూడు, నాలుగు పర్యాయాలు కలిశాడు. వృత్తిరీత్యా తక్కువస్థాయిలో ఉన్నప్పటికీ ఆయనలోని త్యాగబుద్ధిని చూసి, "చైనాలో మనపేరును నిలబెడతాడు. చైనా ప్రజలకు ఉపయోగపడతాడు" అని భావించి డా॥కోట్నీస్‌ను ఎంపిక చేసారు. డాక్టర్ల బృందం చైనాకు వెళుతున్నప్పుడు "సౌభ్రాతృత్వం, మానవత్వం, సేవ" అనే నినాదాలతో అక్కడ ఒక బ్యానర్ పెట్టారు. భారత ప్రజలు తనకు అందించిన ఈ మూడు సూత్రాలకోసం, వాటిని తన జీవితంలో భాగం చేసుకొని డా॥కోట్నీస్ చైనాలో అయిదు సంవత్సరాలు పోరాడాడు.

డాక్టర్ ద్వారకానాథ్ కోట్నీస్ భారతీయ వైద్య బృందంతో 1939 ఫిబ్రవరిలో ఏనాన్ చేరుకున్నాడు. చైనాలో ఆనాటి కొమింగ్‌టాంగ్ ప్రభుత్వం ఈ డాక్టర్ల బృందం పోరాటప్రాంతాలకు చేరుకోకుండా అనేక అడ్డంకులను సృష్టించింది. పోరాట ప్రాంతాలకు, గాయపడుతున్న సైనికుల దగ్గరకు పంపించమని భారత వైద్యబృందం ఎన్నిసార్లు అడిగినా అంబులెన్స్‌కు డీజల్ లేదనీ, ఉష్ణ దేశంనుండి వచ్చిన మీరు అక్కడి విపరీతమైన చలికి తట్టుకోలేరనీ – ఇంకా అనేకసాకులు చెప్తూ కొమింగ్‌టాంగ్ ప్రభుత్వం కాలయాపన చేయటానికి ప్రయత్నించింది. ఈ పరిస్థితిని డా॥కోట్నీస్ నాలుగు పదాల్లో వివరించాడు. (1) అవాయిడ్ (avoid) చేయాలని చూడటం (2) బుజ్జగించటం, (3) బలవంత పెట్టటం (4) వారి దుష్ప్రచారాన్ని మనం నమ్మేట్లుగా చేయటం. ఇలా సామ, దాన, భేద, దండోపాయాలతో కొమింగ్‌టాంగ్ ప్రభుత్వం ఎన్ని అడ్డంకులు సృష్టించినా డా॥కోట్నీస్ బృందం "మేము యానాన్ వెళ్ళవలసిందే" అని గట్టి పట్టుదలతో, చివరకు మావో అసిస్టెంట్లకు ఫోన్ చేసి డీజిల్ తెప్పించుకొని పోరాట ప్రాంతాలకు వెళ్ళారు. డా॥కోట్నీస్ ఏనాన్ నుండి శత్రువులను ఎదుర్కొంటున్న యుద్ధక్షేత్రాలకు వెళ్లాడు. యుద్ధరంగపు వెనుకతట్టున వున్న వైద్య కేంద్రాలలో పనిచేశాడు. చైనీయులు, గెరిల్లా యుద్ధవీరులు, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని 8వ మార్గపు సేన ఈ ప్రాంతాన్ని విముక్తి చేస్తున్న దశ అది. అక్కడి స్థానిక ప్రభుత్వపు అన్ని కార్యాలయాల వలెనే ఆసుపత్రులకు కూడా శాశ్వత సదుపాయాలు లేవు. యుద్ధ పరిస్థితులకు అనుకూలంగా ఒక ప్రదేశంనుంచి మరో ప్రదేశానికి మారుతూ వుండేవారు.

డా॥కోట్నీస్ చైనాలోవున్న నాలుగు సంవత్సరాల్లో పదిసార్లు మావోను కలిశాడు. అయిదుసార్లు చౌఎన్‌లైను కలిశాడు. ఎన్నో ఉపన్యాసాలు విన్నాడు. జాతీయవాది, ఒక మామూలు యంబిబియస్ కుర్రవాడు ప్రపంచ చరిత్రలో చిరస్థాయిగా నిలబడే వ్యక్తిగా ఎదిగాడు. ఇందుకు ప్రోద్బలం చేసిన శక్తులు ఏమిటి? ప్రధానంగా ఆనాడు జపాన్ వ్యతిరేక పోరాటంలో చైనా ప్రజల అశేష త్యాగాలనుండి, చైనా యుద్ధభూమిలో ప్రజావిముక్తి సైనికుల వీరగాథలనుండి ఆయన స్ఫూర్తిని పొందాడు. ప్రభావితమయ్యాడు. డా॥కోట్నీస్ వైద్య బృందానికి యుద్ధభూమిలో ప్రజలు స్వాగతం పలుకుతున్న ఒక సందర్భంలో ఒక గ్రామంలో ముసలి తల్లి ఆహ్వాన కమిటీ అధ్యక్షురాలుగా ముందుకు వస్తుంది. డా॥కోట్నీస్ ఆ వృద్ధురాలిని "ఇంత పెద్ద వయస్సులో మా వద్దకు ఎందుకు వచ్చావ"ని ప్రశ్నించాడు. అప్పుడు ఆ వృద్ధురాలి గురించి పక్కనున్నవారు "ఆమెకు చాలా పట్టుదల వుంది. ఆమె తన భర్తను యుద్ధంలోకి పంపింది. ముగ్గురు కొడుకులను యుద్ధభూమిలోకి పంపింది. ప్రస్తుతం ఎవరూ లేరు కనుక ఆమే స్వయంగా తుపాకి పట్టుకొని యుద్ధభూమికి బయలుదేరింద"ని చెప్తారు. "నా భర్తను కోల్పోయినా, నా పుత్రులను కోల్పోయినా ఫర్వాలేదు. నా మనుమళ్ళు కూడా యుద్ధంలోకి వస్తారు" – అని ఆ వృద్ధమాత చెప్తుంటే డా॥కోట్నీస్ తీవ్రంగా చలించిపోతాడు. ఇంకొక సందర్భంలో ఎర్రసైన్యం మిలటరీ ఆఫీసర్ తన గాథను డా॥కోట్నీస్‌కు వివరిస్తూ – తాను గొర్రెల కాపరిననీ, చదువురాదనీ, తప్పిపోయిన గొర్రెలకోసం తనను తన యజమాని విపరీతంగా కొట్టాడనీ, ఆ స్థితిలో పారిపోయి కొన్నివేల మైళ్ళు నడిచివచ్చి ఎర్రసైన్యంలో చేరాననీ, ఎర్రసైన్యంలో చేరిన తరువాత విద్యాబుద్ధులు నేర్చుకొని చిన్నసైజు కమాండర్ అయ్యానని చెప్పాడు.

ఒక మామూలు స్త్రీ తన కుటుంబాన్నంతా యుద్ధరంగానికి పంపటం, ఏ జ్ఞానమూ, విద్యాలేని మనిషి ప్రజలకోసం కమాండర్‌గా ఎదగటం – ఇలాంటి సంఘటనలతో బాగా ప్రభావితుడైన డా॥కోట్నీస్ తన మానసిక స్థైర్యాన్ని మరింత పెంచుకొని, అక్కడి ప్రజలకోసం పూర్తిగా అంకితమై కృషిచేశాడు. డా॥ కోట్నీస్ చైనా భాషను నేర్చుకుని అక్కడి ప్రజలతో పూర్తిగా మమేకమైపోయాడు. ఆయనను ఒక వీడ్కోలు సభలో ఆటోగ్రాఫ్ అడుగగా "జపాన్‌కు వ్యతిరేకంగా జరుగుతున్న ఈ ప్రతిఘటనా యుద్ధం తప్పకుండా విజయవంతమై తీరుతుంది" అని చైనా భాషలో రాసి సంతకం పెట్టాడు. ఆ కాగితాలను చైనావారు ఇప్పటికీ భద్రపరిచి వుంచారు.

యుద్ధభూమిలో డా॥కోట్నీస్ ప్రజలనుండి ఎన్నో పాఠాలు నేర్చుకున్నాడు. వేలాది ఆపరేషన్లు చేశాడు. సైనికులకు అర్థం కావటానికి "బేసిక్స్ ఆఫ్ సర్జరీ" అనే పుస్తకాన్ని రచించాడు. యుద్ధరంగంలో తన బూట్లు పాడైపోయిన సందర్భంలో ప్రజావిముక్తి సైనికుడు కొత్తబూట్లను ఇవ్వగా, తనబూట్లకంటే ఆ సైనికుని బూట్లే ఎక్కువ పాడైపోయాయని గమనించి డా॥కోట్నీస్ కొత్తబూట్లను ఆ సైనికునికే ఇస్తాడు. అదేవిధంగా తాను సామాన్యమైన ఆహారాన్ని

మాత్రమే స్వీకరిస్తూ, ఒక డాక్టరుగా తనకిచ్చే నాణ్యమైన ఆహారాన్ని అవసరమైన రోగులకు అందించేవాడు. ఇవన్నీ డా॥కోట్నిస్ త్యాగనిరతికి నిదర్శనాలు. తమకు అందిస్తున్న సేవలకు ప్రభావితులైన అక్కడి ప్రజలు ఆయనకు ప్రేమతో 'బ్లాక్ మదర్' అని పేరుపెట్టారు. ఆ తర్వాత డా॥నార్మన్ బెతూన్ స్మారక ఆసుపత్రికి ఆయన్ని డైరెక్టరుగా చేశారు. 1942లో ఆయనకు చైనా కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం లభించింది. ఈ సభ్యత్వాన్ని అత్యున్నతమైన గౌరవంగా డా॥కోట్నిస్ భావించాడు.

తనకు అనారోగ్యంగావున్నా, మూర్ఛరోగం బాధిస్తున్నా డా॥కోట్నిస్ వెరువక తన జీవితం చివరిక్షణం వరకు చైనా ప్రజలకు సేవలందించాడు. విశ్రాంతి తీసుకోవాలని, హాంకాంగ్‌గానీ, ఇండియాగానీ వెళ్ళి ఆరోగ్యం బాగుచేసుకోవాలని ప్రజావిముక్తి సైన్యాధికారులు సలహా ఇచ్చినా ఆయన నిరాకరించాడు. తన అవసరం చైనాలోనే ఎక్కువగా వుందని అక్కడే వుండిపోయాడు. పశ్చిమాన షాంఘై, తూర్పున హీబై రాష్ట్రాలను విభజిస్తున్న తైహాంగ్ కొండల్లోని విశాలమైన పర్వతసానువుల్లో వున్న తెంగ్‌సియాన్ గ్రామంలో పనిచేస్తూ మూర్ఛవ్యాధినుండి బయటపడలేక డాక్టర్ కోట్నిస్ 1942 డిసెంబరు 9న మరణించాడు.

ఆ శీతాకాలపు తొలివేకువలో ఆయన మరణించినప్పుడు, ఆయన సహచర ఉద్యోగులు, వ్యాధిగ్రస్తులు, పరిసర ప్రాంతాల ప్రజలు ఎంతో శోకసంతప్తులయ్యారు. ఆయన మరణశయ్య వద్దనే వున్న భార్య, చైనా యువతి గియో చింగ్ లాన్, ఆమె చేతుల్లోని వాళ్ళ చిన్ని కొడుకు మాత్రమే కాదు. ఆయన నిస్వార్థసేవ, అంకితభావంతో సాగించిన కృషి తెలిసిన సమస్త చైనా ప్రజానీకమూ ఆయనకోసం కన్నీరు నింపుకుంది.

చైనా ప్రజల అత్యున్నత శ్రేణి నాయకులనుంచి డాక్టర్ కోట్నిస్ మరణించినప్పుడు గొప్ప ప్రశంసావాక్యాలు వెలువడ్డాయి. "మన సైన్యం ఒక గొప్ప సహాయకుణ్ణి కోల్పోయింది. మనదేశం ఒక గొప్ప మిత్రుణ్ణి కోల్పోయింది. ఆయన అంతర్జాతీయతా స్ఫూర్తిని మనం సదా గుర్తుంచుకుందాం" అన్నారు చైర్మన్ మావో జెడాంగ్. చౌ ఎన్ లై "ఘనమైన చైనా భారత్ దేశాల మైత్రికి ప్రతీక డాక్టర్ కోట్నిస్. జపాన్ మిలటరీకి, ప్రపంచ ఫాసిజానికి వ్యతిరేకంగా మనం సాగిస్తున్న ఉమ్మడి పోరాటాలలో చురుకుగా పాల్గొంటున్న భారతీయ ప్రజలలో తలమానికం డాక్టర్ కోట్నిస్. రెండు దేశాల ప్రజల హృదయాల్లో ఆయన పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది. ఎందుకంటే మన రెండు దేశాలకోసం ఆయన ప్రాణత్యాగం చేశాడు" అని కొనియాడారు. మేడం సూంగ్ చింగ్ లింగ్ "డాక్టర్ కోట్నిస్ జ్ఞాపకాలు మన రెండు గొప్ప దేశాలకు మాత్రమే సంబంధించినవి కావు. యావత్తు మానవాళి స్వేచ్ఛ, ప్రగతికోసం అకుంఠిత దీక్షతో పోరాటం చేస్తున్న అందరికీ చెందుతుంది. భవిష్యత్తు ఆయనను ఇప్పటికంటే కూడా ఘనంగా సత్కరిస్తుంది. ఎందుకంటే ఆయన పోరాడిందీ, ప్రాణాలు అర్పించిందీ మంచి భవిష్యత్తుకోసమే కదా!"

దూర రాష్ట్రాలలోని ప్రజలు కూడా "జపాన్ ప్రతిఘటనా యుద్ధంలో మనకు సాయం చేయటానికి సుదూర ప్రాంతంనుంచి చైనా వచ్చిన వ్యక్తిగా" డాక్టర్ కోట్నీస్‌ను గుర్తుచేసుకుంటారు.

డా॥కోట్నీస్ 1941లో గియో చింగ్‌లాన్ అనే ఒక చైనా అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. అప్పుడు ఆవిడ బెతూన్ హాస్పటలులో నర్సుగా వుండేది. వారిద్దరికీ ఒక కొడుకు కూడా కలిగాడు. అతను 25 ఏళ్ళ వయసులో మెడిసన్ చదువుతూవుండగా చనిపోయాడు. 1916లో జన్మించిన గియో చింగ్‌లాన్, కోట్నీస్ మరణం తర్వాత 1947లో మరో చైనా వ్యక్తిని వివాహమాడింది. అయితే కోట్నీస్ కుటుంబ సభ్యులతో చివరివరకు సంబంధాలు కలిగి వుండేది. 2006లో కూడా ఇండియాకు వచ్చివెళ్ళింది. భారత ప్రభుత్వాధినేతల చైనా పర్యటనలలో ఆవిడ ఒక ముఖ్య అతిథిగా వుండేది. శ్రీమతి గియో చింగ్‌లాన్ తన 96వ ఏట 2012 జూన్ 28న మరణించింది.

1982 డిసెంబరు 9 డాక్టర్ కోట్నీస్ 40వ వర్ధంతి సందర్భంగా ఆయన ఉదాత్త జీవితాన్ని స్మరించుకుంటూ, చీనీ భాషలోవున్న డాక్టరు కోట్నీస్ జీవితగాధ ఇంగ్లీషు, హిందీ అనువాదాలను చైనావారు ప్రచురించారు. శతజయంతి ఉత్సవాలు ఘనంగా నిర్వహించారు. చైనా ప్రభుత్వాధినేతలు భారతదేశం పర్యటించినప్పుడు, గౌరవపూర్వకంగా డా॥కోట్నీస్ కుటుంబాన్ని సందర్శిస్తారు. డా॥కోట్నీస్ స్ఫూర్తిని కొనసాగిస్తూ భారత–చైనా సంయుక్త వైద్య బృందాలను నిర్వహిస్తున్నారు.

తమ దేశంకోసం ప్రాణాలర్పించిన పుత్రుడిగా, భారత–చైనా దేశాల మైత్రికి అత్యుత్తమ చిహ్నంగా, తమ ఆప్తమిత్రుడుగా డా॥కోట్నీస్‌కు చైనా ప్రజలు సదా నివాళులు అర్పిస్తున్నారు. ఈనాటికీ ఆయన స్మృతి అక్కడ దేదీప్యమానంగా వెలుగుతూనే వున్నది.

"మా ప్రియ నేస్తమా! కా॥కోట్నీస్!
హిందూ మహాసముద్రపు ఉష్ణజలాల నుండి వీచిన ఓ వెచ్చనిగాలీ!
చైనా ఉత్తర తీర శీతలత్వాన్ని కరిగించటానికి వచ్చావ్!
నువ్వు అయిదు హేమంత శిశిరాలు పోరాడావ్!
రేపటి ప్రపంచంకోసం!
అయ్యో! ఈ సుదీర్ఘరాత్రి పోరాటంలో నీ జీవశక్తి ఆరిపోయింది!
నీ ఛాయ మమ్మల్ని ఆవరించే వుంటుంది ఎన్నటికీ!
నీ స్మృతి మా హృదయాల్లో జీవించే వుంటుంది ఎన్నటికీ!



# మహోన్నత మానవుడు డా॥ నార్మన్ బెతూన్

డా॥నార్మన్ బెతూన్ మహోన్నత మానవుడు. కెనడాలో పుట్టి పెరిగినా డాక్టరుగా అంతర్జాతీయ మానవతావాదిగా నిలిచాడు. మొదటి ప్రపంచయుద్ధంలో కెనడా సైన్యంలో చేరాడు. తన విద్యాభ్యాసాన్ని మధ్యలోనే వొదిలివేసి ఫ్రాన్సులో అంబులెన్సు స్ట్రెచర్ మోసేవానిగా పనిచేశాడు. ఆ తరువాత వైద్య విద్యను పూర్తి చేశాడు. సర్జరీ విభాగంలో ఎంతో కృషి చేసి కొత్తకొత్త పద్ధతులు అభివృద్ధి చేశాడు.

1935లో సోవియట్‌ను సందర్శించి తన సామాజిక అవగాహనను పెంచుకున్నాడు. తిరిగివచ్చి కెనడా కమ్యూనిష్టు పార్టీలో చేరాడు. 1936 స్పానిష్ అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. స్పానిష్ డెమోక్రసీని కాపాడే సహాయకచర్యలలో భాగంగా స్పెయిన్ వెళ్ళాడు. అక్కడి యుద్ధంలో తన సేవలు అందించాడు. రక్త సేకరణనుండి రోగికి రక్తం ఎక్కించేవరకు వున్న అనేక ప్రక్రియలను ఆ సమయంలో ఆయన ఆధునీకరించాడు. దానివల్ల గాయపడ్డ సైనికుల ప్రాణాలెన్నో కాపాడగలిగారు. అంతేకాదు, కెనడా తిరిగి వచ్చి వలంటీర్లను, విరాళాలను పోగు చేసి స్పెయిన్‌కు పంపాడు.

ఆ తరువాత 1938లో చైనా వెళ్ళాడు. జపాన్ వ్యతిరేక పోరాటంలో ఈయన చైనాను సమర్థిస్తూ, మావో నాయకత్వంలోని కమ్యూనిష్టు పార్టీకి, 8వ మార్గపు రెడ్ ఆర్మీకి తన సేవలు అందించాడు. కొత్తకొత్త తెలివయిన పద్ధతులు అభివృద్ధి చేసి ఆధునిక వైద్య విధానాలను, యుద్ధ భూములకు అనుకూలంగా మార్చి వైద్యం చేశాడు. అలా పనిచేస్తూన్న ఆయన 1939లో సెప్టీసీమియా వ్యాధివల్ల నవంబర్ 12న చనిపోయాడు.

"ఈ రోజు మనం వైద్యాన్ని ఒక విలాసవంతమైన వ్యాపారంలాగ నిర్వహిస్తున్నాం. వజ్రాల ధరలకు మనం రొట్టెముక్కలు అమ్ముతున్నాం. మనం ఈ వైద్య విధానం నుంచి లాభాన్ని, వ్యక్తిగత ఆర్థిక ప్రయోజనాన్ని నిర్మూలించాలి! ఈ వ్యక్తిగత ప్రయోజనం అనే కల్మషాన్నుంచి మన వైద్యవృత్తిని శుభ్రం చేయాలి! మనం రోగులను నీ దగ్గర ఎంత వుంది? అని అడగవద్దు. నీకు నేను ఏమి సేవ చేయగలను? అని అడగాలి". అని ఆయన వైద్యులకు మరిచిపోలేని సందేశమిచ్చాడు.

డాక్టర్ బెతూన్ గురించి మావో వ్రాసిన ఒక వ్యాసం ఇప్పటికీ చైనాలో ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు పాఠంలా బోధిస్తూవున్నారు.

"బెతూన్ స్ఫూర్తి, ఆయనకు ఇతరుల పట్ల వున్న అంకితభావం, స్వంత ప్రయోజనం ఏమాత్రం పట్టించుకోనితనం, తన పని పట్ల ఆయన చూపించిన బాధ్యతాయుత ప్రవర్తన, సహచరులు, ప్రజల పట్ల ఆయన ప్రదర్శించే సౌజన్యం, వీటిని ప్రతి కమ్యూనిస్టూ ఆయన నుంచి నేర్చుకోవాలి! ఆయనలో వున్న స్వచ్ఛమయిన స్వార్థ త్యాగాన్ని మనం అలవరచుకోవాలి. ఒక మనిషి సమర్థుడు కావొచ్చు లేక అసమర్థుడు కావొచ్చు కానీ డా॥ బెతున్‌లో వున్న స్ఫూర్తిని కలిగివుంటే మాత్రం అతను ఉన్నత మానవుడవుతాడు. తన ప్రజలకు ఎంతైనా ఉపయోగపడతాడు". ఇది కా॥మావో పిల్లలకు రాసిన పాఠం.

డా॥బెతూన్ స్మృతి చిహ్నాలు చైనా అంతటావున్నాయి. ముఖ్యంగా అనేక మెడికల్ కాలేజీలు, యూనివర్సిటీలకు ఆయన పేరు పెట్టారు. మేము చూసిన నగరంలోనే బెతూన్ పేర మిలటరీ మెడికల్ కాలేజి, అంతర్జాతీయ శాంతి ఆసుపత్రి, బెతూన్ స్పెషాలిటీ మెడికల్ కాలేజి వున్నాయి.



# చైనాలో బుల్లెట్ రైలు...

1949లో జనచైనా ఆవిర్భావం జరిగింది. అప్పుడు సగటున 30-40 కిలోమీటర్ల వేగంతో నడిచే రైళ్ళు వుండేవి. ఆ తర్వాత యస్ఎల్-7 పేర 110 కి॥మీ॥ వేగంతో నడిచే రైలు వచ్చింది. అది దాలియన్ నుండి జియాన్‌జింగ్ వరకు నడిచేది. రైల్వేలలో ప్రస్తుత ఆధునీకరణకు తలుపులు తీసింది కా॥డెంగ్. 1978లో ఆయన జపాన్ పర్యటన సందర్భంగా చూసిన స్పీడురైలును తమ దేశంలో ప్రవేశపెట్టాలని సూచించారు.

చైనాలో మొట్టమొదటి స్పీడు రైల్వే లైను నిర్మాణం బీజింగ్-షాంఘైలమధ్య జరగాలని 1990లో ఒక ప్రతిపాదన వచ్చింది. ఈ రైలు అవసరం, ఆర్థిక ఉపయోగిత గురించి చర్చించి ఆమోదించారు. 1993లో 48 నుండి 50 కి॥మీ॥ వేగంతో రైళ్ళు నడిచేవి. అందువల్ల విమానాలకు గిరాకీ పెరిగింది. 1997 నుంచి 2004 వరకు 7700 కి॥మీ॥ రైల్వే లైన్లను ఆధునీకరించి, గంటకు 200 కి॥మీ॥ వేగాన్ని సాధించారు. 2007 కల్లా 200 కి॥మీ॥ వేగంతో నడిపే వీలున్న 22000 కి॥మీ॥ లైన్లు ఏర్పడ్డాయి. దేశం మొత్తంమీద రైల్వే ప్రయాణ స్పీడు సరాసరి గంటకు 70 కి॥మీ॥ చేరుకుంది.

2004లో షాంఘై విమానాశ్రయాన్ని, సిటీని కలుపుతూ 'మెగ్‌లేవ్' లైను నిర్మించారు. అది రైలు చక్రాలు పట్టాలకు తగలకుండా ఆకర్షణ శక్తి ద్వారా నడిచే ప్రపంచంలోనే మొదటి ప్రయాణీకుల రైలు. అది 430 కి॥మీ॥ వేగంతో నడుస్తుంది. 30 కి॥మీ॥ దూరం 7 నిమిషాలలో పూర్తి చేస్తుంది. అయితే ఎలక్ట్రోమాగ్నటిక్ రేడియేషన్ గురించి అనుమానాలు తలెత్తడంతో కొంతకాలం ఈ దిశలో విస్తరించకుండా అనేక పరిశోధనలు చేశారు. దానితో సమాంతరంగా జపాన్‌లో నడుస్తున్న హైస్పీడు రైలు గురించి ఆలోచనలు సాగాయి. జపాన్ కూడా 8000కి॥మీ॥ల హైస్పీడు రైల్వేలైన్ నిర్మించటానికి కాంట్రాక్టు తీసుకోవటానికి ముందుకొచ్చింది. అయితే చైనా జనాభిప్రాయం విరుద్ధంగా వుండింది. రెండవ ప్రపంచ యుద్ధం కాలంలో చైనాపై జపాన్ చేసిన యుద్ధాన్ని వాళ్ళు మరిచిపోలేదు. 10 లక్షల

సంతకాలతో జపాన్ కాంట్రాక్టును వ్యతిరేకిస్తూ ప్రజాభిప్రాయం వెలువడింది. 'ఫ్రాన్సువారి ఆల్‌స్టాల్, జర్మనీవారి సీమన్స్, జర్మనీలో పనిచేస్తున్న జపాన్‌వారి కావసాకి వంటి కంపెనీలు టెండర్లలో పాల్గొన్నాయి. సీమన్స్ తప్ప మిగతావి చైనావారి షరతులకు అనుకూలంగా తలవూపాయి. చైనావారు "ప్రామాణిక విలువలు, డిజైన్లు, స్థానిక జాయింట్ వెంచర్ల ద్వారా ఉత్పత్తి, చైనా ఉత్పత్తిదారులకు సహకారం ఇవ్వడం" అనే షరతులు విధించారు. ఇక సీమెన్స్ కూడా ఈ అవకాశం కోల్పోవడం ఇష్టంలేక మరుసటి సంవత్సరం చైనావారి షరతులకు తలవొగ్గింది. ఇక 2006లోనే 2020 నాటికి 25000 కి॥మీ॥ల హైస్పీడ్ రైల్వే నెట్‌వర్క్ నిర్మించాలనే లక్ష్యం నిర్ణయించుకున్నారు. ఐతే 2019కే 29000 కి॥మీ॥ పైబడిన రైల్వేలైన్ల నెట్‌వర్క్ పూర్తిచేశారు.

ఆగస్టు 2008లో బీజింగ్-తియాన్‌జిన్ మార్గంలో 350కి॥మీ॥ల వేగంతో ఇంటర్‌సిటీ రైలు ప్రవేశపెట్టారు. 2011 జూన్‌లో బీజింగ్-షాంఘైల మధ్య గంటకు 380 కి॥మీ॥ల వేగంతో నడిచే రైలును ప్రారంభించారు. జూలై 23, 2011 వెన్‌జౌలో రెండు స్పీడు రైళ్ళు ఢీకొన్నాయి. ఉరుములు, మెరుపులకు సిగ్నల్స్ పనిచేయకపోవటంతో ఒకచోట ఆగిపోయివున్న రైలును మరో రైలు ఢీకొట్టింది. పెద్దఎత్తున ప్రజల్లో ఆందోళన కలిగింది. ప్రభుత్వం వెనువెంటనే స్పందించి రక్షణచర్యలు, నిర్మాణ ప్రమాణాలు తిరిగి పరిశీలించారు. ప్రజల అనుమానాలు తీర్చటానికి, సాంకేతికంగా పరికరాల అరుగుదల (wear & tear) తగ్గించటానికి 300కి॥మీ॥ వేగానికి సవరించారు. టికెట్ రేట్లు తగ్గించారు. ప్రస్తుతం 250-300కి॥మీ॥ వేగంతో నడిచే అతిపెద్ద హైస్పీడ్ రైల్వే నెట్‌వర్క్ చైనాలోవుంది. ఇది ప్రపంచం మొత్తంలోనే అతిపెద్ద రైల్వే నెట్‌వర్క్. ప్రస్తుతం 600కి॥మీ॥ వేగంగల మాగ్‌లెవ్ మీద పరిశోధిస్తున్నారు.



# 4.

# నేను చూసిన చైనా...

## రెండవ పర్యటన - సెప్టెంబరు, 2017

2017 సెప్టెంబర్ 13 నుంచి 16 వరకు చైనాలోని సిచువాన్ ప్రావిన్స్ రాజధానీ నగరం చెంగ్డూలో, 5వ చైనా–దక్షిణ ఆసియా మైత్రీ సంఘాల ఫోరం నిర్వహించారు. భారత–చైనా మిత్రమండలి తెలంగాణ రాష్ట్ర శాఖ ప్రతినిధిగా నేను ఆ సమావేశాలలో పాల్గొన్నాను. ఇది నా రెండవ చైనా యాత్ర.

సిచువాన్ రాష్ట్రం పశ్చిమ చైనాలోవుంది. ఇది బెల్ట్ అండ్ రోడ్, యాంగ్జీనది ఆర్థిక కారిడార్ (బెల్ట్) వ్యూహంలో ముఖ్యమైన కుదురుగావుంది. ప్రజాచైనా అత్యున్నత నాయకులలో వొకరైన డెంగ్ జియావో పింగ్ ఈ రాష్ట్రంలోని గ్వాన్‌గాన్ అనేచోట ఒక రైతు కుటుంబంలో పుట్టి పైకి వచ్చారని గుర్తుకు వస్తోంది. బీజింగ్‌లో అక్టోబరు1, 1949 ప్రజాచైనా ఆవిర్భావ ప్రకటన తర్వాత కూడా కొంతకాలంపాటు ఈ ప్రాంతాలు చాంగ్ కై షేక్ నియంత్రణలోనే వుండేవి. కమ్యూనిస్టు సైన్యం నవంబరు '49 చివరిలో సమీపంలోని షాండుంగ్ ప్రావిన్సును, చాంగ్‌క్వాంగ్‌ను స్వాధీనం చేసుకుంది. కుమింటాంగ్ అధికారంలో చివరి వరకువున్న చెంగ్డూలో 1949లో 8వ రూట్ ఆర్మీ ప్రవేశించింది. ఈ ప్రాంతం కా॥డెంగ్ రాజకీయ నియంత్రణలోకి వచ్చింది. ఆ తర్వాత డెంగ్ కొంతకాలం ఛాంగ్‌క్వింగ్ మేయర్‌గా పనిచేశారు. సిచువాన్ ప్రావిన్స్ 9కోట్లు పైగా జనాభాను కలిగివుంది. చైనా ఆర్థిక ప్రగతిలో ఈ రాష్ట్రం గణనీయమైన పాత్ర పోషిస్తుంది. స్థానిక జిడిపి, 32000 కోట్ల యువాన్లను అధిగమించింది. 500 ఓవర్సీస్ ఫార్చ్యూన్ కంపెనీల్లో 316 ఇక్కడ పెట్టుబడులు పెట్టి తమ కార్యాలయాలను ఏర్పాటు చేసుకున్నాయి. ఈ రాష్ట్ర రాజధాని చెంగ్డూ నగరంలో సుమారు ఒక కోటి పైచిలుకు జనాభా వుంది. ఇది చైనా యొక్క 5వ అతిపెద్ద జనాభాగల నగరం. "దీన్ని సమృద్ధి భూమి" అని పిలుస్తారు. ఈ నగరం, పరిసర ప్రాంతాలను 'స్వర్గదేశం' అనికూడా వ్యవహరిస్తారు.

చెంగ్డూ అంతర్జాతీయ విమానాశ్రయం (షువాంగ్) జాతీయంగా 4వ పెద్ద విమానాశ్రయంగా గుర్తించబడుతోంది.

బెల్ట్ & రోడ్ పథకంలో సిచువాన్ ప్రాంత ప్రాధాన్యతను గుర్తిస్తూ విదేశాలతో మైత్రికై ఏర్పడ్డ చైనా ప్రజల సంస్థ (CPAFFC–సిపిఏఎఫ్ఎఫ్సి), సిచువాన్ అంతర్జాతీయ ట్రేడ్ కౌన్సిలు, సిచువాన్ ప్రావెన్షియల్ ప్రజా ప్రభుత్వం, ఈ కార్యక్రమాన్ని ఇక్కడ ఏర్పాటు చేసారు. కీలక ఆర్గనైజర్లుగా వున్న సిపిఏఎప్ఎఫ్సి కి చెందిన 20మంది, సిచువాన్ ప్రావిన్సునుండి 40 మంది ఫోరంలో పాల్గొన్నారు. ఈ ఫోరంలో దక్షిణాసియా దేశాలనుండి దాదాపు 40 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. చర్చల ప్రక్రియలు నిర్వహించటంలో దక్షిణాసియా చైనా ప్రాంతీయ మైత్రి సంస్థకు (OSARFAC) చాలా ముఖ్యమైన పాత్ర లభించింది. బంగ్లాదేశ్నుంచి 8, నేపాల్ నుంచి 10, శ్రీలంకనుంచి 10, పాకిస్థాన్నుంచి 4, మాల్దీవులనుంచి 4గురు ఈ ఫోరంలో పాల్గొన్నారు. ఇండియానుంచి 8మంది (కేరళ–2, కర్ణాటక–2, మహారాష్ట్ర–2, మా సంస్థ (ఆంధ్ర, తెలంగాణ)–2). ఫోరమ్లో పాల్గొన్నారు. భూటాన్, ఆఫ్ఘనిస్తాన్ ప్రతినిధులు దక్షిణాసియా రౌండ్టేబుల్ సమావేశంలో మాత్రమే పాల్గొన్నారు. మేము మన ఇతర రాష్ట్రాల ప్రతినిధులను బ్యాంకాక్ ఎయిర్పోర్టులోనే కలిసాం. అప్పటినుంచి కలిసేవున్నాం. 12 సెప్టెంబరునాడు ప్రతినిధులందరూ చెంగ్డూ చేరుకున్నారు. మాకు జిజియాంగ్ హొటల్లో బస ఏర్పాటుచేశారు. ఇది ఒక 5 స్టార్ హొటల్. అనేక అంతర్జాతీయ సమావేశాలు నిర్వహించుతున్న వేదిక. 2017లో అత్యున్నత స్థాయి అంతర్జాతీయ కాన్ఫరెన్సులు నిర్వహించిన పది హొటళ్ళలో ఇది వొకటిగా గుర్తింపు పొందింది. ఈ హొటలు 1958లో స్థాపించబడింది. ఈ పేరును మార్షల్ ఛూటే సూచించినట్లు చెబుతారు. మేము అక్కడ వున్నప్పుడే అదే ప్రాంగణంలో వున్న అనేక సభామందిరాలలో, వివిధ రాజ్య సదస్సులను ఏర్పాటుచేసి, వివిధ గ్రూపులకు చెందిన ప్రతినిధులకు ఎలాంటి ఇబ్బంది కానీ, గందరగోళంకానీ లేకుండా ఎంతో అలవోకగా ఏకసమయంలో అనేక సదస్సులు నిర్వహించటం గమనించి సంతోషించాం.

## సదస్సు–సమావేశాలు

సెప్టెంబరు 13వ తేదీన ఆసియా–సిచువాన్ వాణిజ్య వ్యాపారాలను ప్రోత్సహించేందుకు దక్షిణాసియా–సిచువాన్ బిజినెస్ ప్రమోషన్ రౌండ్ టేబుల్ సమావేశాన్ని నిర్వహించారు. ఇది సిచువాన్ కౌన్సిల్ ఫర్ ఇంటర్నేషనల్ ట్రేడ్, సిచువాన్ ప్రొవిన్షియల్ గవర్నమెంటు మరియు స్మార్ట్ సిటీ చాంబర్ ఆఫ్ కామర్సుల ఉమ్మడి ఆధ్వర్యంలో నిర్వహించబడింది. స్మార్ట్ సిటీ నిర్మాణాలు, దక్షిణాసియా–సిచువాన్ ప్రావిన్సుల మధ్య సహకారాన్ని పెంపొందించడం, హైటెక్ వ్యవసాయం, ఫుడ్ ప్రాసెసింగ్, యువతీయువకుల మధ్య ఎక్స్ఛేంజ్లు (యువతను ఆకర్షించే విధానాలు చేర్చటం), సహకారాన్ని ఎంచుకునే వినూత్న పద్ధతులను ఆవిష్కరించటం, ఈ

సమావేశం ఉద్దేశ్యం. ఇక్కడ భూటాన్, ఆఫ్ఘనిస్తాన్ ప్రతినిధులను మేము కలిసాము. భూటాన్ ఛాంబర్ ఆఫ్ కామర్సు అధ్యక్షుడు మరియు సార్క్ యువ వ్యవస్థాపకుల ఫోరం ఛైర్మన్ ఈ సదస్సుకు హాజరయ్యారు. రెండు దేశాలమధ్య, లేక రెండు రాష్ట్రాలమధ్య, లేక రెండు నగరాలమధ్య అవగాహనా ఒప్పందాలు చర్చించబడ్డాయి. పరిశ్రమలకు, మధ్యరకం ప్రాజెక్టులకు అందించుకోగల సహకారం గురించి చర్చించారు. ఇదంతా రోడ్డు అండ్ బెల్ట్ పథకంలో భాగంగా బలోపేతం చేయాలనే ఆలోచనకు పదును పెట్టారు. చైనా చేపట్టిన ఈ చర్యలకు అధికశాతం ప్రతినిధులు సంతృప్తిని వ్యక్తం చేశారు. తమ దేశాలకు ఇవి ఏవిధంగా ఉపయుక్తమో వివరించారు. తమ ఆర్థికవ్యవస్థల్లో వచ్చిన సానుకూల పరిణామాల గురించి గణాంకాల సాక్ష్యం చూపించారు. నేపాల్, శ్రీలంక, పాకిస్తాన్, సార్క్ దేశాల అధికార ప్రతినిధులు చైనావారి చొరవను ప్రశంసించారు. తమ సహకారాన్ని ఇంకా పెంచుతామని వాగ్దానం చేశారు. భారత దేశంనుండి ఇండియా–చైనా ఎడ్యుకేషన్ అండ్ కల్చరల్ కౌన్సిలుకు చెందిన ప్రతినిధి మాట్లాడుతూ చైనావారి కార్యకలాపాలలో వివిధ దశలలో తలఎత్తే పరిణామాలపట్ల భారతదేశానికి సందేహాలు వున్నాయనీ, వీటిని ఒప్పుకోవటంలో మినహాయింపులు, అభ్యంతరాలు వున్నాయని చెప్పాడు. మిగతా ఆసియా దేశాలకు భిన్నంగా భారతదేశం వ్యవహరిస్తోందనీ, అది ఏకాకిగా మారుతోందనే అభిప్రాయం మిగతాదేశాల ప్రతినిధుల మధ్య నెలకొంది. బంగ్లాదేశ్, నేపాల్, మాల్దీవులవంటి దేశాల ప్రతినిధులు 'దక్షిణ ఆసియా దేశాల ప్రయోజనం కోసం ఓబిఓఆర్ కొనసాగించాలనీ, భారత్ కూడా అందులో పాల్గొనాల'నీ అభిప్రాయపడ్డారు. కొందరి ప్రసంగాలు భారతీయ విధానాలను చాలా స్పష్టంగా విమర్శించాయి. అమెరికా విధానాలతో ఏకీభవిస్తూ ఇండియా, దక్షిణ ఆసియా ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యవహరిస్తోందని కూడా అన్నారు. ఈ దశలో ఐసిఎఫ్ఏ జనరల్ సెక్రెటరీ మోహన్‌రెడ్డి మాట్లాడుతూ 'భారత ప్రజలు ఈ విషయంలో ఇతర దక్షిణ ఆసియా దేశాల ప్రజలతో ఏకీభవిస్తున్నారనీ, భారత పాలక వర్గాలు, వారి ప్రతినిధి అయిన భారత ప్రభుత్వం మాత్రం ఈ జనం గొంతుకతో కలిసిలేదనీ, అది అమెరికా సామ్రాజ్యవాదుల వంటి పెత్తందారులతో తమ సంబంధాన్ని వొదులుకోవటం లేదనీ, గత వలసపాలకుల విధానాలను అనుసరిస్తూ ప్రాంతీయ ఆధిపత్య శక్తిగా ఎదిగే ప్రయత్నాలు చేస్తోందనీ, దీనికీ భారత ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలకు పొంతనలేదనీ, భారత–చైనా మిత్రమండలి ఈ దిశలో భారీ ప్రజా ఉద్యమాన్ని నిర్మించే ప్రయత్నం చేస్తోందని" వివరించారు. ఈ వివరణ వర్తమాన భౌగోళిక రాజకీయ పరిస్థితిని తేటతెల్లం చేస్తోందని పలువురు ప్రశంసించారు. ఇక ఆ తరువాత జరిగిన చర్చలలో ఈ విషయాలపైనే కేంద్రీకరించారు. ఆ రాత్రికి, ఆ తర్వాత మాతో ఇతర దేశాల ప్రతినిధులు చేసిన చర్చలు కూడా ఈ విషయాలచుట్టూనే పరిభ్రమించాయి. ఆ రాత్రికి సిచువాన్ రాష్ట్ర ప్రభుత్వం వారిచ్చిన స్వాగతవిందు సమయంలో చిన్నచిన్న బృందాలుగా

ప్రతినిధులతో మాట్లాడే అవకాశం వచ్చింది. భారత ప్రభుత్వ పాలసీలపై వాళ్లు లేవనెత్తిన అనేక ప్రశ్నలకు సమాధానంగా, భారత–చైనా మిత్రమండలి ప్రణాళిక ఆధారంగా మా అవగాహనని వివరించాము.

14 సెప్టెంబరున సిపిఏఎఫ్ఎఫ్సి ప్రారంభ వేడుకలు నిర్వహించింది. సిపిఏఎఫ్ఎఫ్సి వైస్ ప్రెసిడెంట్ శ్రీమతి లిన్ని మేం పలకరించాము. ఆవిడ ఇంతకుముందు హైదరాబాద్ సందర్శించారు. భారత చైనా మిత్రమండలి గురించి మంచి అవగాహన కలిగి వున్న మహిళ. పాత స్నేహితులను మళ్ళీ కలుసుకొంటున్నందుకు ఆమె చాలా సంతోషం వ్యక్తపరిచారు. ఈ పర్యటన సందర్భంలో మాతో ఉత్తర ప్రత్యుత్తరాలను నడిపి, మాకు కావలసిన ఏర్పాట్లుచేసిన యువతి జివో తియాన్ జివో ను కలుసుకున్నాము. పాతికేళ్ళులేని ఆవిడ ఎంత పరిణితి చెందిన రీతిలో తన కార్యనిర్వహణ కొనసాగిస్తున్నదీ చూసి ఆశ్చర్యపోయాము. ప్రస్తుతం షాండింగ్ ప్రావిన్స్ 'ఆఫ్సి' డైరెక్టరుగావున్న మరో పాత మిత్రుడు ఝూంగ్ పెంగ్ ఆత్మీయంగా మాట్లాడించాడు.

ఈ ప్రారంభ కార్యక్రమాన్ని సిచువాన్ డిప్యూటీ సెక్రెటరీ నిర్వహించారు., సిచువాన్ ప్రభుత్వ డిప్యూటీ గవర్నర్ ప్రసంగించారు. సిచువాన్ ప్రాంత అభివృద్ధి గురించి, విదేశీ వాణిజ్యం కోసం మార్కెట్లు తెరవబడ్డనాటి నుండి ఈనాటివరకు అది నిర్వహించిన పాత్రగురించి, ఓబిఓఆర్లో ఈ రాష్ట్రానికివున్న ప్రాముఖ్యత గురించి వివరించారు. శ్రీమతి లిన్ విద్య, ఆరోగ్యం, సాంస్కృతిక రంగాలలో ఇంకా పెంపొందవలసిన ఇంటర్ కనెక్టివిటీ గురించి, సాంకేతిక సహకారం యొక్క ఆవశ్యకత గురించి సూచించింది. ఓబిఓఆర్ విజయం, గ్రహీతదేశాలకు అందించే ఉపయోగంమీద ఆధారపడివుంటుందని ఓసార్ఫాక్ అధ్యక్షుడు పేర్కొన్నారు.

ఆ తర్వాత జిన్జియాంగ్ హోటలులోని వెదురువనంలో మధ్యాహ్నభోజనం చేశాక, సిచువాన్ లైబ్రరీకి వెళ్ళాము. ఈ సమావేశాల ప్రారంభోత్సవ సందర్భంలో దక్షిణాసియా, చైనా దేశాల ఫోటో ప్రదర్శన జరిగింది. ప్రతిదేశం నుండి సిపిఏఎఫ్ఎఫ్సి ముందస్తుగా సేకరించిన ఛాయాచిత్రాలు క్రమపద్ధతిలో, ఎంతో హుందాగా ప్రదర్శించారు. ఈ ప్రదర్శనను ప్రారంభించిన సిపిఏఎఫ్ఎఫ్సి ఉపాధ్యక్షురాలు శ్రీమతి లిన్ – మనదగ్గరలాగా ఏదో ఒకటి రెండు ఫోటోలు చూసి వెళ్ళిపోవడంకాక – ప్రతి ఫోటోగ్రాఫును అధికారులు వివరిస్తుంటే విని, చూశారు. వాళ్ల సమాచారాధికారి ఆ ప్రదర్శనలో వున్న వందల ఫోటోల గురించి, ఆశువుగా వివరిస్తుంటే చూసి, వాటి గురించి చైనా అధికారులు ఎంత ముందుగా, ఎంత వివరంగా సమాచారం సేకరించారో గమనించాము. వివిధ దేశాలపట్ల, సంస్కృతిపట్ల ఎంత ఆసక్తి, అనురక్తి చూపిస్తున్నారో కళ్ళారాచూసి ఆశ్చర్యపోయాం. అలాగే ఆయా దేశాల ప్రతినిధులు తాము పంపిన ఫోటోలను ఈ ప్రదర్శనశాలలో చూసి ఆనందంతో పొంగిపోతూ వాటిగురించి ఇతర దేశాల ప్రతినిధులకు అక్కడికక్కడే వివరించటం మొదలుపెట్టారు. ప్రతివాళ్లు తమ

సంస్కృతిని, చరిత్రని ఎంత ఆరాధనీయంగా భావిస్తారో, వాళ్ళను చులకన చేయకుండా ఇతరులు ఎంత సమ్యక్‌భావనతో, సమానత్వ దృష్టితో మెలగవలసివుందో అర్ధమవుతుంది. ఈ ప్రదర్శన ఏదో 'నామ్‌కే వాస్తే' కాకుండా ఇతరుల చరిత్ర, సంస్కృతిపై తగినంత పరిజ్ఞానాన్ని పొందటానికి సాధనంగా ఏర్పాటుచేశారు. ప్రతి చిన్న పని వెనుకా దాగివున్న ప్రాముఖ్యతను అర్థంచేసుకున్నాం. దక్షిణాసియా దేశాలన్నీ తిరిగిన అనుభూతి కలిగింది ఈ ప్రదర్శన ద్వారా.

సెప్టెంబరు 14న సహకారం, ఆవిష్కరణల పునాదిగా బెల్ట్ అండ్ రోడ్ నిర్మాణం అనే ప్రధాన ఫోరం నిర్వహించారు. నేపాల్ రాయబారి కీలకోపన్యాసం చేసారు. చైనా–నేపాల్ దేశాలమధ్య ద్వైపాక్షిక సంబంధాలు, సహకారం గురించి మాట్లాడారు. ప్రభుత్వ సంస్థలకంటే ప్రభుత్వేతర పౌరసమాజ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు దేశాలమధ్య మంచి వాతావరణం నిర్మించడంలో ప్రముఖపాత్ర వహిస్తాయని చెప్పారు. సంస్థలు మరింత సరళంగా, ఆలోచనాత్మకంగా తమ దేశ భావనలను ప్రతిబింబించాలని చెప్పారు. తమ ప్రభుత్వ విధానాలను విశ్లేషణాత్మకంగా, విమర్శనాత్మకంగా వివరిస్తూ ప్రజల ప్రయోజనాలకోసం దేశ ప్రజల మెదడు, నోరులాగా వ్యవహరించాలని చెప్పారు. ప్రభుత్వ సంస్థలకయితే పరిమితులుంటాయి. తమ ప్రభుత్వ అధికార ప్రకటనల మేరకే వాళ్ళు పనిచేస్తారు. రెండు దేశాలమధ్య అనుమానాలు, సంక్షోభాలు తల ఎత్తినపుడు స్వచ్ఛంద సంస్థలు, ఆలోచనాపరులు సంభాషణలతో, వాదనలతో అనధికార రాయబారులుగా వ్యవహరించ గలరని దేశాలమధ్య ఏర్పడిన ఘర్షణను తగ్గించగలరని అభిప్రాయపడ్డారు. అయితే ఈ సంస్థలు కొన్ని సందర్భాలలో విదేశీ నిధులు స్వీకరించి ఇతరదేశాల తరపున వ్యవహరిస్తున్నాయనే నిందల పాలవుతాయి. అందువల్ల ఈ సంస్థలు చాలా జాగరూకతతో, తమ జాతీయ ప్రయోజనాలకే ప్రాధాన్యతనిచ్చి కార్యకలాపాలు సాగించాలి! రిటైర్ అయిన ఉన్నతస్థాయి ప్రభుత్వోద్యోగులు, మిలటరీ వ్యక్తులు, మేధావులను ఈ జాతీయ, అంతర్జాతీయ అవగాహనలవైపు సమీకరించి ప్రజలను ఆకట్టుకోవాలని ఆయన అన్నారు. వివిధ దేశాల సరిహద్దులుదాటి విస్తరిస్తున్న ఇలాంటి కార్యక్రమాలు అనేక దేశాల అభివృద్ధికి, అవగాహనకి ఉత్ప్రేరకాలుగా పనిచేస్తున్నాయి అన్నారు. ఆ తర్వాత దక్షిణాసియా, పశ్చిమ చైనాల సహకారం, అభివృద్ధి అధ్యయన సంస్థ డైరెక్టరు మాట్లాడారు. ఎఐఐబి (ఆసియా మౌలిక వసతులకై పెట్టుబడుల బ్యాంకు) కార్యక్రమాల గురించి మాట్లాడుతూ ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌కు ఇవ్వతలపెట్టిన 6కోట్ల డాలర్ల సాయం గురించి ప్రస్తావించారు. సిచువాన్ పెట్టుబడుల అభివృద్ధి బ్యూరో డిప్యూటీ డైరెక్టరు మాట్లాడుతూ ప్రపంచంలోని కంప్యూటర్ నోట్‌బుక్ చిప్స్ 50% సిచువాన్‌లో తయారవుతున్నాయని చెప్పారు. ఈ రాష్ట్రంలో 109 కళాశాలలు, యూనివర్సిటీలు ఉన్నాయనీ, ఏటా 4 లక్షలమంది పట్టభద్రులై బయటికి వస్తారనీ చెప్పారు. చెంగ్డూ నగరంతో ప్రపంచలోని వివిధదేశాలలోని 104 నగరాలకు విమాన రాకపోకలు వున్నాయన్నారు. చెంగ్డూ యూరో

ఎక్స్‌ప్రెస్ నిర్మాణంతో కేవలం పదిరోజులలో యూరోపియన్ నగరాలకు సరకుల రవాణా చేయగలుగుతున్నామన్నారు.

కేవలం "పాండాల భూమి (ఎలుగుబంటి వంటి జంతువులు)"గావున్న సిచువాన్ 10 సంవత్సరాల కాలంలోనే ఎంతో అభివృద్ధిని సాధించింది. దాదాపు 320 ప్రపంచస్థాయి వ్యాపార సంస్థలకు నెలవుగా మారింది. చైనా యూరప్ సహకార సంస్థ కేంద్రాన్ని చెంగ్డూలో రెండులక్షల పదివేల చ॥మీ॥ వైశాల్యంగల 46 అంతస్థుల భవనంలో నెలకొల్పారు. దీనికి ప్రాతిపదికగా, అభివృద్ధి ఇంజనుగా పనిచేసినవి అపారమైన వనరులు, వ్యవసాయం, తేయాకుతోటలు, కావలసినంత శ్రామిక సంపద, మానవవనరులు, ఉన్నత సాంకేతికత, ప్రథమశ్రేణి రవాణా సౌకర్యాలు అని చెప్పుకోవాలి! ఒకవంక అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో స్మార్ట్‌సిటీలు నిర్మించటం, మరోవంక ప్రపంచ వారసత్వ కేంద్రంగా గుర్తించబడిన ప్రాంతాలను, చారిత్రక విశేషాలను అలాగే కాపాడుకుంటూ ఒక పర్యాటక పరిశ్రమగా దాన్ని నిర్వహించటంవల్ల ఈ ప్రాంతం ఇంత త్వరగా అభివృద్ధి చెందినట్లు ఆయన మాటల్లో తెలుసుకున్నాం. ఈ రోజున ప్రపంచంలోనే పేరెన్నికగన్న 10 ఐటి హబ్స్‌లో చెంగ్డూ ఒకటి.

ఆ తర్వాత సిపిఏఎఫ్ఎఫ్‌సి ఆధ్వర్యంలో మొదటి సబ్‌ఫోరం నిర్వహించారు. వివిధదేశాల ప్రతినిధి బృందాల నాయకులకు తలా 5-7 నిమిషాలు మాట్లాడే అవకాశం కలిగింది. బంగ్లా, మాల్దీవులు, నేపాల్, శ్రీలంక, పాకిస్తాన్, ఇండియాల ప్రతినిధివర్గాల నాయకులు మాట్లాడారు. వాళ్ల ఉపన్యాసాలు వింటే ఒక విషయం స్పష్టంగా తెలిసింది. ఆయా మైత్రీ సంఘాలు, తమతమ దేశాలలో ప్రభుత్వ ఆదరణ పొందుతున్నాయి. ప్రభుత్వంనుండి ఎంతో సహకారం దొరుకుతోంది వారికి. ప్రభుత్వ ఆధికారులు, అధికార పాలకపక్ష సభ్యులు కూడా ఈ మైత్రీ సంఘాలలో పనిచేస్తున్నారు. అయితే మనం ఈ విషయంలో వారు ఎదుర్కోని ప్రతికూల పరిస్థితులలో పనిచేసున్నాం. మనదగ్గర, చైనాతో సహకారం పెంచుకునేలా ప్రభుత్వాలపై వొత్తిడి చేయవలసిన జాతీయ ఉద్యమ ఆవశ్యకత వుందనీ, భారత-చైనా మిత్రమండలి ఆ దిశలో కృషి చేస్తున్నదని చెప్పాము. మిగతా ప్రతినిధులు చైనావారి ప్రతిపాదనలకు మద్దతు పలకుతూ, వారి దేశాలలో ప్రభుత్వాలు తీసుకుంటున్న మరికొన్ని పథకాలకు చైనానుంచి సహాయం ఆశిస్తున్నట్లు చెప్పారు.

ఈ సమావేశం తర్వాత 2వ సబ్ ఫోరమ్ మీటింగు జరిగింది. దీని కీలక ఆంశం 'సిచువాన్, దక్షిణ ఆసియా దేశ నగరాలతో సహకారం, మైత్రి పెంపొందించటం'. అనేక ప్రభుత్వ, వ్యాపార సంస్థల మధ్య అవగాహనా వొప్పందాలు జరిగాయి. సిచువాన్ రాష్ట్రంలోని అనేక నగరాలలో జరుగుతున్న అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ పథకాలగురించి వివరంగా తెలుసుకోగలిగాము.

ఆరాత్రి విందులో కూడా మేము అనేకమంది ఇతరదేశాల ప్రతినిధులతో మాట్లాడాము. ట్రైజంక్షన్ వద్ద ఏర్పడ్డ (డోక్లాం) మిలటరీ పరిస్థితి, భారత, చైనా ప్రభుత్వాల వాదనలగురించి

ప్రశ్నించారు. వాళ్లతో జరిగిన సంభాషణల్లో వారు తమ అభిప్రాయాలు చాలా స్పష్టంగా ప్రకటించారు. మన పొరుగు దేశాలు భారత ప్రభుత్వ వైఖరితో చాలా అసంతృప్తితో, ఆందోళనతో వున్నట్లు అర్థమవుతోంది. అనేక సందర్భాలలో మన పాలకులు వాళ్లను పరాభవించినట్లుగా భావిస్తున్నారు. వాళ్లమీద పెత్తనంచేసే పెద్దన్న వైఖరితో భారతదేశం వ్యవహరిస్తోందని స్పష్టంగా చెబుతున్నారు. బంగ్లాదేశ్, నేపాలు ప్రతినిధులైతే "మాకు ఇండియా అంటే ఎంతో ఇష్టం. మాకు దగ్గరగా వుంటుంది. మా మనసులకు చాల ప్రియమైనది. భాష, భావనలు, బంధాలు అన్నింటిలో మనం చాలా దగ్గర. ఆధ్యాత్మిక విశ్వాసాలు దాదాపు వొక్కటే. మన సాంస్కృతిక సారూప్యత, సంబంధమూ అవిచ్ఛిన్నమైనవి" అన్నారు. "మతం కూడా మనమధ్య ఒక ఆధ్యాత్మిక బంధాన్ని కలిగిస్తోంద"ని నేపాల్ వాళ్లు ప్రత్యేకించి నొక్కిచెప్పారు. "కానీ మాదేశాల రోజువారీ వ్యవహారాలలో, ఎన్నికలలో, ఉద్యమాలలో, సంస్కరణలలో భారత ప్రభుత్వం వేలుపెట్టడం నచ్చడంలేదు. అందుకే మేము ఇండియాకు దూరంగా జరగవలసి వస్తోంది. అంతేకాదు. ఈనాడు చైనా మాకు చాల పెద్ద ఎత్తున సాయం అందించగల స్థితిలోవుంది. అలా మా అభివృద్ధికి తోడ్పడుతోంది కూడా! ఐనా చైనా మా దేశ వ్యవహారాలలో ఏమాత్రం జోక్యం చేసుకోదు. అందువల్ల మేము చైనావైపు మొగ్గు చూపుతున్నామ"ని వాళ్ళు అన్నారు. "కాలం మారుతోంది. ఇండియా ఇక మీదట ఒక విషయాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలి. తన పొరుగు దేశాలకు ఇండియాను మించిన అంద అందే చక్కని అవకాశాలు, ప్రత్యామ్నాయ వనరులు లభ్యమవుతున్నాయి. అందువల్ల ఈ పొరుగుదేశాలు అనిష్టంగానే అయినా ఇండియాను వొదిలి చైనావంటి దేశాల సరసకు చేరుతున్నాయి. ఇండియా తన 19వ, 20వ శతాబ్దపు ఆలోచనలు, బ్రిటిష్ యూరప్‌వంటి దేశాల వలస విధానాలను, తాత్వికతను విడనాడి 'ఉమ్మడి అభివృద్ధి గమ్యం' అనే నూతన తాత్వికతను అలవరుచుకోవాల"ని ఆయాదేశాల ప్రతినిధులు కరాఖండీగా చెప్పారు.

దీని తర్వాత 2వ సబ్‌ఫోరం సమావేశం నిర్వహించారు. దీని చర్చనీయాంశం 'చైనా, సిచువాన్, దక్షిణ ఆసియా దేశాల మధ్య స్నేహం'. వ్యాపార ప్రయోజనాలువున్నా అది ఏదో ప్రచార కార్యక్రమంలా కాకుండా ఒక సాంస్కృతిక మేలుకొలుపులాగా నిర్వహించారు. వివిధ దేశాల అధికారులు, యువ ఎంటర్‌ప్రూనర్లు, సోదర పట్టణాల మధ్య అవగాహనా ఒప్పందాలు చేసుకున్నారు. వారి ఆసక్తి, సామర్థ్యం, వనరుల గురించి ఒకరికొకరు తెలుపుకోవటం జరిగింది. చైనా ప్రతినిధులనటుండనిచ్చి వివిధదేశాల ప్రతినిధులు తమ సంస్కృతిని, తమ దగ్గర వున్న పర్యాటక ప్రదేశాలను, వ్యాపార అవకాశాలను విపులంగా వీడియో ప్రదర్శనల ద్వారా తెలియజేశారు. పర్యాటకులను ఆహ్వానించారు. ఆ ప్రదేశాలను అభివృద్ధి పరచటంలో ఇతరదేశాల, ముఖ్యంగా చైనా సహకారాన్ని అర్థించారు.

నేపాల్‌నుండి వచ్చిన బిష్ణు హిమాలయ పర్వతసీమల అందాలను, ఆ మంచుకొండల మధ్యవున్న గ్రామాల మనోహర దృశ్యాలను, బౌద్ధ ప్రదేశాలను, హిందూ ఆధ్యాత్మిక కేంద్రాలను

గురించి వివరించారు. బంగ్లాదేశ్ నుండి వచ్చిన జీబా అలీనా ఖక్ వారి దగ్గరున్న నదీనదాలను, సాంస్కృతిక కేంద్రాలను, కళారూపాలను, వివిధ వంటకాల ప్రాశస్త్యాన్ని వివరించారు. శ్రీలంక, చైనా, ఇతర దక్షిణాసియా దేశాలమధ్య చిరకాలంగా ప్రవహిస్తున్న బౌద్ధ ఆలోచనాధారను ఉమ్మడి బిందువుగా ఆధారం చేసుకుని మరింతగా స్వాభావిక మైత్రిని పెంపొందించుకోవాలనే ఆకాంక్ష వ్యక్తమయ్యింది. ముఖ్యంగా శ్రీలంక ప్రతినిధులు ఈ ఉమ్మడి వారసత్వసంపదను ఉన్నతీకరించి ఇరుదేశాల మధ్య బౌద్ధసంఘాల మైత్రిని మరింత పెంపొందించుకోవాలన్నారు. ఈ వొక్క సదస్సులో దాదాపు 5,6 దేశాల నగరాల అందాలను, వాటి విశేషాలను పూసగుచ్చినట్లు చూడగలిగాం. వినగలిగాం. మెరుగైన సహకారం కోసం, మైత్రికోసం మరింత ఉత్సాహంగా పనిచేయటమనే ఆశావహదృష్టి, ఓబిఓఆర్‌తో అందరికీ అభివృద్ధి సిద్ధించగలదనే విశ్వాసంతో ఈ సమావేశం ముగిసింది. ఆసియా దేశాలు, చైనా మధ్య ఏర్పడే వినూత్న సంబంధాలు, ఉమ్మడి అభివృద్ధి అనే గమ్యస్థానం చేరటానికి కొత్తదారులు వేస్తాయనే భావం బలపడింది.

ఆ రాత్రికి సిచువాన్ వంటలతో విలాసవంతమైన విందు. జింజియాంగ్ హోటల్‌లో సిచువాన్ మసాల వంటకాల రుచులు, జాగ్రత్తగా ఎంపిక చేసిన సముద్రజీవుల మాంసాహారం, నిపుణులైన వంటమాస్టర్లు ప్రత్యేక శ్రద్ధతో తయారుచేసిన అనేక పదార్థాలు వడ్డించారు. మరో విశేషమేమంటే వంటలు చేసిన ఆ పాక శాస్త్ర ప్రవీణులు మన దగ్గరకు వచ్చి వాటి ప్రత్యేకతలు వివరించటం, అతిథుల అభిరుచుల మేరకు అక్కడికక్కడ కొన్ని చిన్నచిన్న మార్పులు చేసి మరీ వడ్డించటం, వాళ్ళలో సహజంగావున్న అతిథి మర్యాదల పద్ధతిని చూపెట్టింది.

'వసంత రుతువులో మొలకెత్తటం (జీవం పోసుకోవటం), వేసవిలో పెరగటం. శరదృతువులో పండటం (అభివృద్ధి చెందటం), శీతాకాలంలో పొదుపుగా దాచుకొని అనుభవించటం అనే జీవన విధానాలు, మన జీవితానికి అర్థానిస్తాయి, సార్ధకతనిస్తాయి' అని భోజనశాలలో రాసివున్న చైనా సూక్తి ప్రత్యేకంగా ఆకర్షించింది.

## పర్యాటక ప్రదేశాల సందర్శన

సెప్టెంబరు 15న అల్పాహారం తరువాత ఉదయం 8 గంటలకల్లా 'మింగ్‌షాన్' ప్రాంతం పర్యటనకు బయలుదేరాం. ఈ ప్రాంతానికి ముఖ్యపట్టణం యాన్ సిటీ. ఇది చెంగ్డూకు నైరుతీమూలన 130 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ఈ ప్రాంతమంతా గుబురైన టీ తోటలతో నిండివుంటుంది. పెద్దపెద్ద పాండాలకు ఇది నివాస స్థలం. 80% ప్రాంతం కొండలు, కొండ చరియలే. ఒకపక్క చెంగ్డూ మైదానాలు, మరోపక్క టిబెట్ పీఠభూమి, వాటిమధ్య వున్న పరివర్తనా ప్రాంతమిది. వెచ్చగాను, తేమగాను వుంటుంది వాతావరణం. ఉష్ణోగ్రత సగటున 20-30 డిగ్రీల సెంటిగ్రేడు. సరిపడినంత వర్షపాతం. అద్భుతమైన

ప్రకృతికి ఆటపట్టు. చిక్కని, పచ్చని వృక్షసంపద. అందుకే ఈ ప్రాంతాన్ని "హరిత ప్రపంచం"గా వర్ణిస్తారు. అంతేకాదు. ఇది "సహజ ఆమ్లజని నెలవు" (ప్రాణవాయువు కేంద్రం) అని కూడా ప్రఖ్యాతిని పొందింది. ఆ అందమైన ప్రకృతి ఒడిలో, ఘాట్‌రోడ్డులో, మంచి కండిషన్‌లోవున్న సౌకర్యవంతమైన వాహనాలలో చాలా ఉల్లాసంగా సాగింది మా ప్రయాణం. మార్గమధ్యంలో అక్కడక్కడా రహదారి సేవాకేంద్రాలు (మోటెల్స్ లాంటివి) వున్నాయి. ఈ సెంటర్లు కూడా విశాలంగా, ఫ్రెష్ రూములు, రిఫ్రెష్‌మెంట్లు, స్నాక్స్ (తినుబండారాలు) చిన్నచిన్న షాపింగ్ కేంద్రాలతో, పిల్లలకోసం ప్రత్యేకించిన ఆటల స్థలాలు, వినోదశాలలు, వినోదప్రదర్శనలు, టివీలు, రేడియోలు, ఇంటర్నెట్‌వంటి సర్వసదుపాయాలతో వున్నాయి. కొంత నియమిత దూరమో లేక సమయమో ప్రయాణించిన డ్రైవరు తప్పనిసరిగా ఈ కేంద్రాలలో వాహనాన్ని నిలుపవలసి వుంటుంది. ప్రయాణీకులకు, డ్రైవరుకు కూడా విశ్రాంతి తప్పనిసరిగా వుండాలని వారంటారు. అలాగే వాహనవేగంమీద కూడా అనేక నిబంధనలు వుంటాయి. ఎవ్వరూ వాటిని అతిక్రమించాలనో, నిర్లక్ష్యం చేయాలనో, తప్పించాలనో భావించరు.

మేము మింగ్‌డింగ్ పర్వత శిఖరం చేరుకున్నాము. పశ్చిమంలో హాన్ రాజవంశపాలన రోజులనుండీ ఉన్న పురాతన చైనా టీ సంస్కృతి ఇక్కడే ప్రారంభమైనది. మేము నాన్సింగ్ టీ తోటను సందర్శించాము. మాంగ్‌డింగ్ టీని 'రాయల్ ట్రిబ్యూట్ టీ' అని పిలిచేవారు. ప్రజారాజ్యం ఏర్పడిన పిదప దానికి నేషనల్ గిఫ్ట్ టీ (జాతీయ తేయాకు కానుక) అని పేరు పెట్టారు. ఈ ప్రాంతం పాండాలు, తేయాకు, అందమైన అతివలకు ప్రసిద్ధమని మా గైడు చాలాసార్లు పునరావృతం చేశాడు. అలాంటి అందమైన అమ్మాయిలే మమ్మల్ని ఆహ్వానించి, టీ తయారుచేసే విధానాన్ని ప్రదర్శించి అతిథులందరికీ అందించారు. చైనాలో టీ తయారుచేయటం చూసి తీరవలసిన విషయం. రకరకాల తేయాకు సువాసనలతో, వివిధరకాల రుచులతో దాన్నో కళగా ప్రదర్శిస్తారు వాళ్లు. ఈ రకరకాల 'టీ'కి రకరకాల ఆరోగ్యకర లక్షణాలను ఆపాదించి వివిధ రుగ్మతలకు దాన్నో ఔషధంగా కూడా వారు స్వీకరిస్తారు.

ఉన్నతస్థాయి జిల్లా అధికారులు, సిపిపిఎఫ్‌ఎఫ్‌సి సిచువాన్ అధ్యక్షుడు మిస్టర్ జోహెూపెంగ్ మమ్మల్ని మూడు ఎస్కార్ట్ వాహనాలతో సహా ఆ ప్రాంతమంతా తిప్పారు. ప్రతినిధి బృందానికి వారు మార్గదర్శకునిగాను ఒక టూరుగైడుగాను కూడా వ్యవహరించారు. మిస్టర్ పెంగ్ తోటల పెంపకం, టీ మ్యూజియం, దాని చరిత్ర ఆడియో విజువల్ ప్రదర్శన, ఫోటోగ్రాఫుల ద్వారా వివరంగా విశదీకరించారు. మింగ్‌షాన్‌లో 20 వేల హెక్టార్లకు పైగా టీ తోటలను, జాతీయ వ్యవసాయ పర్యాటక ప్రదర్శనగా ప్రకటించారు. (ఒక హెక్టారు భూమి అంటే సుమారు 2.4 ఎకరాలు) మేము సందర్శించిన ప్రాంతం 4వేల హెక్టార్ల తోటలో ఒకభాగం. 4వేల టన్నుల టీ పొడి ఇక్కడ ఉత్పత్తి అవుతోంది. ఇది స్థానిక రైతుల సహకార

వ్యవసాయ క్షేత్రం. దీనిని ఒక సంస్థద్వారా నిర్వహిస్తున్నారు. రైతుల భూమి వాటా దామాషాలో ఆదాయం పంపిణీ చేయబడుతుంది. మరి ఆయా వ్యక్తులు, కుటుంబాలు చేసిన శ్రమ, పనిలో భాగస్వామ్యం ప్రకారం రోజువారీ వేతనాలు పొందుతారు. ఈ కర్షకులు, కూలీలు తమజీవితాలు సుఖప్రదంగా వున్నాయని అన్నారు. వారు తమ ఘనమైన వారసత్వాన్ని ఎప్పుడూ గుర్తుంచుకొంటారు. ఎంతో గర్విస్తారు కూడా. అనువాదకుల సహాయంతో అక్కడ పనిచేస్తున్న వాళ్ళను (ఆడ, మగ ఇద్దరినీ) మేము చాలా ప్రశ్నలు అడిగాము. అందరూ నవ్వుతూ తమ సమాధానాలు ధైర్యంగా చెప్పారు. కొంతమంది చనువుగా మా చేతులు పట్టుకుని తీసుకెళ్ళి తమ పనుల గురించి వివరించారు. పెద్ద హడావుడి, వొత్తిడీ లేకుండా నింపాదిగా తమ పనులు తాము చేసుకుంటూ కనిపించారు. చిరుసిగ్గుల నునులేత నవ్వులతో చాలా స్నేహంగా, సౌహార్దంగా అనిపించారు ఆ రైతులు.

"యాంగ్జీనదిలో నీరు సర్వశ్రేష్టం. మెంగ్‌డింగ్ పర్వతాలపై టీ అంతే శ్రేష్టం" అనే చాటువు ద్వారా ఆ ప్రాంత ప్రత్యేకత స్పష్టంగా తెలుస్తుంది. పులిజంగ్ అనే వ్యక్తిని 'తేయాకు పితామహుడు' అని గుర్తు చేసుకుంటారు. ఆయన పేరున ఒక శిలావిగ్రహం నిర్మించి నివాళులర్పిస్తున్నారు. వేయి సంవత్సరాల క్రితం ఈ కొండలపై తేయాకు తోటలు నాటిన మొదటి వ్యక్తిగా ఆయనను సమాదరిస్తారు. ఏడు పొదలను ఆనాడు ఆయన నాటిన తోటకు ప్రతీకగా చూపిస్తారు. చైనా ప్రపంచంలోని ప్రముఖ తేయాకు ఉత్పత్తిదారు. ఎటా 10 కోట్ల విలువైన టీని ఎగుమతి చేస్తారు. 2010 గణాంకాల ప్రకారం 1.86 హెక్టార్ల భూమిలో 10 లక్షల 35 వేల టన్నుల టీని పండించారు. తోటలు వేయటం పంటలు పండించటం లేక దాని అమ్మకాలవరకు ఈ టీ సంబంధిత కార్యకలాపాలలో సుమారు 8 కోట్ల మంది ప్రజలు పాల్గొంటున్నారు. అలా అది ఒక పెద్ద ఉపాధిరంగం. సుమారు 70వేల టీ కంపెనీలు వున్నాయట. కానీ "లిప్టన్" లా అంతర్జాతీయంగా స్థిరపడిన బ్రాండు కంపెనీ ఏదీలేదు". "చైనా టీ" అనే పేరునే అమ్మకాలు సాగుతున్నాయి. అంతర్జాతీయ మార్కెట్టులో తమ ఉత్పత్తికి తగ్గ వాటాను పొందాలని ప్రభుత్వం పథకాలు రచిస్తోంది. అయితే దేశీయ వినియోగమే చాలా అధికంగా వుందని కొందరు అంటున్నారు. వివిధ ప్రాంతాలలో చైనీయులు వినియోగించే వందలాది రకాలు – మనిషికో రుచి అన్నట్లు – ఒక ఏకరీతి ప్రామాణికతలకు లొంగదని కొందరు అన్నారు. ఈ తేయాకులలో దాదాపు 1100 కంటే ఎక్కువ రుచులున్నాయట. ఏ ప్రాంతంవాళ్ళు ఆ ప్రాంతం రుచినే ఎక్కువ ఇష్టపడటం సహజమేకదా! ప్రతి ఒక్కరుచికి దాని అభిమానులు దానికి వున్నారు. ఆ రుచికోసం ఎంతదురమైనా వెళతారు కానీ రుచిని మార్చుకోరట. ఈ తేయాకు తోటలను చాలా పరిశుభ్రంగా (హైజీనిక్‌గా) నిర్వహిస్తున్నారు. అంటే నిరంతరం శ్రద్ధ, ఒక సుదీర్ఘ ప్రణాళిక, స్థిరమైన సంరక్షణాచర్యలు తీసుకుంటున్నారని మాకు అర్థమయ్యింది. శ్రమించే కూలీలు, సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించే నిపుణులు కలసికట్టుగా సాధిస్తున్న వ్యవసాయ అభివృద్ధిని చూశాము. ఖర్చు పెట్టవలసి వచ్చినా, దిగుబడి

బాగా పెరుగుతుందని వారన్నారు. ఫ్లష్‌ను తేలికగా లాగటానికి మొక్కలను క్రమంతప్పకుండా ఒక మీటర్ ఎత్తులో కత్తిరిస్తారు. ఏమీ చేయకుండా వదిలేస్తే మొక్కలు వృక్షాలై 12 మీటర్ల ఎత్తువరకు పెరుగుతాయి. మేము చూసిన తోటలో నడుమెత్తు మొక్కలు వున్నాయి. అయితే అవి 25 నుండి 90 సంవత్సరాల వయసుగల వృక్షాలట. క్రమపద్ధతిలోవున్న తోటను చూస్తుంటే మనకు "గౌరవ వందనం సమర్పిస్తూ నిలబడ్డ రెడార్మీ సైనికుల రెజిమెంటులాగా" అనిపిస్తుంది. కొన్ని మొక్కలపై తెల్లనిపూలు, పెద్దశనగ గింజలంత పరిమాణంలో పండ్లను గమనించాము. ఈ పండునుంచి టీ నూనెను తీస్తారట కానీ సాధారణంగా కాయలు, పండ్లు పెరగడానికి అనుమతించరట. టీ యొక్క సుగంధం మొత్తం ఆకులనుంచే వస్తుంది కానీ పువ్వులనుంచి కాదు. వాళ్ళు వ్యవసాయం చేస్తున్న పద్ధతిలో అంకితభావం, ప్రణాళికాబద్ధమైన వ్యవహారం గమనించి వాళ్ళను అభినందించాము. ఆతర్వాత టిబెటన్ టీ–కల్చర్ మ్యూజియానికి వెళ్ళాము. అక్కడ వందలాది సంవత్సరాలు ఈ 'కృషి'లో జరిగిన పరిణామాలు, మొక్కలు పెంచడం, ఆకుల కట్టలు కట్టడం, ప్రాసెస్ చేయటం, మోపులను పర్వతాలవెంట వీపున మోసుకొని వెళ్ళటం దగ్గరినుండి ఈనాటి యాంత్రిక సహాయం వరకు వివరంగా చూశాము. నిటారుగావున్న పర్వతవాలులవెంట దిగుతూ, ఎక్కుతూ, మోపులు మోస్తున్న స్త్రీ పురుషులు, వారి వెనక లోడువేసుకుని గుర్రాలు... ఎన్ని తరాల మానవ శ్రమ... ఎంత ఆకలి... ఎంత స్వేదం... ఎంత కన్నీరు ఈ నేలను తడిపితే ఇంత పచ్చగా పెరిగిందో ఈ తోట అనిపిస్తుంది. ఈ గుర్రాల మార్గాన్ని (పాత సిచువాన్–టిబెట్ మార్గం) సిల్కురూటు యొక్క ప్రారంభ స్థానంగా చెబుతారు.

టిబెటన్లు ఈ టీని చాలా ఇష్టపడతారనీ, తొలి రోజుల్లో 20, 30 కిలోల తేయాకు కోసం వారి గుర్రాలను ఇచ్చి వేసేవారనీ బొమ్మలు చెబుతున్నాయి.

ఒక చిన్న పట్టణంలో మధ్యాహ్నభోజనం కోసం, కొంత విశ్రాంతికోసం ఆగాము. డైనింగుహాలు, ఆ ప్రాంగణంలో వున్న అలంకరణలు ఎంతో ఆనందాన్ని కల్గించాయి. ఆ ప్రాంతపు దృశ్యాలు, కళాఖండాలు, సామాన్య వస్తువులనే ప్రదర్శనాయోగ్యంగా తీర్చిదిద్ది ఎంతో కళాత్మకంగా ప్రదర్శించిన తీరు రమణీయంగా అనిపించాయి. ఆ ప్రాంతమంతా పల్లె అందాల గుబాళింపులే. ఆహారమూ ప్రాంతీయ రుచితోనే. పంచతార హొటళ్ళకు భిన్నంగా అక్కడి ఇంటిరుచిలా. శుచిగా.

ఆ తర్వాత బి.ఫెంగ్ పాండా నేచురల్ రిజర్వుకు వెళ్ళాము. ఈ ప్రదేశంలో ఒకదాని వెనుక ఒకటిగా, వరుసగా కానవస్తున్న గిరుల శృంగాలు ఒక శృంఖలలాగా కానవస్తాయి. ఒక కొండమీద భారీ పాండా బొమ్మ ఎన్నో మైళ్ళదూరం నుండి కనిపిస్తూవుంటుంది. అసలు రిజర్వ్ ప్రదేశంకూడా చాలా భారీ గేటుతో మొదలవుతుంది. పాండాలు మన ఎలుగుబంటి జాతికి చెందినవే. అయితే ఈ జాతి త్వరగా అంతరించి పోతోంది. ఈ జంతుజాతిని కాపాడటానికి

తగిన చర్యలు తీసుకుంటోంది చైనా ప్రభుత్వం. పాండాలను ఒకచోటికి చేరుస్తారు, పెంచుతారు, పోషిస్తారు. వాటి పునరుత్పత్తిని పర్యవేక్షిస్తారు. పాండాకూనలను సంరక్షిస్తారు. వాటిని వాటికి సహజమైన వాతావరణం, పరిసరాలు కల్పించి పెంచుతారు. అవి కొద్దిగా పెద్దయిన తర్వాత తీసుకువెళ్లి అడవులలో వదిలేస్తారు. 2008లో వెన్‌ఛురాన్ అనే ప్రాంతంలో వచ్చిన పెద్ద భూకంపం తర్వాత ఈ సంరక్షణ కేంద్రం ప్రాధాన్యత మరింత పెరిగింది. ఆయా బాధిత ప్రాంతాలనుండి కూడా పాండాలను తెచ్చి ఇక్కడ పోషించారు. మనల్ని ఆకట్టుకునే విశేషం ఏమిటంటే ఆ కేంద్రాలలో పనిచేస్తున్నవారు ఆయా జంతువులను తమ స్వంతఇంటి పెంపుడు జంతువులపై చూపే శ్రద్ధ, ప్రేమ కురిపించి పెంచుతున్నారు. మన గ్రామాల్లో రైతులకీ, పాడిపశువులకీ మధ్య ఎంతటి ఆత్మీయతా బంధం కనిపించేదో అలాంటి వాతావరణమే ఇక్కడా కనిపించింది. ఏదో 'జూ' చూసిన ఫీలింగ్‌కాక మనిషికి – జంతువుకీ మధ్య ఉన్న పరస్పర అనుబంధంవున్న కుటుంబాన్ని చూసివచ్చినట్లనిపించింది.

మానవుడెంతటి మహనీయుడు – ఎంతటి విపత్కర కాలాలను ఈదుకుంటూ వస్తున్నాడు. ప్రకృతితో స్నేహంచేసి, ప్రకృతిలో ప్రకృతిలా మమేకంచెంది, వన్యప్రాణులతో కలసిజీవిస్తూ, మరణిస్తూ, భయానక ప్రకృతి విలయాలకు కృంగిపోతూ, వోడిపోతూ, లేచినిలుస్తూ, గెలుస్తూ తనే ప్రకృతికి రారాజునని విర్రవీగుతూ, తన స్వార్థంకోసం తన పరిసరాలనీ, వనాలనీ పీల్చి పిప్పిచేసి, నిస్సారం చేసి, కాలుష్య భరితం చేసి... మళ్లీ ఎన్నడో జ్ఞానదీపం వెలిగి మళ్లీ ప్రకృతిని తల్లిలా భావించి, ఆమెవొడిని చేరి ఆమెకు సౌష్టవాన్ని, ఆరోగ్యాన్ని, సౌందర్యాన్ని తిరిగి కల్పిస్తూ... ఎంతటి సుదీర్ఘ ప్రయాణం. గ్లోబల్ వార్మింగ్‌నుంచి ఈ హరితవనాల సంరక్షణవరకూ – ఎంత అభివృద్ధి! ఎంతవిధ్వంసం. "మనిషి అవసరాలకు సరిపడ్డ ప్రకృతిసంపద ఎప్పుడూవుంది. కానీ వాడి దురాశను తీర్చగలిగే శక్తి మాత్రం ఈ భూమికి లేదు" అన్న తెలివిడి కలుగుతోంది ఈ గిరిశిఖరాలలో, తేయాకుతోటల్లో, మా కళ్లల్లో అలుముకున్న పచ్చనికాంతులు చూస్తుంటే.

ఆ సాయంత్రం యాన్ నగరం చేరుకున్నాం. జిల్లా ఉన్నతాధికారులు, మైత్రీసంఘాల నేతలు ఆయా చుట్టుపక్కల జరుగుతున్న నిర్మాణ కార్యక్రమాలు, అభివృద్ధిని సాధించే ప్రక్రియను వీడియోలద్వారా ప్రదర్శించి చూపించారు. అవి ఎంత చక్కగా చిత్రించారంటే అక్కడి శోభాయమానమైన ప్రకృతి చిత్రమంతా ప్రత్యక్షంగా చూసిన అనుభూతికి లోనయి, ఆప్రాంతాలను చూడలేకపోయామే అన్న అసంతృప్తిని తీసివేయగలిగాయి. ఆరాత్రి అక్కడే యాన్ స్థానిక ప్రభుత్వ ఆతిథ్యంలో వీడ్కోలు విందు జరిగింది. రుచికరమైన భోజనంతోపాటు నృత్యాలు, గానాలు, అధికారులతో మాటామంతీ, కంటితో చూడలేని ఎన్నో విషయాలు, ఆ జాతి నిర్మాణ కార్యక్రమాలలో ఎదుర్కొన్న ఇబ్బందులు, ప్రజలను వాళ్ళు తయారుచేసుకున్న తీరు, ప్రజలలో కల్పించిన చైతన్యం, బాధ్యతాయుత భాగస్వామ్యం, క్రిందినించి వస్తున్న సూచనలు, సలహాలు తమ పథకాలలో మేళవించుకోవటంవంటి అనేక విషయాలు

ముచ్చటించుకున్నాం. "ఏదీ సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము. నరుడు నరుడౌట దుష్కరమ్ము" అనే కవివాక్యం గుర్తొచ్చింది. సమిష్టి బాధ్యత, సమిష్టి ప్రయోజనంలోనే ఒక వ్యక్తి అభివృద్ధి, సౌఖ్యం దాగున్నాయనే సత్యం మరోసారి కళ్ళముందు సాక్షాత్కరించింది.

వారి చక్కని ఆతిథ్యానికి, చూపించిన స్నేహపూర్వక సౌజన్యానికి మా కృతజ్ఞతాంజలి ఘటిస్తూ చిన్న చిన్న కానుకలు, జ్ఞాపికలు, పుస్తకాలు ఇచ్చిపుచ్చుకుని వీడ్కోలు పలికి అర్ధరాత్రి సమయానికి చెంగ్డూ నగరం చేరుకున్నాము.

సెప్టెంబరు 16, అంటే ప్రతినిధులందరూ తిరిగి వెళ్ళేరోజు. స్థానిక స్నేహ సంస్థ సహకారంతో మేము వొక వైద్యసంస్థను సందర్శించటానికి ముందుగానే ఏర్పాట్లు చేసుకొన్నాం. స్థానిక సంస్థకు చెందిన మిసెస్ లిడు మమ్మల్ని సిచువాన్ అకాడమీ ఆఫ్ మెడికల్ సైన్సెస్ మరియు సిచువాన్ ప్రొవిన్షియల్ పీపుల్స్ హాస్పిటలుకు (మన నిమ్స్ తరహాది) తీసుకువెళ్ళింది. ఇది నాలుగు లక్షల చదరపు మీటర్ల వైశాల్యం కలిగిన 24 అంతస్తులు గల భవనాల సముదాయం. ఇక్కడ 3300పైగా ఇన్ పేషెంటు బెడ్స్ వున్నాయి. ఓ.పి. పేషంట్లకి (బయటి రోగులు) లెక్కలేదని అక్కడి డాక్టర్లు అన్నారు. 2011లోనే వారి ఓ.పి. సుమారుగా 365000 అంటే రోజుకు 10వేల మంది కంటే ఎక్కువగా నమోదయ్యింది. 75వేల శస్త్ర చికిత్సలు ఏటా నిర్వహిస్తారు. ఈ సంస్థను మొదట 1941లో స్థాపించారు. క్రమంగా మెరుగుపడుతూ, అభివృద్ధి చెందుతూ ఈ స్థాయికి చేరుకుంది. 2012లో కొన్ని ఇతర ఆరోగ్యసేవల యూనిట్లు, పునరావాసం యూనిట్లు విలీనం చేశారు. ఇప్పుడు ఈ ప్రాంగణంలో 24 అంతస్థుల రెండో భవనంలో సిచువాన్ హాంగ్‌కాంగ్ పునరావాస కేంద్రం నెలకొనివుంది.

ఈ ఆసుపత్రి ఆదర్శం "ప్రజల ఆరోగ్యం కోసం హృదయంతో, ఆత్మతో సేవ చేయాలి".

హాంగ్‌కాంగ్ రిహాబిలిటేషన్ సొసైటీ 1986నుండీ పనిచేస్తున్నది. పునరావాసం కోసం పశ్చిమ పసిఫిక్ ప్రాంతంలో శిక్షణ కేంద్రాలు నిర్వహిస్తున్న ఏడు సంస్థల్లో ఇది వొకటి. చైనాలో సిచువాన్ ప్రాంతంలోనే 2008లో మే 12న భారీ భూకంపం (రిక్టర్ స్కేలుపై 8 పాయింట్లు) సంభవించింది. సుమారు 69 వేలమంది ప్రాణాలు కోల్పోయారు, 3 లక్షల 75వేలమంది గాయాల పాలయ్యారు. 48 లక్షలమంది ఇళ్ళు కోల్పోయారు. చాలా పెద్దయెత్తున సహాయక కార్యక్రమాలు చేపట్టారు. భూకంప అనంతర పునరావాసం కోసం అడుగుపెట్టింది ఈ రిహాబిలిటేషన్ సెంటరు. చికిత్స మరియు శిక్షణా కేంద్రాలను స్థాపించింది. ఇవాళ మేము చూస్తున్నది ఆ కార్యక్రమాల ఫలితంగా ఏర్పడ్డ అత్యున్నత వైద్యశాల. ఇది ఊహాశక్తికి అతీతమైనది. గాయాలు, అవయవాలు కోల్పోవడం, వెన్నెముక గాయాలవల్ల కాళ్ళు చేతులు చచ్చుబడిపోవటంతో చక్రాల కుర్చీలకో, మంచాలకో పరిమితమైపోయిన వ్యక్తులు, వంగిపోయిన శరీరాలు, వంకరలుపోయిన కాళ్ళు, చేతులుగల వ్యక్తులకోసం అప్పటినుంచి ఇప్పటివరకు శ్రద్ధవహించి, చికిత్సలు కొనసాగించడం జరుగుతోంది. వారికి కావలసిన

శారీరక శిక్షణ (ఫిజియోథెరపీ) కొనసాగిస్తున్నారు. అంతేకాదు, కొంతమంది మెరుగుపడిన పేషంట్లు శిక్షణపొంది ఇతర పేషెంట్లకు సేవ చేస్తున్నారు. ఇతర పేషెంట్ల సంరక్షణకోసం కొందరు పేషంట్లను చికిత్సకులుగా మార్చటం ఈ కేంద్రం విశిష్టత. వైకల్యం కలిగిన వ్యక్తులకు సంతృప్తికరమైన, సంతుష్ట జీవితాన్ని కల్పించటమే ఉద్దేశ్యంగా ఈ సంస్థ నడుస్తోంది. శ్రద్ధాహృదయంతో అత్యంత ఆధునికమైన సేవలందిస్తున్న సంస్థ ఇది. ఆ తర్వాత మేము ప్రత్యేకించి ఇఎన్‌టి, ఆర్థోపెడిక్ శాఖలను సందర్శించాము. దాదాపు 2 గంటలపాటు అక్కడి డాక్టర్లతో, స్థానిక నిపుణులతో మంచి చర్చ జరిగింది. వారాంతపు శెలవులు కావటంవల్ల ఎక్కువమంది డాక్టర్లను కలవలేక పోయాము. కానీ అందుబాటులోవున్న నిపుణులు మాతో మాట్లాడటానికి ఉత్సాహంగా ముందుకువచ్చారు. ఎంతో సహకరించి మా ప్రశ్నలకు సమాధానమిచ్చారు. వార్డులలోకి వెళ్లి రోగులను చూసి వాళ్లతో మాట్లాడాము. రోగులకు అందించే సదుపాయాలు, పరిశుభ్ర వాతావరణం, ఆత్మీయంగా పనిచేస్తున్న డాక్టర్లు, నర్సులు, ఆ హాస్పిటలు పరిసరాలు చూసి మేం చాలా సంతోషపడ్డాము. ఆహ్లాదకరమైన స్నేహభావంతో వారినుంచి వీడ్కోలు తీసుకొని వచ్చాము.

ఈ ఆహ్లాదకరమైన పరిచయాలు, పరామర్శలతో మా పర్యటన ముగింపుకు వచ్చింది. ఇక జింజియాంగ్ హోటల్‌నుండి కూడా శెలవు తీసుకునే సమయం ఆసన్నమయింది. ఈ తిరుగుప్రయాణంలో ఏ చికాకులు, చిరాకులు లేకుండా చూడటానికి మాతో మూడురోజులుగా అనువాదకులుగా పనిచేస్తున్న స్టూడెంట్ వలంటీర్లు మాతో విమానాశ్రయం వరకూ వచ్చారు. వీరు 9 లేదా 10వ తరగతిలో ఇంగ్లీషు నేర్చుకుంటున్న విద్యార్థులు. తమ విద్యానైపుణ్యత పెంచుకోవటానికి, సంభాషణా చతురతను సాధించటానికి, విదేశీ అతిధుల అవసరాలను, ఇబ్బందులను గుర్తించి వాటిని పరిష్కరించి సాయపడటానికి విద్యార్థులకిది ఒక ఆచరణాత్మక శిక్షణా కార్యక్రమం (ప్రాక్టికల్ ట్రైనింగ్). అదే సమయంలో విదేశీ ప్రతినిధులకేమో సౌకర్యం. తేలికగా చైనీయులతో మాట్లాడగల వెసులుబాటు. ఆ పిల్లల కుటుంబాల గురించి, విద్యా అవకాశాల గురించి, చిన్నచిన్న మాటలలో సేకరించిన విషయాలన్నీ వారి మధురమైన బాల్య జీవితం గురించి తెలిపాయి. వాళ్ళల్లోనే చైనాదేశపు భావి రాయబారులు, దౌత్యవేత్తలు పురివిప్పుతున్నారని అనిపించింది నాకు. వివిధదేశాల వ్యక్తులు, ప్రతినిధులతో, కాలం గడపడం, వారి సంస్కృతులను, అలవాట్లను దగ్గరినుండి గమనించటంతో ఈ విద్యార్థులలో తప్పనిసరిగా ఇతర సంస్కృతులపట్ల అవగాహన పెరుగుతుంది. వారిలో సహనం వికసిస్తుంది. విశ్వమానవ ఏకత మీద గురి కుదురుతుంది. రాబోయే రోజుల సమిష్టి స్వామిత్వానికి ప్రతీకలుగా వీళ్ళు రూపుదిద్దుకుంటున్నారు.

బృహత్తర ప్రణాళికలనుండి, భారీ నిర్మాణాలనుండి అతి సున్నితమైన మానవ ప్రతి స్పందనలవరకు, ఇంజనీరింగ్ విన్యాసాలనుండి మానవ సంబంధాలవరకు, పండుటాకుల వంటి వయోవృద్ధులనుండి చిగురుటాకులవంటి చిన్నారుల సంరక్షణ వరకు, కొండల్ని

తొలచటం దగ్గర్నుంచి జీవజంతుజాలాన్ని సంరక్షించటం వరకు, ఒక నూతన దిశలో, ఒక అభిలషణీయమైన దిశలో ఆ సమాజ గమనం వుందని అర్ధమవుతుంది. చైనా కమ్యూనిస్టు పార్టీ రచించుకున్న దీర్ఘ ప్రయాణం ఫలవంతమవుతున్న దృశ్యాలు కనిపిస్తున్నాయి. "అందుకుంది ఆవగింజంత ఇంకా సాధించవలసింది ఆకాశమంతవుంది" అనే స్ఫురణతో ఆ పార్టీ నాయకత్వం ప్రజల భాగస్వామ్యంతో సాధిస్తున్న విజయాలకు ఒక ప్రపంచ పౌరునిగా, మనస్ఫూర్తిగా అభినందన గీతాలు పలకక తప్పదు. అక్కడ వర్తమానంలో జరుగుతున్న కృషిపట్ల ఆనందం, భవిష్యత్తుపై విశ్వాసం కలగలిసిన అందమైన ఊహలతో భారీ విమానపు రెక్కలపై ఊరేగుతూ మనసు ఉత్రూతలూగుతుంటే 17 సెప్టెంబరు లేత వెలుగులు విచ్చుకుంటున్న తొలిఝాములో హైద్రాబాదు చేరుకున్నాం.



# 5.

# చైనా యాత్రాకథనాలకు నా ముందుమాటలు...

## 1. మేము చూసిన జనచైనా... కథనం : నిఖిలేశ్వర్

భారత చైనా దేశాల ప్రజల మధ్య అనేక వేల సంవత్సరాలుగా గాఢమైన సాంస్కృతిక, స్నేహపూర్వక సంబంధాలు వున్నాయి. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటల వారసత్వం వుంది. ఆ పోరాటాలలో ఒకరికొకరు సంఘీభావంతో తోడ్పడిన చారిత్రక అనుభవం వుంది. మంచి ఇరుగుపొరుగు దేశాలుగా స్నేహ సౌహార్ధాలను పంచుకొని, వలస పాలనపై, ఫాసిజంపై విజయాన్ని సాధించిన ఉత్తేజకరమైన చరిత్రవున్నది. ప్రపంచంలో నేటికీ కొనసాగుతున్న సామ్రాజ్యవాద, అగ్రరాజ్య పెత్తందారీ ధోరణుల వ్యతిరేకత ప్రాతిపదికగా, భారత చైనా దేశాల మధ్య మైత్రి మరింత బలీయం కావాలనీ, సంపూర్ణంగా వికసించాలనీ, అది నేటి చారిత్రక అవసరమనీ భారత చైనా మిత్రమండలి భావిస్తుంది. రెండు దైశాల మధ్య తలఎత్తిన అవాంఛనీయమైన సమస్యలు, సందేహాలు, అపోహలు తొలగించుకుని స్నేహ సహకారాలు సంపూర్ణస్థాయిలో పెంపొందించుకోవటం ప్రాంతీయ సుస్థిరతకు, ప్రపంచ శాంతికి మార్గమని మిత్రమండలి భావిస్తున్నది. అందుకై ప్రజా ఉద్యమ నిర్మాణంలో నిమగ్నమై వున్నది.

ప్రపంచ దేశాల మధ్య సంబంధాలకు పంచశీల సూత్రాలు ప్రాతిపదికగా, కొన్ని అంగీకృత విధానాలు అనుసరించాలని బలంగా విశ్వసిస్తోంది. చైనా ప్రభుత్వం ఈ పంచశీల సూత్రాలకు అత్యధిక ప్రాధాన్యతనిస్తోంది. 2014లో పంచశీల ఒప్పందం 60వ వార్షికోత్సవాన్ని ఘనంగా నిర్వహించింది. నేటి వైషమ్యాలకు విరుగుడుగా “పంచశీల”ను చైనా మరోసారి గుర్తుచేస్తున్నది. ఆ సందర్భంగా 2014 సెప్టెంబరులో చైనా అధ్యక్షుడు కామ్రేడ్ జీ జిన్‌పింగ్ భారతదేశ పర్యటనలో – ఇరుదేశాలమధ్య స్నేహ వారధులు నిర్మిస్తున్న కొందరికి ‘పంచశీల మైత్రీ పురస్కారాలు’ కూడా అందించారు. ఈ అవార్డులు అందుకున్న వారిలో డా॥మోహన్‌రెడ్డి (భారత చైనా మిత్రమండలి జాతీయ ప్రధాన కార్యదర్శి) ఒకరు. ఆ తదుపరి

చైనావారు డా॥మోహన్‌రెడ్డి నాయకత్వంలో (ఉమ్మడి) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంనుండి ఒక బృందాన్ని చైనా పర్యటనకు ఆహ్వానించారు. గతంలో భారత–చైనా మిత్రమండలి తరఫున చైనా ప్రభుత్వ ఆహ్వానం అందుకున్న జాతీయ బృందంలో సంస్థ కార్యదర్శిగా పనిచేసిన కా॥జ్వాలాముఖి, ఆ తర్వాత ప్రముఖ గాంధేయవాది, నిరాడంబర నాయకుడు శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు చైనా పర్యటించారు. అనేక సంవత్సరాల తదుపరి ప్రస్తుతం ఒక పెద్ద బృందానికి ఈ అవకాశం వచ్చింది. మైత్రీ ఉద్యమానికి తోడ్పడుతున్న వివిధరంగాల ప్రముఖులనుండి భారత–చైనా మిత్రమండలి (ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ శాఖ) 12 మందితో ఒక బృందాన్ని ఏర్పాటు చేసింది. ఇదే సందర్భంలో మరో జాతీయ బృందం కూడా చైనాను సందర్శించింది. భారత–చైనా మిత్ర మండలి ఆధ్వర్యంలో మరియు భారతదేశంలోని చైనా రాయబార కార్యాలయ సహకారంతో చైనా ప్రభుత్వ అతిధులుగా రెండు తెలుగు రాష్ట్రాలకు చెందిన మొత్తం 14మంది సభ్యులు రెండు బృందాలుగా 2015 సంవత్సరం డిసెంబరు నెలలో 10 రోజులపాటు చైనాలో పర్యటించారు. తిరిగి వచ్చాక ఈ ప్రతినిధులు అనేక సభలు, వ్యాసాలద్వారా తమ అనుభవాలు, అనుభూతులు, తాము గ్రహించిన సామాజిక అంశాలు ప్రజలకు తెలియజేస్తున్నారు. శ్రీ రాఘవ శర్మగారు దినపత్రికలోనూ, శ్రీ సత్యనారాయణగారు ఉపాధ్యాయ ప్రగతి పత్రికలోను వ్యాస పరంపర ప్రకటిస్తున్నారు. ప్రముఖ కవి, వ్యాసకర్త, విప్లవ ప్రేమికుడు, సమసమాజ స్వాప్నికుడు శ్రీ నిఖిలేశ్వర్ తను చూసిన చైనా విశేషాలు వివరంగా ఈ చిరు పుస్తకములో అందిస్తున్నారు. ఆయన జ్ఞాపకాలకు అద్దం పట్టేలా కొన్ని ఛాయాచిత్రాలు కూడా పొందుపరచటం జరిగింది.

ఈ పర్యటన కేవలం ఒక విదేశీ యాత్ర కాదు, ఒక విహారయాత్ర అంతకన్నా కాదు. 77 సంవత్సరాల వయసులో, ఎన్నో ప్రయాసలకోర్చి అత్యంత కఠినమైన చలిగాలులకు వోర్చుకుని అత్యంత ఉత్సాహంగా, ఉద్వేగంగా చేసిన అధ్యయన యాత్ర. అనేక దశాబ్దాలుగా తన ఊహలలో కదలాడుతున్న స్వప్న సమాజాన్ని, ఆకలి, పేదరికం, నిరుద్యోగంలేని సామాజిక పరిస్థితిని, స్నేహం, సోదరత్వం పునాదిగా మానవ సంబంధాలు పరిఢవిల్లే సాంస్కృతిక జీవన వాతావరణాన్ని, దోపిడి పీడనలు లేని రాజ్యాన్ని నిర్మిస్తున్న చైనాను చూసిరావడం గొప్ప అవకాశంగా ఆయన భావించారు. భారత దేశంలో అలాంటి వ్యవస్థ నిర్మాణం కావాలని జరుగుతున్న ఉద్యమాలకు వెన్నుదన్నుగా సాహిత్యయాత్రను కొనసాగిస్తున్న శ్రీ నిఖిలేశ్వర్, ఆ లక్షిత సమాజాన్ని – సోషలిస్టు సమాజాన్ని – నిర్మిస్తున్న చైనా దేశాన్ని మొదటిసారిగా పర్యటించి వచ్చారు. తన స్వప్న సమాజాన్ని సాకారం చేసే దిశలో ఆ దేశం ఏ దశలోవుందో చూసి వచ్చారు. ఆ కృషిలో వాళ్లు సాధిస్తున్న విజయాలనీ, ఎదుర్కొంటున్న సమస్యలనీ, పునరుత్తేజితం అవుతూ సోషలిస్టు మార్గంలో సుదృఢంగా నడుస్తున్న వారి దీక్షనీ ఈ రచనలో రేఖామాత్రంగా చిత్రించారు. చర్చించారు.

ఎన్ని సమస్యలున్నా సోషలిస్టు నిర్మాణం పట్టుదలగా కొనసాగుతోందనే విశ్వాసాన్ని ప్రకటించారు. సంపదను పెంచి పంచుతున్న దేశంగా, సమూహాన్ని, వ్యక్తినీ సమన్వయించే

దిశలో సాగుతున్న సమాజంగా చైనాను ఆయన అభివర్ణించారు. ఆనందంగా, ఆరోగ్యంగావున్న ప్రజలను చూసి మురిసిపోయారు. పసిపిల్లల ఆరెంజ్ బుగ్గల్లో ప్రతిఫలిస్తున్న లాంగ్‌మార్చ్ విజయాన్ని చూసి పొంగిపోయారు. విశ్వమానవ స్నేహంకోసం చేతులుచాస్తున్న జనచైనా పురోగమనంతో తాదాత్మ్యం చెంది కవితీకరించారు. భారత పురోగమనం నత్తనడకన నడుస్తున్నదనే వాస్తవాన్ని ఎత్తిచూపారు.

ఈ అనుభూతులు ఆయనవి మాత్రమే కాదు. బృందంలోని మిగతాసభ్యులుకూడా ఈ విధంగానే ప్రతిస్పందించారు. భారత చైనా మిత్రమండలి నిర్వహించిన సభలలో వారి ఆలోచనలను, అనుభూతులను నేనుకూడా పంచుకున్నాను.

ఇదంతా చదివితే మనలో ఎన్నో ఆలోచనలు తలెత్తుతాయి. 1950లలో కుడిఎడమగా సమానంగావున్న భారత–చైనాలు రెండు విభిన్న మార్గాలలో పయనించి ఈనాడు ఏదశకు చేరుకున్నాయో తులనాత్మకంగా పరిశీలించాలనిపిస్తుంది. ఒక సోషలిస్టు సమాజ స్థాపనకై నడుంకట్టి – అందుబాటులోవున్న అన్ని మార్గాలను, మార్కెట్ వ్యవస్థలను, సమయోచితంగా ఉపయోగించుకుంటూ, సోషలిస్టు పథానికి అన్వయించుకుంటూ, తన స్వతంత్ర విధానాలను మెరుగు పరుచుకుంటూ ఈనాడు జనచైనా అతి శీఘ్రగతిలో ప్రపంచాన్ని అబ్బురపరిచే అభివృద్ధిని సాధించింది. పెత్తందారీ సామ్రాజ్యవాద శక్తులకు పెనుసవాలుగా నిలదొక్కుకుంది. అదే సమయంలో భారతదేశం 'సోషలిస్టు మాదిరి వ్యవస్థ' నిర్మాణం అంటూ మొదలయినా పెట్టుబడిదారీ పంథాలో సాగుతూ, ఆయా సామ్రాజ్యవాద శక్తులతో ముడివేసుకొని ఒక పరాధీన వ్యవస్థ నిర్మాణం కొనసాగిస్తోంది. ఆర్థికంగా, రాజకీయంగా పెత్తందారీ దేశాలతో అంటకాగుతోంది. తత్ఫలితంగా, సాధించిన అభివృద్ధి ఫలితాలు సైతం ప్రజలకు దక్కకుండా దోపిడీశక్తుల పరమవుతున్నాయి. దేశం అర్థవలసగానే మిగిలిపోయింది. మెరుగైన, సౌకర్యవంతమైన జీవితం అధికశాతం ప్రజలకు అందుబాటులోకి రాలేదు. దీనికి కారణం ఒక్కటే. ఒకచోట, భూస్వామ్య శక్తులను తుదముట్టించి, సామ్రాజ్యవాద ప్రయోజనాలకు భిన్నంగా తమ జాతీయ ప్రయోజనాలు కాపాడే స్వతంత్ర వ్యవస్థ నెలకొంటున్నది. మరోచోట ఆ దోపిడీ శక్తులకే పట్టంగట్టి ఆచరణలో దోపిడికి నిలయమవుతున్నది. ఈ మౌలిక అంశాన్ని గుర్తించకుండా, జనతా ప్రజాతంత్ర విప్లవం జయించకుండా నేటి భారత వ్యవస్థలోని అసమానతలను, వెనుకబాటుతనాన్ని రూపుమాపడం సాధ్యంకాదు. భారత పాలకవర్గాలు ఈ కర్తవ్యాన్ని పూర్తిచేస్తాయని ఆశించటం దురాశ, దుర్భ్రమ...

అయితే భారత ప్రజలు మాత్రం ఆ మార్గంలోనే పోరాటం సాగిస్తున్నారు. పెను మార్పులకు సమాయత్తమవుతున్నారు. అలాంటి వీర ప్రజానీకానికి ఈ పుస్తకం స్ఫూర్తిదాయకం అవుతుందని భావిస్తున్నాను.

భారత, చైనా ప్రభుత్వాలు కలిసి అనేక సంయుక్త ప్రకటనలు చేస్తున్నాయి. చైనా తన స్నేహ హస్తం అందిస్తున్నది. ప్రపంచ పురోగమనానికై ఎన్నో ప్రతిపాదనలు చేస్తున్నది. మన

ప్రభుత్వం ఇలాంటి అవకాశాలను అందిపుచ్చుకుని ఇరుదేశాల మధ్య వున్న సమస్యలను పరిష్కరించుకొని, చైనాతో కలిసికట్టుగా ముందుకు సాగాలనీ, ఆసియా శతాబ్దపు పురోగమనంలో తనవంతు పాత్రను పోషించాలనీ భారత-చైనా మిత్రమండలి కోరుకుంటున్నది. ఈ లక్ష్యసాధనలో ఇరుదేశాల ప్రజలమధ్య పరిచయాలు, పరిశీలనలు, ప్రతినిధి బృందాల రాకపోకలు ఇతోధికంగా కొనసాగాలని భావిస్తున్నది. అందుకై మిత్రమండలి డా॥కోట్నిస్ స్మారక భారత-చైనా సంయుక్త వైద్య బృందాలను, విద్యా సదస్సులకై ప్రతినిధులను, బాలల బృందాలను పంపుతూ ఇరుదేశాల ప్రజలమధ్య మైత్రీ బంధాలను పేనుతున్నది.

మైనస్ 5 సెల్సియస్ డిగ్రీల చలిలో చైనాలో వేలాది మైళ్ళు ప్రయాణించి అక్కడి జీవితాన్ని, ఆ సమాజాన్ని పరిశీలించి మనకు వివరిస్తున్న ఉద్యమశీలి శ్రీ నిఖిలేశ్వర్‌కు అభినందనలు, ధన్యవాదాలు.

పాఠకులు దీన్ని ఆదరిస్తారనీ, ఆలోచిస్తారనీ, నూతన వ్యవస్థ నిర్మాణంలో క్రియాశీలంగా పాలుపంచుకొంటారని ఆశిస్తున్నాను. అందుకే ఈ చిరు పుస్తకాన్ని భారత-చైనా మిత్ర మండలి మీ ముందుకు తెస్తున్నదని భావిస్తున్నాను.

ఉద్యమాభినందనలతో...

*- మార్చి, 2016*

## 2. ఓ కొత్త బంగారు లోకం... కథనం: రాఘవశర్మ

రాఘవశర్మగారు 2015 డిసెంబర్‌లో చైనాలో పర్యటించి వచ్చారు. ఆయన విన్నవి, కన్నవి, ఆ పర్యటన అనుభవాలు, అనుభూతులు ఒక్క ముక్కలో చెప్పారు. 'ఓ కొత్త బంగారులోకం' అని. ఆ మాట ఎందుకన్నారో విస్తరిస్తే, వివరాల్లోకి వెళితే... ఈ యాత్రాసాహితి చిరుపుస్తకం తయారయ్యింది. ఈ పుస్తకాన్ని భారత-చైనా మిత్ర మండలి సంతోషంగా మీ ముందుకు తెస్తోంది. అత్యంత వేగంగా మారిపోతున్న నేటి ప్రపంచ ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వాతావరణంలో వ్యక్తులు, సమాజాలు, దేశాలు తమ భవిష్యత్తుపట్ల, మానవాళి మనుగడపట్ల, ప్రపంచశాంతి అభ్యుదయాలపట్ల ఆసక్తితో ఆలోచించుకోవలసిన అగత్యం ఏర్పడింది. తమతమ సమాజాల, దేశాల అభ్యున్నతిలోనే ప్రజా సంక్షేమము, వ్యక్తిగత సౌఖ్యము ముడిపడి ఉన్నాయనే అవగాహన సామాన్యులలో విస్తారమవుతోంది. ఈ ప్రపంచంలో అనేక ధోరణులు, వాటి మధ్య సంఘర్షణలు, వాటి సంక్లిష్టతలు, వివిధవర్గాలు ఆలోచిస్తూ, పరిష్కరించుకుంటూ ప్రజావళికి ఏవి మేలు చేస్తాయి

అనే అంశాలను ఎప్పటికప్పుడు తేల్చుకుంటూ సాగవలసిన అవసరం ఏర్పడింది. ఈ కర్తవ్యంలో మేధావుల పాత్ర, వారి ఆలోచన, విశ్లేషణ ఎంతో ప్రభావశీలంగా వుంటాయి. వ్యక్తిగత అభిరుచులు, ఇష్టాయిష్టాలు అటుంచి ఈ ప్రపంచాన్ని వస్తునిర్దేశంగా, వాస్తవ పరిస్థితుల ప్రాతిపదికగా, నిర్దిష్టంగా నిర్వచించుకోవలసిన సమయం వచ్చింది. గతంలోని భావాలు, భావోద్రేకాలు పక్కనపెట్టి వర్తమాన స్థితిగతులను క్షుణ్ణంగా పరిశీలించి, మూల్యాంకనం చేసుకోవలసిన పరిస్థితి వున్నది. అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతూ, ప్రపంచ ఆర్థిక వ్యవస్థను తన చుట్టూ తిప్పుకునే స్థాయిలో పురోగమించిన జన చైనా ఈనాడొక అబ్బురం, విస్మరించలేని అంశం. సహజంగానే ఆ దేశంపట్ల ప్రపంచమంతటా ఆసక్తి వున్నది. మనకు పొరుగుదేశం అవ్వడంవల్ల, చారిత్రకంగా వేల సంవత్సరాల సాంస్కృతిక సంబంధాలు కలిగివుండటంవల్ల మనకు ఆసక్తి వున్నది.

అతిపెద్ద జనాభా కలిగిన చైనా, భారతదేశాలు రెండూ గతంలో ప్రపంచ నాగరికతను నిర్దేశించిన వారసత్వం కలిగివున్నాయి. ప్రపంచ వస్తూత్పత్తిలో, వాణిజ్య వ్యాపారాలలో గణనీయమైన పాత్రను పోషించాయి. అయితే, పెట్టుబడిదారీ విధానాలు, సామ్రాజ్యవాద శక్తుల విజృంభణతో వలసపాలనకు, అర్థిక దోపిడీకి గురయి ఈ రెండు దేశాలు తమ ప్రాభవాన్ని కొంత కోల్పోయాయి. అయితే రెండు దేశాల ప్రజలు తమపై సాగుతున్న వలసపాలనకు, సామ్రాజ్యవాద శక్తులకు వ్యతిరేకంగా పోరాడి విజయం సాధించారు. భారతదేశం ఇటు 1947లో బ్రిటిష్ పాలననుండి స్వాతంత్ర్యం పొందింది. 1949లో చైనా విముక్తిని సాధించుకుని ప్రజారాజ్యంగా మారింది. ఈ ఏడు దశాబ్దాల కాలంలో చైనా అనూహ్యమైన అభివృద్ధితో ఒక అగ్రేసరపాత్రను నిర్వహించే దశకు చేరుకుంది. భారతదేశం గణనీయమైన అభివృద్ధి సాధించినా అనేక ఒడిదుడుకులకు లోనవుతూ సాగుతున్నది. అభివృద్ధి ఫలాలు సామాన్యులకు చేరకపోవడం అత్యంత పెద్దలోపంగా ఉంది. స్వతంత్ర పరిపాలనను సాధించినా, సామ్రాజ్యవాద దేశాలతో, పెట్టుబడిదారీ పెత్తందారీ విధానాలతో అంటకాగుతూ పరాధీన విధానాలు అవలంబించడం భారత పాలకవర్గాల నైజంగా వుంది. మరి చైనా తన దేశంనుండి దోపిడీపీడనలు తరిమివేసి, పేదరికాన్ని దాదాపుగా తొలగించి తన దేశ పరిస్థితులకనుగుణంగా అవసరమైన మార్పులను చేసుకుంటూ ఒక సోషలిస్టు సమాజంవైపు తనదైన స్వతంత్ర విధానాలతో దృఢంగా ప్రస్థానం కొనసాగిస్తున్నది. 21వ శతాబ్దం ఇక ఆసియాఅభివృద్ధి శకంగా మారాలని, ప్రపంచశాంతి అభ్యుదయాలకు అసియా ఖండం ఒక సరికొత్త మార్గాన్ని చూపగలగాలని చైనా అనేక ప్రతిపాదనలతో, ఇరుగుపొరుగు దేశాల పథకాలకు తనవంతు సహకారం ఇస్తూ స్నేహహస్తాలు అందిస్తున్నది. ఆసియాలో మరొక పెద్ద దేశమైన ఇండియా ఈ ప్రస్థానంలో కలిసి రాకపోతే ఆ అభివృద్ధి చక్రం ముందుకుసాగదు. అందుకే భారత, చైనా దేశాలు, దక్షిణాసియా దేశాల మధ్య చక్కటి స్నేహవారధులు నిర్మించుకోవలసిన చారిత్రక అవసరం నేడు ఏర్పడింది. భారత, చైనా దేశాల మధ్య మైత్రి

ఇరుదేశాల ప్రజల మధ్య సంఘీభావానికి, ప్రాదేశిక శాంతి సామరస్యాలకు పునాది అవుతుంది. ఆసియాలోనే కాక ప్రపంచ మానవసౌభాగ్యానికి దారితీస్తుంది. ప్రపంచ శాంతికి నెలవుగా మారుతుంది. ఈ మంచి పరిణామాన్ని తమకు పెనుసవాలుగా భావించే సామ్రాజ్యవాద శక్తులు, యుద్ధకాముకులు అడుగడుగునా అడ్డుపడుతూ, భారత, చైనాల మైత్రిని నిరోధిస్తున్నారు. మనదేశంలో చైనాపట్ల అనేక అపోహలు, అనుమానాలు, శత్రుపూరిత వ్యాఖ్యానాలు ప్రచారం అవుతున్నాయి. దీని ఫలితంగా తెలిసో తెలియకో సామాన్యులు కూడా ఈ ప్రచార ప్రభావానికి గురవుతున్నారు.

చైనా దేశాన్ని ప్రత్యక్షంగా చూడడంవల్ల, ఆ ప్రజలతో సంభాషించడం వల్ల, సంబంధాలు నెలకొల్పుకోవడం వల్ల ఇద్దరి మధ్య సదవగాహన, పరస్పర విశ్వాసం కలుగుతాయి. ప్రజల మధ్యనేకాక, ఇరు ప్రభుత్వాలమధ్య మైత్రి ఏర్పడే అవకాశం వస్తుంది. ఈ ఉద్దేశ్యంతోనే భారత, చైనా మిత్రమండలి చైనాలోని మైత్రీ సంఘాలతో కలిసి పనిచేస్తున్నది. వైద్యబృందాలు, బాలల బృందాలు, విద్యావంతుల సదస్సులు వంటి పలురూపాలలో ఒక నిరంతర సంభాషణా ప్రక్రియను కొనసాగిస్తున్నది. స్నేహ వాతావరణం నెలకొల్పుతున్నది. 270 కోట్ల మంది ప్రజల మధ్య సఖ్యత పుష్పించే ప్రయత్నం చేస్తూన్నది. అనేక దశాబ్దాలుగా కొనసాగిస్తున్న ఈ మైత్రీ కార్యక్రమాలను ఈ మధ్య మరింత చురుకుగా నిర్వహిస్తూ ఒక ప్రజాఉద్యమ స్థాయికి తీసుకెళు తున్నది. పంచశీల సూత్రాల ప్రాతిపదికగా రాజకీయ విజ్ఞతతో ఇరుదేశాల మధ్య ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో సమస్యలు పరిష్కరించుకొని ఏకోన్ముఖంగా సాగిననాడే ప్రాంతీయాభివృద్ధి, అసియా శతాబ్ది, ప్రపంచశాంతి సాకారం అవుతాయని విశ్వసిస్తోంది. ఈ దశలో చైనా అందిస్తున్న స్నేహహస్తం మనమూ అందిపుచ్చుకుని సుస్థిరతకు, శాంతి, అభ్యుదయాలకు మనవంతు సహకారం అందించవలసి వుంది. ఈ ప్రజా ఆకాంక్షను ప్రతిబింబించేలా మైత్రీ ఉద్యమాన్ని బలోపేతం చేయవలసివుంది. ఈ ఉద్యమ కర్తవ్యనిర్వహణలో అకుంఠితంగా కృషిచేస్తున్న మైత్రీ శక్తులందరికీ అభివాదం తెలుపుతూ, ఇరుదేశాల మధ్య ప్రతినిధి బృందాల రాకపోకలు, పరస్పర అభిప్రాయ మార్పిడులు స్నేహపరిధిని పెంచుతాయని భావిస్తూ మిత్రమండలి అనేక కార్యక్రమాలు చేస్తున్నది.

అందులో భాగంగానే తెలుగు రాష్ట్రాలనుండి వివిధ రంగాలకు చెందిన కార్యకర్తలను, నాయకులను కొందరిని సమీకరించి, చైనా ప్రభుత్వంనుండి పంచశీల మైత్రి పురస్కారం అందుకున్న డాక్టర్ మోహన్‌రెడ్డిగారి నాయకత్వంలో ఒక బృందాన్ని చైనాకు పంపించడం జరిగింది. ఆ బృందంలో సభ్యులు తిరిగివచ్చాక "మేం చూసిన జన చైనా" అని ప్రముఖ విప్లవ కవి నిఖిలేశ్వర్‌గారు, "పురోగమనంలో చైనా ప్రజలు" అని ఐసిఎఫ్ఏ ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు, 'ఉపాధ్యాయ ప్రగతి' సంపాదకులు సత్యనారాయణగారు ఇప్పటికే తమ అనుభవసారాన్ని ప్రచురించారు. ఇప్పుడు రాఘవశర్మగారి "ఓ కొత్త బంగారులోకం" మీ ముందుకు వచ్చింది. ఈ పుస్తకాలు కేవలం యాత్రావిశేషాలు మాత్రమే కాదు, భారత ప్రజల ప్రజాస్వామిక

ఆకాంక్షల ప్రతిధ్వనులు. భారత విదేశాంగ విధానంలో రావలసిన మార్పులను సూచించే ఆలోచనాతరంగాలు, భవిష్యత్ సూచికలు. సునిశిత పరిశీలనాదృష్టితో చైనాలోని సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని పరిశీలించి తన ఆలోచనలు అక్షరబద్ధంచేసి మనకు అందించిన రాఘవ శర్మగారికి అభినందనలు. చదువరులు కూడా దీన్ని లోతుగా పరిశీలిస్తారనీ, భారత–చైనా మైత్రీ ఉద్యమ వ్యాప్తికి తమవంతు సహాయసహకారాలు అందిస్తారని, కొత్త బంగారులోకం నిర్మించడానికి ప్రాతిపదికగావుండే భూస్వామ్య వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక రాజకీయ చైతన్యం, రాజకీయ నిర్మాణాల ప్రాధాన్యతను గుర్తిస్తారని, ఆ దిశలో మన దేశ భవిష్యత్తును నిర్మించుకోవడంలో ముందడుగు వేస్తారని మిత్రమండలి అభిలషిస్తున్నది.

*– మే, 2016*

## 3. పురోగమనంలో చైనా ప్రజలు... కథనం :జి. సత్యనారాయణ

డిసెంబర్ 2015 భారత చైనా మిత్రమండలి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ శాఖనుండి 12మంది సభ్యుల బృందం చైనా పర్యటించి వచ్చింది. మిత్రమండలి జాతీయ కార్యదర్శి, పంచశీల మైత్రీ పురస్కార గ్రహీత డా॥మోహన్‌రెడ్డి నాయకత్వంలో ఈ బృందం ఏర్పాటయింది. ఆ ప్రభుత్వ ఆహ్వానంతో వారి అతిథులుగా చైనాను సందర్శించే అవకాశం ఈ బృందానికి దొరికింది. ఈ బృందంలోని సభ్యులందరూ ప్రజాఉద్యమాలలో కాకలుతీరినవాళ్ళు. ప్రజాతంత్ర అభిలాషలతో తమ జాతి జనుల భాగ్యోన్నతి కోసం దశాబ్దాలుగా తమతమ రంగాలలో కృషి చేస్తూన్నవాళ్ళు. ఆ బృందం సభ్యులలో ఒకరు జి. సత్యనారాయణ గారు. ఉపాధ్యాయ ప్రగతి సంపాదకులుగా, ఏపిటిఎఫ్ నాయకులుగా సుప్రసిద్ధులు, చిరపరిచితులు. ఆయన ఉద్యమ అభినివేశంతో చైనాను పరిశీలించారు. ఎంతో ఉద్వేగంతో చైనాను సందర్శించారు. అనారోగ్యం, ముదిమితనం ఆయనలోని ఉత్సాహాన్ని ఏమాత్రం తగ్గించలేకపోయాయి. అధిక చలివల్ల, అననుకూల వాతావరణ పరిస్థితులవల్ల తలెత్తిన సమస్యలను తేలికగా తీసుకొని అనేక ప్రదేశాలు పర్యటించారు. దశాబ్దాలుగా కలలలో ఊరించిన సోషలిస్టు సమాజం, ఊహించిన భాగ్యయుగం చైనా పర్యటనలో ఇలలో కనిపించినట్లయిందాయనకు. "కలయో! వైష్ణవ మాయయో..." అని అడుగడుగునా ఆశ్చర్యపోయారు. "కాదిది కల. ఇది చైనా జన వికాసలీల" అని తనకు తానే చెప్పుకున్నారు. ఒక్క సత్యనారాయణ గారే కాదు. ఆ బృందమంతా అంతగా పరవశించి పోయింది. ఫలితంగానే ఆ పర్యటన అనుభవాలను శ్రీ నిఖిలేశ్వర్ 'మేం చూసిన జనచైనా' అనీ, శ్రీ రాఘవశర్మ 'కొత్త బంగారు లోకం' అనీ ఇప్పటికే పుస్తకరూపంలో ప్రచురించారు. అదే కోవలో ఇది మూడవ పుస్తకం. ఈ పుస్తకాలను తెలుగు ప్రజల సోషలిస్టు కలల రూపాలుగా భారత చైనా మిత్రమండలి భావిస్తున్నది. ఈ

పుస్తకాన్ని ప్రచురిస్తున్న ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ సంస్థను అభినందిస్తోంది. మైత్రీ ఉద్యమ సహచరులను సమాదరిస్తోంది.

ఒక జాతిని వేరొక జాతి పీడించే కాలానికి చరమగీతం పాడి, దోపిడీపీడనలను రద్దుచేసి ప్రజారాజ్యంగా ఎదుగుతున్న చైనా అభివృద్ధి క్రమాన్ని ఆకళింపు చేసుకుని, హర్షపులకిత హృదయంతో తన అనుభూతులను అక్షరబద్ధం చేశారు సత్యనారాయణగారు. తన పరిశీలనలు, అనుశీలనలు, ఈ పుస్తకం ద్వారా అందిస్తున్నారు. జనచైనా అభివృద్ధికి అబ్బురపడటమే కాదు, ఆ దేశంలో భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, సామ్రాజ్యవాద అనుకూల శక్తులను రూపుమాపి సమిష్టి శ్రమలతో సమాజ సంపదలు పెంచి, స్వాభావిక సహజ సామాజిక న్యాయసూత్రాల కనుగుణంగా సౌభాగ్యాలు అనుభవించడం వారి వ్యవస్థలోని ముఖ్యలక్షణమని గ్రహించి మనకు పాఠం చెబుతున్నారు. తమ అవసరాలకు అనుగుణమైన స్వతంత్ర ఆర్థిక విధానాలతో, ప్రణాళికలతో, ప్రజానుకూల పరిపాలనా పద్ధతులలో సోషలిస్టు పథంలో ముందుకుసాగడమే వారి సర్వతోముఖాభివృద్ధికి కారణమంటున్నారు. అకుంఠిత దీక్షతో, సోషలిస్టు నిర్మాణంపట్ల అచంచల విశ్వాసంతో, అంకితభావంతో నడుంకట్టి తమ దేశ నిర్మాణానికి, తమ జాతి అరుణోదయానికి పరిక్రమిస్తున్న సుందరదృశ్యంగా చైనా ప్రజారాశులను, వారి నాయకత్వాన్ని ఆయన వీక్షించారు. వారు సాధించిన నూతన జనతా ప్రజాతంత్ర విప్లవ విజయమే వారి అభివృద్ధి సోపానాల నిర్మాణానికి పునాది అని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నారు రచయిత. అంతేకాదు భారతదేశ పాలకవర్గాలు తమ పరాధీన ఆర్థిక విధానాలు విడనాడకపోవడం, సామ్రాజ్యవాద అనుకూల, భూస్వామ్య అనుకూల విధానాలతో పెనవేసుకుని ప్రజాప్రయోజనాలను గాలికి వదిలేయడమే మనదేశ దుస్థితికీ, వెనుకబాటు తనానికీ అసలైన కారణమంటూ ఎత్తిచూపారు. పెట్టుబడిదారీ వికృతస్వార్థం, భూస్వామ్యదోపిడి దురహంకారం రెండుతలల విషనాగులా మన వ్యవస్థను కాటువేసి విషపూరితం చేసి ప్రజా జీవితాలను నిర్వీర్యం చేస్తూ, దేశ ఆర్థికసౌష్టవాన్ని దెబ్బతీస్తున్నాయి. ఈ దోపిడీశక్తులకు అనుకూలంగా మనం అనుసరిస్తున్న విదేశీనీతి సహితం మనపట్ల ఇరుగు పొరుగుదేశాలలో సంకోచాలు, అనుమానాలు రేకెత్తిస్తూ యుద్ధభీతిని కలిగిస్తున్నాయి. అదే సమయంలో జనచైనా తన స్వతంత్ర విధానాలతో తన దేశ ప్రయోజనాలకనుగుణంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటశక్తిగా, బలమైన ఆర్థికశక్తిగా బలం పుంజుకుంటోంది. ఇరుగు పొరుగుదేశాల అభివృద్ధి పథకాలకు తోడ్పాటుగా స్నేహ సౌరభాలను పంచుతూ ప్రపంచశాంతికి దారులు వేస్తోంది. ఆసియా ఖండంలో రెండు పెద్ద దేశాలుగా ఉన్న చైనా, భారత్‌ల పట్ల నేడు ప్రపంచమంతా ఆసక్తి నెలకొన్నది. రాబోయే ఆసియా అభివృద్ధి శతాబ్దంలో రెండుదేశాలు కలసి నిర్వహించవలసిన నిర్ణాయక పాత్ర గురించి చర్చించుకుంటున్నాయి. ఇరుదేశాల ప్రజలు స్నేహసంబంధాలను, మైత్రీ బంధాలను కోరుతున్నా, ఇద్దరిమధ్య సామ్రాజ్యవాద ప్రయోజనాలు అడ్డుగోడ కడుతున్నాయి, అనుమాన సంకోచాలు నెలకొల్పుతున్నాయి. ఈ అవాంఛనీయ

వాతావరణాన్ని కాలదన్నుతూ, భారత పాలకవర్గాలు కూడా సామ్రాజ్యవాద వ్యతిరేక సంప్రదాయాలు పునరుద్ధరించుకుని చైనాతో వ్యూహాత్మక భాగస్వామ్యం పంచుకుంటూ విశాలమైన ప్రజారాశులను అభివృద్ధి పథంలోకి నడిపించవలసి వుంటుంది.

పేదరికం నిర్మూలనలో, ఒక దీటైన ఆర్థికశక్తిగా రూపొందటంలో చైనా అనుభవాలను మనం నిశితంగా పరిశీలించి మన దేశానికి అవసరమైన రీతిలో అన్వయించుకుని అభివృద్ధిని సాధించాలని భారత-చైనా మిత్రమండలి కోరుకుంటున్నది. సామ్రాజ్యవాద పన్నాగాలకు దూరంగా జరిగి చైనా అందిస్తున్న స్నేహహస్తాన్ని అందుకోవాలి. తద్వారా ప్రాదేశిక సమగ్రతకు, సుస్థిరతకు ప్రపంచశాంతికి దోహదపడే విధానాలతో భారతదేశ ప్రయోజనాల కోసం పూనిక వహించాలి అని మిత్రమండలి భావిస్తున్నది. ఇటీవల చైనా అనుసరిస్తున్న అనేకానేక ప్రత్యామ్నాయ అభివృద్ధి మార్గాలను (ఉదా॥ సిల్కురోడ్డు (ఓబిఓఆర్) ఆసియా మౌలిక వసతుల అభివృద్ధి బ్యాంకు, బ్రిక్స్ దేశాల సహకారం) మనం కూడా అందిపుచ్చుకుని ఇరుగుపొరుగు దేశాలతో స్నేహ సహకారాల వైఖరితో జనవిముక్తి పోరాటాలలో పాలుపంచుకోవాలని ఆశిస్తున్నది. మనదేశ ప్రయోజనాలను పరిరక్షించే ఇలాంటి ప్రాపంచిక ఆలోచనా ధోరణితో భారత చైనా మిత్రమండలి అనేక దశాబ్దాలుగా కృషి చేస్తోంది. ఇరుదేశాల మధ్య సదవగాహన, సోదరభావన పెరిగేలా కార్యక్రమాలు చేపడుతోంది. ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో సమస్యలను సత్వరంగా పరిష్కరించుకోవాలని భారత ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నది. దేశభక్తి పేర ఉన్మాదాన్ని రెచ్చగొడుతూ పొరుగుదేశాలపట్ల వ్యతిరేకతను పెంచిపోషించే పద్ధతులు విడనాడాలని, ప్రాంతీయ సుస్థిరతకు, ప్రపంచశాంతికి భంగం వాటిల్లని వైఖరులు అనుసరించాలని భారత పాలకవర్గాలపై వొత్తిడి పెంచే ప్రజాఉద్యమాలు నిర్మిస్తున్నది. ఆ ఉద్యమంలో ప్రజలందరి భాగస్వామ్యం కోరుకుంటోంది.

అభివృద్ధి మార్గంలో రెండు విభిన్న విధానాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయా అన్నట్లుగా వున్న భారత, చైనా దేశాలు భౌగోళికంగా పక్కపక్కనే ఉన్నాయి. సుదీర్ఘమైన సరిహద్దుకు అటూ ఇటూ ఉన్నాయి. ఎత్తైన పర్వతాలు, పొడవైన జీవనదులు, ఇద్దరికీ సమిష్టి ఆస్తి వనరులుగా ఉన్నాయి. తరతరాలుగా పెంచుకున్న సంస్కారవంతమైన సాంస్కృతిక సంపద వుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వారసత్వం వుంది. ఇవన్నీ ఇరుదేశాల మధ్య స్నేహ సంబంధాలు నెలకొల్పటానికి ఎలా తోడ్పడుతాయో, వివాదాలతో అవే విభజించే అంశాలుగా పరిణమిస్తాయి. నదులు, పర్వతాలు, జల వివాదాలుగా పరిణమిస్తాయో - ఇరు సంస్కృతులను కలిపే స్నేహ వారధులుగా నిలుస్తాయో అనేది దేశాల పాలకుల విజ్ఞతపై ఆధారపడి ఉంటుంది. పాలకుల ప్రయోజనాలపై ఆధారపడి ఉంటుంది. ప్రజాప్రయోజనాలు గీటురాయిగా మన పాలకవర్గాలు తమ విజ్ఞతను, వివేకాన్ని ప్రదర్శించి సమస్యలు పరిష్కరించాలని మిత్రమండలి అభిప్రాయం.

స్నేహ పునాదులపై జనావళికి శుభం పూయాలని ఆకాంక్షిద్దాం. అలాంటి స్నేహ వాతావరణం కల్పించటంలో, ప్రజలమధ్య సదవగాహన కల్పించటంలో ఇరుదేశాల మధ్య రాకపోకలు, ప్రతినిధి బృందాల పర్యటనలు, అభిప్రాయాల పరస్పర మార్పిడులు తోడ్పడతాయని భావిస్తున్నాము. ఆ సమాజాన్ని చూచివచ్చిన వారి ప్రత్యక్ష అనుభవాలు, అభిప్రాయాలు, ఆలోచనలు, ఇలాంటి పుస్తకాలు ప్రజల మధ్య మైత్రీ భావాలను అభివృద్ధి పరచగలవని భావిస్తున్నాము.

జనచైతన్య గీతమై, శ్రామిక శ్రేయోపతాకమై, జనం కలల ఉమ్మడి రూపమై, సామ్యవాద వ్యవస్థ పురోగమనంలో దూసుకువెళుతున్న అరుణ కిరణమై ప్రపంచ ప్రజల మన్నన పొందుతున్న జనచైనా పట్ల స్నేహభావానికి దోహదపడే ఇలాంటి పుస్తకాలను ప్రజాస్వామ్య ప్రియులంతా ఆదరిస్తారని ఆశిస్తూ... ఇంత చక్కగా తన పర్యటనల అనుభవాలను మనకు అందించిన శ్రీ సత్యనారాయణ గారిని అభినందిస్తూ...

*– అక్టోబరు, 2016*



# 6.

# ఆసియా శతాబ్దాన్ని సాకారం చేయటంలో భారత, చైనా దేశాల మైత్రి ప్రాధాన్యత

*(17, 18 మార్చి 2016 తేదీలలో నేపాల్ రాజధాని ఖాట్మండులో జరిగిన ఓ.యస్.ఏ.ఆర్.యఫ్.సి.సి. సదస్సుకు సమర్పించిన పత్రం.)*

---

*["విదేశాలతో మైత్రి కొరకు చైనా ప్రజల సంస్థ (సి.పి.ఏ.ఎఫ్.ఎఫ్.సి.) దక్షిణ ఆసియా దేశాల మైత్రి సంస్థలతో పరస్పర స్నేహ సంబంధాలు పెంపొందించుకొనే లక్ష్యంతో చైనా దక్షిణ ఆసియా మైత్రి సంస్థల వేదికను ఏర్పాటు చేసి 2009 నుండి సమావేశాలు నిర్వహిస్తోంది. ఈ సందర్భంగా దక్షిణ ఆసియా దేశాల మధ్య మరియు ఈ దేశాలకు చైనాకు మధ్య సత్సంబంధాలు పెంపొందింపజేయటానికి ఓ.యస్.ఏ.ఆర్.యఫ్.సి.సి. అనే సంస్థను సభ్య దేశాలు ఏర్పాటు చేసుకున్నాయి. గతంలో ఈ సంస్థ సమావేశాలు చైనా దక్షిణాసియా దేశాల మైత్రీ సంఘాల ఫోరం (సి.ఎస్.ఏ.ఎఫ్.ఓ.ఎఫ్.) సమావేశాలతోపాటు జరిగాయి. 2016, మార్చి 17, 18 తేదీలలో ఓ.యస్.ఏ.ఆర్. యఫ్.సి.సి. సమావేశాలు, నేపాల్‌లోని ఖాట్మండులో నిర్వహించారు. ఆ సదస్సులో ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటకల భారత–చైనా మిత్రమండలి నాయకులు పాల్గొన్నారు. ఆ సదస్సులో డా॥యస్.జతిన్ కుమార్ చేసిన ప్రసంగానికి తెలుగు అనువాదం. ఇది ఐసిఎఫ్ఏ ప్రధాన కార్యదర్శి నివేదికలోని అంశాలకు దక్షిణాసియా దేశాలకు సంబంధించిన మరికొన్ని అంశాలను జోడించి సంస్థ తరపున చేసిన ప్రసంగం.]*

**మిత్రులారా!**

ప్రధమంగా నేను నేపాలు, చైనా ఎగ్జిక్యూటివ్స్ కౌన్సిల్ సభ్యులకు ఈ సంస్థ అధ్యక్షుడు శ్రీ అనూప్ భట్టారికి కృతజ్ఞతలు చెబుతున్నాను. భారత–చైనా మిత్రమండలి, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ శాఖల ఉమ్మడి ప్రతినిధిగా మా సంస్థను ఈ సమావేశానికి ఆహ్వానించినందుకు, చక్కని ఆతిధ్యం సమకూర్చినందుకు మీకు మా ధన్యవాదాలు తెలుపుతున్నాను. నా మాతృదేశం

భారతదేశం తరఫున, నా సంస్థ భారత-చైనా మిత్రమండలి తరఫున నా శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ఈ సమావేశంలో సాగించే చర్చలు, తీసుకునే నిర్ణయాలు దక్షిణాసియా దేశాల మధ్య స్నేహ సంబంధాలను మరింత అభివృద్ధి చేయాలని, ఆసియా దేశాలకు చైనా దేశానికి మధ్య మరింత సహకారం పెంపొందించటానికి తోడ్పడగలవని భావిస్తున్నాను. ఆసియాదేశాలకు, చైనాకు మధ్య స్నేహం గురించి చర్చించటానికిముందు ఈ ఆశయం కోసం, స్నేహానికున్న పరిధిని, అవకాశాలను విస్తృత పరచటంకోసం అకుంఠితంగా కృషి చేస్తున్న మన నాయకులకు, సోదర సభ్యులకు మన గౌరవ వందనాలు తెలుపుకుందాం.

మన ప్రజల కోరిక, ఈ ప్రాంతంలోని వివిధ దేశాల ఆకాంక్ష, ప్రాంతీయ విభేదాలు, సంఘర్షణలు లేకుండావుండటం, యుద్ధ భయం లేకుండా శాంతియుతంగా జీవించటం. తమ సర్వశక్తులు ఒడ్డి దేశాభివృద్ధిని, తమ జీవన ప్రామాణికతను మెరుగుపరచుకోవటం సౌకర్యవంతమైన ప్రశాంత జీవితం గడపటం. అభివృద్ధి చెందిన సమాజం, అందరికీ సమాన అవకాశాలు కల్గించే సమాజం, జాతి, మత, ప్రాంత, భాషా ప్రాతిపదికలపై ఎలాంటి వివక్ష చూపని సమాజం నెలకొల్పుకోవటం. అయితే ఈనాటి ప్రపంచంలో ఆధిపత్య శక్తులు, అధికారం చలాయిస్తున్న పెత్తందారీ శక్తులు ఈ వివక్షతల ఆధారంగానే ప్రజలను, దేశాలను విభజించి, విడగొట్టి తమ పబ్బం గడుపుకుంటున్నాయి. అగ్రరాజ్య శక్తులు దోపిడీని యధేచ్ఛగా కొనసాగించటానికి పేద దేశాల సంపదలనూ, వనరులనూ కొల్లగొట్టటానికి ఈ కుయుక్తులకు పాల్పడుతున్నాయి. ఇలా దోపిడీపీడనలకు గురవుతున్న దేశాలను, అవి అభివృద్ధిచెందిన దేశాలపై ఆధారపడి జీవిస్తున్నట్టుగా భ్రమలు కల్పిస్తున్నారు. అయితే వాస్తవమేమంటే వెనుకబడ్డ దేశాలని చెప్పబడుతున్న దేశాల మానవ వనరులను, సహజ వనరులను అభివృద్ధి చెందిన దేశాలనేవి కొల్లగొడుతున్నాయి. తమ దేశాలకు తరలించుకుపోతున్నాయి. అలాగే విభిన్న సంస్కృతుల మధ్యవున్న వైవిధ్యాలను వాడుకుంటున్నాయి. పేద దేశాల ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తూ తాము చాలా వెనుకబడిన వారమనీ, నిష్ప్రయోజకులమనీ భావించేలా చేస్తున్నాయి. ఆయా దేశాల జాతి గౌరవాన్ని కృంగదీస్తున్నాయి. అందుకనే ప్రజలు ఆయా దేశాల మధ్యసంబంధాలు ఒక సమాన ప్రాతిపదికపై, పరస్పర గౌరవ మర్యాదలు చూపించుకునేలా వుండాలనుకుంటున్నారు. తమ దేశాల ఆంతరంగిక విషయాల్లో ఇతర దేశాల జోక్యాన్ని నిరసిస్తున్నారు. శాంతియుత సహజీవనం, పరస్పర ప్రయోజనకరమైన షరతులపైన ఇతర దేశాలతో తమ దేశం మైత్రిని నెలకొల్పుకోవాలని అభిలషిస్తున్నారు. మనం ఈ ప్రజాస్వామిక ఆకాంక్షలను మన ప్రాంతపు దేశాల పరస్పర సంబంధాలకు, జనచైనాకు, మన ప్రాంతానికి మధ్యగల స్నేహ సంబంధాలకు ప్రాతిపదికగా వుండాలని మనసారా కోరుకుంటూ దానికై ఉద్యమిస్తున్నాం.

**మిత్రులారా!**

ఇంకాలోతుగా ఈ మైత్రీ వుద్యమం గురించి పరిశీలించేముందు మనం కచ్చితంగా అసలు మైత్రి ఉద్దేశం, లక్ష్యం గురించి స్పష్టంగా తెలుసుకోవాలి. భారత-చైనా మిత్రమండలి

ప్రణాళికలో మేము విస్పష్టంగా నిర్వచించాం. "భారత, చైనా ప్రజలు చారిత్రాత్మకమైన స్నేహం, సాంస్కృతిక బంధనాలతో కట్టివేయబడి వున్నారు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల ఉమ్మడి వారసత్వం కలిగివున్నారు. భారత, చైనా దేశాలమధ్య కుదిరిన పంచశీల ఒప్పందం రెండు దేశాల ప్రజల స్నేహ ఆకాంక్షలతో, వారి ఉమ్మడి ప్రయోజనాలకు అద్దం పడుతున్నది. ఈనాటి అంతర్జాతీయ పరిస్థితులలో ముఖ్యంగా ఒక అగ్రరాజ్యం ఏక ధృవ ప్రపంచాన్ని నెలకొల్పటానికి విఫలయత్నాలు విస్తారంగా కొనసాగిస్తున్నవేళ భారత, చైనాలు తమ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వారసత్వాన్ని ముందుకు తీసుకు వెళ్ళవలసిన ఆవశ్యకత ఎంతైనావుంది".

అందువల్ల నేటి ప్రపంచ రాజకీయాలు, సాంఘిక, సాంస్కృతిక అంశాలను పరిగణిస్తూ మన ఆశయాలను రూపొందించుకోవాలి. మన లక్ష్యాలు ఈ సామ్రాజ్యవాద వ్యతిరేక, పెత్తందారీ వ్యతిరేక, ప్రజానుకూల ఆకాంక్షలకు అనుగుణంగానే వుండాలి. త్వరితంగా మారిపోతున్న ప్రపంచ పరిణామాల నేపథ్యంలో మన అవగాహనను నిరంతరం పదును పెట్టుకుంటూ మన భవిష్యత్ కార్యక్రమాలు, మైత్రీ వుద్యమాన్ని మరింత ఉన్నతికి చేర్చే పథకాలు తీర్చి దిద్దుకోవాలి.

ఈనాటి భౌగోళిక రాజకీయ నేపథ్యంలో "భారత-చైనా మైత్రి ఆసియా శతాబ్దాన్ని సాధించటంలో దానిపాత్ర, ప్రపంచ పరిణామాలలో దాని విశిష్టత, ప్రాధాన్యత" అనే అంశం మా దేశ ప్రజల అభీష్టాన్ని ప్రతిబింబిస్తుంది. ఒకవిధంగా ఆది ప్రపంచ ప్రజల ఉమ్మడి కోరికగా కూడా ప్రతిధ్వనిస్తోంది. 19వ శతాబ్దాన్ని బ్రిటిష్ శతాబ్దం అంటారు. 20వ శతాబ్దం అమెరికా శతాబ్దం. ఇక 21వ శతాబ్దం ఆసియా శతాబ్దం కానుంది. ఈరోజున ఆసియా శతాబ్దం అనే పదం చాలా విరివిగా ఉపయోగించబడుతోంది. సాధారణంగా ప్రజలు భవిష్యత్తును ఆసియాకి చెందినదానిగా చూస్తున్నారు. మేధావులు, చదువుకున్నవారే కాదు సాధారణ ప్రజలు కూడా ఈ ఆలోచనపట్ల చాలా ఆసక్తి చూపిస్తున్నారు. విద్యావేత్తలు ఈ అవగాహనని ఆర్థికవాద రాజకీయకోణంలో విశదీకరిస్తున్నారు. చరిత్రలో బ్రిటిష్ సామ్రాజ్యవాదపు పతనం అమెరికా అగ్రరాజ్యానికి ఎలా దారులు తీసిందీ, ప్రజలపై ఎలా పెత్తనం చెలాయించిందీ చూపిస్తున్నారు. మరీముఖ్యంగా ఒకనాటి అగ్రరాజ్యం సోవియట్ పతనం తర్వాత అమెరికా ఏకైక అధికార ధృవంగా మారటానికి అర్రులుచాస్తున్న వైనంవైపు దృష్టి సారిస్తున్నారు. అదేసమయంలో అమెరికా అగ్రరాజ్యంలో రోజురోజుకూ పెరిగిపోతున్న ఆర్థిక సంక్షోభం ఒకవైపు అదుపులేకుండా విస్తరిస్తుంటే, మరోవైపు ఆసియాలో మరీముఖ్యంగా చైనాలో శీఘ్రగతిన జరుగుతున్న అభివృద్ధిని గమనిస్తూ ఆసియా శతాబ్దం రానున్నదని విశ్వసనీయంగా ఊహిస్తున్నారు. అయితే ఆసియా శతాబ్దం ఊరికే అలా ఊడిపడదు. ఊహించిన అభివృద్ధిని సాధించిననాడే సాధ్యమవుతుంది. అభివృద్ధి కేవలం అంకెలలో 'జిడిపి' అభివృద్ధిగాకాక మానవజీవన అభివృద్ధిని సాధించాల్సివుంది. ప్రపంచంలో అత్యధిక జనాభాగల చైనా, భారతదేశాలు రెండూ ఆసియా ఖండంలోనే వున్నాయి. 1980ల ప్రాంతంలో ప్రపంచంలోని నిరుపేదలలో 80 శాతం ఈ రెండు దేశాలకి చెందినవారే. అయితే చైనాలో

జరిగిన బ్రహ్మాండమైన అభివృద్ధి ద్వారా ఆ దేశంలో బీదరికాన్ని దాదాపుగా నిర్మూలించగలిగారు. ప్రస్తుతం ఆసియాలోని పేదవారిలో 50 శాతం వరకు భారతదేశంలోనే వున్నారు. ఇండియా కూడా తన ప్రజలను పేదరికం కోరలనుండి బయటపడవేస్తేనే నిజమైన అర్థంలో ఆసియా శతాబ్దం సాధ్యపడుతుంది. ఇంత అభివృద్ధితో చైనా ఏం కానుంది? ఏం చేయబోతోంది? అని ప్రపంచం ఆసక్తితోనూ, కొంత సంశయంతోనూ పరిశీలిస్తోంది. చైనా కూడా మరో అగ్రరాజ్యంగా మారుతుందని కొందరు తెలిసో తెలియకో భావిస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న చైనా ఈ ప్రపంచానికి ఒక ముప్పుగా మారనుందని అమెరికా అగ్రరాజ్యం దుష్ప్రచారం చేస్తోంది. అయితే చైనా మాత్రం ఈ అభిప్రాయాన్ని ఖండిస్తోంది. "ప్రపంచంలో మరో అగ్రరాజ్యంగా, మరో పెత్తందారీ శక్తిగా మారాలని చైనా ఏమాత్రం ఆశించటంలేదు. "ఉమ్మడి లక్ష్యంగల సమాజంగా" ఈ ప్రపంచాన్ని తీర్చిదిద్దటమే తమ ఆశయంగా ఒక నూతన దృక్పథాన్ని అది ప్రతిపాదిస్తోంది.

చైనా తన స్వతంత్ర విధానాలతోను, తన దేశ పరిస్థితులకు అనుగుణమైన ప్రణాళికలతోను, తను నిర్దేశించుకున్న లక్ష్యాలనుసాధించే పథకాలతోను శరవేగంగా సర్వతోముఖాభివృద్ధిని సాధించగలిగింది. ఈరోజున చైనా ఇతరదేశాలతో పరస్పర ప్రయోజనకరమైన ప్రాజెక్టులు నిర్వహించటానికి, అభివృద్ధి చెందుతున్న పేద దేశాలకు కొంత సాయపడటానికి కావలసిన సాధన సంపత్తులు సమకూర్చుకోగలిగింది. ఆయా దేశాల సార్వభౌమాధికారాలకు లోబడి వారు నిర్ణయించుకున్న అభివృద్ధి కార్యక్రమాలకు తోడ్పడటానికి సిద్ధమవుతోంది.

ఇటీవలికాలంలో అంతర్జాతీయ స్థాయిలో ఆసియా మౌలికవసతుల పెట్టుబడుల బ్యాంకును (ఏఐఐబి) చైనావారు స్థాపించారు. వంద బిలియన్ డాలర్ల పెట్టుబడితో 57 దేశాలు శాశ్వత సభ్యులుగా ఈ బ్యాంకు నెలకొన్నది. ప్రపంచబ్యాంకు పెట్టుబడిలో ఇది సగం. ఆసియా అభివృద్ధి బ్యాంకు (ఏడిబి) మూలధనంలో ఇది 2/3వ వంతు. ఈ బ్యాంకు ఆవిష్కరణలో ఐక్యరాజ్యసమితి అధినేత మాట్లాడుతూ పటిష్టమైన అభివృద్ధిని కొనసాగించేలా పెట్టుబడులు సమకూర్చే సత్తావున్న బ్యాంకుగా అభివర్ణించారు. ఆర్థిక నిపుణులు దీన్ని ప్రపంచబ్యాంకు, ఐయంఎఫ్ వంటి సంస్థలకు ప్రత్యామ్నాయంగా పరిగణిస్తున్నారు. ప్రపంచ ఆర్థిక వ్యవహారాల నిర్వహణలో మెరుగైన పద్ధతులు ప్రవేశపెడుతుందని, ఆసియా దేశాల స్థిరమైన అభివృద్ధికేకాక ప్రపంచ దేశాలన్నింటి అభివృద్ధికీ తోడ్పడుతుందని ఆశిస్తున్నారు.

బ్రిక్స్ దేశాల కూటమి, బ్యాంకు, ఓబిఓఆర్ (వన్‌బెల్ట్–వన్‌రోడ్) వంటి కార్యక్రమాలతో చైనా చొరవగా, చురుకుగా ముందుకు వస్తోంది. ఇవన్నీ ప్రపంచాన్ని సమిష్టి అభివృద్ధిని సాధించే సమూహంగా మార్చటానికి చేస్తున్న మంచి ప్రయత్నాలే. తమ దేశ అవసరాలు మాత్రమేకాక ప్రపంచ భవితవ్యాన్ని కూడా దృష్టిలో వుంచుకొని చైనా ఎంతో దార్శనికతతో తన విధానాలు రూపొందిస్తున్నదనటానికి ఇవన్నీ తిరుగులేని నిదర్శనాలు. జపాన్, ఇండియావంటి

ఏ కొద్ది దేశాలనో మినహాయిస్తే మిగిలిన ఆసియా దేశాలు చైనాతో గాఢమైన మిత్ర సంబంధాలు పెంచుకుంటూ అనేక అభివృద్ధి ఫలాలను అనుభవించగలుగుతున్నాయి. ఆయా దేశాలమధ్య బలపడుతున్న ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక సంబంధాలు ఆసియా శతాబ్దంవైపు వేస్తున్న దృఢమైన అడుగులుగా ఎంతో ఆశావహంగా వున్నాయి.

ఒకవంక చైనా ఇలా శాంతియుత అభివృద్ధిని సాధించటానికి, ఒక సరైన ప్రపంచక్రమాన్ని తీర్చిదిద్దటానికి పలు ప్రతిపాదనలు చేస్తూ చిత్తశుద్ధితో ప్రయత్నిస్తుంటే – మరోవైపున అమెరికా అగ్రరాజ్యం చైనాను ప్రపంచానికి పెనుసవాలుగా చిత్రిస్తున్నది. తాను కోల్పోతున్న ప్రాభవాన్ని పున:సాధించే విఫలయత్నాలలో భాగంగానే అమెరికా ఇలాంటి ప్రచారం చేస్తున్నదనేది స్పష్టమే. ప్రచారమేకాక చైనాను నిలువరించే ప్రయత్నాలను అది ముమ్మరం చేస్తున్నది. ఇండియావంటి దేశాలను ఆ వ్యూహంలో భాగస్వాములుగా కలిసివచ్చేలా ప్రోత్సహిస్తున్నది. ఆసియా, మరీముఖ్యంగా సౌభాగ్యవంతమైన తూర్పు ఆసియాను ప్రస్తుతం అమెరికా అగ్రరాజ్యం తనకు చాలా అవసరమైన, ప్రాముఖ్యతగల ప్రాంతంగా ఎంచుకున్నది. ఈ ప్రాంతంలోని సంపదను దోచుకోవటానికి ఆయా దేశాలమధ్య కొత్త సంఘర్షణలు సృష్టించి, తన సామ్రాజ్యవాద కుయుక్తులను అనుసరిస్తూ తన పబ్బం గడుపుకుంటున్నది. ఆసియాపై కేంద్రీకరించి దేశాలమధ్య సమతూకం సాధించటమనే పేరుతో ఈ విధానం చేపట్టటం ఈ వ్యవహారంలో భాగమే. అలాగే దక్షిణ చైనా సముద్ర ప్రాంతంలో లేనిపోని సమస్యలు సృష్టించడం, ఆయా దేశాల మధ్య ఉద్రిక్తతలను రెచ్చగొట్టటం చురుకుగా అమలుచేస్తున్న వారి సామ్రాజ్యవాద పన్నాగమే.

సిల్కురూటు పథకంలో ఇప్పటికే దాదాపు 57 దేశాలు అంగీకరించి, పాలు పంచుకుంటున్నాయి. ఇండియా మాత్రం ఈ పథకంలో పాల్గొనకపోవటమే కాదు చైనాకు వ్యతిరేకంగా అమెరికా సాగిస్తున్న కార్యక్రమాలలో భాగం పంచుకోవటాన్ని కొనసాగిస్తున్నది. గతంలోని యుపిఏ (కాంగ్రెసు) సర్కారు మొదలుపెట్టిన 'తూర్పువైపు చూద్దాం' విధానం కానీ, వర్తమాన యన్‌డిఏ (బిజెపి) ప్రభుత్వం చెబుతున్న 'తూర్పువైపు పనిచేద్దాం' విధానం కానీ అమెరికా ప్రభుత్వం చెబుతున్న "ఆసియాపై కేంద్రీకరిద్దాం" అనే పథకంలో భాగమే. భారత పాలకవర్గాలు అమెరికా అగ్రరాజ్య ప్రయోజనాలకు ఎలా ఊడిగం చేస్తున్నాయో ఇక్కడ స్పష్టంగా కనిపిస్తుంది.

మొత్తం ప్రపంచంలోని పేద ప్రజలలో 50% భారతదేశంలోనే వున్నారు. అందువల్ల భారతదేశం పేదరికం నిర్మూలనలో మరింత బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. తన ప్రజలను పేదరికంనుండి విముక్తిచేస్తే అది ప్రపంచ జనాభాలో పెద్ద భాగాన్ని పేదరికం నుండి విముక్తి చేసినట్లే కదా! అందుకే భారతదేశం ప్రపంచ ప్రజలకు జవాబుదారీగా వ్యవహరించాల్సివుంది. తన అభివృద్ధి పథకాలకు, తన దేశ ప్రయోజనాల ప్రాధాన్యాన్ని ఎంచుకోవటంలో ఇండియా ప్రజాతంత్రయుతంగా వుండాలి. అయితే అనేక సందర్భాలలో భారత పాలకవర్గాలు, దేశనాయకులు చేస్తున్న ప్రకటనలు, దేశం మరొక అగ్రరాజ్యంగా

మారాలనే ఆకాంక్షను వ్యక్తం చేస్తుంటాయి. వాస్తవంలో ఇది ఒక పెత్తందారుగా మారాలనుకోవటమే. ఈ వైఖరి భారతదేశ పరిస్థితులకు, అసంఖ్యాక ప్రజల అభివృద్ధికి, మౌలిక ఆకాంక్షకు అనుగుణ్యమైనది కాదు.

ఈనాటి ప్రపంచంలో అగ్రరాజ్యంగా వెలుగొందుతున్న అమెరికా రాజ్యమే ధనరాసులు వుండికూడా తన స్థానాన్ని నిలబెట్టుకోలేక చతికిలబడి పోతున్నది. వారి అపారమైన వనరులు ప్రపంచదేశాలను దోపిడీచేసి సంతరించుకున్నవే. ఈ స్థితిలో అమెరికా అనుంగుబంటుగా వ్యవహరిస్తూ తానూ ఒక అగ్రదేశంగా మారతానని ఇండియా కలలుగనటం ఆచరణ సాధ్యం కానిది. అది ప్రజలను భ్రమలలో ముంచెత్తటమే అవుతుంది. వాస్తవంగా ఇండియా ఒక నాయకత్వ పాత్రలోకివచ్చి, ప్రపంచ వ్యవహారాలలో ఒక ప్రధాన భూమిక నిర్వహించాలంటే మానవ అభివృద్ధి గమ్యాలను తాను అందుకుని మిగిలిన దేశాలకు ఒక ఆదర్శప్రాయమైన పురోభివృద్ధి మార్గాన్ని అందించినపుడు మాత్రమే సాధ్యమవుతుంది. ఈ నేపథ్యంలో ఇండియా, ఇతర ఆసియా దేశాలు ఆసియా శతాబ్దమనే లక్ష్యాన్ని చేరటానికి ఏం చేయాల్సివుంది? ఆసియా స్వప్నం మిగతా ప్రపంచానికి ఎలా మేలు చేకూర్చుతుంది?

2010కి ముందు మూడు దశాబ్దాలపాటు ఆసియా ఖండంలో జరిగిన గణనీయమైన ఆర్థిక అభివృద్ధి – మరీముఖ్యంగా చైనా సాధించిన మహత్తరమైన అభివృద్ధి – ఆసియా శతాబ్దమనేది సాధ్యమేననే ఆశలు ప్రస్ఫుటంగా కలిగించాయి. భారత చైనాలు కలిసి శ్రమిస్తే తమ గత వైభవాన్ని సాధించుకోవటం, సమిష్టి పురోగమన సమాజమనే గమ్యాన్ని చేరుకోవటం సాధ్యమవుతుంది. అయితే భారత పాలకవర్గాలు తద్భిన్నంగా వ్యవహరిస్తున్నాయి. మాటలలో చైనాతో చక్కటి సంబంధాలు వుండాలని అనేక ప్రకటనలు చేస్తుంటారు. భారత చైనాలు కలిసి ఒక అద్భుత భవిష్యత్తును సాధించగలుగుతాయని పదేపదే చెబుతుంటారు. కానీ ఆచరణలో "ఆసియాలో సమతూకం", "ఆసియాపై కేంద్రీకరించండి"వంటి అమెరికా పథకాలలో భాగస్వాములవుతారు. సామ్రాజ్యవాదుల ప్రపంచవ్యూహంలో భాగంగా చైనా అభివృద్ధిని నిలువరించే సర్వ ప్రయత్నాలకు మద్దతు ఇస్తారు. ఇలా పరస్పర విరుద్ధమైన వైఖరిని ప్రదర్శిస్తారు. ఈ వైఖరిని విడనాడి, మిగతా దక్షిణ ఆసియా దేశాల ప్రజల ఆశలకు, ఆకాంక్షలకు అనుగుణమైన దృక్పథంతో, ఈ ప్రాంతీయ సంక్షేమానికి దారితీయగల కార్యక్రమాలలో భాగస్వామికావాలి. చైనాతో భారతదేశానికున్న సమస్యలను రాజకీయ అభిలాషతో సత్వరమే పరిష్కరించుకొని, స్నేహమార్గంలో ముందడుగు వేయాలి. సుదీర్ఘమైన మైత్రికి రంగం సిద్ధం చేసుకోవాలి. భారత–చైనా మిత్రమండలిగా ఇది మా ప్రధానమైన డిమాండు. ఇది నేరవేరేవరకు మా ఉద్యమాన్ని కొనసాగించాల్సివుంది.

మిత్రులారా!

దక్షిణాసియా అంటే ఆఫ్ఘనిస్తాన్, బంగ్లాదేశ్, భూటాన్, పాకిస్తాన్, ఇండియా, నేపాల్, మాల్దీవులు, శ్రీలంక వున్న ప్రాంతం. భౌగోళికంగా భారత భూభాగం ఈ ప్రాంతంలో

విశాలమైనది. ఈ ప్రాంతాన్ని అనేక ఇతర పేర్లతో కూడా పిలుస్తుంటారు. ఒక్కొక్కసారి ఒక్కొక ప్రాంతాన్ని కలపటం, మరోసారి దాన్ని తీసివేయటం కూడా జరుగుతూవుంది. ఈ చేరికలకు, తీసివేతలకు ఏదో ఒక కుంటిసాకు చెబుతూవుంటారు. ఉదాహరణకి, ఆఫ్ఘనిస్తాన్‌ను ఒకోసారి కలుపుతారు. కొన్నిసార్లు అది దక్షిణాసియాలోనిది కాదంటారు. మారిషస్, టిబెట్ స్వయంపాలిత ప్రాంతాన్ని కొందరు ప్రత్యేకంగా కలుపుతారు. మయన్మార్ (బర్మా) పరిస్థితికూడా సందిగ్ధంగా వుంటుంది. అలాగే ఈ ప్రాంతాన్ని పిలవటంలో కూడా అనేక పద్ధతులు అవలంబిస్తారు. హిమాలయ నిమ్న ప్రాంతమనీ, భారత ఉపఖండమనీ, ఆయా కాలాల పాలకులు, ముఖ్యంగా బ్రిటిషువారు రాజ్యం చేసిన కాలంనుండీ దీన్ని తమతమ ఇష్టానుసారం వ్యవహరిస్తున్నారు. దీనికి ప్రత్యేకమయిన స్పష్టమయిన భౌగోళిక, చారిత్రక ఆధారాన్ని కూడా అనుసరించటం లేదు. ఇదంతా ఎలాగున్నా ప్రస్తుతం దక్షిణ ఆసియా అంటే పైన పేర్కొన్న ఎనిమిది దేశాల భాగంగా గుర్తింపు పొందింది. ఆసియాలో 11% భూభాగం, 1.72 బిలియన్ల జనాభా. అంటే ప్రపంచంలో 24%. ఇందులో పర్వత శ్రేణులున్న నేపాల్, భూటాన్, శ్రీలంక, మాల్దీవులవంటి లంకలు, లోయలు, మైదానాలు, పీఠభూములు వంటి విభిన్న నైసర్గిక స్వరూపాలు గల దేశాలు వున్నాయి. ఈ ప్రాంతంలో మానవ ఆవాసాలు వేల సంవత్సరాల క్రితమే ప్రారంభమయ్యాయి. ఇక్కడవున్న సాంస్కృతిక జీవన ప్రత్యేకతలు, విభిన్నతలు ఆయా దేశాల సరిహద్దులకు అతీతంగా వుంటాయి. ఆఫ్ఘనిస్తాన్, పశ్చిమ పాకిస్తాన్, భారత దేశంలోని కొన్ని పశ్చిమోత్తర ప్రాంతాలు పర్షియన్ (ఇరానియన్) సంస్కృతిని కలిగివుంటాయి. అస్సాం, భూటాన్, సిక్కిం, మేఘాలయ, నేపాలులో కొన్ని భాగాలు టిబెట్ బుద్ధిజాన్ని అనుసరిస్తాయి. బంగ్లాదేశ్, పశ్చిమబెంగాల్ వంగభాషను మాట్లాడుతాయి. దక్షిణ భారతదేశం, శ్రీలంక ద్రవిడ సంస్కృతిని పంచుకుంటాయి. ఇలా వివిధ దేశాలలోవున్న ప్రజలు కొందరు ఒకే రకం సంస్కృతిని కలిగివుంటారు. అలాగే ఒకే దేశంలోవున్న ప్రజలకు వివిధ సంస్కృతుల వారసత్వమూ వుంది. ఈ ప్రత్యేక లక్షణంవల్ల వివిధ దేశాలు కలిసిమెలసి వుండటానికి ఆస్కారం ఏర్పడింది. ఆయా దేశాల ప్రభుత్వాలకు మధ్య వున్న సంబంధాలకు మించిన గాఢమైన అనుబంధం ఈ విభిన్న దేశాల ప్రజలమధ్య నెలకొనివుంది. మన ప్రాంతంలోవున్న ఈ విశిష్ట లక్షణాలను మన ప్రజల ప్రయోజనాలకోసం వుపయోగించుకోవాలి. తద్వారా ప్రాంతాలమధ్యవున్న క్షేత్రస్థాయి విబేధాలను పెంచి పెద్దచేసి ప్రజలనూ, ప్రాంతాలను విభజించి తమ ప్రయోజనాలకు అనుగుణంగా తీర్చిదిద్దుకుంటున్న సామ్రాజ్యవాదుల కుటిల ప్రయత్నాలను తిప్పికొట్టగలము. మనమధ్య వున్న ఉమ్మడి సమస్యలను గుర్తించి, పరస్పర సహాయం, సహకారంతో వాటిని పరిష్కరించుకొనే ప్రయత్నం చేయాలి. ప్రభుత్వాలు, వాటి ప్రతినిధులద్వారా జరిగే ప్రయత్నాలు ఎలావున్నా, ప్రజల మధ్య మైత్రీ సంబంధాలువుంటే, అవి ఇరుదేశాల మధ్య శాంతి సౌమనస్యాలను నెలకొల్పటంలో

ఎక్కువగా తోడ్పడుతాయి. మన సంస్థలు ఈ విషయంలో గణనీయమైన పాత్ర పోషించగలుగుతాయి. మన ప్రయత్నాల ద్వారా ఇద్దరిమధ్య సౌభ్రాతృత్వమూ, సహోదర భావమూ వెల్లివిరుస్తాయి. ఈ సదవగాహన ద్వారా మాత్రమే పాలకుల పెద్దన్నల అహంకార వైఖరికి, పెత్తందారీతనానికి అడ్డుకట్ట వేయగలుగుతాము.

దక్షిణాసియా ప్రాంతంలో ఇండియా అత్యంత త్వరితంగా ఎదుగుతున్న ఆర్థిక వ్యవస్థ గల దేశం. అయితే అదే సమయంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాల ప్రకారం పోషకాహార లోపంతో కునారిల్లుతున్న ప్రపంచ బాలలలో అత్యధిక శాతం ఇండియాలోనే వున్నారు. ఉండవలసిన బరువుకన్నా తక్కువ బరువువున్న పిల్లల జనాభా కూడా భారత దేశంలోనే అన్ని చోట్ల కంటే ఎక్కువగావుంది. ఒకవంక 7.6% అభివృద్ధిని నమోదు చేస్తోంది. మరోపక్క పోషకాహారం, ఆరోగ్యం, అక్షరాస్యత, విద్యారంగాలలో అనేక దేశాలకంటే వెనుకబడి వుంది. అభివృద్ధి చెందిన పశ్చిమ దేశాలకంటే మాత్రమే కాదు, ఆసియాలోని కొన్ని చిన్నదేశాలకంటే కూడా భారత దేశం తులనాత్మకంగా వెనుకబడివుంది. అయితే దక్షిణాసియా ప్రాంతపు ఆర్థికవ్యవస్థలో భారతదేశానికి 82% వాటా వుంది. ఈ ప్రాంతంలో అందరమూ ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలున్నాయి. ఉదాహరణకి, అవినీతి స్థాయి చాలా ఎక్కువ. 160 స్థానాలలో బంగ్లాదేశ్ 139, పాకిస్థాన్ 117, నేపాల్ 130, ఇండియా 76 స్థానాల్లో వున్నాయి. అలాగే దారిద్ర్యరేఖకు దిగువగా వున్న జనాభా 20 నుంచి 30 శాతంవుంది.

ఈ ప్రాంతాలలో ఇప్పటికి 70% జనాభా వ్యవసాయ ఆధారితంగా గ్రామాలలో బతుకుతున్నారు. బీదవారిలో 75% మంది గ్రామీణులే. అందువల్ల గ్రామాల ఆర్థిక వ్యవస్థను అత్యవసరంగా పునర్వ్యవస్థీకరించవలసి వుంది. భూస్వామ్య వ్యతిరేక విధానాలతో గ్రామీణ వ్యవస్థను పటిష్టపరచవలసి వుంది. ఈ అంశంలో చైనా అనుభవం, వారు సాధించిన విజయాలు మనకు అత్యంత ఉపయోగకరంగా వుంటాయి. భారతదేశం వంటి పెద్ద దేశాలలో కొనసాగుతున్న అర్థఫ్యూడల్ వ్యవస్థను మౌలికంగా విప్లవాత్మకంగా మార్చివేసినప్పుడు మాత్రమే గ్రామీణ ప్రాంతాలు బీదరికపు సంకెళ్ళనుండి విముక్తి చెందుతాయి. మన సమాజాలలో వున్న పీడిత రైతాంగానికి మనం ఈ సందేశం అందించగలగాలి. సామ్రాజ్యవాదులు మన ప్రజలను చీల్చివేసి కొనసాగిస్తున్న ఆర్థిక వనరుల దోపిడికి వ్యతిరేకంగా బలమైన ఉద్యమాలు నెలకొల్పాలి. అప్పుడే మన పట్టణాల ప్రగతిని సాధించగలం. ఇలా భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక ద్విముఖ వ్యూహంతో ఉద్యమించినప్పుడే మన సమాజాలను సంపద్వంతం చేసుకోగలుగుతాము.

మనకు అత్యంత ఆవశ్యకమైన ఈ అగ్రరాజ్య పెత్తందారీ వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక, స్వతంత్ర అభివృద్ధి పంథాను అనుసరించటంలో జనచైనా రిపబ్లిక్ మనకు ఎంతగానో తోడ్పడగలుగుతుంది. ఈ ప్రాతిపదికమీదనే మన దేశాలు పరస్పరం సహకారం పెంచుకుంటూ మరోవంక జనచైనాతో మైత్రిని నిర్వహించవలసి వుంది. ఈ స్నేహ

సంబంధాలు మాత్రమే మన ప్రాంతానికి, ఆసియా ఖండానికి, మొత్తం ప్రపంచానికి లాభకరం, క్షేమకరం అని నేను భావిస్తున్నాను. ఈ వైఖరితో మానవాళికి మనమొక భద్రమైన అభివృద్ధి చెందిన, శాంతి సౌమనస్యాలుగల సమాజాన్ని నిర్మించగలం. అడ్డుగోడలు, సరిహద్దుల విభజనలను అధిగమించి, ఈ కర్తవ్యనిర్వహణకు పూనుకుందాం.

ఆసియా శతాబ్దిని సాధించటమన్నది చైనా ఏకపక్షంగా నిర్ణయించుకున్న లక్ష్యం కాదు. భారత, చైనాలతో పాటు దక్షిణాసియా దేశాలు సమిష్టిగా, ఏకోన్ముఖంగా కృషిచేసి సాకారం చేసుకోవలసిన సుందరస్వప్నం. ఆసియా ఖండంలో సర్వతోముఖ అభివృద్ధిని మాత్రమేకాదు మొత్తం ప్రపంచ పురోగమనాన్ని లక్ష్యించే సంకల్పమది. మన చైనా మిత్రులు అభివర్ణించినట్లు అది ఏకవ్యక్తిగానం కాదు. అది సామూహిక గానకచేరి. రండి... సామరస్యపు గానం ఆలపిద్దాం.... ఆరంభిద్దాం....

అందరికీ భారత చైనా మిత్రమండలి తరపున కృతజ్ఞతాభివందనం.



# 7.

# చైనాలో వైద్య సేవలు - తులనాత్మక పరిశీలన

*(2012లో మొదటిసారి భారత-చైనా సంయుక్త వైద్య బృందం సభ్యునిగాను, 2016లో మరోసారి నేను చైనా వెళ్ళి వచ్చాను. ఈ రెండు సమయాలలో ఒక డాక్టరుగా అక్కడ అనేక వైద్యశాలలు, వైద్య విద్యాలయాలు, ఆరోగ్యకేంద్రాలు సందర్శించాను. అక్కడి ఆరోగ్యశాఖ ఉన్నతాధికారులతో సంభాషించాను. భారత-చైనా సంయుక్త వైద్య బృందాల పర్యటనలలో భాగంగా అక్కడికి వెళ్ళి వస్తున్న డాక్టర్లతో సుదీర్ఘంగా చర్చిస్తున్నాను. ఇక్కడకు వచ్చిన చైనా వైద్యబృంద సభ్యులతో అరమరికలు లేకుండా కలిసి మాట్లాడుతున్నాను. భారత-చైనా మిత్రమండలి నిర్వాహక సభ్యునిగా నాకీ విస్తృతమైన అవకాశం వచ్చింది. కనుక వైద్య రంగంలో అక్కడ జరుగుతున్న అభివృద్ధిని క్రమానుగతంగా అర్థంచేసుకోగలుగుతున్నాను. దీనికితోడు ప్రపంచ ఆరోగ్య సంస్థలాంటి అనేక అంతర్జాతీయ సంస్థలు ప్రకటించే గణాంకాలు, పరిశీలనలు మనకు లభ్యమవుతున్నాయి. వీటి ఆధారంగా ప్రస్తుత పరిశీలన జరిగింది.)*

తిండి, బట్ట, ఇల్లు అనే ప్రాథమిక అవసరాల తర్వాత ప్రతి మనిషికీ అవసరమైనది వైద్యం, విద్య.. ఒక సమాజం ఎంత ఆరోగ్యకరంగా వుంటే అది అంత అభివృద్ధి చెందినట్టుగా భావించవచ్చు. 'ఈసురోమని మనుషులుంటే దేశమే గతి బాగుపడునోయి?' అన్నది అనుభవ సత్యం కదా! అందుకే ప్రతినాగరిక సమాజమూ వైద్యరంగానికి తగిన ప్రాధాన్యతనిచ్చి ప్రజల ఆరోగ్యాన్ని పరిరక్షించే ఏర్పాట్లు చేసుకుంటుంది. ఆరోగ్య రక్షణ అనేది ఒక వ్యక్తిగత సమస్య కాదు. అది మొత్తం సమాజ బాధ్యత. పరిపాలక వర్గాల ముందున్న మౌలిక కర్తవ్యాలలో ఒకటి. అందుకే ప్రపంచ ఆరోగ్య సంస్థను ఏర్పాటు చేసుకుని, ఎప్పటికప్పుడు మార్గదర్శకాలను, లక్ష్యాలను రూపొందించుకుని, మానవజాతి తన ముందు వున్న వనరులను వైద్య విజ్ఞానాన్ని ఆయా దేశాలకు అందించటం జరుగుతోంది. కొన్ని తప్పని సరి పథకాలను ప్రతి దేశమూ అనుసరించేటట్టూ, కొన్ని ప్రాథమిక ఆరోగ్య రక్షణా చర్యలు ప్రతి ప్రభుత్వమూ

బాధ్యతగా స్వీకరించేటట్టు అంతర్జాతీయ ఒత్తిడి పెరుగుతోంది. ఈ కార్యక్రమాలన్నింటికి కనీస ప్రమాణాలను నిర్ణయించటం జరుగుతుంది. ఆ ప్రామాణిక పద్ధతులు ప్రతి దేశమూ, ముఖ్యంగా అధిక జనాభావున్న పేద దేశాలు తప్పనిసరిగా అనుసరించాలి. లేకపోతే ఈ ఆధునిక ప్రపంచంలో, మారిన జీవన విధానాలలో, ప్రపంచమంతా ఒక కుగ్రామమే అన్నంతగా దగ్గర చేసిన రవాణా వ్యవస్థలలో, ప్రపంచంలో ఎక్కడో పుట్టిన ఒక జబ్బు అతి త్వరితంగా ప్రపంచమంతా వ్యాపిస్తుంది. ఎయిడ్స్, ఆంత్రాక్స్, స్వైన్‌ఫ్లూ లాంటి జబ్బులు ఎక్కడో పుట్టినా, భౌగోళిక సరిహద్దులను దాటి ప్రపంచ ప్రజలందరికీ సమస్యగా ఎలా మారుతున్నాయో ఇటీవలి కాలంలో మనందరం గమనించాం. ఒక వ్యక్తి అనుసరించే అలవాట్లు, తీసుకునే జాగ్రత్తలు మాత్రమే ఆరోగ్య రక్షణకు గ్యారంటీ ఇవ్వలేవు. అతను నివసిస్తున్న సమాజంలో వున్న ఆచార వ్యవహారాలు, అందుబాటులో వున్న ఆహారం, రక్షిత మంచి నీటి పథకాలు, పరిసరాల ప్రభావం, కాలుష్యాలు, రసాయనాలతో కూడిన కలుషిత వాతావరణం, రోగాల పట్ల వున్న జ్ఞానం, చికిత్సా విధానాల పట్ల అవగాహన, లభ్యత, వాటిపట్ల నమ్మకం, అందుబాటు ధరలలో వైద్యం లభించటం, వ్యక్తి కొనుగోలు శక్తి, ఇలా తన చేతిలో లేని అనేక అంశాలవల్ల ఒకరి ఆరోగ్యం ప్రభావితమవుతోంది. ఈ అన్ని అంశాలను సమాజానికి, వ్యక్తులకు అనుకూలంగా మార్చవలసింది, రక్షణచర్యలు చేపట్టవలసింది ప్రభుత్వమేననటం నిర్వివాదం. అందుకే ఏ ప్రభుత్వమూ ప్రజారోగ్య రక్షణ అనే బాధ్యతనుంచి తప్పుకోకూడదు. ఇలాంటి పూర్తి బాధ్యతకు తిలోదకాలిచ్చి, ఏవో అరకొర ఆరోగ్యశ్రీ, ఆయుష్మాన్ భారత్ వంటి ప్రజాకర్షక పథకాలను ప్రవేశపెట్టి, ప్రజలకెంతో మేలు చేస్తూన్నామని చెప్పుకోవటం, అంటే ప్రజలను మోసం చేయటం తప్ప మరొకటి కాదు. ఈ ఆరోగ్య సేవలు ప్రపంచంలో వివిధ దేశాలలో వివిధ రకాలుగా అమలు చేయబడుతున్నాయి. ఆరోగ్యం గురించి ప్రభుత్వాలు ఏమీ పట్టించుకోని స్థితి నుంచి, ఎంతటి సమస్యకైనా పూర్తి ఉచిత వైద్యం అందించే దశ వరకు అనేక పథకాలు ఆయా దేశాల్లో అమలవుతున్నాయి.

అమెరికాలాంటి దేశాల్లో ఆరోగ్యబీమా వ్యవస్థ ద్వారా వైద్యం అందించటం జరుగుతోంది. బీమా ప్రీమియంలు అధికంగా వుండటంతో, ప్రజలందరూ ఈ పథకాలను కొనుగోలు చేయలేక పోతున్నారు. కొన్ని జబ్బులకు బీమా అర్హత వర్తించక పోవటంతో లక్షలాది మంది పౌరులు, ముఖ్యంగా పేద వర్గాల వారు వైద్యసేవలకు దూరంగా వుండిపోతున్నారు. భరించలేనంత ఖరీదు కావటంతో పేదలు ఆధునిక వైద్యాన్నే తిరస్కరిస్తూ, ఏదో చిట్కా వైద్యాలతో కాలం వెళ్ళదీస్తున్నారు. బీమా పథకం వర్తించే వారికీ అనేక సమస్యలున్నాయి. బీమా సంస్థలు ప్రైవేటు యాజమాన్యంలో వుండి తమకు అనుకూలంగా విధివిధానాలు రూపొందిస్తున్నాయి. చికిత్సా విధానాలను బట్టే రుసుము చెల్లిస్తూ, చికిత్సా పద్ధతులను కూడా ఇన్సూరెన్సు కంపెనీలు తమ అదుపులో వుంచుకుంటున్నాయి ఏ రోగిని ఎంతకాలం

ఆసుపత్రిలో వుంచాలి, ఎలాంటి పద్ధతుల్లో చికిత్స చేయాలి అనేవి సైతం ఆయా ఇన్సూరెన్సు కంపెనీల ఇష్టారాజ్యంగా సాగుతోంది. రోగి ప్రయోజనాలకన్నా సామాజిక ఆరోగ్య భద్రతకన్నా, బీమా కంపెనీల లాభాలను పెంచే రీతిలో ఆరోగ్య సేవారంగం నిర్వహించబడుతోంది.

మరికొన్ని దేశాలలో బీమా సంస్థలు, నామ మాత్రంగానే వున్నాయి. పూర్తి ప్రైవేటు రంగం ఆజమాయిషీలో వైద్యరంగం నడుస్తోంది. కొన్ని పబ్లిక్ రంగ ఆసుపత్రులు, ట్రస్టు ఆసుపత్రులు, అతి తక్కువగా ప్రభుత్వ ఆసుపత్రులు వుంటాయి. ఇలాంటి చోట్ల సామాజిక బాధ్యత అనే అంశం మరుగునపడిపోయి, ఆరోగ్య రంగంలో ముఖ్యమైన నివారణా చర్యలు, ముందస్తు జాగ్రత్తలు మృగ్యమైపోతున్నాయి. రోగికి చికిత్స చేసి లాభాలు చేసుకోవటమే ఆరోగ్యసేవా రంగం పనిగా వున్నది తప్ప సమాజ ఆరోగ్యరక్షణ అనేది దానికి ఒక లక్ష్యంగా కూడా లేకుండాపోయింది. కొన్ని దేశాలలో సార్వత్రిక ఉచిత వైద్యవిధానం అమలు చేస్తున్నారు. ఉదాహరణకి ఇంగ్లండ్ దేశంలో ఉచిత వైద్య విధానం 60 సంవత్సరాలకు పైగా అమలవుతోంది. అయితే మొదట్లోవున్న ఆదర్శపు ఆవేశం, ఉచితానుచిత న్యాయం తగ్గిపోయి అనేక లొసుగులు బయటపడుతున్నాయి. క్రమంగా వైద్య ప్రమాణాలు క్షీణించటం, శక్తి యుక్తులు, సమర్ధత దిగజారిపోవటం జరుగుతోంది. ఉచితంగా దొరికేదాన్ని విలువ లేనిదిగా పరిగణించటం ఆరంభమయ్యింది.. ఒక రోగి డాక్టరను కలవాలంటే ఎంతోకాలం వేచి వుండాల్సి వస్తుంది, ఉచిత వైద్య విధానాలను ప్రభావశీల వర్గాలు, అవినీతికి కొమ్ముకాసే అధికార వర్గాలు, సామాజిక బాధ్యత లేకుండా వ్యక్తిగత ప్రయోజనాలకు పెద్ద పీట వేసే స్వార్ధపర వర్గాలు, తమ వ్యక్తిగత, కుటుంబ సభ్యుల అవసరాలు తీరటమే అత్యవసరంగా భావించేవారు, అపోహలు భయాలతో ఆందోళనపడే సామాన్యులు, ఇలా అందరూ ఈ ఉచిత విధానాలను తప్పుడు పద్ధతుల్లో వినియోగించుకుంటున్నారు. దాంతో ఈ వైద్య వ్యవస్థే కుప్పకూలి పోతోంది. ఆర్ధికంగా ఆయా ప్రభుత్వాలకు పెను సవాలుగా మారుతోంది. నిజానికి ఇది పైకి ఉచితవైద్యంగా కనపడుతున్నా, ఈ వ్యవస్థకు కేటాయించబడ్డ నిధులన్నీ ప్రజలు కట్టిన పన్నులనుంచే అనేది దాచేస్తే దాగని సత్యం.

చైనాలో అనేక రకాల పద్ధతుల్లో వైద్యసేవలు అందించబడుతున్నాయి. ప్రాంతాల అవసరాలు, ఆయా ప్రాంతాల అభివృద్ధి క్రమం, ఆ అభివృద్ధిలో అసమానతలు, ప్రజల స్థితిగతులు ఆధారం చేసుకుని అనేక మార్పులు చేర్పులు చేస్తూన్నారు. 130 కోట్లకు పైబడ్డ జనాభా ప్రాధమిక అవసరాలను తీర్చడంలో చైనా ఎదుర్కొంటున్న సమస్యలు, అనుసరిస్తున్న విధానాలు, పొందుతున్న అనుభవాలు, సాధిస్తున్న విజయాలు, అవశ్యం పరిశీలించాల్సినవిగా భావిస్తున్నాను.

1949లో జనచైనా ఆవిర్భావం తర్వాత ప్రభుత్వాలు వైద్య రంగానికి పెద్ద పీట వేశాయి. పట్టణ ప్రజలు వైద్యం కోసం చేసే ఖర్చులో 90% వరకు ప్రభుత్వమే భరించేది. గ్రామీణులకు పూర్తిగా ఉచితంగా వైద్యం అందించేవారు. వందలాది సంవత్సరాలుగా వున్న గ్రామీణ వైద్యుల

వ్యవస్థను, సంచార వైద్యులను (బేర్‌ఫూట్ డాక్టర్లు) ఇముడ్చుకొని, గ్రామీణ ప్రాంతాలలో వుండే సంప్రదాయ వైద్య విధానాలను అభివృద్ధిపరుస్తూ, ఆధునిక వైద్య విధానాలను కూడా అందుబాటులోకి తెచ్చారు. వైద్య కళాశాలలు నెలకొల్పి ఆధునిక వైద్యుల్ని తయారుచేశారు. ఉన్న వనరులను ఉపయోగించుకోవటంలో భాగంగా సంప్రదాయ, సంచార డాక్టర్ల సేవలు కొనసాగిస్తు, కళాశాల వైద్యుల్ని తయారు చేసుకోవటంతో, ఈ రంగంలో "విస్తరణ-ఉన్నతీకరణ" అనే లక్ష్యాలను సాధించారు. సాధారణ పరిస్థితులలో ఈ విధానం సవ్యంగానే వున్నట్లు కనిపించినా, అభివృద్ధి చెందుతున్న వైద్య విజ్ఞానం, ఆధునిక పరికరాలు, రోగ నిర్ధారణ చేసే ప్రయోగశాలలు, నూతన చికిత్స విధానాలను ఇముడ్చుకోవటంలో ఈ వ్యవస్థ మందకొడిగా వుండేది. కనుక ఈ పరిస్థితిని మార్చటానికి సమకట్టారు. 1980లో ఆర్థిక సంస్కరణల పర్వం మొదలయ్యాక ఈ పద్ధతుల్ని మార్చివేశారు. ఆధునిక వైద్యరంగం బౌద్ధికంగానూ, భౌతికంగానూ అభివృద్ధి చెందవలసిన అవసరం గుర్తించి మార్కెట్ ఎకానమీ పద్ధతులు ప్రవేశ పెట్టారు. రాజ్యం నడిపే ఆసుపత్రులకు ప్రభుత్వ నిధులు తగ్గించి వేసి, ఆయా వైద్య సంస్థలే స్వయంపోషకంగా తయారవ్వాలని నిర్ణయించారు. ఎప్పుడైతే ఆదాయం పొందవలసిన అవసరం ఏర్పడిందో, ఆయా సంస్థల నిర్వాహకులు, ప్రాంతీయ ప్రభుత్వాలు, కౌన్సిళ్ళు, మండళ్ళు లాభాలు సమకూర్చే పద్ధతులు అవలంభించ నారంభించాయి. దాంతో వైద్యం ఒక ఖరీదయిన వ్యవహారంగా మారింది. మౌలిక వసతులు, నిర్మాణాలు, ఆధునిక పరికరాలు సమకూరాయి కానీ సామాన్య ప్రజలకు అందుబాటులోకి లేకుండాపోయింది. ఏ ఆధునిక వైద్యం ప్రజలకు అందించాలనే ఉద్దేశంతో ఈ మార్పులు తెచ్చారో ఆ మౌలిక లక్ష్యానికి దూరమయ్యారు. తప్పనిసరిగా వైద్యం చేయించుకోవలసిన సందర్భాలలో ప్రజలు మరింత పేదరికంలోకి నెట్టివేయబడ్డారు. 1980లో వైద్యం ఖర్చులో వ్యక్తిగతంగా 20% భరించితే మిగితాది రాయితీగా అందేది. అదే 2007 వచ్చేసరికి వైద్యం ఖర్చులో రోగి 45% భరించవలసి వచ్చింది. క్రమంగా దిగజారుతున్న ఈ పరిస్థితిని గమనించి దిద్దుబాటు చర్యలు ఆరంభించారు. 1997లోనే రాష్ట్రమండలి ఒక విధాన ప్రకటనతో ముందుకు వచ్చింది. వైద్యరంగాన్ని ఆదాయపు వనరుగా చూడకూడదన్నారు. వైద్యం వ్యాపారపు సరకు కాదని వక్కాణించారు. ఒక దశాబ్దం పాటు అనేక విడతలుగా, పలురకాల సంస్కరణలు ప్రవేశపెట్టి వైద్యరంగాన్ని ప్రజానుకూలంగా మార్చే ప్రయత్నం చేశారు. వాటిలో ముఖ్యంగా చెప్పుకోవలసింది గ్రామీణుల కోసం ప్రవేశపెట్టిన 'రైతు సహకార వైద్య పథకం'. గ్రామీణ సహకార వైద్యం. పట్టణ ప్రాంతాల వారి కోసం కనీస ఆరోగ్య భీమా పథకం ప్రవేశపెట్టారు. పట్టణ ఉద్యోగుల పథకం, పట్టణవాసుల ఆరోగ్య పథకం అనివున్నా ఇవి పట్టణ ప్రజలందరికీ కాక ఉద్యోగస్తులకు మాత్రమే ఎక్కువగా ఉపయోగపడ్డాయి. గత దశాబ్ధపు అనుభవాలను క్షుణ్ణంగా సమీక్షించారు. మార్కెట్ శక్తుల ప్రభావం అధికంగా ఉండటంతోపాటు, ప్రభుత్వపర్యవేక్షణ పటిష్టంగా లేకపోవటంవల్ల ఆశించిన సక్రమఫలితాలు సాధించలేకపోయినట్లు గుర్తించారు. గ్రామాల్లో వైద్యుల కొరత ఉంది. పట్టాపుచ్చుకున్న

వైద్యులు పట్టణాలలోనే వుండిపోయారు. యువ డాక్టర్లు గ్రామాలకు వెళ్ళకుండా ఏదో ఒక రూపంలో పట్టణాలకే పరిమితం కావటం జరిగింది. పట్నంలోని వైద్యశాలల్లో తక్కువ జీతానికయినా పని చేయటానికి సిద్ధపడ్డారు. ప్రాంతీయ అసమానతలు, గ్రామాలు, పట్టణ ప్రాంతాల మధ్య వున్న అభివృద్ధి అంతరాలు ఈ ధోరణిని మరింత పెంచాయి. దాంతో ప్రతి చిన్న రుగ్మతకీ గ్రామీణులు పట్టణాలకే రావలసిన అగత్యం ఏర్పడింది. అందువల్ల తీవ్రమయిన అసంతృప్తి కలిగింది. వైద్యం ఆధునికం అయ్యింది కానీ అందుబాటులో లేకుండా పోయింది. 2005లో కేంద్ర ప్రభుత్వం ఈ పరిస్థితినంతా తిరిగి సమీక్షించింది. మార్కెట్ శక్తులు అనుసరించే పద్ధతులు కొన్ని ప్రజల సంక్షేమాన్ని నీరుకార్చాయి. అయితే కొన్ని ప్రతికూల పరిస్థితులు తలయెత్తినా కూడ వైద్యరంగంలో మౌలిక వసతులు పెరగటంవల్ల సాధించిన విజయాలు కూడా గణనీయంగా వున్నాయి. వాటి ఫలితంగా చైనీయుల ఆయుప్రమాణం బాగా పెరిగింది. 2005కల్లానే అక్కడ 19,38,000 డాక్టర్లు (అంటే ప్రతి వెయ్యిమందికి 1.5 డాక్టర్లు) 30 లక్షల హాస్పటల్ పడకలు (1000 మందికి 2.4) అందుబాటులోకి వచ్చాయి. తమ జిడిపిలో 5.5 శాతం వైద్యంమీద ఖర్చు చేసేవారు. 2005 ప్రణాళిక ప్రకారం 240 కోట్ల డాలర్లు ఖర్చుచేసి గ్రామీణ క్లినిక్‌లు, టౌన్‌షిప్ క్లినిక్‌లు, మండల (కౌంటీ) హాస్పటళ్ల సంఖ్య పెంచారు. డాక్టర్ల శిక్షణా కాలం బ్రిటిష్ పద్ధతిలో (దాదాపు మనలాగే) వుంటుంది. 1980లో 5,16,000మంది పాశ్చాత్య పద్ధతిలోనూ, 2,90,000 మంది సాంప్రదాయ చైనా వైద్యంలోనూ శిక్షణ పొందిన డాక్టర్లు వుండేవారు. మరి 2005కల్లా ఎంత అభివృద్ధిని సాధించారో గమనించవచ్చు. ఈ రెండు పద్ధతులలోని మేలైన అంశాలను, చికిత్సా పద్ధతులను మిళితంచేసి ప్రజలకు అందుబాటులోకి తెచ్చారు. ప్రత్యేకంగా సాంప్రదాయవైద్యం అందించే సంస్థలుకూడా ఏర్పాటు చేసారు. రోగులు తమ అవసరాలు, అభీష్టాలమేరకు ఈ పద్ధతులను ఉపయోగించుకుంటారు.

గ్రామీణస్థాయి ప్రాథమిక కేంద్రాలలో వెయ్యిమందికి ఇద్దరు చొప్పున శిక్షణ పొందిన చికిత్సకులు వుంటారు. వీరికి శిక్షణా తరగతులు వుంటాయి, ప్రతి సంవత్సరం అర్హత రుజువుచేసుకుని అనుమతి పత్రం తీసుకోవాలి. రెండవస్థాయిలో 10-30 వేల జనాభాకు సేవలందించే ఆరోగ్యకేంద్రాలు వుంటాయి. వీటిలో 10నుంచి 30 వరకు పడకలు వుంటాయి. ఇక్కడ 3 సంవత్సరాల కోర్సు పూర్తిచేసిన డాక్టర్లు చికిత్సనందిస్తారు. మూడవ స్థాయిలో 2నుంచి 6లక్షల జనాభాకు ఒకటి చొప్పున ఆసుపత్రులు వుంటాయి. ఇక్కడ 5సంవత్సరాల కోర్సు పూర్తిచేసిన డాక్టర్లు వుంటారు. 1985లో గ్రామీణ సంచార వైద్యుల (బేర్‌ఫూట్ డాక్టర్లు) వ్యవస్థను రద్దుచేశారు. వారికి తగు శిక్షణ ఇచ్చి గ్రామీణ వైద్యులుగా మార్చారు. 2006 నుండి గ్రామీణ సహకార వైద్య పరిరక్షణా విధానం అమలు చేస్తున్నారు. దీనివల్ల 80 కోట్లమంది గ్రామీణులకు లబ్ధి చేకూరింది.

గతంలో వున్న ఆహారలేమి, పోషకాహార లోపం వల్ల కలిగే వ్యాధులు, అంటువ్యాధులు బాగా తగ్గిపోయాయి. అయితే జీవన విధానంలో వచ్చిన మార్పుల ఫలితంగా పెరుగుతున్న

కొత్త వ్యాధులు, సమస్యలు, ప్రపంచవ్యాప్తంగా వ్యాపిస్తున్న కొత్త జబ్బులు ఇవన్నీ కూడా చైనా వైద్యరంగం మీద పెనుభారంగా పరిణమించాయి. సామాన్యుల కోసం ఉద్దేశించిన సామాజిక భద్రతావ్యవస్థలు పెరిగిపోతున్న ప్రజల డిమాండ్‌కు ఏ విధంగానూ సరిపోలేదు. సమాజ సంరక్షణా పథకాలు, సంక్షేమ పథకాలవల్ల ఒకవంక ప్రభుత్వం మీద తీవ్రంగా భారం పడుతున్నా, మరోవంక ప్రజల ఆకాంక్షలను ఇవి తీర్చలేకపోయాయి. 1980 నుండీ వైద్యరంగ సేవాప్రమాణాలు తగ్గుతూ పోయాయనీ 1997నుంచీ తీసుకున్న దిద్దుబాటు చర్యలవల్ల పరిస్థితి కొంత మెరుగుపడినా పూర్తి గుణాత్మక మార్పులు రాలేదని నిర్ణయానికి వచ్చారు. ఈ గుర్తింపుతో వైద్యరంగాన్ని సమూలంగా ప్రక్షాళన చేస్తూ, ఆ రంగాన్ని మౌలికంగా పునర్నిర్వచిస్తు 2009 ఏప్రియల్ నెలలో గొప్ప విధాన ప్రకటన చేసింది చైనా ప్రభుత్వం.

ఈ నూతన పథకం రూపురేఖలు దిద్దటానికి దాదాపు 3 సంవత్సరాలు అధ్యయనం చేశారు. ఈ సంస్కరణలను అనేక దఫాలుగా ప్రచారం చేసి, చర్చలు సాగించి, ప్రజల నుంచి వచ్చిన సూచనల్ని క్రోడీకరించి తిరిగి చర్చించి కొంతకాలంపాటు ఎన్నికచేసిన ప్రాంతాల్లో ఈ పథకాన్ని ఆచరించి, ఆ అనుభవంనుంచి మరింత మెరుగుపరిచి నూతన విధానం ప్రవేశ పెట్టారు. దాదాపు 27,000 సూచనలు, వ్యాఖ్యలు పరిశీలించి, ప్రజల భాగస్వామ్యంతో ప్రజల కోసం తయారుచేసిన పథకం ఇది. నియంతృత్వపాలన అనీ, వ్యక్తి స్వేచ్ఛ వుండదనీ చైనాను నిత్యం ఆడిపోసుకునేవారు తమ ప్రజల క్షేమం విషయంలో చైనా ఎంత ప్రజాస్వామ్యయుతంగా వ్యవహరిస్తోందో చూసి తెలుసుకోగలరా? షాంఘై రాష్ట్రంలో షెన్యూ మండలం ఒక అభివృద్ధి చెందిన ప్రాంతం. అక్కడ ఉచిత వైద్య విధానం ప్రవేశపెట్టి పరీక్షించారు. దేశంలో సగటున ఆరోగ్యసబ్సిడీ కింద 17 డాలర్లు ఖర్చు చేస్తుంటే ఇక్కడ 57 డాలర్లు ఖర్చు చేసారు. ప్రతి సంవత్సరం 216 లక్షల డాలర్లు ఈ ఉచితవైద్యం కోసం కేటాయించి కొంతకాలం అమలుచేశారు. ఈ విధానం మీద సమీక్షాసమావేశాలు నిర్వహిస్తే ఎక్కువమంది ఉచితవైద్యాన్ని కోరుకోవటంలేదనీ, అందుబాటులో ఉండే వైద్యాన్ని, మెరుగైన వైద్యాన్ని కోరుకుంటున్నారని తెలిసింది. పర్యవేక్షక పద్ధతిని అనుసరించకపోతే ఈ విధానం అవినీతి పద్ధతులకు, అనారోగ్యకర నైతిక పతనానికి దారి తీస్తుందని కొందరు భయపడ్డారు. ఎంత పటిష్ఠమయిన ఆర్థికపట్టు వున్నా కాలక్రమంలో ఈ 'సర్వ ఉచిత విధానం' ఆర్థిక వ్యవస్థను దెబ్బతీస్తుందని భావించారు మరికొందరు. రోగులు, వైద్యశాలలు కుమ్మక్కై ప్రభుత్వాన్ని వంచించి నిధులు రాబట్టుకోగల అవకాశం వుందని కొందరు తెలిపారు. పరిమితమయిన వైద్య సదుపాయాలను, వనరులను ఉపయోగించుకునే సందర్భంలో కొందరు ఆబగా, అనవసరంగా, ఉచితమే కదా అని బాధ్యతారహితంగా ప్రవర్తించే అవకాశాలు వున్నాయని కొందరు ఎత్తిచూపారు. ఈ పథకం అనవసరపు రద్దీ వల్ల కుప్పకూలిపోవచ్చు. అయితే ఈ విధానం తాత్కాలికం కాదనీ, ఎప్పటికీ అందుబాటులో ఉండే సదుపాయమేననీ నమ్మకం కలిగితే ప్రజల విపరీత ప్రవర్తన తగ్గిపోయి తమ అవసరాలరీత్యానే ఈ సౌకర్యాన్ని ఉపయోగించుకుంటారనీ, చైనీయులనుంచి ఈ సామాజిక దృష్టి, బాధ్యతాయుత ప్రవర్తన ఆశించటం అత్యాశకాదని

ఎక్కువమంది భావించారు. ఉచిత వైద్య విధానాన్ని ప్రవేశ పెట్టకముందు ప్రజలు ఎదుర్కొన్న ఇబ్బందుల వల్ల ఉచిత పథకాలకు మొదట్లో రద్దీ బాగాపెరగటం సహజమేననీ. చిన్నచిన్న జబ్బులకు కూడా పెద్ద ఆసుపత్రులకు వెళ్ళాలనే యావ పెరుగుతుందనీ, అయితే ఇది క్రమంగా సమసిపోయి సాధారణ స్థితి వస్తుందని కొందరన్నారు. 'సరఫరా' (సప్లై) కంటే 'అవసరం' (డిమాండ్) బాగా ఎక్కువ వుండటంవల్ల ఈ సదుపాయంలో అనైతిక పద్ధతులు పుట్టుకువస్తాయి. దాంతో ఈ పద్ధతిలోని సమర్థత దెబ్బతింటుంది. ఇంగ్లండ్, స్కాండినేవియన్ దేశాల్లో ఇలాంటి సమస్యలనే ఎదుర్కోవలసి వచ్చింది అని గమనించారు. కానీ 'అన్ని వైఫల్యాలకు కారణం ప్రజలలో నైతిక విలువలు లేకపోవటమే అని తప్పుపట్టడం దారుణం' అనుకుంది చైనా ప్రభుత్వం. ప్రజల అవసరాలకు అనుగుణంగా సదుపాయాలు పెంచటం, వాళ్ళ ఆకాంక్షలను అందుకునే విధంగా సమర్థవంతంగా పని చేయడం, ప్రజలలో నమ్మకం నెలకొల్పటం ద్వారా ఈ వైఫల్యాలను అధిగమించాలని భావించారు. ఈ చర్చలూ, కొన్ని ప్రాంతాలలో ప్రయోగాత్మకంగా నిర్వహించిన సంస్థల అనుభవాలు (PILOT PROJECTS), దశాబ్దాలుగా నేర్చుకున్న పాఠాలు, గుణపాఠాలు, ప్రజలకు మేలుచేయాలన్న తాత్విక, రాజకీయ భూమికలు గల నేపథ్యంలో చైనా ప్రభుత్వం తన కొత్త వైద్య విధానాన్ని 2009నుంచి అమలుపరుస్తోంది. రాబోయే దశాబ్దికి సరిపడేలా ప్రణాళికలు రూపొందించింది.

'ఎక్కడ అనారోగ్యం వుంటుందో అక్కడే చికిత్స లభించాలి' అనే చైనీయుల చిరకాల కోరికను తీర్చేలా ఈ పథకాలు  రూపొందించారు. 'ఈ కొత్త పథకం ఆరోగ్య సంరక్షణ సేవల్ని ప్రజలకు చేరువలోకి తెస్తుంది, అందుబాటు ధరలకు అందిస్తుంది' అని చైనా ప్రధాని ప్రకటించారు. ఆరోగ్య సేవలు, చికిత్సా విధానాలు, ఆరోగ్య బీమా పథకాలు, మందుల సరఫరా అనే నాలుగు అంశాలను దేశ ప్రజలందరికీ (పట్టణ, గ్రామీణ భేదం లేకుండా) అందుబాటులోకి తేవటం ఈ పథకం ప్రధానోద్దేశం. దీనిలో మొదటిదశగా ఒక మూడు సంవత్సరాల కాలపరిమితిలో పూర్తి చేయవలసిన తక్షణ కార్యాచరణను ప్రకటించారు. అందరికీ చేరువకావటం, అందరికీ సమాన అవకాశం కల్గించటం అనేవి ముఖ్యలక్ష్యంగా నిర్ణయించారు. ప్రతి గ్రామంలో కనీసం ఒక చికిత్సా కేంద్రం నెలకొల్పాలని సమాయత్తమయ్యారు. 8500 కోట్ల యువాన్లు ఈ రంగంలో ఖర్చుకోసం కేటాయించారు. (1) మౌలిక ఆరోగ్య భీమా వ్యవస్థను సత్వరం అభివృద్ధి చేయటానికి, (2) అట్టడుగు స్థాయి వరకు విస్తరించే ఆరోగ్య సేవా వ్యవస్థను అభివృద్ధి పరచటానికి. (3) మౌలిక ప్రజారోగ్య సేవా రంగంలో క్రమానుగతంగా ప్రజలందరికీ సమాన ప్రతిపత్తిని సాధించటానికి, ఈ నిధుల్ని వినియోగిస్తారు. ఈ మూడేళ్ళలో 200 మండల ఆసుపత్రులు, 5000 చిన్నపట్టణాల ఆరోగ్య కేంద్రాలను నిర్మించాలనీ, 13.7 లక్షల గ్రామీణ వైద్యులను, 16,000 సామాజిక వైద్యులను తయారు చేయాలని సంకల్పించారు. వీటికి తోడుగా 2900 పట్టణ ఆసుపత్రులను నిర్మించాలనీ, అప్పటికే పని చేస్తున్న 5 వేల పట్టణ ఆరోగ్య కేంద్రాల స్థాయిని పెంచాలనీ, ఇవన్నీ ప్రత్యక్షంగా కేంద్ర ప్రభుత్వం అందించే నిధులతో అభివృద్ధి పరచాలని అనుకున్నారు.

3700 సామాజిక ఆరోగ్య కేంద్రాలను, 1100 సామాజిక చికిత్సా కేంద్రాలను పట్టణ ప్రాంతాలలో నెలకొల్పాలని బృహత్తర ప్రణాళికను సిద్ధం చేశారు. ఈ పథకాలన్నీ ఆచరణలోకి వస్తే దేశ జనాభాలో 90 శాతానికిపైగా మౌలిక ఆరోగ్యబీమా కిందకి వస్తారు. ఇవి పూర్తిచేయటానికి 2011 సంవత్సరాన్నే అవధిగా ఎంచుకుని నిర్మాణ కార్యక్రమాలు మొదలు పెట్టారంటే చైనా పాలకపక్షం ఈ విధానానికి ఎంతగా కట్టుబడివుందో, ఎంతటి కృతనిశ్చయంతో ముందుకు సాగుతుందో అర్ధమవుతుంది. ప్రభుత్వ వాగ్దానాలకు, ఆచరణకు మధ్య హస్తిమశకాంతర భేదంచూసే తెలుగువారికి ఇది నమ్మశక్యం కాకపోవచ్చు కానీ అనుకున్న కాలవ్యవధిలో ఇవన్నీ సాధించారు.

ఆరోగ్య సేవా రంగంలో 2009లో తలకు 15 యువాన్లుగా వున్న పెట్టుబడిని 2011 కల్లా 20 యునాన్లకు పెంచారు. అంటే ప్రతి సంవత్సరం దాదాపు 2000-2600 కోట్ల యువాన్లు ఈ రంగంలో ఖర్చు చేశారు. దీంతో 80 కోట్ల గ్రామీణ చైనీయుల ఆరోగ్య అవసరాలను తీర్చటం జరుగుతోంది. అత్యంత చవకగా వీరికి వైద్యం చేరువయ్యింది. ఆరోగ్య సేవారంగం ప్రజల దగ్గరకు కదిలివెళ్ళటం ఆరోగ్యరక్షణకు ఉపయోగపడటమే కాదు, మరోవంక గ్రామాల్లోనూ, పట్టణాలలోను అనేక లక్షలమందికి ఈ పథకాలు ఉపాధిని కల్పించాయి. వలస కార్మికులకు, విద్యార్థులకు, పట్టభద్రులయిన నిరుద్యోగులకు ఈ వైద్యపథకాలద్వారా ఎంతో సదుపాయం కలిగింది. ఇంతవరకూ ప్రణాళికాకర్తల దృష్టికిరాని ఎన్నోరంగాల ప్రజలకు ప్రత్యక్షంగా మేలు చేకూరింది. ఈ సమయంలో మిగతా ప్రపంచమంతా ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి, పరిశ్రమలన్నీ మాంద్యంతో విలవిల లాడుతుండేవి. అమెరికాలాంటి ధనిక ప్రభుత్వాలే ప్రజాసంక్షేమ చర్యలలో కోత పెట్టిన సమయంలో చైనా మాత్రం దేశ ప్రజలందరికీ ఉపయోగపడే సంక్షేమ కార్యక్రమాన్ని ఆరంభించి, ఇన్ని వేలకోట్ల డాలర్ల డబ్బును ప్రజల కోసం ఖర్చుచేస్తూ తన ఆర్థికరంగానికి ఉత్తేజం కలిగించింది. ప్రజల ఆర్థిక పరిస్థితిని మెరుగుపరిచే అడుగులు వేసింది. ఉపాధికల్పన ద్వారా ప్రత్యక్షంగాను, వైద్యం కోసం ప్రజలు చేసే ఖర్చును తగ్గించటం ద్వారా వారి వనరులను మరో అవసరంకోసం ఉపయోగించేలా చేయటం వల్లనూ, కొనుగోలు శక్తిని కాపాడటం, ఆ శక్తిని పెంచటం జరిగింది. ప్రాథమిక అవసరాలను తీర్చుకోవటం కోసం నిధులు లభ్యంకావటంతో, ప్రాంతీయ పరిశ్రమలకు పరోక్షంగా తోడ్పాటు దొరికింది. మిగతాదేశాలలో పెట్టుబడిదారులకు ప్రత్యక్షంగా నిధులు సమకూర్చటం, వారికి ఉపయోగపడేలా రాయితీలు ప్రకటించటం, బ్యాంకుల ద్వారా అపార ధనరాసులు అందించటం జరుగుతోంది. ఇలా పోగుపడ్డ సంపదను పెట్టుబడిదారులు ప్రజల క్షేమం కోసం ఎంతవరకు ఖర్చు చేస్తారో అందరికీ తెలిసినదే కదా! అంటే 'సంక్షోభం ప్రజలకు - సంక్షేమం ధనాఢ్యవర్గాలకు' అని ఆయా ప్రభుత్వాలు చెప్పకనే చెబుతున్నాయి. అయితే చైనా మాత్రం ఆర్థికసంక్షోభాన్ని ఎదుర్కోవటంలోకూడా తనదైన, ప్రజోపయోగకరమయిన మార్గాన్ని ఎంచుకుని, సంక్షోభంలో ప్రజల పక్షాన నిలబడి తన తాత్విక రాజకీయ నిబద్ధతను ప్రదర్శిస్తున్నది. చైనాలో ఆరోగ్యరంగ

సంస్కరణలు సర్వజనులకు సమాన అవకాశాలను కల్పించే రీతిలో సాగుతున్నాయని ప్రపంచ ఆరోగ్యసంస్థ బాధ్యులు కొనియాడుతున్నారు. ఈ పథకరచనలో చైనా చూపిన ప్రజాస్వామ్య స్ఫూర్తిని వారు ప్రశంసిస్తూ 'ఆయా ప్రభుత్వాలు తమ ప్రాంతాల సమస్యలకు ఎలా స్పందించాలో మార్గదర్శకంగా వుంద'ని తెలిపారు.

## ప్రస్తుత పరిస్థితి

చైనాలో ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో వైద్యశాలలు, వైద్యసంస్థలు పనిచేస్తున్నాయి. అనారోగ్యపీడితులకు ఇన్స్యూరెన్స్ సదుపాయం కల్పించారు. జనాభాలో 95 శాతానికి ఈ వ్యవస్థల ద్వారా ప్రాథమిక ఆరోగ్య సంరక్షణ అందుబాటులోకి వచ్చింది. ప్రస్తుతం "ఆరోగ్యవంతమైన చైనా 2020" అనే కొత్తలక్ష్యాన్ని చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ నిర్దేశించారు. వైద్య ఖర్చులను వీలైనంత తక్కువస్థాయికి తేవాలని ప్రయత్నిస్తున్నారు. 70–80 శాతం ఖర్చులు ఇన్స్యూరెన్స్ కంపెనీల ద్వారా చెల్లింపులు జరిగేలా చూస్తున్నారు. యాస్ట్రా, గ్లాక్సో, మెర్క్ వంటి అనేక అంతర్జాతీయ మందులకంపెనీలు చైనాలో ఉత్పత్తులు ప్రారంభించాయి. పరిశోధన, అభివృద్ధివల్ల చైనా వైద్యరంగం నేడు అత్యున్నతస్థాయి సేవలు అందించ గలుగుతోంది.

అన్ని పెద్ద నగరాలలో వివిధరకాల నిపుణులతో కూడిన మల్టీ స్పెషాలిటీ హాస్పిటల్స్ అందుబాటులోకి వచ్చాయి. విదేశీ సంస్థలు, విదేశీ నిపుణులు, దేశీయసంస్థలు కలిసి నడిపే భాగస్వామ్య సంస్థలు (జాయింట్ వెంచర్స్) వున్నాయి. వీటిలో పూర్తిగా ఆధునిక పాశ్చాత్య వైద్య విధానము ప్రపంచస్థాయి ప్రమాణాలతో అందుబాటులో వుంది. ఇవి ఖరీదైన హాస్పిటల్స్. ఐతే పాశ్చాత్య దేశాలలోకన్నా చాలా చవకగా వుంటాయి. కొన్ని ప్రత్యేక సంస్థలలో ఇంగ్లీషు మాట్లాడగలిగిన డాక్టర్లు, నర్సులు తదితర సిబ్బందితో పాటు ఖరీదైన ఏర్పాట్లతో ప్రత్యేక వార్డులు (విఐపి వార్డులు) వుంటాయి. ప్రధానంగా ఇవి విదేశీ పేషంట్ల అవసరాలు తీరుస్తాయి. అందువల్ల అనేకమంది పాశ్చాత్యులు వైద్యంకోసం చైనా వెళుతున్నారు. ఇదేమాదిరి ఆధునిక వున్నతస్థాయి గల ప్రభుత్వ హాస్పిటళ్లు అనేకం ప్రధాననగరాల్లో వున్నాయి. మామూలు పట్టణాలు, నగరాలలో కూడా వున్నతస్థాయి సదుపాయాలతో ప్రభుత్వరంగంలోనే అనేక హాస్పిటళ్లు వున్నాయి. వీటిలో ఆధునిక వైద్యంతోపాటు, సాంప్రదాయ చైనా వైద్యము, దంతవైద్యమూ, కాస్మెటిక్ సర్జరీ విభాగాలు వంటి ప్రత్యేక సేవలు కూడా లభిస్తాయి.

2009నుంచి వరుసగా తీసుకుంటున్న అనేక చర్యలు, సంస్కరణలవల్ల గ్రామీణ వైద్యం చాలా మెరుగుపడింది. దూరప్రయాణాలు చేసి పట్టణాలకు చేరుకోలేని వారికోసం 'కుటుంబ వైద్యుల' వ్యవస్థ ఏర్పాటు చేయబడింది. ఈ వైద్యులే రోగుల ఇళ్ళవద్దకు వెళ్ళి చికిత్సనందిస్తారు. ఈ ఖర్చుల బాధ్యత ప్రభుత్వమే తీసుకుంటుంది. ప్రభుత్వరంగ ఆస్పత్రులు ఎంత సమర్ధవంతంగా పనిచేస్తున్నాయంటే, ఎక్కువమంది ప్రజలు ఇన్సూరెన్సు సదుపాయం ఉన్నప్పటికీ, ప్రైవేటు సంస్థలకు కాక ప్రభుత్వ ఆస్పత్రులకు వెళ్ళటానికే ఇష్టపడతారని 2012లో

చేసిన ఒక సర్వేలో తేలింది. మనదేశంలో దీనికి పూర్తి విరుద్ధమైన దృశ్యం కనపడుతుంది. 2003-11 సంవత్సరాల మధ్య వైద్య సేవలు, ఇన్సూరెన్సు సదుపాయాలు శీఘ్రంగా అభివృద్ధి చెందాయి. ఔట్ పేషెంట్లకు, ఇన్ పేషెంట్లకు కూడా ఇన్సూరెన్సు సౌకర్యాలు అందుబాటులోకి వచ్చాయి. వేగంగా పెరిగిపోతున్న సాంకేతిక, శాస్త్రీయ జ్ఞానాన్ని అందుకుంటూ, ఎప్పటికప్పుడు ఆధునికం చేసుకుంటూ, నైపుణ్యాన్ని పెంచుకుంటూ, సంస్థలూ డాక్టర్లూ మెరుగైన సేవలందిస్తున్నారు. అంతర్జాతీయ స్థాయిలోవున్న శాస్త్రపరిశోధనలు, చికిత్సాపద్ధతులలో నవీనీకరణలవల్ల చైనావారి పరిశోధనాపత్రాలు అత్యంత అధికంగా ప్రచురించ బడుతున్నాయి. అనేక దేశాలలో ఆదరణ పొందుతున్నాయి. పరిశోధనాపత్రాల ప్రచురణలో 1995లో 14వ స్థానంలో వున్న చైనా ఈరోజు అంతర్జాతీయంగా 2వ స్థానానికి చేరుకుంది.

గతంలో వుండిన అంటువ్యాధులు, పోషకాహారలేమితో సంక్రమించే జబ్బులు చాలావరకు తగ్గిపోయాయి. సమాజంలో శరవేగంగా వస్తున్న ఆర్థిక, సాంకేతిక, పారిశ్రామిక అభివృద్ధివల్ల తలెత్తిన గాలికాలుష్యం, రవాణా వాహనాలు వెదజల్లుతున్న కాలుష్యం, రసాయన కాలుష్యం, జీవనవేగం వల్ల ఏర్పడుతున్న విపత్తులు, ఆధునిక జీవనశైలివల్ల సంభవిస్తున్న కొత్త ఆరోగ్య సమస్యలను ఎదుర్కోవటంలో వారు అభివృద్ధి చెందిన వైద్య విధానాలు ఆవిష్కరిస్తున్నారు, అవలంబిస్తున్నారు.

ఒక దేశ వైద్య ఆరోగ్య ప్రమాణాలను అంచనా వేయాలంటే అక్కడి ప్రజల సగటు జీవితకాలం (ఆయుప్రమాణం), శిశుమరణాలు, ప్రసవకాలంలో స్త్రీల మరణాలను సూచికగా పరిగణిస్తారు. నవజాత శిశువుల మరణాలు ఎక్కువగా వుంటే, అది గర్భిణీ స్త్రీల ఆరోగ్యం, పోషణ, గర్భస్థ శిశువు ఎదుగుదలా, వారి రక్షణ, కాన్పుసమయంలో తలయెత్తే సమస్యలను సవ్యంగా పరిష్కరించటంలో లోపాలున్నాయని సూచిస్తుంది. 1990లో శిశుమరణాల ప్రపంచ సగటు రేటు 65 వుండేది. 2017నాటికి అది 29కి తగ్గింది. చైనాలో ఈ మరణాల రేటు 12కు తగ్గితే మనదేశంలో మాత్రం ప్రపంచ సగటుకన్నా ఎక్కువగా 39 వద్ద వుంది. అలాగే లక్ష కాన్పులలో ఎందరు మహిళలు ప్రాణాలు కోల్పోతున్నదీ క్రింది పట్టికలో చూడవచ్చు.

**ప్రసవం సమయంలో స్త్రీల మరణాల దామాషా (1లక్ష కాన్పులలో)**

| | ఇండియా | చైనా |
|---|---|---|
| 1990లో | 556 | 97 |
| 1995లో | 471 | 72 |
| 2000లో | 374 | 58 |
| 2018లో | 174 | 27 |

*(ఇవి యూనిసెఫ్ సంస్థ '1990-2018 గణాంకాలు' అనే డాక్యుమెంటులో ప్రకటించినవి)*

అనారోగ్యంవల్ల మరణిస్తున్నవారిలో 45% మరణాలు పౌష్టికాహారలోపం వల్లనే అని ప్రపంచ ఆరోగ్య సంస్థ తెలుపుతోంది. 2018లో ఒక సర్వే ప్రకారం 88% దేశాలలో పౌష్టికాహారలభ్యత ఒక పెద్ద సమస్యగా వుంది. అంటే అది ప్రజల పేదరికానికి సంబంధించిన సమస్య. గ్లోబల్ న్యూట్రిషన్ రిపోర్టు 2018 లోని ఆకలి సూచికలో మొదటి మూడు దేశాలలో మన దేశం ఒకటిగా వుంది. సరైన ఆహారం లభించకపోవటం వల్ల పిల్లల్లో ఎదుగుదల వుండదు. 2000 సంవత్సరంలో చైనాలో ఎదుగుదల ఆగిపోయిన పిల్లలు 20%, తక్కువ బరువువున్న పిల్లలు 22% వుంటే 2012కు అది వరుసగా 8 శాతానికి, 15 శాతానికి తగ్గింది. అంటే ఆ దేశంలోని పేదరికాన్ని తగ్గించగలిగారని అర్థం. ఇదే సమయంలో మనదేశంలో ఎదుగుదల ఆగిపోయిన పిల్లలు 38%, తక్కువ బరువువున్న పిల్లలు 36%. ఎత్తుకుతగ్గ బరువులేని పిల్లలు 21% వున్నారని, 59% రక్తహీనతవల్ల బాధపడుతున్నారని 2016 సర్వే తెలుపుతోంది. మనదేశంలో సంపద వృద్ధి జరుగుతున్నకొద్దీ ఆర్థిక తారతమ్యం కూడా మరింత పెరుగుతోంది. 2004లో దాదాపు 5వేల కోట్ల డాలర్లుగా వున్న బిలియనీర్ల సంపద, 2017నాటికి 48వేల కోట్లకు పెరిగింది. కానీ ప్రజల పేదరికం ఏమాత్రం తగ్గలేదు. పై స్థాయిలలోవున్న 10% ధనవంతులు దేశ సంపదలో 75 శాతానికి హక్కుదారులైవుంటే, క్రిందిస్థాయి 60% ప్రజలకు దేశ సంపదలో 4.8 శాతం మాత్రమే దక్కుతోంది. అందుకే అధికశాతం ప్రజలు పోషకాహారం తీసుకోలేరు.

1952లో 35 సంవత్సరాలే వున్న సగటు ఆయుప్రమాణాన్ని 1982కల్లా చైనావారు 68 సంవత్సరాలకు పెంచుకోగలిగారు. ప్రస్తుత చైనీయుల సగటు జీవితకాల ప్రమాణం పురుషుల్లో 75 సంవత్సరాలు, స్త్రీలలో 80 సంవత్సరాలకు పెరిగింది. అదే మన దేశంలో 1960లో 42 సంవత్సరాలున్న సగటు ఆయుర్దాయం 1980కి 48 సంవత్సరాలకు చేరుకుంది. ప్రస్తుతం అది పురుషులకు 67 సంవత్సరాలుగాను, స్త్రీలలో 70 సంవత్సరాలుగానూ వుంది. సగటు జీవితకాలం ఎక్కువవుందీ అంటే ప్రజలకు సరైన పోషకాహారం, శుభ్రమైన తాగునీరు, పరిశుద్ధమైన గాలీ, ఆరోగ్యకరమైన పరిసరాలు వున్నాయని, వారిలో తలెత్తే రుగ్మతలను సమర్ధవంతంగా అరికడుతున్నారనీ అర్థం. అంతేకాదు ఆ సమాజంలో అంటువ్యాధుల వ్యాప్తిని అరికట్టారని, అసాంక్రమిక వ్యాధులను సమర్ధవంతంగా ఎదుర్కోగలుగుతున్నారని అర్థం.

చైనాలో ప్రస్తుతం ప్రతి వెయ్యిమంది జనాభాకి, 1.7 నర్సులు (22,44,000), 1.8 లైసెన్సు కలిగిన డాక్టర్లు (24,66,000) వున్నారు. 3.8 పడకలతో (51,60,000) – 9,54,000 హాస్పటల్స్ వైద్యసేవలు అందిస్తున్నాయి. భారీస్థాయిలో మౌలిక వసతులు, బహుళ అంతస్తుల భవనాలు, పూర్తి శిక్షణ పొందిన సిబ్బందితో నగరాలలోని ప్రభుత్వ ఆస్పత్రులు నెలకొల్పారు. ఉదాహరణకి చెంగ్డూ నగరంలోని ఒక ఆస్పత్రిలో 4300 పడకలు వున్నాయి. 10000 మంది చికిత్సకులు పనిచేస్తున్నారు. రోజూ 15000 మంది రోగులకు వైద్య సేవలందిస్తారు. (మరి మనదగ్గర ముఖ్యమైన ఆస్పత్రులుగా పరిగణిస్తున్న గాంధీ, ఉస్మానియాలలో 1500నుండి 2000 పడకల సామర్థ్యం మాత్రమే వుంది). ఈ గణాంకాల

ద్వారా చైనా మనకంటే అధికంగా వున్నతస్థాయి వైద్యసేవలు అందిస్తోందని, అధిక శాతం ప్రజల జీవనప్రమాణలు మనకంటే మెరుగుగా వున్నాయని స్పష్టమవుతోంది.

పరిశోధనారంగంలో 2012నాటికి వారు 1లక్ష కోట్ల యువాన్లు (జిడిపిలో 2 శాతం) ఖర్చుచేశారు. 2020కల్లా దేశాన్ని 'పవర్‌హౌజ్ ఆఫ్ సైన్స్'గా మార్చాలని కంకణం కట్టుకున్నారు. సూపర్ కంప్యూటర్లు, 3డి టెక్నాలజీ, 5జి సాంకేతికతవంటి ఆధునిక శాస్త్రీయ పరిజ్ఞానంతో వైద్యరంగాన్ని అధునాతనంగా తీర్చిదిద్దుతున్నారు. 2015వరకల్లా సాధించాలని 2000 సంవత్సరంలో ప్రకటించిన మిలీనియం అభివృద్ధి లక్ష్యాలలో మనం ఏవీ సాధించలేక పోయాం. అదే చైనాలో ఆ లక్ష్యాలను అధిగమిస్తూ ప్రస్తుతం గ్లోబల్ సంస్థలు కొత్తగా నిర్దేశించిన సుస్థిర అభివృద్ధి లక్ష్యాలు (Sustainable Development Goals) 2030 కల్లా సాధించాలనే పూనికతో సాగిపోతున్నారు.

భూస్వామ్యం ఉక్కుపిడికిలి నుంచి విడివడి, వలసపెత్తనంపై విజయం సాధించి, సామాన్యమానవుడి సంక్షేమమే కీలకంగా తన విధానాలు రూపొందించుకొని, శ్రామిక రాజ్యపు అరుణతారగా ముందడుగు వేస్తున్నది జనచైనా. తాను ఎంచుకున్న సోషలిస్టు సమాజ నిర్మాణంలో ఆధునికీకరణలను ప్రవేశపెట్టి, ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో వస్తున్న తీవ్ర సంక్షోభాలను, ఒడిదుడుకులను తట్టుకుంటూ, మార్కెట్ ఎకానమీని తన అశేష జనాభా లక్ష్యాలకు అనుగుణంగా, సమయానుకూలంగా మార్చుకుంటూ, ప్రపంచానికి కొత్త పరిష్కార మార్గాలను సూచిస్తూ, నూతన వ్యవస్థ నిర్మాణం సాగిస్తోంది నవ చైనా. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థతో ముడివేసుకుని, ఆ ప్రపంచంలో వస్తున్న ప్రతి దుష్పరిణామానికి, ప్రతి సంక్షోభానికి, ప్రతి ప్రకంపనకూ గురి అవుతూ, అతలాకుతలం అవుతూ, ఆ వ్యవస్థలే చూపిస్తున్న పరిష్కార మార్గాలను అనుసరిస్తూ మరింతగా సమస్యల వూబిలోకి జారిపోతున్న వ్యవస్థ మన దేశానిది. సంక్షోభ భారాలను 120 కోట్ల పైబడ్డ జనసామాన్యం మీదికి నెట్టివేస్తూ సామాన్యుల జీవనాన్ని అధ:పాతాళానికి చేర్చి, తాను మాత్రం బయటపడే మార్గాలను అనుసరిస్తున్న నయావలస వికృత విధానం మన పాలక వర్గాలది. అయితే తాను అమలుచేస్తున్న ఈ దగా, దళారి విధానం, భారతదేశ బంగారు భవిష్యత్తు కోసమనీ, సామాన్య మానవుల సంక్షేమం కోసమేననీ పెద్ద ఎత్తున ప్రచారం చేసుకుంటుంది మన ప్రభుత్వం.

నిజంగా ప్రజలకు అనుకూలమయిన వ్యవస్థలు ఎలా వుంటాయో, ఎలాంటి విధానాలు అమలు చేస్తాయో, ఆ ప్రణాళికల నిర్దేశిత లక్ష్యాలను సాధించలేనప్పుడు ఎలాంటి దిద్దుబాటు చర్యలు తీసుకుంటాయో, ప్రజల నుంచి ప్రజలకు అనే దిశలో పాలనా చర్యలు ఎలావుంటాయో చైనా చరిత్ర మనకు తెలియజేస్తోంది.

ప్రజారోగ్య పరిరక్షణా రంగంలో ప్రజలకు ఉపయుక్తమైన వినూత్న మార్గాలను అన్వేషిస్తూ, రూపొందిస్తూ, ఆచరిస్తూ నూతన దశకు చేరుకుంటున్నది జనచైనా. చైనా జైత్రయాత్ర సత్ఫలితాలనిస్తుందని, ప్రపంచప్రజలకు మరో మార్గదీపం దొరుకుతుందని ఆశిద్దాం.

– *జూన్, 2019*

# 8.

# మేడం సూంగ్ చింగ్ లింగ్ స్ఫూర్తితో చైనాలో అంతర్జాతీయ బాలల వేసవిశిబిరాలు

మేడం సూంగ్ చింగ్ లింగ్ (1893-1981) జనచైనా నాయకులలో ఒక విశిష్ట స్థానం పొందిన విదుషీమణి. ఒక అసాధారణ మహిళ. అంతర్జాతీయంగా పేరుపొందిన సామాజిక కార్యకర్త. దీర్ఘకాలం పాటు చైనా దేశీయ వ్యవహారాలలోనే కాక అంతర్జాతీయంగా ప్రాముఖ్యం గల కార్యకలాపాలలో ఆవిడ నేతృత్వం వహించి, ప్రపంచశాంతికి, సామాజిక అభివృద్ధికి, మానవ సంక్షేమానికి ఎంతగానో తోడ్పడ్డారు. వివిధ జాతుల మధ్య, దేశాల మధ్య అవగాహన పెరగాలనీ, అన్ని జాతుల మధ్య సమాచార మార్పిడి జరగాలనీ, ఆవిడ ఎంతగానో అభిలషించేవారు. ప్రత్యేకించి బాలలకు, వారి వారసత్వపు సంస్కృతిని పరిచయం చేయాలనీ, బాలల హక్కులు కాపాడాలనీ, వారికి విద్య, సంరక్షణ, శిక్షణ, అత్యంత ప్రాధాన్యతగల అంశాలనీ, అలాగే మహిళల హక్కులు, సమానత, సాధికారతల కోసం పాలనా వ్యవస్థలు ప్రత్యేక ప్రయత్నాలు సాగించాలనీ ఆవిడ కృషి చేశారు. ప్రపంచమంతా అభినందిస్తూ 20వ శతాబ్దపు గొప్ప మహిళల్లో ఒకరిగా ఆమెను గుర్తించారు. ఆమె జీవితంలో ముఖ్యంగా నాలుగు రంగాలలో అసమానమైన కృషిచేసి నాయకత్వ బాధ్యతలు నిర్వహించారు.

**మొదటిది రాజకీయ రంగం :** ఒక విప్లవ రాజకీయవేత్తగా, దేశభవిష్యత్తు, తనజాతిజనుల పురోభివృద్ధిని కాంక్షించి ఆవిడ డా॥ సన్‌యట్‌సేన్ నడిపిన చైనా జాతీయ పోరాటంలో గణనీయమైన పాత్ర పోషించారు. ఆ తరువాత జాతీయ విముక్తి పోరాటంలో జనచైనా రాజ్య ఆవిర్భావం, నిర్మాణం, పురోగమనం కోసం సాగించిన ప్రజ ఉద్యమాలన్నింటా ప్రముఖ భూమికను పోషించారు.

**రెండవరంగం సామాజిక వికాసం :** చైనా దేశపు జీవితం, చరిత్ర, సామాజిక సమస్యల పట్ల ఆవిడకు మంచి అవగాహన వుండేది. ఈ సమస్యలు తొలగించటానికి, ఉన్న పరిస్థితులలో

కాస్తయినా ఉపశమనం కలిగించటానికి, సమాజం మొత్తం సోదర ప్రజలపట్ల కారుణ్యం, దాతృత్వం మానవత దృష్టి కలిగి వుండాలనీ, సమాజం సంక్షేమ రాజ్యంగా ఎదగాలని కాంక్షించారు. యుద్ధ పీడితులకు ఉపశమనం కోసం ఒక సంస్థను, చైనా సాంఘిక సంక్షేమం కోసం ఒక సంస్థను కమ్యూనిష్టు పార్టీ ఆధ్వర్యంలో ప్రారంభించి నిర్వహించారు.

**మూడవ రంగం స్త్రీ, శిశు సంక్షేమ రంగం :** స్త్రీల విముక్తి కోసం ఆవిడ ఎంతో తపన పడేవారు. మాతాశిశు సంరక్షణ కోసం, వారి ఆరోగ్య పరిరక్షణ కోసం ఒక అంతర్జాతీయ సంస్థనే (Inter National Peace, Maternal and Infant Health Care Institute) ఏర్పరిచి దానికి తన మలి జీవితంలో అత్యధిక ప్రాధాన్యతనిచ్చి అవిరామ కృషి చేశారు. దాంతో పాటుగా కిండర్ గార్టెన్, బాలమందిరాలు, బాలలకోసం కళా వేదికలు (art theaters) నిర్మించి, నిర్వహించి ఆ రంగంలో ఎనలేని సేవలు చేశారు. అంతేకాదు 'బాలల యుగం' అనే పత్రికను ప్రారంభించి నడిపారు. మహిళల బాలల అభివృద్ధి కోసం చైనాలో సాగిన మహత్తర కృషిలో ఆవిడ పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది. ఆమె ఇంత అచంచలంగాను కృషి చేసిన

**నాలుగోరంగం ప్రపంచ శాంతి ఉద్యమం :** చైనా ప్రజల మైత్రీ ఉద్యమంతో విడదీయలేని సంబంధం ఆమెది. చైనా సాంస్కృతిక రాయబారిగా, చైనా మైత్రీ ఉద్యమ ప్రతీకగా, ఆవిడ ప్రపంచ ప్రజల మన్ననలు పొందారు. ప్రపంచ శాంతి కోసం కృషి చేసే శక్తులకు అపూర్వమైన వారసత్వాన్ని, ఒక పంథాని, నాయకత్వాన్ని కూడా ఆమె సమకూర్చారు. ఆవిడ అమెరికా సంయుక్త రాష్ట్రాల గురించి క్షుణ్ణంగా చదువుకున్నారు. జపాన్, ఫ్రాన్సు, జర్మనీ, సోవియట్ రష్యా దేశాలలో కొంతకాలం పాటు నివసించారు. ఆసమయంలో ఆవిడకు అనేక మందితో పరిచయాలు కలిగాయి. వారంతా సన్నిహిత మిత్రులుగా ఎదిగారు. "ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక కమిటీ"కి, "సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రపంచ సంఘటన"కు ఆవిడ అధ్యక్ష బాధ్యతలు నిర్వహించటానికి ఎన్నుకోబడ్డారు. ఆసియా-పసిఫిక్ శాంతి సదస్సుకు ఆమె వ్యవస్థాపక సభ్యురాలు. అనేక అంతర్జాతీయ సదస్సులు, సెమినార్లలో చైనా తరపున పాల్గొన్నారు. తన శాంతి ప్రియత్వంతో ప్రపంచ ప్రజల ఆదరాన్ని చూరగొని వారి సహకారాన్ని అర్థించారు, సాధించారు. ఐక్యరాజ్యసమితితో సన్నిహితంగా మెలిగి వారి ఆధ్వర్యంలో జరిగే సంక్షేమ కార్యక్రమాలు, చైనాలోను, ఆసియా దేశాలలోను అమలుజరిగేలా ప్రభావితం చేశారు. ఇంతటి మహత్తరమైన జీవితం, 1981లో భౌతికంగా ముగిసిపోయింది. అయితే ఆమె స్ఫూర్తి అజరామరం.

ఆవిడ స్మృతిలో ఆమె ప్రథమ వర్ధంతినాటికి (29-5-1982) మేడం సూంగ్‌ఛింగ్‌లింగ్ ఫౌండేషన్ ఏర్పాటు చేశారు. ఆమెకు ఎంతో ప్రియమైన అంశాలను ఈ సంస్థ తన కార్యకలాపాలుగా చేసుకొంది. 1.అంతర్జాతీయ సంబంధాలను మైత్రీ సంబంధాలుగా మెరుగుపరుచుకోవటం, 2.చైనా పునర్వ్యవస్థీకరణను, పునరేకీకరణను సాధించటం, 3.పిల్లల కార్యశీలతను పెంపొందించే కార్యక్రమాలు నిర్వహించటం అనేవి ఈ సంస్థ లక్ష్యాలుగా

చేసుకొంది. దీనికి చైనా దేశస్తులేకాక ఎంతో మంది విదేశస్తులు, ఎన్నో విదేశీ సంస్థలు తమ సహకారాన్ని అందిస్తున్నారు. ప్రభుత్వాలతో ప్రమేయం లేకుండా ప్రజల మధ్య అవగాహన, సద్భావన కలిగే రీతిలో ఈ సంస్థ కృషి చేస్తోంది – పిల్లల చదువులకోసం సహాయక పథకాలు, శాస్త్రీయవిజ్ఞానాన్ని, శాస్త్రీయ ఆలోచనా విధానాన్ని ప్రజల దగ్గరకు తీసుకువెళ్ళే కార్యక్రమాలు, పిల్లల ఆటపాటలు, సాహిత్య, సాంస్కృతిక అభినివేశాలు వికాసం పొందేలా ప్రోత్సాహకాలు, బహుమతులు, ఆవార్డులు అందించటం వారి కార్యాచరణగా వుంది. మంచి భవిష్యత్తును సృజించటం అన్న మేడం సూంగ్‌చింగ్‌లింగ్ ఆశయానికి ఆచరణరూపం కలిగిస్తూ నేటి బాలతరంనుండి రేపటి ప్రపంచమానవుణ్ణి రూపొందించటానికి ఈ సంస్థ పలు కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది. అందులో భాగంగానే కొన్ని సంవత్సరాలుగా అంతర్జాతీయ బాలల వేసవిశిబిరాలు నిర్వహిస్తోంది. వివిధ దేశాల పిల్లలు చైనాలో కొన్ని రోజులు కలసిమెలసి సంచరించి మైత్రీ సుగంధం హత్తుకుని వెళ్ళాలని ఈ శిబిరాల ముఖ్య ఉద్దేశం.



# 9.

# సాంస్కృతిక భిన్నత్వం - సమ్యక్‌దృక్పథం

(చైనాలో అంతర్జాతీయ బాలల వేసవిశిబిరం 2014 సందర్భంగా...)

ఈ ప్రపంచం భిన్న జాతులకు, విభిన్న సంస్కృతులకు, నాగరికతలకు నెలవు. మానవ నాగరికతా ప్రస్థానం ఆయా ప్రాంతాలలో రూపుదిద్దుకున్న సామాజిక వ్యవస్థల అభివృద్ధి క్రమంతో ముడిపడి ముందువెనకలుగా కొనసాగుతుంది. అనేక ప్రత్యేకతలతో, ప్రాంతీయ సౌరభాలతో, జాతీయ విశిష్టలక్షణాలతో జీవన విధానం, సంస్కృతి, ఎంతో వైవిధ్యభరితంగా ఉంటుంది. నలుమూలల్లో విస్తరించిన నాలుగు రకాల సంస్కృతులను అందరూ అర్థం చేసుకొని పరస్పర గౌరవంతో కలిసి, సామరస్య పూర్వక మానవ సంబంధాలను, జాతుల మధ్య సహజీవనాన్ని సాధించటం ఒక సవాలుగా వుంది. 'విశ్వనరుడను నేను' అన్న సహోదర భావంతో ప్రపంచ ప్రజల ఏకోన్ముఖమై ప్రపంచ శాంతికి బాటలు వేయాలి. ఇలాంటి ఉదాత్త ఆశయాలను ప్రతిబింబిస్తూ, బాలబాలికలలో ఈ నవచైతన్యం నింపడానికి, జనచైనా గత కొన్ని సంవత్సరాలుగా అంతర్జాతీయ వేసవి శిబిరాలు నిర్వహిస్తోంది. వివిధ దేశాలనుండి, ప్రాంతాల నుండి బాలబాలికలను, యువతరాన్ని ఆహ్వానించి సాంస్కృతిక సమ్మేళనాలు నిర్వహిస్తోంది. వేసవి శిబిరాల రూపంలో వారం పదిరోజుల పాటు క్యాంపులు నిర్వహించి వందలాది బాలబాలికల మధ్య స్నేహం సౌహార్దం వెల్లివిరిసే ప్రయత్నం చేస్తోంది. వివిధ సంస్కృతులను పరస్పరం పరిచయం చేయటం, ఆయా సంస్కృతుల మధ్య గౌరవంతో కూడిన స్నేహభావాన్ని పెంపొందించటం, తద్వారా నూతన ప్రపంచ మానవుణ్ణి తీర్చిదిద్దటం అన్న లక్ష్యాలను సాధించటానికి కృషి చేస్తోంది.

ఈ కృషికి చైనా సూంగ్ ఛింగ్ ఫౌండేషన్ పేరున ఒక సంస్థను ఏర్పరచారు. గొప్ప జాతీయనాయకురాలు, దేశభక్తురాలు, చైనా విప్లవ విజయంకోసం అకుంఠిత దీక్షతో పనిచేసిన ధీరురాలు, చైనా జాతీయ అధ్యక్షురాలు మేడం సూంగ్ ఛింగ్ లింగ్ (డా॥సన్‌యట్ సేన్ సహచరి) పేరిట ఈ సంస్థ కృషి చేస్తోంది. ఇప్పటికి నాలుగు క్యాంపులు నిర్వహించారు. సరిహద్దులు, అడ్డంకులు ఎరుగని పసివయసులో, స్నేహ భావం నిండిన నిష్కల్మషమైన

మనసుల కలిగిన బాలబాలికలకు సంస్కృతి పట్ల సరిఅయిన అవగాహన కల్పించటం ఈ వేసవి శిబిరాల ముఖ్య ఉద్దేశం.

2014 జూలై 16 నుంచి 24 వరకు 5వ సూంగ్ ఛింగ్ లింగ్ అంతర్జాతీయ వేసవి శిబిరం నిర్వహిస్తున్నారు. 27 దేశాల నుంచి దాదాపు 300 మంది పిల్లలు తమ సృజనశీలతను, కళాభిజ్ఞతను ప్రదర్శించనున్నారు. భారత-చైనా మిత్రమండలి చైనా సంస్థ ఆహ్వానం మేరకు 11మంది సభ్యులు గల బృందాన్ని చైనాకు పంపిస్తోంది. వేల సంవత్సరాల సాంస్కృతిక వారసత్వంగల చైనాతో భారతీయ సాంస్కృతిక సంబంధం మరింత మెరుగుపడుతుందనీ, భారత చైనా మైత్రీ మార్గంలో ఈ పిల్లల బృందం పర్యటన మరో ముందడుగు అవుతుందనీ భావిస్తున్నాం. 300 మంది పిల్లలు తమతమ ప్రాంతాల జీవనశైలిని, ఆలోచనా విధానాలను, ఆచారవ్యవహారాలను వారం రోజులు పంచుకుని, జీవించనున్నారు. వేల కిలోమీటర్లు పర్యటించి చైనాలోని అభివృద్ధిని గమనించనున్నారు. మన బృందం చిత్రలేఖనం, పెయింటింగులు, నృత్య ప్రదర్శనల ద్వారా మన సంస్కృతీ విశేషాలను వారికి పరిచయం చేయనున్నారు. ప్రతిగా అనేక దేశాల నుంచి వచ్చినవారి స్నేహ సౌరభాలను తిరిగి తెస్తారు. ఒక సాంస్కృతిక సమ్యక్‌దృష్టికి, స్నేహ వాతావరణం కల్పించటానికి, అంతర్జాతీయ సంఘీభావం వికసించటానికి ఈ బృందం పర్యటన తోడ్పడగలదు. వ్యక్తులుగా ఈ పిల్లలు సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని ప్రత్యక్షంగా చూడగలుగుతారు. బృందంగా భారతీయ సాంస్కృతిక దూతలుగా వ్యవహరిస్తారు. ఈ నేపథ్యంలో ప్రపంచ వ్యాప్తంగా సాంస్కృతిక రంగంలో నెలకొనివున్న పరిస్థితిని ఒక్కసారి సమీక్షించుకోవటం సముచితంగా వుంటుంది.

అంచలంచెలుగా ఎదిగిపోతున్న శాస్త్ర సాంకేతిక నైపుణ్యంవల్ల అందుబాటులోకి వచ్చిన అత్యాధునిక సమాచార వ్యవస్థలు, ఈ ప్రపంచాన్ని ఓ కుగ్రామమంత దగ్గరకు తెస్తూనే మనషుల్ని ఎంతోదూరంగా కూడా విడదీసున్నాయి. చేతిలో టచ్‌ఫోన్లు, వొళ్ళో కంపూటర్లు, టాబ్లెట్లు పెటుకున్న మనిషి తన ప్రపంచంలో మునిగిపోయి, పక్కనేవున్న మనిషిని, కనీసం తన ఇంటిమనిషిని కూడా పట్టించుకోవటం లేదు. మానవ సంబంధాలు సోషల్ నెట్‌వర్కుల ద్వారా కలుసుకోవటంగా మిగిలి, అంతిమంగా అది అనుబంధాల విచ్ఛిన్నానికే దారితీస్తోంది. వ్యక్తుల, కుటుంబాల, ప్రాంతాల, జాతుల, దేశాల ప్రత్యేకతలు నశిస్తూ వొక ఏకరూపమైన జీవనవిధానం క్రమంగా తలయెత్తుతోంది. ప్రపంచీకరణ నేపథ్యంలో వస్తువినిమయ సంస్కృతిని, మార్కెట్ మాయాజాలంగా పెట్టుబడిదారీ వ్యవస్థ పెంచిపోషిస్తోంది. వ్యాపార ప్రయోజనాలు, ఆర్థిక లాభాలు లక్ష్యంగా, దేశ విదేశాల్లో పెట్టుబడులు పెంచుకునే రీతిలో ప్రపంచ ధనస్వాములు ప్రజల ఆలోచనారీతిని తమ కనుకూలంగా మార్చుకుంటున్నారు. పత్రికలు, ప్రకటనలు, టి.వీ. ఛానళ్ళ ద్వారా మన ఇళ్ళలో ప్రవేశించి, వాళ్ళ వస్తువులను కొనే కన్స్యూమర్లుగా ప్రజలను తీర్చి దిద్దుతున్నారు. వాళ్ళు విక్రేతలు, మనం వినియోగదారులం. మనకు కావలసినవి కాక, వాళ్ళు అమ్మేవి కొనేస్థితికి తీసుకు వెళుతున్నారు. ఈ క్రమంలో మన జీవన విధానం, జీవిత అవసరాలు, మనుగడ లక్ష్యాలు. అన్నీ పెట్టుబడికి అనుకూలంగా

మారిపోతున్నాయి. ఈ దుస్థితికి ప్రధాన మార్గం సాంస్కృతిక దాడి. తమ జీవన విధానం ఉత్తమమైనదనీ, తమ సంస్కృతి అధునాతనమనీ, అభివృద్ధికరమనీ, మిగతావి అటవికమనీ, ఛాందసమనీ, మూఢమనీ, వెనుకబడ్డవనీ ప్రచారం చేస్తున్నారు. వలసలు, నయావలసలు, సెమీవలసలు, అంతర్గత వలసలు ప్రోత్సహించటం, తమకు అనుకూలంగా వ్యవహరించే కీలుబొమ్మ ప్రభుత్వాలను ఏర్పరచటం, ఆర్థిక దిగ్బంధం విధించటం లాంటి విధానాలతో ప్రపంచాన్ని తన గుప్పిటిలో పెట్టుకున్న సామ్రాజ్యవాదులకు పెద్ద ఆయుధం సామ్రాజ్యవాద సంస్కృతి. పాలకుల సంస్కృతి. అనేకచోట్ల వలసాధిపతులు తొలగినా, వలస పాలనావశేషంగా వారి సంస్కృతి మిగిలేవుంటోంది. వలసాధిపత్య విధానాలనే కొత్త ప్రభువులు కూడా పెంచి పోషిస్తూ, జాతిలో బానిస భావాలను, బానిస మనస్తత్వాన్ని సజీవంగా వుంచుతున్నారు. విజేతల, ప్రభువుల సంస్కృతినే తమ విధానంగా ప్రజల ఆమోదించి అనుసరించవలసి వస్తోంది. సంస్కృతి, నాగరికత, మతం వ్యవహారాల్లో ఈ వ్యాపార ప్రభువుల జోక్యం మితిమీరిపోయింది. ఆయా వ్యవస్థల మధ్య వైషమ్యాలు పెంచుతూ తమ దోపిడికి అనుకూల వాతావరణం సృష్టించుకుంటున్నారు.

ఈ విషసంస్కృతి వ్యాప్తిని అడ్డుకుంటూ వివిధ ప్రాంతాల, జాతుల ప్రజలు తమతమ మూల సంస్కృతుల వారసత్వాన్ని కాపాడుకునే ప్రతిఘటనా ప్రయత్నాలు చేస్తున్నారు. తమతమ ప్రాంతీయ, నైసర్గిక, ఆధ్యాత్మిక, భావోద్వేగాలతో నిండిన జీవన విధానాన్ని నిలబెట్టుకునేందుకు కంకణబద్ధులై ఉన్నారు. అలా సాంస్కృతికరంగలో తమపై జరుగుతున్న దాడినీ, దోపిడీని ఎదుర్కొంటున్నారు. ఒక జాతి సంస్కృతి మరోజాతి సంస్కృతికంటే ఉత్తమమనో, ఉన్నతమనో జరుగుతున్న దుష్ప్రచారాన్ని తిరస్కరిస్తున్నారు. ప్రతి సంస్కృతిలోను మేలు అంశాలతోపాటు లోటుపాట్లు వుంటాయనీ, ఇతరుల ఉత్తమ లక్షణాలను నేర్చుకుని తమ బలహీనతలను అధిగమించాలని భావిస్తున్నారు. సంస్కృతుల మధ్య దురహంకార పాలకులు సృష్టించిన ఘర్షణను వ్యతిరేకిస్తున్నారు. ఇది సంస్కృతి పట్ల వ్యాపార ప్రపంచానికి, ప్రజలకీ మధ్య వున్న మౌలికబేధం. ఈ చారిత్రక పరిణామాల మధ్య ప్రజానుకూల వాతావరణాన్ని పరిపోషించే ప్రయత్నాలు అంతర్జాతీయంగా కొనసాగుతున్నాయి. భిన్న సంస్కృతులను గుర్తించి, గౌరవిస్తూ ఆయా సంస్కృతులకు అనుకూలమైన, అనువైన, అభివృద్ధిని సాధించటమే లక్ష్యంగా ఒక సంభాషణాక్రమం కూడా కొనసాగుతున్నది. ప్రపంచవ్యాప్తంగా తలయెత్తిన ఈ సంస్కృతీ పరిరక్షణ ప్రయత్నాలకు, ఉద్యమాలకు వేదికలుగా అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థలు కలిసి సాగుతున్నాయి. ఈ ప్రజాభిప్రాయాన్ని క్రోడీకరిస్తూ ఐక్యరాజ్యసమితి (యునెస్కో) 2001లోనే ఒక ప్రకటన చేసింది. ఇది మానవహక్కుల ప్రకటనకున్నంత ప్రాముఖ్యతను సంతరించుకున్నది.

సంస్కృతుల మధ్య సఖ్యతకై ఒక గ్లోబల్ ఫోరం (ప్రపంచస్థాయి సంస్థ) ఏర్పాటు చేయబడింది. సంస్కృతి అంటే ఒక సమాజం, లేక సమాజంలోని బృందాలు సాముహికంగా అనుసరించే జీవన విధానంలోని భౌతిక, ఆత్మిక అంశాలు, వివేకము, భావోద్వేగాలకు చెందిన

విశిష్ట లక్షణాల సమాహారం. అది కళలు, సాహిత్యంతోపాటు, ఆయా సమాజాలలోని జీవనశైలి, కలిసిబతికే తీరుతెన్నులు, ఆచార వ్యవహారాలు, అనుసరించే విలువలు, విశ్వాసాలకు విస్తరిస్తుంది. సంస్కృతిలోవున్న భిన్నత్వాలను గౌరవించటం, పరస్పర విశ్వాసంగల వాతావరణంలో చర్చించుకుని, అవగాహన, సహనం సహకారంతో వ్యవహరించటం, అంతర్జాతీయ శాంతి భద్రతలకు గొప్ప రక్షణగావుంటుంది. సాంస్కృతిక విభేదాలను గ్రహిస్తూనే మానవజాతి ఐక్యతకుగల ప్రాముఖ్యతను గుర్తించటం, దానికోసం వివిధ సంస్కృతుల మధ్య ఆదానప్రదానాలను ప్రోత్సహించటం ఒక ముఖ్యమైన కర్తవ్యం. విభిన్న సంస్కృతులను రక్షించటం ఒక నైతిక అవశ్యకత. మానవ జీవన హుందాతనాన్ని, ఆత్మగౌరవాన్ని నిలబెట్టటంలో వారి సంస్కృతిని సమాదరించటం వొక విడదీయరాని అంశం. మానవులకున్న మౌలిక స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను, ప్రాథమిక హక్కులను కాపాడే ప్రయత్నంగా దీన్ని గ్రహించాలి. అని యునెస్కో ప్రకటన స్పష్టం చేసింది.

ప్రాంతం, జాతి, మతం, వొంటిరంగు, మనుషులకున్న విశ్వాసాలపట్ల అసహనం వల్ల ఏర్పడుతున్న వివక్షతలను ఎదుర్కోవటం కోసం, ప్రాంతీయ, జాతీయ ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు కార్యచరణకు ఉపక్రమించాలని 2006లో ఐక్యరాజ్య సమితి పిలుపునిచ్చింది. అన్ని సంస్కృతులు, నాగరికతలు, మానవజాతి అనుభవాన్ని సుసంపన్నం చేశాయి. ఈ సాంస్కృతిక వైవిధ్యం వల్ల ఒనగూడిన అనుభవజ్ఞానం మానవజాతి యావత్తు కాపాడుకోవలసిన సంపద. ఈ అవగాహనతోనే ప్రపంచవ్యాప్తంగా సంస్కృతీ పరిరక్షణోద్యమం నడుస్తోంది. గ్లోబల్ ఫోరమ్స్ నిర్వహిస్తున్నారు. 2008 జనవరిలో స్పెయిన్‌లో, 2009 ఏప్రియల్‌లో టర్కిలో, 2010 మే నెలలో బ్రెజిల్‌లో, 2011 డిసెంబరులో ఖతార్‌లో, 2013లో వియన్నాలో ఫోరం సమావేశాలు జరిగాయి. ఇక 2014లో ఇండోనేషియాలో ఈ ప్రపంచఫోరం అరవ సమావేశం జరగనుంది. ఈ అన్ని సదస్సులలోను సంస్కృతి, నాగరికతల ద్వారా ప్రజలను ఐక్యంచేసే విధానాలు, ప్రపంచశాంతికి బాటలువేసే పద్ధతులు రూపొందుతున్నాయి. మానవ అభివృద్ధికి దోహదం చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అభివృద్ధి అంటే కేవలం ఆర్థిక, పాదార్థిక పెంపుదలకాదనీ, మానవజాతి మేధోపరంగా, భావోద్వేగపరంగా, నైతికంగా ఆధ్యాత్మికంగా, జీవితంలో ఒక సంతృప్తికరమయిన ఎదుగుదలను సాధించటమే అభివృద్ధి అని నిర్వచించారు. ఆయా మానవ సమూహాల సంస్కృతీ మూలాలను, సాంస్కృతిక విలువలను అభివృద్ధి పథానికి ఆలంబనం చేసుకోవాలని నొక్కివక్కాణించారు.

1970ల నుంచీ అవలంబిస్తున్న అభివృద్ధి నమూనాలు ఈ లక్ష్యాలను సాధించటంలో పూర్తిగా విఫలమయ్యాయనీ, ప్రజల ఆశలు, ఆకాంక్షలు నెరవేర్చటంలో ఈ నమూనాలు నిరుపయోగంగా ఉన్నాయని కూడా ఐక్యరాజ్యసమితి ప్రకటించింది. అంతేకాదు విస్తరిస్తున్న ప్రపంచీకరణ విధానాలు అభివృద్ధికి కొత్త సవాళ్ళు విసురుతున్నాయనీ దానికి విరుగుడుగా, విభిన్నత (Diversity) సంభాషణ (Dialogue) వికాసం (Development) (ఇంగ్లీషులో '3D' Policy అనే పద్ధతిని సూచిస్తోంది. ఈ అభివృద్ధి స్థానిక అవసరాలు, ఆకాంక్షలను

ప్రతిబింబించే విధంగా క్రిందనుంచి పైకి అనే ధోరణిలో జరగాలంటోంది. దానర్థం క్షేత్రస్థాయిలో ప్రజల సాంస్కృతిక జీవనాన్ని వారి అవసరాలను ఖచ్చితంగా గమనించవలసి వుంటుంది. ఈ విధంగా సంస్కృతికీ, మానవ మనుగడకూ, అభివృద్ధి పథానికి ఉన్న సంబంధాన్ని సరికొత్తగా వీక్షించవలసివుంది. విఫలమయిన పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద ఆర్థిక సాంస్కృతిక విధానాలకు ప్రత్యామ్నాయంగా ప్రజానుకూల, సామ్యవాద విధానాలు అమలు కావలసివుంది. దానికి ప్రాతిపదికగా ముందు విభిన్న సంస్కృతులను అవగాహన చేసుకోవలసివుంది. భిన్న ప్రాంతాలకు, జాతులకు, వ్యవస్థలకు చెందిన విశిష్ట, ప్రత్యేక లక్షణాలను అధ్యయనం చేయాల్సివుంది. తద్వారా సదవగాహన, సమ్యక్‌దృష్టి, సహోదరభావం, జాతుల మధ్య సంఘీభావం పెరుగుతాయి.

ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని మంచివైపు నడిపించే మార్గదర్శిగా ఈ సవ్యమయిన సాంస్కృతిక దృక్పథాన్ని అనుసరిస్తూ చైనా తన జాతీయ, అంతర్జాతీయ పాత్రను కృతనిశ్చయంతో పోషిస్తోంది. సాంస్కృతిక బృందాల పర్యటనలు, సదస్సులు, శిబిరాలు – ఆ కృషిలో భాగమే. శాంతి, సౌమనస్యం పునాదిగా, మానవ అభివృద్ధికి వాహికగా సాగుతున్న ఈ 'ప్రజలనుంచి ప్రజలకు' అనే సంబంధాల ప్రవాహం నిరంతరం కొనసాగాలని, రెండు పెద్ద దేశాల, ప్రాచీన వారసత్వంగల సాంస్కృతిక శక్తుల మధ్య స్నేహం, ప్రపంచ శాంతి, అభ్యుదయాలకు దారితీయాలని ఆకాంక్షిస్తూ ఈ పిల్లల బృందానికి శుభాకాంక్షలు.

– జూలై, 2014



# 10.

# సాంస్కృతిక సామరస్యం

(చైనాలో అంతర్జాతీయ బాలల వేసవిశిబిరం 2015 సందర్భంగా...)

2015, జూలై 22 నుండి 29 వరకు చైనా ఒక అంతర్జాతీయ స్థాయి బాలల వేసవి శిబిరం నిర్వహిస్తున్నది. స్నేహం, సామరస్యం, భిన్న సంస్కృతుల పట్ల అవగాహన కల్పించటం లక్ష్యంగా ఈ సాంస్కృతిక శిబిరం ఏర్పాటు చేశారు. అందులో భారత చైనా మిత్ర మండలి తరపున 11 మంది సభ్యుల బాలల బృందం పాలుపంచుకుంటోంది. ఈ బృందం 21వ తేదీన బయలుదేరి బీజింగ్ వెళుతోంది. శిబిరంలో భాగంగా వీళ్ళు బీజింగ్, షాంఘై, మంగోలియా నాన్‌టాంగ్ మొదలయిన ప్రాంతాలలో వారం రోజులు గడుపుతారు. వివిధ దేశాలకు చెందిన సుమారు 300 మంది బాలలు, యువకులు రెండు బృందాలుగా విడిపోయి చైనాలోని విశాల ప్రాంతాన్ని అధ్యయనం చేస్తారు. అనేక చారిత్రక, పర్యాటక ప్రాంతాలను సందర్శిస్తారు. ఈ కార్యక్రమాన్ని చైనాలోని మేడం సూంగ్ ఛింగ్ లింగ్ స్మారక సంస్థ వారు చేపట్టారు. వివిధ సంస్కృతులతో పరిచయం పొందటం, విభిన్న సంస్కృతులతో జీవించే ప్రజల మధ్య గౌరవాభిమానాలు పెంపొందించటం, స్నేహం ద్వారా ఒక సామరస్యపూరిత వాతావరణాన్ని కల్పించి, శాంతి, అభ్యుదయ పథంలో, ఒకరికొకరు తోడ్పడే నూతన మానవులను తీర్చిదిద్దటం తమ లక్ష్యంగా చైనా ప్రకటించుకొన్నది. అందుకు అనువుగానే కౌమారదశలోవున్న తరాన్ని, లేత యువతరాన్ని ఎంచుకొని, వారిలో నవచైతన్యం నింపటానికి ప్రయత్నిస్తోంది. భావి ప్రపంచపౌరుల మధ్య సత్సంబంధాలు, సదవగాహన పెంపొందేలా కార్యక్రమాలు రూపొందించటం చైనా ప్రభుత్వ దూరదృష్టికి నిదర్శనం. ఇది భవిష్యత్ తరాలపట్లా, వారి సుఖ జీవనం కోసం మనం అందించవలసిన, శాంతి సహకారాలతో విలసిల్లే ఆధునిక నాగరిక సమాజం, దాని నిర్మాణంపట్ల వారికున్న ఆసక్తికి ఆనవాలు. ప్రపంచ భద్రత కోసం బాధ్యతాయుతంగా సాగిస్తున్న కృషికి తార్కాణం ఇలాంటి సాంస్కృతిక సమ్మేళనాల నిర్వహణ.

విభిన్న సంస్కృతులను, విభిన్న స్థాయిల నాగరికతలను, వైవిధ్య భరితమయిన జీవన విధానాలను, ప్రాంతీయ ప్రత్యేకతలను, విభిన్న జాతుల విశిష్టతలను, భిన్న భాషల మధ్యవున్న

వ్యత్యాసాలను పరిశీలించడం జరుగుతుంది. ఆయా జాతుల అభివృద్ధి, దేశాల భౌగోళికతలకు అనుగుణంగా రూపుదిద్దుకుంటున్న వారివారి జీవన పద్ధతులను అవగాహన చేసుకోవడం, ఒక వారమే అయినా వారితో కలసిమెలసి జీవించటం ఈ సంస్కృతిక శిబిరాలు అందించే అద్భుత అవకాశం. పెద్ద చిన్న అనే తారతమ్యాలు విడనాడి, ప్రజలందరూ ప్రపంచపౌరులే, సహోదరులే అనే భావం కల్పించడం ఒక లక్ష్యం. ఈ ప్రపంచాన్ని కాపాడుకోవటంలోనూ, సవ్యంగా నడిపించుకోవటంలోనూ, అభివృద్ధి పరుచుకోవడంలోనూ అందరూ సమాన భాగస్వాములే అన్న ఎరుక కలిగించడం మరో ముఖ్య ఉద్దేశం. ప్రపంచ శాంతి, సౌమనస్యాలను కాపాడటమనే బృహత్తర కృషిలో విశ్వనరులందరూ, స్నేహ, సోదర భావాలతో కలిసి ఉండవలసిన అగత్యాన్ని గుర్తుచేయడం మరో కర్తవ్యం. ఆ స్నేహం పరిమళించాలంటే అందరికీ సమానగౌరవ ప్రతిపత్తి లభించటం మొదటి షరతుగా వుంటుంది గదా!

ఒక జాతిని వేరొకజాతి, ఒక దేశాన్ని మరొక దేశం పీడించితే వారి మధ్య స్నేహం సాధ్యం కాదు. ఒక వర్గాన్ని మరో వర్గం కొల్లగొట్టినంతకాలం వారి మధ్య సామరస్యం సాధ్యం కాదు. తమ వ్యాపార ప్రయోజనాల కోసం, సామ్రాజ్యవాద లక్ష్యాల కోసం, ప్రపంచం మీద పెత్తనం కోసం, ఆధిపత్యం కోసం, అభివృద్ధి చెందిన అగ్రరాజ్యాలు బడుగు దేశాల మీద తమ దోపిడీ, పీడనలను రుద్దితే స్నేహం సాధ్యం కాదు. దేశాల మధ్య తంపులు, తగవులు పెంచి హెచ్చుతగ్గుల తేడాలు సృష్టించీ, పెంచీ, కొందరిని ఘనులుగాను, మరికొందరిని అల్పజాతులుగాను విభజించి, వివక్షతో వ్యవహరిస్తే మైత్రి ఎలా సాధ్యం!

ఈ నాటి ప్రపంచంలో అగ్ర రాజ్యాలుగా చలామణి అవుతున్న శక్తులు, ప్రభుత్వాలు చేస్తున్నది ఇదే. పెట్టుబడిదారీ దేశాలు అనుసరిస్తున్న నీతి ఇదే. తమ దేశాలు, నాగరికతలు, ఆలోచనలు, వస్తువులు, జీవనపద్ధతులు, విలువలు అన్నీ అత్యుత్తమమైనవనీ, ఇతరులకు వీటిని అనుసరించటం తప్ప మరో మార్గం లేదనీ ప్రచారం చేస్తూ, ప్రపంచ మానవాళిని తమ గుప్పిటిలోకి తెచ్చుకుంటున్నారు. తమ మార్కెట్ విలువలకు అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించుకుంటున్నారు. "ప్రపంచమంతా ఒక్కటే, అన్న గొప్ప ఆదర్శాన్ని ప్రపంచమంతా మా మార్కెటే" అన్న విధంగా వక్రీకరిస్తున్నారు. అసమానమైన షరతులతో తమ ఆర్థిక ఆధిపత్యాన్ని కొనసాగిస్తున్నారు. వారి ఉత్పత్తులను ప్రజలు తమ అవసరాలుగా భావించేలా ప్రజల ఆలోచనారీతిని ప్రభావితం చేస్తున్నారు. ఈ మార్కెట్ మాయాజాలంలో చిక్కుకుని అనేక దేశాలు ఆర్థిక పరాధీనతతో, ఆత్మన్యూనతతో కునారిల్లుతున్నాయి. ఆధునికత పేరిట తమ ప్రాంతీయ, స్వాభావిక, సాంస్కృతిక జీవనాన్ని కోల్పోతున్నారు. అందుకే ఈనాడు ఆయా జాతులు, ప్రజల సాంస్కృతిక వారసత్వాన్ని గుర్తుచేస్తూ వారి ఆత్మగౌరవాన్ని, స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టుకునేలా కృషి చేయవలసిన అగత్యం ఏర్పడింది.

దోపిడీ సంస్కృతిని వ్యతిరేకిస్తూ, ప్రజా సంస్కృతిని పోషించుకోవలసి వుంది. ఇదే సందర్భంలో ప్రపంచీకరణ పేరిట వస్తున్న విష సంస్కృతికి విరుగుడుగా ప్రాంతీయ

సంస్కృతిని అభివృద్ధి చేస్తున్నామంటూ కొందరు, కాలంచెల్లిన భావాలను, మూఢనమ్మకాలను, వెనుకబాటు ధోరణులను, ప్రజాస్వామ్యవ్యతిరేక, భూస్వామ్యఅనుకూల భావజాలాన్ని ప్రచారం చేస్తున్నారు. ఒక దుష్టసంస్కృతికి మరో దుర్మార్గసంస్కృతి లేక మరోరకం దోపిడి సంస్కృతి ప్రత్యామ్నాయం కాదు. నిజమైన ప్రజానుకూల సంస్కృతిని అభివృద్ధి చేయవలసి వుంటుంది. అందుకే ప్రజల మధ్య సాంస్కృతిక సామరస్యాన్ని, విభిన్న జాతుల మధ్య సదవగాహనని పెంచుతూ, ఆధిపత్యవాదుల ప్రచారానికి ప్రజలను దూరం చేయాలి. చైనాలోని సూంగ్ ఛింగ్ లింగ్ సంస్థ తలపెట్టిన ఇలాంటి కార్యక్రమాలకు భారత చైనా మిత్రమండలి తనవంతు తోడ్పాటు అందిస్తున్నది.

బాలబాలికలలో నవచైతన్యం నింపటానికి, యువతీ యువకుల మధ్య స్నేహ సౌహార్దాలు విరబూయటానికి, మానవ సంబంధాలలో ఒక మానవీయ కోణాన్ని ఆవిష్కరించడానికి, ప్రపంచం నలుమూలలకు తమ దృష్టిని విస్తరించడానికి పిల్లలకు ఇదొక సదవకాశంగా భావించాలి. తమ సంస్కృతిని తామే చిన్నచూపు చూస్తున్నవారికి, మరచిపోతున్న వారికి, ఆత్మవిశ్వాసం కలిగించేలా సాంస్కృతిక ప్రదర్శనలు ఉండాలని నిర్వాహకుల అభిప్రాయం. ప్రతి జాతి తన విశిష్ట లక్షణాలను, తనదైన సృజనాత్మకతను కలిగివుంటాయి. అల్పవిషయాలుగా అనిపించినా, అవే అత్యంత ప్రాముఖ్యత కలిగిన జీవన తాత్వికతను వెలువరిస్తాయి. అవే సాంస్కృతిక వారసత్వాన్ని కొనసాగిస్తాయి. జాతి గౌరవాన్ని వెలిగిస్తాయి. ఆధిపత్యవాద సంస్కృతికి విరుద్ధంగా, సహోదర భావజనితమైన ప్రజాసంస్కృతిని పరిపుష్టం చేయడమే విశాల ప్రపంచాన్ని ఏకంచేసే మార్గం. విభేదాలను, విద్వేషాలను తుదముట్టించే సానుకూల ప్రజాభిప్రాయం పెరిగి, సరిహద్దుల కతీతంగా ప్రపంచమానవాళికి శుభం పూచే మార్గం.

ఇలాంటి ఉన్నత ఆశయాలతోనే భారత చైనా మిత్రమండలి మరోసారి బాల బాలికల బృందాన్ని తయారుచేసి చైనా పర్యటనకు పంపిస్తోంది. ప్రకృతిని పరిరక్షించే భారతీయ జీవన విధానానికి, వ్యవసాయాధారిత సమాజంలో ప్రకృతిని ప్రేమించి, పశువులకు, పూలకు సైతం దేవతా రూపమిచ్చి, ప్రణమిల్లి తమ కృతజ్ఞతలు పండుగల రూపంలో వెలిబుచ్చుతున్న మన సాంస్కృతిక నేపథ్యాన్ని ప్రదర్శిస్తోంది ఈ బృందం. సంక్రాంతి, బతుకమ్మ, బోనాలువంటి మన పండుగలను దృశ్యీకరిస్తోంది. ఆయుధ వ్యాపారుల ఆకాంక్షలు, యుద్ధ ప్రభువుల ప్రయోజనాలు ప్రపంచాన్ని కూటములుగా చీల్చుతున్నాయనీ, వారి కుట్రలకు వ్యతిరేకంగా ప్రజాసాంస్కృతిక బంధంతో ప్రజలు ఏకమై సాగితేనే ప్రపంచ శాంతి పరిఢవిల్లుతుందనీ, మరో కార్యక్రమంలో ప్రదర్శిస్తోంది. ఇవికాక సాంప్రదాయ నృత్యాలు, హస్తకళలు, కళాకృతులు, చిత్రపటాలు మొదలైనవి ప్రదర్శించి భారతీయ విశిష్టతను తెలియజేప్పే ప్రయత్నం జరుగుతోంది.

తమతో కలసి వుండబోయే వివిధ దేశాల బాలబాలికలను కలుసుకోవాలనీ, వారితో అనుభవాలు పంచుకోవాలనీ ఉవ్విళ్ళూరుతూ ఈ బృందం తన అధ్యయన యాత్ర

మొదలుపెడుతోంది. వేలాది సంవత్సరాల సాంస్కృతిక వారసత్వం, మైత్రి కలిగిన భారత చైనా దేశాల మధ్య ఇలాంటి రాకపోకలు మరింత స్నేహభరిత వాతావరణాన్ని నెలకొల్పగలవనీ, ఇరు దేశాల ప్రజలమధ్య ఐక్యత ఈ ప్రాంతంలోనూ, ప్రపంచంలోనూ శాంతికి మార్గం కాగలదని నమ్ముతూ, వీరి పర్యటన సుఖవంతమూ, ఫలప్రదమూ కావాలని ఆశిద్దాం.

*– జూలై, 2015*



# 11.

# బాలల బృందం చైనా పర్యటన అనుభవాలు

(చైనాలో అంతర్జాతీయ బాలల వేసవిశిబిరం 2016 సందర్భంగా...)

భారత చైనా మిత్రమండలి తరపున 2016, జులై 24 నుండి 31 వరకు పదిమంది బాలల బృందం చైనా పర్యటించి వచ్చింది. చైనాలోని సూంగ్ ఛింగ్ లింగ్ ఫౌండేషన్ వారి ఆహ్వానంతో బాలల బృందానికీ అవకాశం వచ్చింది. వారు నిర్వహించిన అంతర్జాతీయ వేసవి శిబిరంలో మన రెండురాష్ట్రాలకు చెందిన పిల్లలు పాల్గొనివచ్చారు. భావి ప్రపంచ పౌరులయిన నేటి తరాన్ని (12 నుంచి 17 సంగల వయసు గల వారిని) ఒక వేదికకు చేర్చి, వారం రోజుల పాటు వారంతా కలిసిమెలిసి తిరిగేలా కార్యక్రమాలు రూపొందిస్తోంది ఈ ఫౌండేషన్. ఈ సంవత్సరం దాదాపు 30 దేశాల నుంచి 300 మంది ప్రతినిధులు ఇటు ఆస్ట్రేలియా నుండి అటు అమెరికా వరకు, శ్రీలంక నుంచి మంగోలియా వరకు బీజింగ్ చేరుకున్నారు. మాల్దీవులు, మలేసియా, బోస్నియా, రుమేనియా, స్లోవాక్, పోలాండ్, కొరియా, జపాన్‌వంటి వివిధ దేశాలనుండి వచ్చిన పిల్లలను దేశం, భాష, జాతి ప్రమేయం లేకుండా కలగలిపి కొన్ని గ్రూపులుగా విభజించారు. వారంతా కలసిమెలసి తిరుగుతూ అనేక కార్యక్రమాలలో కలిసి పనిచేశారు. ఒకరినొకరు తెలుసుకుంటూ, ఒకరికొకరు సహకరించుకుంటూ వారం రోజులు స్నేహవర్షంలో తడిసిముద్దయిన వాళ్ళంతా, అంతర్జాతీయ స్నేహ పరిమళాన్ని వెదజల్లుతూ తమ దేశాలకు తిరిగి వెళ్ళారు. ఒక కొత్త దృష్టిని, ఒక విశాలత్వాన్ని సంతరించుకున్న పిల్లలు అనేక కొత్త విషయాలు నేర్చుకున్నామని చెబుతున్నారు.

మన తెలుగు బాలలబృందం సభ్యులు తమ జీవితాలకే ఒక మరపురాని అనుభవంగా మిగిలిపోతుందీ పర్యటన అని సంబరపడ్డారు. ఈ అవకాశం కల్పించిన భారత చైనా మిత్రమండలికి, తమనెంతో ఆప్యాయంగా ఆదరించిన సూంగ్ ఛింగ్ లింగ్ ఫౌండేషన్ నిర్వాహకులకు, పర్యటన ఆసాంతం తమకు తోడుగా నిలిచిన వలంటీర్లు, గైడ్స్ తదితర మిత్రులందరికీ మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలుపుతున్నారు.

మేడం సూంగ్ ఛింగ్ లింగ్ మావో నాయకత్వంలోని కమ్యూనిష్టు పార్టీతో భుజం భుజం కలిపి చైనా నిర్మాణ కృషిలో అవిశ్రాంతంగా కృషి చేసిన ధీరురాలు – స్త్రీలపట్ల, పిల్లలపట్ల, చైనా దేశ భవిష్యత్తుపట్ల అపారమైన శ్రద్ధాసక్తులతో జీవిత పర్యంతం తన విప్లవాత్మక కృషిని కొనసాగించి అంతర్జాతీయ నాయకురాలిగా వినుతికెక్కిన విదుషీమణి. 1981లో మరణించిన ఆ ధీరవనితకు సముచిత స్మృత్యంజలిగా, చైనావారు భావితరాలపట్ల బాధ్యతగా, ఆవిడ స్ఫూర్తిని కొనసాగిస్తున్నారు. యుద్ధ సంఘర్షణ కీలల మధ్య నలిగిపోతున్న ప్రపంచానికి ఒక ప్రత్యామ్నాయ శాంతి, సౌమనస్యాల సంస్కృతిని ప్రతిపాదిస్తున్నారు. అపనమ్మకాలు, ద్వేషాలు, అభిజాత్యాల పోరులో, అగ్రరాజ్యాల అధికార దురహంకారాలకు బలిఅవుతున్న జాతుల ఔన్నత్యాన్ని పునరుద్ధరించటానికి చైనా ప్రజా ప్రభుత్వం ప్రపంచానికి అందిస్తున్న అమూల్యమైన మార్గం ఈ మైత్రీ మార్గం. దానికోసం, నిష్కల్మషమైన పిల్లల హృదయక్షేత్రాలను ఆలంబనగా చేసుకుని భవిష్యత్ నిర్మాణానికి పునాదులు వేస్తున్నారు.

ఈ సంవత్సరం కార్యక్రమాలలో – బీజింగ్, ఛాంగ్ జీ, షాంఘై తదితర ప్రాంతాలలో ప్రతినిధులు విహరించారు. చైనా ప్రజాజీవితాన్ని వారిసంస్కృతిని గమనించారు. కళలు కమనీయ శిల్పాలు చూశారు, వనాలు, ఉద్యానవనాలు చూశారు. నగరాలను, వాటి అభివృద్ధినీ గమనించారు. వారి నిర్మాణాలను, మౌలిక వసతులను గమనించారు. చైనావారి ఆదరణ, ఆప్యాయతను అనుభవించారు. వారి వంటకాల రుచులు ఆస్వాదించారు. అనేక దేశాలనుంచి వచ్చిన వారంతా కలసి అద్భుత పూలవనాలుగా మారిపోయారు. పర్యాటక ప్రదేశాలు, చారిత్రక ప్రదేశాల సందర్శనలో పులకరించిపోయారు. ఆయా ప్రాంతాలను, వాటి చారిత్రక ఆధారాలను చైనావారు కాపాడుతున్న తీరుకూ, వాటిని వివరించిన పద్ధతికీ ముగ్ధులయ్యారు. ఇక చైనా కార్నివాల్‌లో చూసిన చిత్రాలు, డాన్సులు, ఆక్రోబాటిక్ ప్రదర్శనలు, వారి పాటలు ఇతర సాంస్కృతిక ప్రదర్శనలు ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఈ ప్రదర్శనలు చూస్తే చైనావారు ఒలింపిక్ గేమ్స్‌లో ఎందుకు అన్ని పతకాలు గెలుస్తున్నారో అర్థమవుతుందనీ, ఏ విషయంలోనయినా వాళ్ళు అంత పకడ్బందీగా ప్రాక్టీసు చేస్తారనీ మన పిల్లలు చెప్పారు.

"మీకు అన్నింటికన్నా ఎక్కువ నచ్చిన విషయం ఏమిటి?" అంటే "ప్రజలు ఆనందంగా వుండటం, నవ్వు ముఖాలతో సంచరించడం" అని చెప్పారు. "మీరు అక్కడినుంచి ఏమి నేర్చుకోవాలి" అని అడిగితే – "వాళ్ళ పంక్చువాలిటీ, సోసైటీపట్ల వాళ్ళు ఫీలయ్యే బాధ్యత, వారి డ్యూటీమైండ్" అన్నారు. అక్కడ చూసిన డైనోసార్ ప్రపంచం, సైన్స్ మ్యూజియాలు, ప్రదర్శనలు, 3-D ప్రింటింగ్‌లు, సాంకేతిక అభివృద్ధి, ఓరియంటల్ పెరల్ టవర్, హువాంగ్ హూ నదిలో నౌకావిహారంచేస్తూ షాంఘై నగరాన్ని విద్యుత్‌కాంతుల అలంకరణలో చూడటం – ఇలాంటివన్నీ ఎంతో ఆనందాన్ని, అంతకుమించి ఆశ్చర్యాన్ని కలిగించాయన్నారు. ఆ భవనాలు, విశాలమైన రోడ్లు, సౌకర్యాలు, రైల్వేలు, విమానాశ్రయాలకన్నా పెద్దగా, శుభ్రంగావున్న రైల్వేస్టేషన్లు, ఆశ్చర్యంతోపాటు కొంచెం అసూయను కలిగించాయి. ఇవన్నీ

మనదేశంలో ఎప్పుడు ఏర్పడతాయా అని దిగులూ కలిగిందన్నారు. ఆ ప్రజల క్రమశిక్షణ, సమయపాలన (Punctuality)లకు ఆశ్చర్యపడ్డాం. వాళ్ళ అభివృద్ధికి బహుశా అంకిత భావం, కఠోర పరిశ్రమ కారణమని అనుకుంటున్నాం అని అన్నారు. ఇంకొందరు పిల్లలు "ఆ దేశంలో ప్రభుత్వ అధికారులు ప్రజలకోసమే పనిచేస్తున్నారు. అది కమ్యూనిష్టు ప్రభుత్వం. కనుక ప్రజల మంచిని ఆలోచించి, ప్రజలందరినీ కదిలించి దేశాన్ని అభివృద్ధి పరుస్తున్నారు. అందుకే అక్కడ వేగంగా పనులు జరుగుతున్నాయి" అని అభిప్రాయపడ్డారు. "ఏది ఏమయినా మనదేశాన్ని ఫార్వార్డ్ బటన్ నొక్కి పరుగెత్తించినా చైనాను అందుకోవటానికి 50-100 సంవత్సరాలు పడుతుంది" అన్నారు ఈ పిల్లలు.

ఇక సాంస్కృతిక పరమయిన అంశాలవైపు చూస్తే పరస్పర పరిచయం అనే చిన్న ఉద్దేశంతో మొదలయిన ఈ శిబిరాలు, విశ్వమానవులుగా పిల్లలను తీర్చిదిద్దాలనే గొప్ప ఆశయం వైపు ప్రయాణిస్తూన్నాయి. ప్రతి ఒక్క ప్రతినిధీ ఈ ప్రపంచ సాంస్కృతిక వికాసంలో సమాన భాగస్వామి. దేశాలకు విస్తీర్ణంలోనూ, జాతులకు జనాభాపరంగాను చిన్నాపెద్దా తేడాలుంటాయి గానీ, ప్రతి జాతి వారూ ఈ మానవజాతి మహాప్రస్థానంలో సముచితస్థానం కలవారే అన్న సూత్రాన్ని పాటిస్తూ, నేషనల్ డే కార్యక్రమాల పేరిట ఆయా దేశాలకు, జాతులకు చెందిన ప్రత్యేకతలను చాటిచెప్పే అంతర్జాతీయవేదికగా ఈ శిబిరాలు రూపొందిస్తున్నారు. ప్రతిదేశంవారికి ఐదు నిమిషాలపాటు తమ సంస్కృతీ విశిష్టతలను ప్రదర్శించే అవకాశం కల్పించారు. మన తెలుగుబాలలు 'థింసా' నృత్యరూపంలో గిరిజన జీవితాన్ని, బతుకమ్మ ఆటపాటల ద్వారా గ్రామీణజీవితాన్ని అక్కడ ప్రదర్శించి చూపారు. ఇండియాస్టాల్‌లో మన చేతికళలు, అద్దకం వస్తువులు, రంగుల రేఖాచిత్రాలు, మన నృత్యరీతులు, పండుగలు, జానపద కళారూపాలను పోస్టర్లుగా ప్రదర్శించారు. మనవైన వంటకాలు రుచి చూపించారు. ప్రతిభాప్రదర్శన విభాగంలో 'సామరస్యంవైపు ప్రపంచం' అనే నృత్యాన్ని ప్రదర్శించారు. జీవ వికాసక్రమంలో మానవ అభివృద్ధి, వివిధ రూపాల సాంఘిక వ్యవస్థలు, మనిషి నడిచి వచ్చిన ఆటవిక, ఆదిమానవ సమాజాలు, రాజరికాలు, భూస్వామ్య విధానాలు, పారిశ్రామిక ప్రగతి తదనంతర పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధి క్షయాలు, వాటి దోపిడి విధానాలు, ప్రజలను విభజించి పాలించే కుటిల వైఖరులను, ప్రజలు వాటిని ఎప్పటికప్పుడు ఎదిరించి పోరాడి, ఒక సోషలిస్టు నిర్మాణ ధ్యేయంతో ప్రపంచశాంతి, అభ్యుదయాలవైపు అకుంఠితంగా సాగిపోతున్న ఉద్యమ క్రమాన్ని మైమ్ డ్రామాగా ప్రదర్శించారు. ఇక వ్యక్తిగత ప్రతిభా ప్రదర్శనలో కూడా పాల్గొని 'భాంగ్రా' సాంప్రదాయ నృత్యాలతో కనువిందు, సారేజహాసే అచ్ఛా గీతంతో (వాయిద్య సంగీతంగా) వీనులవిందు కలిగించారు. ఈ ప్రదర్శనలు తోటి ప్రతినిధులను ఎంతగానో ఆకట్టుకున్నాయి.

ప్రతి రోజు ఇంటరాక్టివ్ సమావేశాలు, చైనావారి సాంస్కృతిక ప్రదర్శనలు, ఇతరదేశాల ప్రతినిధులతో ముచ్చట్లు, బహుమతులు, కానుకలు ఇచ్చి పుచ్చుకోవటంతో వారం ఇట్టే

గడిచిపోయింది. "భారతీయ ప్రజాసంస్కృతిని, జీవనవిధానాన్ని ఇతరులకు పరిచయం చేయటానికి మేము ప్రయత్నించాము. వాళ్ళకు భారతీయ సంస్కృతి పట్ల గౌరవం, భారతీయుల పట్ల స్నేహభావం వుందని మాకర్థమయ్యింది. చైనాలో మనపట్ల ఎక్కడా శత్రుభావం కానీ, చులకన కానీ కనపడలేద"ని ఈ ప్రతినిధులంతా అభిప్రాయపడుతున్నారు. అంతేకాక మన స్టాలు అలంకరణ, మన దుస్తులు, మన ప్రదర్శనలు మొదలయిన వాటి పట్ల వాళ్ళు కూడా ఆకర్షితులయ్యారు. వారికి మన పట్ల ఎంతో ఆసక్తి వుంది. ఇక ఇతర దేశాల ప్రతినిధులు కూడా మా పట్ల ఒక రకమయిన ఆరాధన, గౌరవం చూపించారు. "ఇండియా అంటే గొప్ప దేశం మీ సంస్కృతి చాల విశిష్టమయినది అని ఇతరులు చెబుతుంటే మాకు ఎంతో గర్వంగా అనిపించింది" అని పిల్లలు చెప్పారు. "మనదగ్గర వున్న అసౌకర్యాలు, అసమానతలు ఏవీ గుర్తురాలేదు" అన్నారు. "మన దేశం గొప్పతనాన్ని నిలబెట్టటానికి, మంచి అభివృద్ధిని సాధించడానికి భారతీయులమంతా చైనావారి మాదిరిగా బాధ్యతాయుతంగా, అంకితభావంతో పనిచేయాలని మా అభిప్రాయం" అని ఈ ప్రతినిధులు తమ తుదిమాటగా చెబుతున్నారు.

"వారం రోజులు ఒక కొత్త లోకంలో తిరిగిన మాకు, అంతమంది ఫ్రెండ్స్‌ని వదలి రావాలనిపించలేదు. 31వ తారీఖు వచ్చేసరికి అప్పుడే తిరిగి వెళ్ళిపోతున్నామా అని దిగులు కూడా కలిగింది. అయితే మనకు ఇప్పుడు అనేక దేశాలలో స్నేహితులు వున్నారు అనే అద్భుతమైన అనుభూతితో తిరిగివచ్చాము. నిజానికి మాలో ఉబికివస్తూన్న భావాలను చెప్పటానికి మా దగ్గర మాటలే లేవు. ఈ చైనా పర్యటన మాకు ఒక అద్భుతం, మరిచిపోలేనిది. మా కోసం, మన దేశం కోసం ఎన్నో నేర్చుకుని వచ్చాము" అని అన్నారు.

ఇంతటి స్నేహాన్ని, ఆదర్శాన్ని, నమ్మకాన్ని కలిగించిన ఈ పిల్లల బృందం చేసిన చైనా పర్యటన అనుభవాలు పెద్దలకూ పాఠం కాగలుగుతాయని ఆశిస్తున్నా. భారత చైనా మిత్ర మండలి నిర్వహిస్తున్న ఇటువంటి కార్యక్రమాలకు మీ అందరి సహకారాన్ని ఆకాంక్షిస్తూ, ఈ అనుభవాలు మీతో పంచుకుంటున్నాము.

*– జూలై, 2016*



# 12.

# అందరి భాగస్వామ్యంగల భవిష్యత్తు

*[అక్టోబరు 18-21, 2017లో జరిగిన చైనా కమ్యూనిస్టు పార్టీ 19వ కాంగ్రెస్ సందర్భంగా 'మానవాళికి అందరి భాగస్వామ్యంగల భవిష్యత్తు సమాజం తయారవుతోంది' ("A community of shared future for mankind in the making") అనే శీర్షికన 'జిన్హువా నెట్ డాట్ కామ్'లో మెంగ్ నా అనే రచయిత 6-10-2017న ఈ వ్యాసం ప్రచురించారు. 2012లో జరిగిన 18వ కాంగ్రెస్ తరువాతి ఐదు సంవత్సరాల కాలంలో చైనా అనుసరిస్తున్న విదేశాంగ దౌత్యపరమయిన విధానాలగురించి ఈ వ్యాసంలో వివరించారు. చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ 18-1-2018న జెనీవా యు.యన్. సమావేశాలలో చేసిన ప్రసంగం దీనికి ఆధారంగా వుంది. తెలుగు పాఠకుల సౌకర్యంకోసం కొన్ని వివరణలు, నోట్సు అదనంగా చేర్చటం జరిగింది.]*

గత 50 సంవత్సరాలలో అనూహ్యమైన అభివృద్ధిని సాధించి, వర్తమాన ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిణామాలను ప్రభావితం చేయగల బలమైన శక్తిగా రూపుదిద్దుకున్నది జనచైనా. ప్రపంచ రంగస్థలంపై ఎవ్వరూ విస్మరించలేని కంఠం తనది. ఈ చరిత్రాత్మక స్థానం పొందటమేకాదు, పెట్టుబడిదారీ ప్రపంచం ఆలోచించని, కనీసం అర్థం చేసుకోలేని అనేక ప్రత్యామ్నాయ విధానాలను ప్రవేశపెడుతూ మానవాళి భవిష్యత్తును భద్రమయిన దిశకు చేర్చే గురుతరమయిన బాధ్యత నిర్వహిస్తోంది చైనా. ఇప్పటికీ 17 లక్షల కోట్ల డాలర్ల ఆర్థిక వ్యవస్థతో అమెరికా ప్రథమస్థానంలోనే వుంది. మరి చైనా 11 లక్షల కోట్ల డాలర్ల సంపత్తితో రెండో స్థానానికి చేరుకుంది*. అమెరికాను అధిగమించి ప్రథమస్థానం పొందటానికి ఎంతో సమయం పట్టకపోవచ్చు.

---

** 2018లో అమెరికా జిడిపి 20 లక్షల కోట్ల డాలర్లు. చైనాది 14.8 లక్షల కోట్ల డాలర్లు. అమెరికా తలసరి జిడిపి 64,767 డాలర్లు. కాగా చైనాలో అది 9,500 డాలర్లు. సాధారణ జిడిపి రీత్యా (NGDP) అమెరికా మొదటి స్థానంలోనూ, చైనా రెండవ*

ఒకవైపు అమెరికా యుద్ధాల ఊబిలో దిగబడుతూ, ప్రపంచమంతా ఆయుధాలు అమ్ముకొని, ప్రపంచదేశాల మధ్య విద్వేషాలు పెంచిపోషిస్తూ వుంటే, చైనా, అత్యధిక ఉత్పాదక సామర్థ్యంతో ప్రపంచానికి కావలసిన అనేకరకాల సరుకులు చవకగా ఎగుమతిచేస్తూ, ప్రపంచ అవసరాలు తీరుస్తున్నది. తాను ఆర్థికంగా ఎదుగుతున్నది. అందువల్ల ప్రపంచ ఆర్థిక కేంద్రం పశ్చిమదేశాలనుంచి తూర్పుదిక్కుకు కదులుతున్నది. ఇది అమెరికాకు రుచించనిదే. కనుక చైనా ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయటానికి, చైనాలోని ఉత్పాదక ఆర్థిక వ్యవస్థను యుద్ధ ఆర్థిక వ్యవస్థగా మార్చి చైనా అభివృద్ధి దారిని మరల్చాలని అమెరికా భావిస్తోంది. ఈ లక్ష్యం కోసమే అమెరికా తన విదేశీవిధానాన్ని, మరీ ముఖ్యంగా ఆసియా వ్యవహారాల్లో కలగజేసుకొని, చైనా చుట్టూ ఏవో ప్రాంతీయ సమస్యలు సృష్టించాలనీ, వాటిని పెంచి యుద్ధజ్వాలలుగా మార్చాలని ప్రయత్నిస్తున్నది. దీనికి ప్రతిగా చైనా సామ్రాజ్యవాద దేశాలు ముఖ్యంగా అమెరికా అగ్రరాజ్యం కుట్రలను విజయవంతంగా ఎదుర్కొంటూ, ఇరుగుపొరుగు దేశాలతో సత్సంబంధాలు

**ఆర్థిక వ్యవస్థల తులనాత్మక పట్టిక**

*(C.I.A World Fact Book 2019 సెప్టెంబరు **2019** వరకువున్న సమాచారం ఆధారంగా డాలర్లలో)*

| క్ర.సం. | వివరం | అమెరికా | చైనా | ఇండియా |
|---|---|---|---|---|
| 1. | జిడిపి (నామినల్) | 21.345 ట్రి. | 14.2 ట్రి. | 2.9 ట్రి. |
| 2. | జిడిపి (పిపిపి) | 19.49 ట్రి. | 23.21 ట్రి. | 9.47 ట్రి. |
| 3. | తలసరి జిడిపి (పిపిపి) | 59800 | 16700 | 7200 |
| 4. | బయటి అప్పులు | 17.91 ట్రి. | 1.60 ట్రి. | 501.6 బి. |
| 5. | జిడిపిలో అప్పుల శాతం | 78.8% | 47% | 71.2% |
| 6. | మానవ అభివృద్ధి సూచిక | 0.924 | 0.643 | 0.640 |
| 7. | నిరుద్యోగిత శాతం | 4% | 3.9% | 8.5% |
| 8. | దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నది | 15% | 3.3%[1] | 21.9% |
| 9. | విదేశీ మారక నిల్వలు | 123.3 బి. | 3.236 ట్రి. | 409.8 బి. |
| 10. | మొత్తం ఎగుమతులు | 1.553 ట్రి. | 2.216 ట్రి. | 304.1 బి. |
| 11. | మొత్తం దిగుమతులు | 2.361 ట్రి. | 1.74 ట్రి. | 452.2 బి. |

*ట్రి. =ట్రిలియన్ = లక్ష కోట్లు; బి. = బిలియన్ = 100 కోట్లు*

*([1] ప్రపంచబ్యాంకు సమాచారం ప్రకారం చైనాలో 2015 నాటికి దారిద్ర్యరేఖకు దిగువన వున్న ప్రజలు 0.7% మాత్రమే.)*

భారతదేశంలో ప్రజల కనీస ఆదాయ సూచిక - సంవత్సరానికి రూ.27000.00 (అంటే రోజుకు 0.5 డాలర్లు)
చైనాలో ప్రజల కనీస ఆదాయ సూచిక - 2300 యువాన్లు (అంటే రోజుకు 0.65 డాలర్లు)

*స్థానంలోనూ వున్నాయి. అయితే, కొనుగోలుశక్తి ఆధారంగా (PPP పర్చేజింగ్ పవర్ పారిటీ) చైనా మొదటి స్థానంలోనూ, అమెరికా రెండవ స్థానంలోనూ వున్నాయి. ఫిబ్రవరి 2019 నాటికి అమెరికాకు 22 లక్షల కోట్ల డాలర్ల అప్పులున్నాయి. అందులో దేశీయ అప్పు 16 లక్షల కోట్లు. వారి జిడిపిలో ఇది 78%. 2018 అక్టోబరు వరకు చైనా అప్పులు 5.2 లక్షల కోట్ల డాలర్లు. అది వారి జిడిపిలో 47%. మానవ అభివృద్ధి సూచికలో చైనా 0.752 కన్నా అమెరికా 0.924 తో కొంచెం ముందంజలోవుంది. సమాజంలో ఆర్థిక అసమానతలను సూచించే జినీ సూచిక చైనాలో 40 అమెరికాలో 41.5తో దాదాపు సమానంగా వుంది. ముందుగా సంపత్తిని పెంచుకున్న చైనా ప్రస్తుతం ఆర్థిక అసమానతలను తగ్గించే కృషి చేస్తోంది. ప్రపంచంలోనే అత్యధికంగా 3.1 లక్షలకోట్ల డాలర్ల విలువగల విదేశీ మారక ద్రవ్య నిధులతో చైనా ఆర్థికవ్యవస్థ పటిష్టంగా వుంది. (వీకీపీడియా నుంచి, ఐయమ్ఎఫ్ రిపోర్టులు మరియు సిఐఏ వరల్డ్ ఫ్యాక్ట్ బుక్ 2018 ఆధారంగా).*

నెలకొల్పుకుని శాంతిమార్గంలో నడిచే ప్రయత్నం చేస్తున్నది. పంచశీల సూత్రాలను ఇప్పటికీ ప్రచారం చేస్తూ, ఆచరిస్తూ చిన్న చిన్న దేశాల మన్ననలు పొందగలుగుతోంది. చైనా ప్రభుత్వం తీసుకుంటున్న అనేక చర్యలను నిర్దేశించేది చైనా కమ్యూనిస్టు పార్టీ రాజకీయ, తాత్విక ఆలోచనాధార అని అందరూ ఎరిగినదే.

చైనా కమ్యూనిస్టు పార్టీ 19వ జాతీయ మహాసభల (18-24, అక్టోబరు 2017) సందర్భంగా, గత ఐదు సంవత్సరాలుగా చైనా ఇతర దేశాలతో వ్యవహరించిన తీరును పరిశీలించి, భవిష్యత్తులో చైనా విదేశాంగ నీతి ఏ సూత్రాల ఆధారంగా వుండబోతున్నదీ ఒక అంచనా వేయటం ఆసక్తికరంగా, ఉపయుక్తంగా వుంటుంది. ముఖ్యంగా మనదేశంలో చైనాపట్ల వున్న అమిత్ర, శతృపూరిత ప్రచారం నేపథ్యంలో అసలు వారు ఏమి చెబుతున్నారు అనేది చైనావారినుండి వినటంకూడా వాస్తవాలకు దగ్గరగా తీసుకువెళుతుంది.

'అందరి భాగస్వామ్యంగల ఉమ్మడి భవిష్యత్తుకై సమాజ నిర్మాణం' (build a community with a shared future for mankind) అనే అవగాహనగల పదబంధాన్ని చైనా ప్రచారం చేస్తున్నది. ఆపార్టీ (సిపిసి) 18వ జాతీయ మహాసభలలో 2012లో ఈ ఆలోచన వినిపించింది. పార్టీ నివేదికలలో దానిని పొందుపరిచారు. ఆ ఆలోచనాబీజం నేటికి విస్తరించి చక్కని ప్రణాళికాబద్ధమయిన, స్పష్టమయిన దిశను సూచించే ఆచరణాత్మక కార్యక్రమంగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన మద్దతును కూడగట్టుకున్నది కూడా!

బహుధృవ ప్రపంచం, ప్రపంచీకరణ, సాంస్కృతిక భిన్నత్వం, పరస్పర ఆధారిత వ్యవస్థ, శాస్త్ర, సాంకేతిక, పారిశ్రామిక రంగాలలో విప్లవాత్మక అభివృద్ధి అనేవి నేటి ప్రపంచాన్ని అభివర్ణించే కీలక అంశాలుగా చైనీయులు భావిస్తారు. ఇదే సమయంలో ప్రపంచ ప్రజలు బహుముఖమైన సమస్యలు, సవాళ్ళను ఎదుర్కొంటున్న దశలోకూడా వున్నారు. ప్రపంచవ్యాప్తంగా చూస్తే అభివృద్ధివేగం మందగమనంతో వుంది. నిరాసక్తికరంగా సాగుతోంది. నిన్నటి ఆర్థిక సంక్షోభపు ప్రభావం, దట్టంగా అలుముకున్న కారుమబ్బులా ప్రపంచ ఆర్థిక ఆకాశాన్ని ఇంకా ఆవరించుకునేవుంది. వాతావరణం అనూహ్యమైన మార్పులకు గురవుతోంది. అభివృద్ధిలో అసమానత ఆవులిస్తోంది. ప్రచ్ఛన్నయుద్ధపు భావజాలం, తమ అధికారంకోసం ఆధిపత్య రాజకీయాలు కొనసాగుతూనే వున్నాయి. ఒకవంక ఉగ్రవాదం, మరోవంక శరణార్థుల సమస్య విస్తరిస్తున్నాయి అని చైనా నాయకత్వం ప్రపంచ పరిస్థితిని విశదపరుస్తోంది.

ఈ నేపథ్యంలో చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ ప్రతిపాదించినదే – ఏ ముసుగులూలేని, పారదర్శకమైన, సామూహిక భాగస్వామ్యంగల భవిష్యత్తుకై స్వచ్ఛమయిన సమాజం నిర్మించటం. చిరకాలం సుస్థిరశాంతిని నెలకొల్పేది, ఉమ్మడి సంపదను పెంచేదీ, ఉమ్మడి రక్షణ కల్పించేది ఈ ప్రతిపాదన. అందరినీ కలుపుకొని వెళ్ళవలసిన ఒక శాంతిమార్గం అది.

అభివృద్ధికోసం ఉమ్మడి భాగస్వామ్యం అన్న ఈ భావన, అలుముకున్న చీకట్లమధ్య ఒక దీపస్తంభంలా వెలుగుతోంది. అందరి భాగస్వామ్యంతో నిర్మించుకునేదే అసలయిన భవిష్యత్తు అని భావించే ప్రజలందరికీ ఆశాకిరణంలా కనిపిస్తోంది.

ఇంతవరకూ నడిచిన సంఘర్షణాపూరిత రాజకీయాలు, అవకాశవాద పొత్తులు, అల్పమయిన ముఠాలు ఏం సాధించాయి? ఈ ప్రపంచానికి ఏమిచ్చాయి? ఏ సాంత్వన కలిగించాయి? ఇక దేశాలమధ్య సంబంధాలు, సదవగాహనమీద, పరస్పర గౌరవంమీద, సత్‌సంభాషణ మీద ఆధారపడి, తమమధ్య చక్కని భాగస్వామ్యాన్ని నిర్మించుకోవలసిన సమయం ఆసన్నమయింది.

2017 జనవరిలో శ్రీ జిన్‌పింగ్ జెనీవా సమావేశాలలో చెప్పినట్లు – "పెద్దదేశాలు చిన్న దేశాలను తమతో సమానులుగా భావిస్తేతప్ప, తమ ఆధిపత్యపు ఆకాంక్షలను వారిపై బలవంతంగా రుద్దటం మానివేస్తే తప్ప దేశాలమధ్య సామరస్యం చిగురింపజేసే సదాశయాలు నెరవేరవు.

శక్తివంతమయిన దేశాలు, మిగిలిన దేశాల ప్రధాన అభిలాషలను, వారి అవసరాలను, ఆకాంక్షలను గుర్తించి గౌరవించనిదే, పెద్దదేశాలు తమమధ్యవున్న విభేదాలను నియంత్రించుకోనిదే, ఈ కొత్తరకం సంబంధాలు నెలకొల్పుకోజాలవు. సంఘర్షణ స్థానంలో సహకారాన్ని, శతృవైఖరి స్థానంలో సమాదరభావాన్ని నెలకొల్పుకోవాలి! ఎదుటివారిని వోడించి దెబ్బతీసేబదులు పరస్పర ప్రయోజనం సిద్ధించే, ఇరుపక్షాలకు మేలుచేసే పద్ధతులను (విన్–విన్) అనుసరించాలి.

ఉమ్మడి వ్యవస్థ, సమ్మిళిత అభివృద్ధి, సహకారం, నిలకడైన రక్షణ అనేవి ఈ ఐదు సంవత్సరాలుగా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ వచిస్తున్న విధానాలు. వాటికనుగుణంగానే చైనా ప్రపంచ వాణిజ్య సంస్థ (WTO) నియమాలను ఆచరిస్తోంది. వాటిని సమర్థిస్తోంది. ముసుగులులేని, పారదర్శకమైన, వివక్షతలులేని వాణిజ్యాన్ని ప్రతిపాదిస్తోంది. ఈ రోజున స్వేచ్ఛా వాణిజ్య ప్రపంచపు మొనగాళ్లుగా చెప్పుకుంటున్న అమెరికావంటి దేశాలేమో స్వంతలాభంకోసం వ్యాపారంలో వివక్షతలు పాటిస్తూ, వారి దేశాలలో దేశీయశక్తులను కాపాడటం పేరిట అనేక రక్షణాత్మక వైఖరులు అవలంబిస్తున్నాయి. స్వేచ్ఛా వాణిజ్యం పేర ఇప్పటివరకు అభివృద్ధి చెందిన దేశాలు ఇతర దేశాలను ఇష్టారీతిని కొల్లగొట్టాయి. అయితే అభివృద్ధి చెందుతున్న దేశాలు ప్రపంచీకరణలో భాగంగా తమలోతాము కొన్ని అవకాశాలను కల్పించుకుని తమ స్వంత అభివృద్ధి పంథాలను అనుసరిస్తున్నాయి. దాదాపు 100 దేశాలు డబ్ల్యూ.టి.వో. ఒప్పందాలమేరకు సమిష్టిగా బేరసారాలు చేయగలుగుతున్నాయి. ఈ పరిణామాలు సహించలేని సామ్రాజ్యవాద దేశాలు తమ ఆర్థికపట్టు సడలకుండా కాపాడుకోవటానికి, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయోజనాలను దెబ్బతీసే విధంగా తమ

దేశీయ శక్తులకు రక్షణ అనే వైఖరిని లేవనెత్తాయి. దేశాలపట్ల వివక్షతలు ప్రదర్శిస్తున్నారు. వారికనుకూలంగాలేని (WTO) నియమాలను నిరాదరిస్తున్నారు. అందుకే ఈ వైఖరులకు వ్యతిరేకంగా చైనా, అంతర్జాతీయ వ్యాపారంలో వివక్షలతో కూడిన రక్షణాత్మక వైఖరులు అవలంబించటం తప్పనీ, ఏ దేశమైనా తనకుతాను ఒంటరిగా మిగిలిపోవటం ఎవ్వరికీ లాభకరం కాదు అని స్పష్టంగా గళం విప్పింది.

చైనా ప్రతిపాదించిన "ఉమ్మడి భాగస్వామ్యంతో భవిష్యత్తును నిర్మించుకోవటమనే" అవగాహనను ఐక్యరాజ్య సమితి కూడా సమ్మతించి రోదసిలో ఆయుధపోటీని నివారించటానికి 2017లో చేసిన తీర్మానాలలో దాన్ని పొందుపరిచింది. అలాంటి భవిష్యత్తును నిర్మించటానికి, ఆర్థిక ప్రపంచీకరణ తప్పనిసరిగా పారదర్శకమై ఉండాలి. బహిరంగమై వుండాలి. సమతుల్యంగా వుండాలి. అందరికీ ప్రయోజనకరంగా వుండాలి. అందరి అభిలాషలు కలుపుకొని వెళ్ళేదిగా వుండాలి. దీనికోసం చైనా నాయకత్వం చెబుతున్నదేమంటే "మనం రొట్టెను పెద్దదిగా తయారు చేద్దాం. అలాగే దానిని సముచితంగా పంచుకొందాము." సమానత్వం, న్యాయం ప్రాతిపదికగా ఈ పంపకం జరగాలన్నదే ఆయన ప్రకటనల సారాంశం.

2016 సెప్టెంబరులో హాంగ్‌ఝూవ్‌లో (చైనా) జరిగిన జి-20 దేశాల శిఖరాగ్ర సమావేశం ఈ భావాలతో కూడిన సృజనాత్మక అభివృద్ధి పథకాలకు తలవూపింది. ప్రపంచం ముందువున్న స్థూలలక్ష్యాలలో 'అభివృద్ధి'ని కేంద్ర బిందువుగా గుర్తించి దానికోసం ఒక ఆచరణ పథకాన్ని కూడా రూపొందించింది.

అందరూ భాగస్వామ్యం వహించే ఒక సమాజాన్ని తీర్చిదిద్దటంలో భాగంగా 'బెల్ట్ అండ్ రోడ్' అనే మరో ప్రతిపాదన తెచ్చింది చైనా నాయకత్వం. 100కు పైగా దేశాలు, అంతర్జాతీయ సంస్థలు అనేకం దీనిని సమర్థించాయి. ఇప్పటికే నిర్మించిన మొదటిదశ ప్రాజెక్టుల తొలి ఫలితాలు అప్పుడే సామాన్య ప్రజల జీవితాలను ప్రభావితం చేయటం ఆరంభమయ్యింది కూడా. సమ్మిళిత ప్రగతి, అభివృద్ధి సాధించాలంటే పటిష్టమయిన మౌలిక సదుపాయాలు అవసరం. ఆసియా మౌలిక వనరులు అభివృద్ధి బ్యాంకు (AIIB) ఈ విషయంలో ప్రపంచానికి అవసరమయిన వసతులు, వనరులు సమకూర్చటంలో సహకరిస్తోంది.

మానవాళి భవిష్యత్తుకోసం ఈ భూగోళాన్ని పరిరక్షించుకోవటం ఒక అవసర కర్తవ్యంగా మారింది. పర్యావరణాన్ని, మారిపోతున్న వాతావరణాన్ని కాపాడుకోవటానికి పారిస్ ఒొప్పందాన్ని అమలుచేయటం అత్యుత్తమ మార్గమని చైనా భావిస్తున్నది. ఈ విషయంలో చైనా తనమీదవున్న బాధ్యతలను సక్రమంగా అర్థం చేసుకున్నది. ఈ భూగోళాన్ని, పర్యావరణాన్ని సంరక్షించటంలో తనవంతు బాధ్యతను చిత్తశుద్ధితో నిర్వహిస్తోంది. అంతే చొరవతో, వుత్సాహంతో ఇతరదేశాలు కూడా తమవంతు బాధ్యతలు పంచుకోవాలని పిలుపునిస్తోంది.

ఇలా ఆచరణాత్మక పథకాలతో శాంతి, అభివృద్ధి అందరి భాగస్వామ్యం, బహుళపక్ష స్వభావం అనే విధానాలు ప్రవేశపెట్టి చైనా ఐదు సంవత్సరాలుగా వాటిని ఆచరించి

చూపుతోంది. ప్రస్తుతం కొన్ని చేర్పులు చేసినా గతంలో కూడా చైనా మౌలికంగా ఇవే విధానాలు అనుసరిస్తోంది. ఇవే ఉన్నత విలువలు రానున్న కాలానికి అన్ని దేశాలకు దారిదీపాలుగా వెలుగొందుతాయని ఆశించగలము. చైనా కమ్యూనిస్టు పార్టీ 19వ మహాసభలు ఈ విషయాలను ప్రపంచం ముందుకు తెచ్చాయి.

మానవాళి భవిష్యత్తును నిర్మించే ఉమ్మడి భాగస్వామ్యంగల అంతర్జాతీయ సమాజం తయారవుతోంది. సామ్రాజ్యవాద దేశాలు, అమెరికా అగ్రరాజ్యం అనుసరిస్తున్న పెత్తందారీ విధానాలకు రాజకీయంగా, దౌత్యపరంగా, ఆర్థికంగా అవసరమయిన చర్యలు తీసుకుంటూ చైనా ఈ ఉమ్మడి భవిష్యత్తుకోసం కృషిచేస్తోంది. ఇది అంతర్జాతీయ స్థాయిలో జరుగుతున్న వర్గపోరాటం. అగ్రరాజ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం. అందువల్ల భారత ప్రజలు కూడా ఈ పోరాటంలో భాగం కావాలి. భారతదేశం అమెరికా పన్నుతున్న యుద్ధవ్యూహాలనుండి బయటపడి, శాంతిప్రియత్వంతో, అభివృద్ధికోసం ఏకాగ్రదృష్టితో, ఇరుగు పొరుగులతో స్నేహ సంబధాలు పెంచుకోవలసిన అవసరం ఎంతైనావుంది. ఆసియాలో పెద్ద శక్తులుగావున్న భారత, చైనాలు ఏకంగా ముందుకువస్తే ప్రపంచశాంతికి సుస్థిర మార్గం ఏర్పడుతుంది. అదే విశ్వశ్రేయస్సుకు, మానవాళి మనుగడకు సరైన దారిగా కనపడుతోంది. ఆ ఉమ్మడి భాగస్వామ్యం కోసం, ఆ ఉన్నత సమాజ నిర్మాణంకోసం కలిసి కదులుదాం.

*– సెప్టెంబరు, 2019*



# 13.

# చైనా అభివృద్ధిలో ప్రజాస్వామ్య దృక్పథం

*(2017 అక్టోబరు 18-24 తేదీల మధ్య జరిగిన జరిగిన చైనా కమ్యూనిస్టు పార్టీ 19వ జాతీయ మహాసభల సందర్భంగా పాశ్చాత్య పత్రికలు ఎంతో ఆసక్తిని ప్రదర్శించాయి. సామాజిక మాధ్యమాల ద్వారా అనేక విషయాలు ప్రచారం చేశాయి. అయితే ఇవన్నీ పాశ్చాత్య దృక్కోణం నుండే జరిగాయన్నది నిజం. మన దేశంలో కూడా దాని ప్రతిధ్వనులే వినవచ్చాయి. ఈ సందర్భంలో చైనా అభివృద్ధిని, అక్కడవున్న ప్రజాస్వామ్య పద్ధతిని గురించి కొంత లోతుగా చర్చించుకోవటం ఉపయుక్తంగా వుంటుంది.)*

ప్రపంచంలో భిన్నమైన వ్యవస్థలువున్నాయి. భిన్న విభిన్నమయిన సంస్కృతులు వున్నాయి. నేటి పాలన వ్యవస్థలలో అందరూ అభిలషించేది ప్రజాస్వామ్యాన్ని. అయితే ప్రజాస్వామ్యం అనేది కూడా అనేక రూపాలలో వుంటుంది. ప్రజాస్వామ్యమంటే ప్రజల అభీష్టం సిద్ధించటంగా అర్థం చేసుకుంటే ఈ రోజు మనం చైనాను పెద్ద ప్రజాస్వామ్య దేశంగా గుర్తించక తప్పదు. బహుళ పార్టీల వ్యవస్థ, సార్వత్రిక ఎన్నికలు మాత్రమే ప్రజాస్వామ్యానికి కొలబద్దలు కావు. సుమారు 9 కోట్ల మంది సభ్యులు గల చైనా కమ్యూనిస్టు పార్టీ, ఆ పార్టీ నాయకత్వంలోని ప్రభుత్వం అనేక దశలలో చర్చించి ప్రజాభిప్రాయాలను సమీకరించి, పరిగణించి, వాటికనుగుణంగా తమవిధానాలను రూపుదిద్దే క్రమం ప్రజాస్వామ్యం కాదనగలమా? ప్రపంచ జనాభాలో 18.7% గల 140కోట్ల మందికి ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వం ప్రజాస్వామ్యం కాదంటామా? చైనా రాజ్య అధికారానికి అత్యున్నత సంస్థ వారి నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్ (ఎన్.పి.సి.). చైనాలో జాతీయ ప్రజా కాంగ్రెసులో చైనా కమ్యూనిస్టు పార్టీతో పాటు ప్రాతినిధ్యం వహిస్తున్న ఎనిమిది ఇతరపార్టీలు వున్నాయి. ఆ పార్టీలతో సమాలోచనలు, సంప్రదింపులు జరిపి వారి ఆలోచనలను విశ్లేషించి అంతిమ నిర్ణయం తీసుకునే చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని ప్రభుత్వ విధానం ప్రజాస్వామ్యం కాదా?

అతి భారీ జనాభాగల ప్రజల జీవన ప్రమాణాలను పెంచి, వారికి సౌకర్యవంతమయిన జీవితాన్ని అందిస్తున్న సమాజం ప్రజాస్వామ్యం కాదంటామా? ఇంకా దేశంలో మిగిలి వున్న 2 కోట్లమంది పేదలను సైతం పేదరికం కోరల నుండి బయటకులాగే ప్రయత్నాలు చేసున్న ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్యం కాదంటామా? ప్రజాస్వామ్య దేశాలని చెప్పుకునే ఏ పాశ్చాత్య దేశమయినా ఇంతటి భారీ ప్రణాళికలతో తన ప్రజల శ్రేయస్సు కోసం పాటుబడుతున్నదా?

30 సంవత్సరాల క్రితం వెనుకబడిన ఆర్థిక వ్యవస్థగల దేశం ఈనాడు 80 కోట్ల ప్రజల పేదరికం, ఆకలి, నిరుద్యోగం, అవిద్యలను పారద్రోలి, ప్రపంచంలో 2వ పెద్ద ఆర్థిక వ్యవస్థగా రూపొందటం మాయ కాదు గదా! ఇంతటి బృహత్తర కృషిలో ప్రజల భాగస్వామ్యం లేదనగలమా? తాను అభివృద్ధి సాధించటమే కాదు అభివృద్ధి చెందిన దేశాలను ఆర్థికంగా ఆదుకునే దశకు చేరుకున్నది. సాంకేతిక జ్ఞానం, నైపుణ్యాలతో, దశాబ్దాలుగా అగ్రగాములుగా వున్న దేశాలను అధిగమించి పోతున్నది. చైనా తన జాతీయ అవసరాలకు, ప్రయోజనాలకు అనుగుణమయిన అభివృద్ధిమార్గాన్ని ఎంచుకొని ఆచరిస్తున్నది. పాశ్చాత్య ప్రపంచం చేసే విమర్శలను, ప్రశంసలను పట్టించుకోకుండా తనదైన విశిష్ట లక్షణాలతో సోషలిస్టు అభివృద్ధి పథంలో సాగిపోతున్నది.

చైనా కమ్యూనిస్టు పార్టీ మొదటి నుంచి ప్రతిదేశం స్వతంత్రంగా, తన పరిస్థితులకు అవసరమైన అనుకూలమైన విప్లవమార్గం అనుసరించాలని చెప్తోంది. విప్లవానికి ముందూ తర్వాత కూడా తమకు అనుకూలమైన అభివృద్ధి పథం రూపొందించుకొని తన ప్రజలను ఐక్యపరచి సోషలిజాన్ని నిర్మించాలని చెబుతోంది. ఈ ఆలోచనలకు అనుగుణంగానే తమ దేశంలో సోషలిజం అభివృద్ధి కొరకు "చైనా విశిష్ట లక్షణాలుగల సోషలిస్టు నిర్మాణం" అనే సిద్ధాంతాన్ని విజయవంతంగా అమలు చేస్తోంది. ఈ ప్రయాణంలో తమ అనుభవాలతో వెనకబడ్డ ఆర్థిక వ్యవస్థలు గల పేద దేశాలలో సోషలిజం ఎలా నిర్మించాలి ఎలా పటిష్ఠ పరచాలి అనే ప్రాథమిక సమస్యలకు వారు ఒక సమాధానంగా నిలబడ్డారు. ఈ కొత్త అవగాహనతో మార్క్సిజాన్ని మరింత అభివృద్ధి చేయగలిగారు. చైనా విశిష్ట లక్షణాలు గల సామ్యవాద నిర్మాణం అనే విధానానికి ఆధారమైన అంశాలను లోతుగా పరిశీలించాలి.

చైనా కమ్యూనిస్టు పార్టీ 14వ జాతీయ మహాసభలలో ఆనాటి జనరల్ సెక్రెటరీ కామ్రేడ్ జియాంగ్ జెమిన్ అక్టోబర్ 12, 1992న తన నివేదికలో ఆ విశిష్ఠ లక్షణాలను వివరించారు. చైనా వ్యవస్థను అర్థం చేసుకోవటానికి, ఆ సారాంశాన్ని పరిశీలిద్దాం.

**సోషలిజం నిర్మాణ సిద్ధాంతంలో చైనా విశిష్ఠ లక్షణాలు**

**1. సోషలిస్టు మార్గం –** మార్క్సిజం మూలసూత్రాలను దార్శనికతతో అనుసరిస్తూ, స్వంత కార్యాచరణ కలిగివుండాలి. ఒక పిడివాదంగా సిద్ధాంతగ్రంథాలను ఆచరించటం కానీ, ఇతరదేశాల నమూనాలను గుడ్డిగా అనుసరించటం కానీ కుదరదు. వాస్తవాల నుంచి

సత్యాలను వెలికితీయటం, పాతభావాల నుండి మేధస్సును విముక్తం చేసుకోవడం, ప్రజల చొరవను, కార్యచరణకు దిగే ఉత్సాహాన్ని గౌరవించటం వల్లనే ఈ మార్గంలో స్థిరంగా నడవగలుగతాం.

**2. సోషలిజాన్ని దశల వారిగా అభివృద్ధి చేయటం –** చైనా ఇంకా సోషలిజం ప్రధమ దశలోనే వుంది. ఈ దశ కనీసం వంద సంవత్సరాల వరకు కొనసాగవచ్చు. ఈ ప్రాధమిక వాస్తవాన్ని గుర్తుంచుకునే మన సూత్రాలు, విధానాలు రూపొందించుకోవలిసి వుంటుంది. ఈ దశను దాట వేయాలనుకోవడం కుదరదు.

**3. సోషలిజం మౌలికకర్తవ్యం –** సోషలిజం యొక్క లక్ష్యం ఉత్పత్తి శక్తుల విముక్తిని సాధించటం, వాటిని అభివృద్ధి పరచటం, దోపిడీని అంతమొందించటం, సంపదల కేంద్రీకరణ ధృవాలను అరికట్టడం, అంతిమంగా ఉమ్మడి సంపత్తిని పెంపొందించి సమాజాన్ని సంపద్వంతం చేయటం. చైనా సమాజంలో ప్రధాన వైరుధ్యం – తక్కువ స్థాయిలోవున్న ఉత్పత్తికి, పెరిగిపోతున్న ప్రజల భౌతిక, బౌద్ధిక అవసరాలకు మధ్యవున్న అంతరమే (ప్రస్తుతం ఈ ప్రధాన వైరుధ్యం.........). అందువల్ల అన్ని కోణాలలో సామాజిక ప్రగతిని సాధించటానికి, ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ప్రాధాన్యతనివ్వాలి. ఆర్థిక అభివృద్ధిని మన కర్తవ్యాలకు కేంద్రంగా చేసుకోవాలి. మనం విజయం సాధించామా లేదా అని నిర్ణయించేవి – మన విధానాలు సామ్యవాద సమాజపు ఉత్పత్తిశక్తులను అభివృద్ధి పరిచాయా? దేశ శక్తి సామర్థ్యాలను అధికం చేయగలిగాయా? ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయా? అన్న అంశాలు మాత్రమే. ఈనాడు ఉత్పత్తి శక్తులలో శాస్త్ర సాంకేతిక జ్ఞానం ఒక బలమైన, ప్రధానమైన భాగంగా వున్నది. ఆర్థిక అభివృద్ధిని సాధించటానికి ఈ శాస్త్ర సాంకేతిక ప్రగతి మీద ఆధారపడవలసి వుంది. కనుక ఈ రంగంలో నైపుణ్యం గల కార్మిక శక్తిని అభివృద్ధి చేయాలి.

**4. సోషలిస్టు అభివృద్ధికి చోదకశక్తి –** ఉత్పత్తి శక్తుల విముక్తిని సాధించే లక్ష్యంగల సంస్కరణ కూడ ఒక విప్లవమే. దీని వల్ల మాత్రమే చైనాను ఆధునికం చేయగలం. యధాతథ స్థితిని అంగీకరించటం లేక కాలం చెల్లిన భావాలకు చిక్కుకుపోయి వుండటం వల్ల ఏమీ సాధించలేము.

ఆర్థిక పునర్వ్యవస్థీకరణలో – సోషలిస్టు మార్కెట్ విధానాలను అభివృద్ధి పరచటం, ప్రభుత్వ యాజమాన్య రంగాన్ని ప్రభావశీలమైన స్థానంలో వుంచటం, పనికితగ్గ ఫలితం ప్రధాన పంపిణీ విధానంగా అమలుచేయటం, ఇతర రంగాలను, సంపద పంపిణీని సక్రమంగా నిర్వహించటం అనేవి ముఖ్యాంశాలు.

రాజకీయ రంగ పునర్వ్యవస్థీకరణలో – సామ్యవాద ప్రజాతంత్రాన్ని బలీయం చేయటం దానికై కమ్యూనిస్టు పార్టీ నేతృత్వంలో ప్రజా కాంగ్రెసుల వ్యవస్థను మరింత అభివృద్ధి చేయటం, బహుపార్టీలతో సంప్రదింపులు సహకారం అనే విధానాన్ని అవసరమైన చోట్ల అదనపు పద్ధతులు ఆచరించటం ఇందులో ముఖ్యాంశాలు.

ఈ పునర్వ్యవస్థీకరణలకు అనుగుణమైన ఉన్నతమైన సామ్యవాద సంస్కృతిని, సిద్ధాంతాన్ని పెంపొందించాలి. మంచి ఆశయాలు, ఉత్తమ నైతిక ప్రవర్తన, విద్యానైపుణ్యాలు, చక్కటి క్రమశిక్షణ గల పౌర సమాజాన్ని నిర్మించాలి.

**5. సోషలిజం నిర్మాణానికి బయటి పరిస్థితులు –** అంతర్జాతీయ రంగంలో శాంతి, అభివృద్ధి అనేవి అత్యంత ప్రాధాన్యతగల రెండు అంశాలు. మన ఆధునికీకరణకు అనుకూలమైన అంతర్జాతీయ వాతావరణం నెలకొనే విధంగా ఒక స్వతంత్రమైన శాంతియుత విదేశాంగ విధానాన్ని మనం అనుసరించాలి. అందువల్ల బయటి ప్రపంచంతో మన సంబంధ బాంధవ్యాలను మరింతగా పెంచుకోవాలి. బయటి దేశాలకు మన తలుపులు తెరిచిపెట్టాలి. మన సంస్కరణలకు, ఆర్థిక అభివృద్ధికి ఈ ఓపెన్ అప్ విధానం అత్యంత ఆవశ్యకమైనది. అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల అనుభవాల సహితంగా, ఇతరదేశాలు సాధించిన విజయాలను, ప్రగతిని మనం అవగాహన చేసుకొని ఉపయోగించుకోవాలి. తలుపులు మూసుకొనివుంచే విధానం వెనుకబాటుతనాన్ని శాశ్వతీకరించటానికి మాత్రమే తోడ్పడుతుంది.

**6. సోషలిస్టు నిర్మాణానికి రాజకీయ గ్యారంటీనివ్వడం –** సోషలిస్టు పంథాకు అంకితమై వుండటం, జనతా ప్రజతంత్ర నియంతృత్వాన్ని ఎత్తి పట్టడం, చైనా కమ్యూనిస్టు పార్టీ నేతృత్వాన్ని అంగీకరించటం, మార్క్సిజం–లెనినిజం–మావో ఆలోచనా విధానాలను మార్గదర్శకంగా స్వీకరించటం అనేవి నాలుగు అనుల్లంఘనీయమైన ప్రధాన సూత్రాలు. సంస్కరణ, ఓపెన్ అప్ విధానం, ఆధునికీకరణ వీటి ఆరోగ్యకర అభివృద్ధికి హామీనిస్తాయి. ఇవి చైనా సమాజ నిర్మాణానికి పునాదులు. ఇదే సామ్యవాదాన్ని గ్యారంటీచేసే చైనా విధానం.

**7. సామ్యవాద నిర్మాణానికి వ్యూహాత్మక ప్రణాళిక –** దేశ ఆధునికీకరణను మూడు దశలలో సాధించాలి.

ఈ సుదీర్ఘ ప్రయాణంలో మనం అన్ని అవకాశాలను అందిపుచ్చుకుని ప్రతి సంవత్సరము నిర్దిష్ట లక్ష్యాలు పెట్టుకుని, అవి అందుకునేలా ఆర్థిక అభివృద్ధిని సాధించాలి. సోషలిజం అంటే పేదరికం కాదు, పేదరికాన్ని పంచుకోవటమూ కాదు. కానీ 130 కోట్ల జనాభాలో ప్రతిఒక్కరు ఒకే సమయంలో ధనవంతులు కావటం అసాధ్యం. అందువల్ల కొన్నిప్రాంతాలు, వ్యక్తులు, బృందాలు ముందుగా సంపద్వంతం కావటాన్ని మనం అనుమతించాలి. ప్రోత్సహించాలి. ఈ క్రమంలో అన్ని ప్రాంతాలు, వరసగా మొత్తం సమాజం ధనవంతం కావటం సాధ్యపడుతుంది.

**8. సోషలిస్టు నిర్మాణానికి నాయకత్వం వహించే శక్తులు, ఆధారపడతగ్గ శక్తులు –** చైనా కమ్యూనిస్టు పార్టీ అత్యున్నత కార్మికవర్గ చైతన్యానికి ప్రాతినిధ్యం వహించే అగ్రేసర సంస్థ. సోషలిజం నిర్మాణానికి ఈ పార్టీయే ప్రధానంగా నాయకత్వం వహిస్తుంది. చైనా అనుసరిసున్న సంస్కరణలు, ఓపెన్ అప్ విధానాలు, ఆధునికీకరణ అన్న మార్గంలో ఎదురయ్యే అన్ని సవాళ్ళను ఎదుర్కునే శక్తిసామర్ధ్యాలను నిరంతరం అభివృద్ధి చేసుకుంటూ ప్రజల ఆకాంక్షలు నెరవేర్చుతుంది. అధికారంలోవున్న ఈ పార్టీ పనివిధానం, ప్రజలతోవున్న సంబంధాలు పార్టీ

స్థానాన్ని నిర్ధారించే అత్యంత ముఖ్యమైన అంశాలుగా ఉంటాయి. కనుక పార్టీ ఆధారపడవలసింది కార్మికులు, రైతులు, మేధావులు, అనేక జాతులకు చెందిన ప్రజల ఐక్యత మీద. సామ్యవాద కార్మికులు, సామ్యవాదాన్ని సమర్థించే దేశభక్తులు, దేశ పునరేకీకరణను కాంక్షించే దేశభక్తుల సాధ్యమైనంత విస్తృత ఐక్యసంఘటన మీద. పార్టీ నాయకత్వంలోవున్న ప్రజాసైన్యం సామ్యవాద మాతృదేశ రక్షకులు. ఈ ప్రజాసైన్యం కూడా సోషలిస్టు నిర్మాణంలో ఒక ముఖ్యమైన శక్తిగా వుంటుంది.

**9. మాతృదేశ పునరేకీకరణ –** ఒక దేశం–రెండు వ్యవస్థలు అనే సృజనాత్మక సూత్రం ముందుకు తెచ్చాము. ఈ ప్రతిపాదనకు ప్రాతిపదిక 'ఒక్క చైనా మాత్రమే' వుంది అన్న కచ్చితమైన అంశమే. చైనా ప్రధానభూమిలో సోషలిస్టు విధానాలను, హాంగ్‌కాంగ్, మకావో, తైవాన్ ప్రాంతాలు అక్కడ వున్న పెట్టుబడిదారీ విధానాలను రాబోయే చాలాకాలం వరకు అనుసరిస్తాయని గుర్తించటమే. ఈ ప్రాతిపదిక ఆధారంగానే అన్ని ప్రాంతాలు శాంతియుతంగా మాతృభూమిలో ఏకం కావటానికై కృషిచేయాలి.

ఈ ప్రధాన మార్గదర్శక లక్షణాలతో పాటు మన ఆచరణలోను, అనుభవంలోను తలఎత్తే సమస్యలు, నూతన పరిస్థితులను అధ్యయనం చేయటం, నూతన సమస్యలకు పరిష్కారం కనుగొనటం ద్వారా మన సోషలిస్టునిర్మాణ సిద్ధాంతాన్ని సుసంపన్నం చేస్తాం, మెరుగు పర్చుతాం, అభివృద్ధి చేస్తాం.

ఈ అంశాల ఆధారంగా చైనా సోషలిస్టు సమాజ ప్రథమదశ నిర్మాణానికి అవసరమైన మౌలిక పంథాను నిర్ధారించుకుంది. ఒక పటిష్టమైన ప్రణాళికతో స్పష్టమైన భవిష్యత్ దృష్టితో తను ఎన్నుకున్న మార్గంలో పురోగమిస్తోంది.

ఏ దేశమయినా, తన భౌగోళిక, భౌతిక, చారిత్రిక, సాంస్కృతిక వారసత్వ సంపద కనుగుణంగా, తన ప్రజల ప్రయోజనాలు, తనవైన మానవ విలువలు పరిపుష్టం చెందేలా రాజకీయ, ఆర్థిక వ్యవస్థలను నిర్మించుకోవలసి వుంటుంది. అన్ని దేశాలకు, జాతులకు, పనికివచ్చే ఒకే మూస అభివృద్ధి మార్గం అనేది వుండదు. పాశ్చాత్య ప్రపంచం ప్రచారం చేస్తున్న అభివృద్ధి నమూనా, ఎన్నో దేశాలను అప్పుల కూపంలోకి నెట్టి వేయడం మనం చూసినదే. 1949లో ప్రారంభమయిన నవచైనా, తాను ఎన్నుకున్న సోషలిస్టు మార్గంలో అభివృద్ధి సాధించగలదని అనేక దేశాలకు విశ్వాసం లేకపోయింది. అయితే దేశ పరిస్థితుల కనుగుణంగా, ప్రపంచ స్థితిగతులను అవగాహన చేసుకుంటూ (కా॥మావో జెడాంగ్, కా॥డెంగ్ సియావోపింగ్, కా॥జీ జిన్‌పింగ్ వంటి వారి విశిష్ట నాయకత్వంలో) కమ్యూనిస్టుపార్టీ సాగిస్తున్న సమయోచిత, సృజనాత్మక అభివృద్ధిపథం ఈనాడు ఒక సఫలమయిన మార్గంగా, ప్రపంచ ప్రజలకొక ఆదర్శంగా కనిపిస్తోంది. 21వ శతాబ్దంలో చైనా ఒక అబ్బురంగా ఎదిగిపోతుంటే, పాశ్చాత్య ప్రపంచం తన పెట్టుబడిదారీ విధానాలవల్ల ఏర్పడిన సమస్యలనుంచి తానుగానీ, తన ప్రభావంలో వున్న ప్రాంతాలనుగానీ బయటపడవేయలేక పోతోంది. పాశ్చాత్య దేశాలు, చైనా, వ్యవస్థాగతంగా విభిన్నంగా వున్నాయనీ, మౌలికంగా,

భూస్వామ్య, సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దోపిడీలకు దూరంగా తనదైన సోషలిస్టు మార్గంలో చైనా పురోగమిస్తోందనీ గుర్తించాలి.

పాశ్చాత్య దేశాలు, సామాజిక మాధ్యమాలు, అనేక సందర్భాలలో చైనాపట్ల అక్కసు, ఉక్రోషం వెలిగక్కడమే కాక, చైనాయొక్క ప్రాధాన్యతను తగ్గించే, విస్మరించే వ్యాఖ్యానాలతో దుష్ప్రచారం సాగిస్తున్నాయి. పెరిగిపోతున్న చైనా ప్రాబల్యాన్ని అడ్డుకోవటానికి శతథా ప్రయత్నిస్తున్నాయి. ఈ నేపథ్యంలో తన 19వ జాతీయ మహాసభలలో చైనా కమ్యూనిస్టు పార్టీ ఒక కొత్తదశకు సిద్ధపడుతూ తమ మార్గదర్శక సూత్రాలు రూపొందించింది. చైనాలో ఏం జరగుతోందనే దాని పట్ల అమెరికా, యూరప్, తదితర దేశాల మీడియా చాలా ఆసక్తిని ప్రదర్శించింది. ఈ విషయాలను విస్తారంగానే ప్రస్తావిస్తున్నాయి కానీ ఈ సందర్భంలో చూపవలసిన సిద్ధాంత గరిమ, లోతైన విశ్లేషణ ప్రదర్శించకుండా పైపై రిపోర్టులతో సరిపెట్టుకుంటున్నాయి. అందువల్ల చైనా అనుసరిస్తున్న సిద్ధాంత సారాంశాన్ని, భవిష్యత్ ప్రణాళికల రూపురేఖలను ప్రజలకు అందించటంలో విఫలం అయ్యాయి. పెట్టుబడిదారీ దేశాల మీడియా ప్రసార మాధ్యమాలు చైనా సాధించిన అభివృద్ధిని, పాదార్థిక శక్తిని సరిగానే చెబుతున్నాయి గానీ ఆ అభివృద్ధి స్వభావాన్ని అంతస్సారాన్ని, దాని లక్ష్యాన్ని చూడలేకపోతున్నాయి. తమదైన వ్యక్తిగత ధోరణితో పాశ్చత్య ప్రపంచపు తూనికరాళ్ళతో కొలిచి, ఒక నిరాశాపూరిత పటాన్ని చిత్రిస్తున్నాయి. దీనివల్ల చైనాను అర్థం చేసుకోలేక పోవటమే కాదు అది సాధిస్తున్న సఫలతను కూడా గుర్తించలేకపోతున్నాయి. దీనికి ప్రధానంగా దృష్టిలోపమే కారణమనవచ్చు. చైనా వ్యూహాలు, అభివృద్ధి ప్రణాళికలు, పాశ్చాత్యదేశాల రాజకీయ వ్యవస్థకు, వారి అభివృద్ధి నమూనాకు ఎంత దగ్గరగావుంటే అంతగా చైనా అభివృద్ధి చెందుతోందనీ వారు భావిస్తారు. ఈ మార్గానికి భిన్నాంగా చైనా వ్యవహరిస్తే, అది ఎంత శీఘ్రంగా పురోగమిస్తున్నా, చైనా తప్పుదారిలో వుందని వర్ణిస్తారు. పాశ్చాత్య ప్రయోజనాలను సంరక్షించే, విధివిధానాలకు లోబడివుండేలా చైనా అభివృద్ధిని కోరుకుంటారు. చైనాకు తన స్వంత ప్రయోజనాలు, తనవైన ప్రాథమ్యాలు వుంటాయని మాటవరసకు అంగీకరిస్తూనే ఇవన్నీ ప్రస్తుత ప్రపంచంలో నెలకొనివున్న తమ ప్రయోజనాలకు (అసమానమార్గాలకు) అనుగుణంగా వుండాలని ఆశిస్తారు.

అమెరికా యూరప్‌లలోని కొందరు నాయకులు చైనాది ప్రతికూల స్వభావమని, ఇది ప్రపంచాభిప్రాయాన్ని ఎదిరిస్తోందనీ వాదిస్తారు. చైనా అనుసరించే ఏ విధానమూ తాము నిర్దేశించిన సార్వజనిక విలువలను ప్రశ్నించేదిగా వుండకూడదంటారు. అంటే ప్రపంచానికి పాశ్చాత్య సమాజాలు సూచించిన మానవ విలువలే గమ్యాలనీ, వేరు ఆలోచనలు వుండకూడదని నియంత్రిస్తున్నారు. అయితే చరిత్ర చాటుతున్నదేమంటే ఈ పాశ్చాత్యదేశాల విలువలు ఆ దేశాల ఆర్థికాభివృద్ధికీ, పురోగమనానికి తోడ్పడినవేమోకాని అవి సర్వమానవాళి శ్రేయస్సును ఉద్దేశించినవి కావు. అసలు వారి విలువలు, విధానాలు ఆయా దేశాల ప్రజల అభ్యున్నతికి, వివక్షలులేని జీవనానికి దారితీసాయా అన్నదికూడా సందేహాస్పదమే. ఇతరుల

హక్కులను, వారి మానవీయ విలువలను ఈ పాశ్చాత్య ప్రపంచం గుర్తించడంలేదని కూడా చెప్పవచ్చు. ఇక్కడ పాశ్చాత్య దేశాలంటే భౌగోళికంగా మాత్రమే కాదు. పారిశ్రామిక విప్లవం తర్వాత పెట్టుబడిదారీ పంథాలో అభివృద్ధి చెందిన దేశాలని గుర్తించాలి. ఈ రెండు విభిన్నమైన వ్యవస్థల విలువల మధ్య గల సంఘర్షణే నేటి ప్రపంచంలోని వైరుధ్యం అని తేలికగానే గుర్తించవచ్చు. పెట్టుబడిదారీ ప్రయోజనాలకు, ప్రజావళి ఆకాంక్షలకు మధ్యగల వైరుధ్యమే నేటి రాజకీయం అనేది వాస్తవం.

అయితే మానవజాతి ఇంతవరకు పొందిన అనుభవం, జ్ఞానం, సాగించిన ప్రస్థానమే అసంపూర్ణమయినది. ఈ దశలో "మాదే అంతిమ మార్గం. మేం చెప్పిందే ప్రపంచానికి తారకమంత్రం" అని పెట్టుబడిదారీ ప్రపంచం చెప్పటం అవివేకం. అంతేకాదు. పెట్టుబడిదారీ ప్రపంచం వరుసగా సంక్షోభాలలో కొట్టుమిట్టాడటం అందరం గమనిస్తున్నదే. దేశ కాల మాన పరిస్థితులను దృష్టిలో వుంచుకొని, ప్రతిజాతి తన అభివృద్ధిమార్గాన్ని అనుసరించవలసి వుంటుంది. అనుకూల ప్రతికూల ఫలితాలను గమనిస్తూ, తన మార్గాన్ని సరిచేసుకుంటూ ముందుకుసాగాలి తప్ప అభిజాత్యంతో, అహంకారంతో, ఆధిపత్య ధోరణితో 'ఏకైక మార్గాలు' ప్రవచించటం అభిలషణీయం కాదు. ఎన్నుకొన్న మార్గంలో దేశం అభివృద్ధి చెందుతోందా? ఆ అభివృద్ధి ఫలాలు జనసామాన్యానికి అందుబాటులోకి వచ్చాయా? వారి ఈతి బాధలు తొలిగిపోతున్నాయా? వారి జీవనప్రమాణాలు మెరుగుపడుతున్నాయా అనే అంశాల ఆధారంగా ఉచితానుచితాలు నిర్ణయించాలి. అదే సమయంలో ఒక దేశపు విధానాలు ప్రపంచ శాంతి, సుస్థిరతలకు దారి తీస్తున్నాయా? లేక మరోదేశ సంపదలను, వనరులను లూటీచేస్తున్నాయా? అనేది గమనించాలి.

చైనా సాధిస్తున్న ప్రగతిపట్ల కొన్నిదేశలలో మిశ్రమ స్పందనలున్నాయి. వారి అభివృద్ధి మార్గం సోషలిజమా? పెట్టుబడిదారీ మార్గమా? అని కొందరు అనుమానాలు రేకెత్తిస్తున్నారనేది వాస్తవం. ఇరుగుపొరుగు దేశాలను భాగస్వాములను చేసుకుంటూ, మానవాళికి ఒక సంయుక్త భవిష్యత్తును నిర్మించే ప్రయత్నం చేస్తున్న చైనా విధానాలు, ప్రాంతీయ ఆధిపత్యవాదులకు, సామ్రాజ్యవాదులకు మింగుడుపడటం లేదన్నది వాస్తవం. అందుకే చైనా అభివృద్ధిపట్ల ఆసక్తి ఉన్నవారిలో ఆందోళనను కూడా పెంచి పోషిస్తున్నారు. పాశ్చాత్యనాగరికత నిర్దేశించినదే సరియినది, చైనా చూపిస్తున్న ప్రత్యామ్నాయ పద్ధతులు హానికరం అని భావించటం పాశ్చాత్యవిలువల కళ్ళజోడుతో వర్తమానాన్ని పరికించిన ఫలితమే. అయితే ఈ పెట్టుబడిదారీ ప్రపంచం తను స్వయంగా సంక్షోభంలో కూరుకుపోయి వుండటంవల్ల వారి మాటలకు, ప్రచారాలకు చలామణి తగ్గిపోతున్నది. పరస్పర ప్రయోజనం సిద్ధించేలా, తమ అంతర్గత విధానాలలో జోక్యం చేసుకోకుండా, చైనా అందిస్తున్న స్నేహహస్తాన్ని అందుకోవడంలో అనేక బడుగు, బలహీన దేశాలు ఉత్సాహంగా ముందుకు వస్తున్నాయి. చైనా అనుసరిస్తున్న ప్రజాస్వామ్య దృక్పథానికి ఇంతకుమించిన అంగీకారం, నిదర్శనం ఇంకేముంటుంది?

– అక్టోబరు, 2017

# 14.

# చైనా విజయపథంలో కీలక అంశాలు

*(బీజింగ్ రివ్యూ పత్రికలో 12 జనవరి 2018న ప్రచురించబడ్డ వ్యాసం ఆధారంగా, స్వేచ్ఛానుసరణతో, అనేక చేర్పులతో తెలుగులో రాసిన వ్యాసం ఇది. దీని మూల రచయిత శ్రీ హు బిలింగ్, బీజింగ్ యూనివర్సిటీలో ఆర్థికశాఖ ఆచార్యునిగా పని చేస్తున్నారు. ఈ వ్యాసంలో వున్న గణాంకాలు మూల రచయిత సమకూర్చినవే. 40 సంవత్సరాల చైనా ప్రగతిపథం పట్ల ఒక విహంగవీక్షణమిది.)*

1976 వరకు చైనా ప్రధానంగా వ్యవసాయక దేశం. జనాభాలో భారీ భాగం అంటే 82.6% ప్రజలు గ్రామాలలో నివసించేవారు. వారిలో అత్యధికులు కడుపేదలు. 1966–76 మధ్య సాగిన సాంస్కృతిక విప్లవానంతరంనాటికి చైనా ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోయే దశకు చేరుకుంది. రాజకీయ వ్యవస్థ సరైన దిశానిర్దేశం లేక కొట్టుమిట్టాడుతోంది. ఈ పరిస్థితులలో, చైనీయులు తమ భవిష్యత్తు గురించి తీవ్రంగా ఆలోచించసాగారు. దేశ నాయకులు తమ అభివృద్ధి లక్ష్యాలను, విధానాలను, ప్రణాళికలను పునర్లిఖించ సమకట్టారు. జాతీయ పునర్నిర్మాణంవైపు దృష్టిసారించారు. రెండు సంవత్సరాల చర్చోపచర్చలు, మేధోమధనం తర్వాత, ఆర్థిక రాజకీయ సామాజిక రంగాలలో నూతన విధానాల రూపకల్పనలు చేసి ఆచరణకు ప్రాతిపదికగా, అత్యంత ప్రయోజనకరంగావుండే నూతన ఆర్థిక, రాజకీయ విధానం ప్రకటించారు. వీటినే సంక్షిప్తంగా సంస్కరణలు, ఓపెన్ అప్ విధానము అని పిలుస్తున్నారు. 1978 చివరలో వీటిని ప్రవేశపెట్టారు. ఈ విధానాలు చైనాను ఒక కొత్త అభివృద్ధి పథంలోకి మరలించాయి. ఆతర్వాత నాలుగు దశాబ్దాలలో చైనా ఆర్థికవ్యవస్థ అనుపమానమైన అభివృద్ధిని సాధించింది.

ఈనాడు చైనాలోని వస్తుతయారీ వ్యవస్థ ప్రపంచంలో ప్రథమ స్థానానికి చేరుకుంది. విదేశీ మదుపుదార్లు ఈక్విటీ షేర్లద్వారా సమకూర్చిన పెట్టుబడులు శూన్యం నుంచి 133.70

కోట్ల డాలర్లకు చేరుకున్నాయి. ప్రపంచంలో ఇది తృతీయస్థానం. అలాగే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు కూడా శూన్యం నుంచి 18,310 కోట్ల డాలర్లకు పెరిగాయి*. అమెరికా సంయుక్త రాష్ట్రాల తర్వాత ఇది ద్వితీయస్థానం. 2016లో వెలువడ్డ గణాంకాలు, ప్రపంచ ఉత్పత్తి సామర్ధ్యత సూచికలు చైనాకు కిరీటం పెట్టాయి. 500 భారీ పారిశ్రామిక ఉత్పత్తులలో 220 ఉత్పత్తులమేరకు చైనాది ప్రథమస్థానం. ఇనుము, ఉక్కు, బొగ్గు, సిమెంట్, ఎలక్ట్రోలైటిక్ అల్యూమినియం, రాగి ఉత్పత్తులలో ఈ అభివృద్ధి సాధించారు. అంతేకాదు. ఉన్నత సాంకేతిక విలువలుగల ఉత్పత్తి విధానాలతో అగ్రస్థానంలో నిలుస్తోంది. ఉత్పత్తి విలువలోను, ఎగుమతుల విలువలోను కూడా ఈ రంగాలలో అమెరికాను తలదన్నింది. ఇలా ఉన్నత సాంకేతికతలనుపయోగించే తయారీరంగంలో చైనా కీలక స్థానం చేరుకుందన్నమాట.

2016 గణాంకాలు మరో విషయాన్నికూడా స్పష్టంచేస్తున్నాయి. స్థూల జాతీయ ఉత్పత్తి (జిడిపి) లో వ్యవసాయరంగంనుంచి వచ్చిన ఉత్పత్తుల విలువ కేవలం 8.6 శాతం మాత్రమే. అంటే చైనా వ్యవసాయకదేశం అన్న స్థితినుండి పూర్తిగా ఒక వస్తుతయారీ దేశంగా మారిపోయింది. పట్టణీకరణ వేగం 57.4% వుంది. అంటే దేశం గ్రామీణ సమాజంనుండి నగరీకరణవైపు వేగంగా కదిలిపోతున్నదన్నమాట.

ఈ గణనీయమైన మార్పులను చైనా ఎలా సాధించింది? ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఈ అనుభవసారం నుండి ఏం చెప్పగలుగుతుంది? చైనా అభివృద్ధినుండి ఇతరదేశాలు ఏం నేర్చుకోగలుగుతాయి? ఏం పంచుకోగలుగుతాయి? అనే ప్రశ్నలకు సమాధానం చెప్పడమే ఈ వ్యాసం ఉద్దేశం.

## చైనాది తన విశిష్ట లక్షణాలు గల పంథా

చైనా, తన అవసరాలకు అనుగుణ్యంగా, తన స్థితిగతులకు అనుకూలమైన విధానాన్ని రూపొందించుకున్నది. అది వారికి బాగా ఉపయోగపడ్డ ప్రత్యేకమయిన, విశిష్టమైన అభివృద్ధి పంథా. దీన్ని "చైనా లక్షణాలుగల సోషలిస్టు పంథా" అని అధికారికంగా వ్యవహరిస్తున్నారు. దీనిలో రెండు ప్రత్యేక అంశాలు సమ్మిళితం చెందాయి. స్వభావరీత్యా ఇది సోషలిజం. ఆచరణరీత్యా ఇది చైనా జాతీయ వైఖరికి అనుగుణమైన విధానం. ఒక విధంగా ఇది చైనా గడ్డనుండి పుట్టిన విశిష్ట వినూత్న సోషలిస్టు విధానం. 'సోషలిస్టు స్వభావం' అంటే దానర్థం

---

** 1949నుంచి 79వరకు చైనాలో విదేశీ పెట్టుబడులు దాదాపు లేవు. నూతన విధానాలు అమలుచేశాక 2017 నాటికి స్వేచ్ఛా వాణిజ్య మండలాలలో (FTZ) దాదాపు 1,600 కోట్ల డాలర్ల పెట్టుబడులు వచ్చాయి. మొత్తం విదేశీ పెట్టుబడులు 2010కల్లా 10,000 కోట్ల డాలర్లకు, 2015నాటికి 12,600 కోట్ల డాలర్లకు చేరుకుని ఈనాడు విదేశీ పెట్టుబడులను ఆకర్షిస్తున్న దేశాలలో నాల్గవ స్థానంలో వుంది. (వికీపీడియా)*

సమాజమంతా ఉమ్మడిగా సంపద్వంతం కావటం. అయితే, తక్కువ స్థాయిలో ఉత్పత్తి శక్తులు బాగా వెనుకబడిన ఆర్థికవ్యవస్థగల చైనా వంటి దేశంలో ఒకేసారి అందరూ ధనవంతులు కావటం సాధ్యంకాదు. అందువల్ల ప్రభుత్వం, కొందరు పౌరులు, కొన్ని ప్రాంతాలు ముందుగా ధనవంతమయ్యే విధానాలను ప్రోత్సహిస్తోంది. దశలవారీగా ఈ విధానాన్ని ఇతర ప్రాంతాలకు విస్తరిస్తోంది. ఇలా దశలవారీగా అభివృద్ధిని సాధిస్తూ, సంపత్తిని సమీకరిస్తూ ప్రజా సంక్షేమానికి వుపయోగిస్తూ తద్వారా సమాజమంతా సంపద్వంతమయ్యే మార్గాన్ని చైనా ఎన్నుకున్నది. ప్రభుత్వ లక్ష్యం సమాజంలోని అందరికీ సౌకర్యవంతమయిన జీవితాన్ని కల్పించడమే. పేదరికాన్ని నిర్మూలించడం తమ ప్రథమ కర్తవ్యంగా చైనా ప్రభుత్వం భావిస్తుంది. ఈ లక్ష్యాన్ని సాధించడానికే అనేక విధానాలు, ప్రణాళికలు రూపొందించి అమలు చేస్తోంది. ఈ విధానాలు సత్ఫలితాలను ఇచ్చాయి కూడా! గత నలభై సంవత్సరాలలో దాదాపు 70 కోట్లమంది చైనీయులు పేదరికం కోరలనుండి బయటపడ్డారు. ఇంకా పేదరికంలో మిగిలిన రెండు మూడు కోట్లమంది కూడా 2020కల్లా తమ దుర్భర దారిద్ర్యంనుండి విడుదల పొందగలరని ఆశిస్తున్నారు. అత్యధిక జనాభా కడు పేదరికంనుండి బయటపడటమే కాదు, ఒక మాదిరి ధనవంతమయిన, సౌకర్యవంతమయిన జీవన స్థితికి చేరుకున్నారు. తన పౌరుల జీవన ప్రమాణాలను మెరుగుపరచడంలో చైనా గణనీయమైన అభివృద్ధిని సాధించింది. నాలుగు పార్శ్వాలలో సాధించినది గమనిస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది.

(1) ప్రతి సంవత్సరం, పట్టణాలలో 1.3 కోట్ల ఉద్యోగాలు కల్పించబడుతున్నాయి. దీంతో నిరుద్యోగులు 4% కంటే తక్కువవున్నారు.

(2) విద్యాసముపార్జన అవకాశాలు బాగా విస్తరించబడ్డాయి. అందువల్ల నిరక్షరాస్యత ఈ నాలుగు దశాబ్దాలలో 30% నుండి పడిపోయి ప్రస్తుతం 3% కంటే తక్కువ స్థాయిలోవుంది. అంటే 95% మించిన అక్షరాస్యతను సాధించారు. అంతేకాదు విద్యావంతులయిన, నైపుణ్యశిక్షణ పొందిన కార్మికులు 0.5% నుండి 25% కి పెరిగారు.

(3) సామాజిక భద్రత విషయంలో చక్కని అభివృద్ధి - 85% జనాభాకు ఏదోవొక పింఛను సంక్షేమ పథకం వర్తిస్తుంది 95% ప్రజలకు వైద్య సేవలనిమిత్తం ప్రాథమిక ఇన్సూరెన్సు పథకంవుంది. విద్య, వైద్య, భవిష్యత్ భద్రత విషయంలో ప్రజలు నిశ్చింతగావున్నారు.

(4) గ్రామీణ, పట్టణ ప్రాంతాల ఆదాయాలలో వ్యత్యాసం బాగా తగ్గించబడుతోంది. 2000–2010 వరకు గ్రామీణుల, పట్టణ పౌరుల ఆదాయాలలో గణనీయమైన తేడాలుండేవి. గ్రామీణుల ఆదాయం పెరిగే చర్యలు చేపట్టడంతో క్రమంగా ఈ వ్యత్యాసం తగ్గిపోతోంది. అలాగే సంపదల పంపిణీ కూడా మెరుగుపడుతోంది. 2008 నుండీ జినీ సూచిక తగ్గుముఖం పట్టింది. (జినీ సూచిక అనేది దేశ ప్రజల ఆదాయాలను, సంపద కేంద్రీకరణను మదింపుచేసే

ఒక గణాంకం. ఈ జినీ గుణకం సున్న అయితే ఆర్థిక అసమానతలు లేవని అర్థం. అదే ఆ గుణకం 1 (ఒకటి–100%) అంటే తీవ్రమయిన అసమానత్వం అని అర్థం.) ప్రస్తుతం చైనాలో జినీ గుణకం 0.45 స్థాయిలోవుంది. అంటే ప్రజల ఆర్థిక అసమానతలు ఇంకా పరిగణించవలసిన స్థాయిలోనే వున్నాయని అర్థం. చైనా తాను అమలుచేస్తున్న మార్గంలో ఇది అనివార్యదశగా పరిగణిస్తోంది. సంపద ఉత్పత్తిక్రమంలో వచ్చిన ఈ తాత్కాలిక దశను అధిగమించి, సంపద కేంద్రీకరణవల్ల సమాజం ధృవాలుగా చీలిపోయే పరిణామాలను నివారిస్తున్నది. మొత్తం సమాజం సంపద్వంతమవుతూ, ప్రజల జీవన ప్రమాణం అంతకంతకూ మెరుగుపరుస్తూ సామ్యవాదదశకు పురోగమిస్తోంది. ఈ పరివర్తనాదశల క్రమవికాసమే సోషలిజం. సోషలిజమంటే పేదరికాన్ని పంచుకోవటం కాదు. దుర్భర దారిద్ర్యంలో బిచ్చగాళ్ళలా జీవించటం కాదు. సోషలిజం అంటే పేదరికాన్ని నిర్మూలించటం. పురోభివృద్ధిలో అనివార్యంగా తలెత్తుతున్న అసమానతలను తగ్గించడమే ముఖ్య కర్తవ్యంగా ప్రభుత్వం భావిస్తోంది.

చైనాలోని సోషలిస్టు స్వభావాన్ని మరో రూపంలో కూడా మనం గమనించవచ్చు. భూమిపై సామాజిక యాజమాన్యం, రాజ్యాధీనంలోని పరిశ్రమలు, సంస్థలు అభివృద్ధి సాధించడం, దేశ ఆర్థిక వ్యవహారాలపై, ద్రవ్యవ్యవస్థపై చైనా ప్రభుత్వానికి వున్న పట్టు వంటి అంశాలు ఈ సోషలిస్టు స్వభావానికి అద్దం పడతాయి. వీటితోపాటు ఇంకా అనేక ఇతర విధానాలు కూడా ఈ సోషలిస్టు స్వభావాన్ని నిర్వచిస్తాయి. నిర్ణయిస్తాయి.

చైనా అభివృద్ధి మార్గం విస్మరించ వీలులేని చైనా ప్రత్యేక లక్షణాలను సమ్మిళితం చేసుకుని సాగుతోంది.

ఈ ప్రత్యేకతలలో మొదటిది అక్కడి రాజకీయ వ్యవస్థ. వారి పాలనా వ్యవస్థ పాశ్చాత్యదేశాల వ్యవస్థలకు భిన్నంగా వుంటుంది. తమదేశ చరిత్రకు, అవసరాలకు అనుగుణంగా రూపొందించుకున్న విధానం వారిది. శాసనవ్యవస్థ, పాలనాధికారుల కార్యనిర్వహణా వ్యవస్థ, న్యాయవ్యవస్థ అనే మూడు ముఖ్య విభాగాలు ఇతర దేశాలకు భిన్నంగా జనతా ప్రజాస్వామిక లక్ష్యాలకోసం రూపుదిద్దుకున్నాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క కేంద్రీకృత సమిష్టి నాయకత్వం ఆధ్వర్యంలో నేషనల్ పీపుల్స్ కాంగ్రెసు (మన పార్లమెంటువంటిది) వుంటుంది. దాని అత్యున్నత అధికారమే రాజ్యాధికారంగా ఉంటుంది. చైనాలో దాదాపు ఎనిమిది ఇతర పార్టీలు వున్నాయి. నేషనల్ పీపుల్స్ కాంగ్రెసులో కూడా ఈ పార్టీల ప్రతినిధులు వుంటారు. వారు చర్చలలో చాలా చురుకుగా పాల్గొంటారు. వారు పాలనా వ్యవహారాలలో భాగం పంచుకుంటారు. వారిది ఏకపార్టీ పాలనా వ్యవస్థ కాదు. అలాగని స్పర్ధలతో, అధికారం కోసం పోటీలతో కలహించుకునే బహుపార్టీల వ్యవస్థ కూడా కాదు. రాజకీయ పార్టీల సమాలోచనలు, సహకారము గల విభిన్నమైన వ్యవస్థ. చైనా ప్రజల రాజకీయ సమాలోచనల సమితి (Chinese People's Political Consultative Conference -

CPPCC) జరిగే చర్చలు, అభిప్రాయ ప్రకటనలు ప్రభుత్వ ప్రణాళికల రూపకల్పనలో ప్రధాన భూమిక వహిస్తాయి. ఇవి ప్రభుత్వ అధికారానికి, ప్రజల ఆకాంక్షలకు మధ్య వారధిలా పనిచేస్తాయి. వీటికి నాయకత్వం వహించేది మాత్రం కమ్యూనిస్టు పార్టీనే. శ్రామికవర్గ నియంతృత్వాన్ని అమలుచేసే కమ్యూనిస్టు పార్టీ అక్కడ అధికార పార్టీ. అది శ్రామికవర్గ నాయకత్వానికి, సోషలిజం నిర్మాణానికి గ్యారంటీగా నిలిచే రాజకీయ వ్యవస్థ.

రెండవది ప్రభుత్వ అధికారం. దేశానికి చెందిన అన్ని రంగాలలో ప్రభుత్వం బలమైన ప్రభావం కలిగివుంటుంది. దేశ ఆర్థిక, సామాజిక అభివృద్ధి మొత్తానికి బాధ్యత వహిస్తుంది. దానికై నాయకత్వం వహిస్తుంది. జనతా ప్రజాతంత్ర సూత్రాలకు అంకితమై, శ్రామిక జనపక్ష సిద్ధాంతమై, ప్రజా ప్రయోజనమే దిక్సూచిగా ప్రభుత్వం అధికారం వహిస్తుంది.

మూడవది ప్రజాజీవనంలో చారిత్రక, సాంస్కృతిక, సంప్రదాయక అంశాల ప్రభావం. జన జీవనంపైన, వారి ఆలోచనావిధానంపైన ఈ సాంస్కృతిక, సంప్రదాయక అంశాల ప్రభావం చాల హెచ్చుగా వుంటుంది. ఉదాహరణకు కన్ఫ్యూషియస్ భావజాల ప్రభావం, నైతికత, చట్టబద్ధమైన పాలన, ధర్మ రక్షణల మధ్యగల సంబంధం, సామాజిక ఆలోచనాక్రమం, అమలవుతున్న శాసనాల మధ్యగల సంబంధం. సామాజిక అంతరాలు, ఆంతరంగిక సంబంధాలు, అభివృద్ధి కార్యక్రమాల సంబంధాలు మున్నగు అంశాలపై తరతరాల వారసత్వ ఆలోచనా ప్రభావం వుంటుంది. ఈ సాంస్కృతిక ప్రభావాన్ని గుర్తించిన చైనా నాయకత్వం, సచేతనంగా తమ వారసత్వంలోని మేలైన అంశాలను పాలనాపద్ధతుల్లో మిళితంచేస్తూ, ప్రజలను పాలనలో భాగం చేస్తోంది. చైనా సామాజిక జీవనంలో, ఒకవంక ప్రభుత్వ సంస్థలు వాటి నియమ నిబంధనలు, మరోవంక సంప్రదాయ నైతిక విలువలు తమతమ ప్రభావాలను ప్రసరింపజేస్తూ ప్రజలను జాగృతపరుస్తాయి. కర్తవ్యబద్ధులను చేస్తాయి.

"చైనా లక్షణాలు గల సామ్యవాద నిర్మాణ సిద్ధాంతం" తమ నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా అనేక అంశాల ఆధారంగా రూపొందించిన విధానం.

చైనా సమాజ సౌధానికి నాలుగు స్థంభాలుగా చెప్పుకునే నాలుగు అనుల్లంఘనీయమైన ప్రధాన సూత్రాలు సామ్యవాదానికి అంకితమై వుండటం, చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని శిరసావహించటం, శ్రామికపక్ష నియంతృత్వాన్ని సమర్థించటం, మార్క్సు, లెనిన్, మావో ఆలోచనలను మార్గదర్శకంగా స్వీకరించటం, ఈ సైద్ధాంతిక ప్రాతిపదికపైన ఆధారపడిన వ్యవస్థ నిర్మాణమే జనచైనా.

1965లో చైనా అభివృద్ధికి ఆనాటి నాయకులు చైర్మన్ మావో, ప్రధాని జౌ ఎన్ లై నాలుగు ఆధునికీకరణలు సూచించారు. ఆ మార్గదర్శనంలోనే 1978 డిసెంబరు ప్లీనంలో ఈ ఆధునికీకరణల ఆచరణ క్రమాన్ని కామ్రేడ్ డెంగ్ సియావో పింగ్ తన అభివృద్ధి కార్యక్రమానికి లక్ష్యాలుగా ఎంచుకున్నారు. చైనాను ఒక ఉత్పత్తి ప్రధాన సమాజంగా మార్చటానికి పునాదులు

వేశారు. వ్యవసాయం, పరిశ్రమలు, రక్షణరంగం, శాస్త్రసాంకేతిక రంగాలను ఎన్నుకొని, వాటిమీద కేంద్రీకరించి వాటిని ఆధునికమూ, సుసంపన్నమూ చేయటమే అభివృద్ధికి ఆచరణీయ మార్గమనే లక్ష్యాన్ని డెంగ్ సియావో పింగ్ నిర్దేశించాడు.

'ఒక ప్రధాన కర్తవ్యం రెండు మౌలిక అంశాలు' అని 1987లో 13వ పార్టీ కాంగ్రెస్‌లో ఆనాటి ప్రధాని ఝావో జియాంగ్ ప్రతిపాదించారు. ఇవి 1978నుండి కామ్రేడ్ డెంగ్ ఆలోచనలల్లో భాగంగా ఉంటూవచ్చాయి. ప్రధాన కర్తవ్యం ఆర్థిక అభివృద్ధి. రెండు మౌలిక అంశాలు దానికి ప్రాతిపదికలు. అందులో మొదటిది నాలుగు అనుల్లంఘనీయమైన సూత్రాలు ఆచరించటమైతే, రెండవది ఓపెన్ అప్ మరియు సంస్కరణల విధానం అవలంబించటం. ఇది మొదటిదశ సోషలిస్టు సమాజ నిర్మాణానికి మార్గం.

సామ్యవాద ప్రస్థానంలో అనేక దశాబ్దాలపాటు శ్రమించి పొందిన ఆచరణాత్మక అనుభవమూ, ఆ అనుభవాన్ని సుసంపన్నం చేస్తూ ఎప్పటికప్పుడు తీసుకున్న మెరుగుదల చర్యల ఫలితమూ, దిద్దుబాటు చర్యలనుండి సాధించిన విశిష్టజ్ఞానమూ కలగలిపి రూపొందించినదే వారి పంథా. దానివలన ముందెరుగని విశేష ప్రయోజనాలు సాధించగలిగింది. తలఎత్తే నూతన పరిస్థితుల కనుగుణంగా తనను తాను మలుచుకుంటూ ముందుకు సాగుతున్నది. ఈ సైద్ధాంతిక పరిణతి, అనుభవ జ్ఞానము, అభివృద్ధిక్రమంలో ప్రభుత్వపాత్రను, మార్కెట్ల పాత్రను సరిగ్గా సమన్వయ పరచగలుగుతోంది. అక్కడి సామ్యవాద పద్ధతులు, వ్యవస్థలు, శ్రామిక శక్తులను, అపార వస్తుసంపదలను, ఆర్థికవనరులను సమీకరించటంలో మంచి ఫలితాలను సాధించాయి. ఇవన్నీ ప్రాంతీయ, జాతీయ అభివృద్ధికి దారితీసే అనేక భారీ పథకాలకు ప్రాణం పోశాయి. అయినా ప్రభుత్వాన్ని మార్కెట్ శక్తులనీ సమన్వయ పరచటంలో ఏర్పడుతున్న చిక్కులను తొలగించటంలో చేయవలసింది ఇంకా చాలా వుందని వారు భావిస్తున్నారు.

## సోషలిస్టు మార్కెట్‌కు అనుగుణమయిన సంస్కరణలు

కా॥ డెంగ్ సియావో పింగ్ ప్రవేశపెట్టిన సంస్కరణల పర్వం విజయవంతం కానట్లయితే చైనాకు తాను ఈనాడున్న స్థానం పొందటం సాధ్యమయ్యేది కాదనే విషయం ప్రపంచమంతా అంగీకరిస్తుంది. ఈ సంస్కరణలు ఇంతగా ఫలవంతమయ్యాయంటే కారణం అవి ఏమాత్రం వూగిసలాట లేకుండా సోషలిస్టు మార్కెట్ అనుకూలతను అనుసరించటమే!

మార్కెట్లుగానీ, ప్రణాళికలు గానీ సాధనాలు మాత్రమే. సోషలిజం అనేది వ్యవస్థాగత లక్ష్యం. అందువల్ల మార్కెట్లకూ, సామ్యవాదానికీ మధ్య వైరుధ్యమేదీ లేదని కామ్రేడ్ డెంగ్ భావించారు. ప్రణాళికాబద్ధమయిన ఆర్థిక వ్యవస్థ సోషలిజానికి సమానార్థకం కాదు, ఎందుకంటే పెట్టుబడిదారి వ్యవస్థలో కుడా ఒక ప్రణాళిక వుంటుంది. మార్కెట్ ఆర్థిక వ్యవస్థ అంటేనే పెట్టుబడిదారీ వ్యవస్థ అని అర్థంకాదు. సోషలిజంలో కూడా మార్కెట్లు వుంటాయి.

ప్రణాళిక మార్కెట్లు అనేవి ఆర్థిక వ్యవహారాలను నిర్వహించే పద్ధతులు మాత్రమే. సోషలిజంలో ప్రధానమైనది ఉత్పత్తి శక్తులను విముక్తి చేయటం, వాటిని అభివృద్ధి పరచటం, దోపిడీని రద్దు చేయటం, సమాజాన్ని సంపద్వంతం చేయటం అని కామ్రేడ్ డెంగ్ భావించారు. (1994 డెంగ్ రచనలు పేజీ 361).

విప్లవానంతర మొదటిదశలో జనచైనా, సోవియట్ రష్యా అనుసరించిన పద్ధతిలో ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానాలను అమలుచేసింది. దానివలన ఉత్పాదకత మెరుగుదలను, జాతీయ ఆర్థికతలో కొంత వృద్ధినీ సాధించింది. అయితే దాంతోపాటు అనేక సమస్యలు కూడా వచ్చిపడ్డాయి. వాటిని పరిష్కరించడానికి సాగిన ఆలోచనా విధానంలోనే కొత్త విధానాలు పురుడుపోసుకున్నాయి. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ఆ క్రమంలో ఏర్పడుతున్న సమస్యలకు పరిష్కారం సరైన మార్కెట్ నిర్వహణ ప్రాతిపదిక గల వ్యవస్థలు, విధానాలు రూపొందించటమే అని నాయకత్వం అవగాహనకు వచ్చింది. సోషలిస్టు నిర్మాణంలో తన మొత్తం కార్యక్రమాలలో భాగంగా చైనా ఈ సంస్కరణల పర్వం తెరిచింది. వినియోగ వస్తువుల ఆర్థికతను పెంపొందించి, ఉత్పాదకతను ప్రేరేపించి, వస్తుమార్పిడిని ప్రోత్సహ పరిచింది. తద్వారా ఒక బలిష్టమయిన సామ్యవాద మార్కెట్ ఆర్థిక వ్యవస్థను నెలకొల్పింది. ఈ మార్పులు సాధిస్తున్న క్రమంలో గతంలో తాను ఆధారపడిన సంస్థలను, విధానాలను, వ్యవస్థలను పూర్తిగా తుడిచిపెట్టలేదు. కొత్తగా ప్రవేశపెట్టి అభివృద్ధి చేస్తున్న సంస్థలూ, వ్యవస్థలూ, పాత వ్యవస్థలూ ఒకదానికొకటి సహకరించుకుంటూ మనుగడ సాగించే అవకాశం కల్పించారు. ఆ సంస్థలు కూడా ఒకదాని లోపాలకు మరొకటి సమాధానంగా అభివృద్ధి చెందాయి. ఈ విధంగా ప్రభుత్వ ప్రణాళికలకు, మార్కెట్ ఆచరణలకు మధ్య ఒక సయోధ్య, వాటి గమనంలో ఒక స్థిరత సాధించారు. అత్యంత చురుకుగా సాగుతున్న సంస్కరణల వేగం, సామాజిక స్థిరత్వాన్ని ఏమాత్రం కుంటుపరచకుండా అభివృద్ధిని సాధించారు. సంస్కరణలతో మార్కెటును సామ్యవాద మార్కెటుగా అభివృద్ధి పరచటంవల్ల కలిగిన విజయం ఇది.

నలభై సంవత్సరాలు గడిచాయి. ఈనాడు చైనాలో మార్కెట్ సంస్కరణలు కొత్తదశకు చేరుకున్నాయి. ఈ స్థితిలో సంస్కరణలు మరింత లోతుగా, మరింత పదునుగా అమలు చేయవలసి వుంది. దీని లక్ష్యం ఇప్పుడు వనరుల కేటాయింపులో, పంపిణీలో, మార్కెట్ ఒక నిశ్చయాత్మక పాత్రను నిర్వహించవలసివుంది హెరిటేజ్ ఫౌండేషన్ (వాషింగ్టన్) అనే సంస్థ అభిప్రాయం ప్రకారం ఆయా దేశాలలోని ఆర్థిక స్వేచ్ఛాసూచికలో చైనా 57/100గా వుంది. 1995లో ఇది 52/100గా వుండేది*. ఈ రోజు చైనాలో మార్కెట్ అనుకూల దిశలో సాగుతున్న సంస్కరణల పట్ల ఎవరికీ వైముఖ్యంలేదు. తమదేశం సాగిస్తున్న సోషలిస్టు అభివృద్ధి

** సరళతర వ్యాపార నిర్వహణలో 1995లో చైనా 52/100గా వుండేది. ఇండియా 53.2/100 స్థానంలో వుండేది. 2019లో చైనా 46/100గా మెరుగుపడితే ఇండియా 55.2/100వ స్థానంలో వుంది.*

ప్రస్థానంలో సంస్కరణలొక గొప్ప చోదకశక్తిగా భావిస్తున్నారు. ఈ మార్గంలో అకుంఠితంగా కృషిచేస్తే మరింత ఉత్తమ ఫలితాలు సాధించగలమని నమ్ముతున్నారు.

## మరింత విశాలంగా... (ఓపెన్ అప్ విధానం)

చైనా సాధించిన విజయాలకు మరో ముఖ్యకారణం ఓపెన్అప్ విధానం. బయటి దేశాలకు తలుపులు తెరిచివుంచే విధానం. ఇది మూడు దశల్లో సాగింది.

**1980-90ల మొదటిదశ.** ఈ దశలో విదేశీ పెట్టుబడులను దేశంలోకి ఆకర్షించి, తద్వారా దేశీయ మౌలిక వసతులను, పారిశ్రామిక కేంద్రాలను అభివృద్ధి పరచడం లక్ష్యంగా వుండేది. భౌగోళిక, చారిత్రక, సాంస్కృతిక అనువంశిక అంశాలను ఆధారం చేసుకుని కోస్తా తీర ప్రాంతాలను దీనికోసం ఎన్నికచేశారు. ప్రత్యేకించి గ్యాంగ్డాంగ్, ఫుజియన్, షాంఘై ప్రాంతాలు ఈ క్రమంలో సత్వర అభివృద్ధిని సాధించాయి. ఉదాహరణకి గ్యాంగ్ డాంగ్ ప్రాంతాన్ని చూద్దాం. ఈ ప్రాంతం ఎంతోకాలంగా దగ్గరున్న హాంగ్కాంగ్తో సత్సంబంధాలను కలిగివుంది. ఇరుప్రాంతాల ప్రజల మధ్య సంబంధాలు, చుట్టరికాలు, రాకపోకలు వున్నాయి. ఎప్పుడైతే చైనాలో విదేశీ పెట్టుబడులకు ద్వారాలు తెరిచారో, వెంటనే హాంగ్కాంగ్లోని వాణిజ్యవేత్తలు, వ్యాపారస్తులు గ్యాంగ్డాంగ్లో తమ సంస్థలు, శాఖలు ప్రారంభించారు. పారిశ్రామిక వాడలు, ఆర్థిక జోన్లు తామరతంపరగా అభివృద్ధి చెందసాగాయి. దాంతో అప్పటివరకు చిన్నచిన్న జనావాసాలుగావున్న ప్రాంతాలు, గ్రామాలు ప్రపంచస్థాయి ఉత్పాదక కేంద్రాలుగా మార్పుచెందాయి. వాటిల్లో చాంగువాన్ అనే ప్రాంతం ప్రపంచప్రసిద్ధి చెందినది. మొదటిస్థాయి ఎలక్ట్రానిక్స్ ఉత్పాదక స్థావరంగా ఎదిగింది. 1990లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు (ఎఫ్డిఐ) అనూహ్యమైన స్థాయికి చేరుకున్నాయి. అందువల్ల చైనా 'ప్రపంచ ఫ్యాక్టరీ'గా కొత్తరూపం స్థిరపరచుకోగలిగింది.

### 2001 నుండి 2012 వరకు రెండవదశ

ప్రపంచ వాణిజ్య సంస్థతో (డబ్ల్యుటిఓ) చైనా వొప్పందానికి రావటం ఈ సమయంలో జరిగింది. ఈ దశలో చైనా రెండు కర్తవ్యాలను పూర్తి చేసింది. మొదటిది దేశంలోని విదేశీ వాణిజ్య, పెట్టుబడులను అంతర్జాతీయ సూత్రాలకనుగుణంగా మార్చడం, అంతర్జాతీయ నియమ నిబంధనలను అమలు చేశారు. ముఖ్యంగా పశ్చిమ పెట్టుబడిదారీ దేశాల అభివృద్ధి చెందిన ఆర్థికవ్యవస్థ గమనాన్ని పరిశీలించారు. ఆయా దేశాల నాణ్యతా ప్రమాణాలను చేరుకుని వారి ఉత్పత్తుల విలువలకు సరితూగేలా తమ వస్తువులను తయారు చేశారు. మొదటిదానివల్ల చైనాతో వాణిజ్యానికి ప్రపంచవ్యాప్తంగా అంగీకారము, ఆదరణ పెరిగాయి. ఇక నాణ్యమైన వస్తువులవల్ల, అంతర్జాతీయ విపణిలో, చైనా అటు రాశిలోను, ఇటు వాసిలోను విస్మరించ వీలులేని శక్తిగా స్థానం సంపాదించుకున్నది. ప్రపంచ మార్కెట్లతో ఈ విధంగా సమ్మిళితమవడం వల్ల వాటిని అత్యధిక స్థాయిలో అందుబాటులోకి తీసుకురావడం వల్ల

అంతర్జాతీయ పోటీని ఎదుర్కోవలసివచ్చింది. ఇది పరిశ్రమలను దెబ్బతీయడంకాక, నాణ్యమైన వస్తువుల వల్ల ఉత్పాదక సమర్ధతను పెంపొందించింది. వీటి నాణ్యత, విలువ అమెరికా వస్తువులకన్నా మించిపోయి ప్రపంచంలో చైనా వస్తువులు ప్రథమస్థానం ఆక్రమించాయి. చైనా జిడిపి జపాన్ జిడిపిని మించిపోయి ప్రపంచంలో రెండవ పెద్ద ఆర్థిక వ్యవస్థగా అవతరించింది.

**2013 నుండి మూడవదశ**

చారిత్రక ప్రాధాన్యంవున్న సిల్కురోడ్డును పునరుద్ధరించి దానిచుట్టూ ఒక ఆర్థిక బెల్టును ఏర్పరచాలనే లక్ష్యాన్ని 2013లో ప్రకటించారు చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్. అప్పటినుండి ఓపెన్‌అప్ అనే విధానం ఓబిఓఆర్ (ప్రస్తుతం దీన్ని బిఆర్ఐ అని వ్యవహరిస్తున్నారు) అనే పథకంలోకి మరింత విశాలంగా విచ్చుకుంది. సంప్రదాయక భూమార్గంతో పాటు, 21వ శతాబ్దపు నావికామార్గంగా కూడా ఒకరోడ్డు ఒక బెల్టును తీర్చిదిద్దాలని సంకల్పం. 'ఒకరోడ్డు ఒక బెల్టు' అనే ప్రతిపాదనవల్ల అనేక దేశాల ఉమ్మడి ప్రయోజనాలు, ఉమ్మడి పథకాలు కలగలుపుకుంటూ, అనేక సంయుక్త నిర్మాణాలు చేపట్టవలసి వుంది. వివిధ దేశాల మధ్య, ప్రాంతాల మధ్య, రాకపోకల మార్గాలు, వ్యాపార వాణిజ్య, సాంస్కృతిక సంబంధాలు ఏర్పడవలసివుంది. ఇవన్నీ కలిసి వివిధ ప్రజా సమూహాల మధ్య చక్కని అవగాహన, మైత్రి నెలకొంటాయని చైనా ప్రగాఢ విశ్వాసం. దీనికోసం అత్యధిక స్థాయిలో మానవ వనరులు, అధికస్థాయి పెట్టుబడులు, ఉన్నత నైపుణ్యాలు, ప్రత్యేక వృత్తి విద్యలు, అనేక కార్యకలాపాలకు సంబంధించిన ప్రత్యేక తర్ఫీదులు అవసరమవుతాయి. అనేక దేశాలు కలిసిమెలిసి వ్యవహరించవలసి వుంటుంది. ఈ బృహత్తర కార్యక్రమానికి తనవంతు సహాయ, సహకారాలు అందించటానికి, పాదార్థిక, ఆర్థిక తోడ్పాటు ఇవ్వటానికి వాటిని సమన్వయ పరచటానికి చైనా సంసిద్ధంగా వుంది. సామ్రాజ్యవాద దేశాలు, అభివృద్ధి చెందిన ఇతరదేశాలు ఇప్పటివరకు అందిస్తున్న 'సహాయం', అభివృద్ధి నిధులు అవి స్వీకరించిన దేశాల అభివృద్ధికన్నా సామ్రాజ్యవాద దేశాలకే ఎక్కువ లాభకరంగా వుండేవి. దీనికి ప్రత్యామ్నాయంగా చైనా విధానం ఇరుపక్షాలకు లాభకరమైన లక్ష్యంతో రూపొందించబడింది. ఇదంతా అనేక దేశాలమధ్య ఎంతో సంయమనంతో సాధించవలసిన మహత్తర కార్యాచరణ. ప్రపంచదేశాలతో పారదర్శకంగా వ్యవహరించటం కీలకం. అందుకే ఇది చైనా అనుసరిస్తున్న ఓపెన్ అప్ విధానాలలో మరో కొత్తదశగా అభివర్ణించబడుతోంది.

ఈ ప్రతిపాదనల వల్ల, అంగీకరించిన దేశాల మధ్య పరస్పర సహకారం సంయుక్త అభివృద్ధి సాధ్యమవుతుంది. అందువల్ల ప్రపంచశాంతికి నిజమైన హామీగా వుంటుంది. పారదర్శకమైన సంతులిత అభివృద్ధికి, విశ్వప్రగతికి దారితీస్తుంది. విభిన్న నాగరికతల మధ్య సంభాషణలు, చర్చలవల్ల సదవగాహన వెల్లివిరుస్తుంది. గొప్ప భవిష్యత్తును ఉమ్మడిగా నిర్మించుకునే, పెంచుకునే మానవ సమాజ నిర్మాణానికి అది ఉపకరిస్తుంది. ప్రపంచ మానవులందరికీ ఒక ఉజ్జ్వల భవిష్యత్తును సమకూర్చే లక్ష్యం ఇది.

## అభివృద్ధిపైన కేంద్రీకరణ

1978 చివరిలో చైనా నాయకత్వం తమ జాతీయ అభివృద్ధి సాధించటానికి నూతన ఆలోచనల సంపుటిని ప్రకటించింది. వాటిలో అతి ముఖ్యమైనది చైనా కమ్యూనిస్టుపార్టీ తన ప్రాధమ్యాలను పునర్నిర్వచించు కోవడం. అభివృద్ధికోసం దృష్టి కేంద్రీకరించడం ఒక ప్రాధాన్యత గల అంశం. అప్పటినుండి అన్నిస్థాయిలలో, కమ్యూనిస్టు పార్టీకి, ప్రభుత్వానికి దేశాభివృద్ధి కీలక కర్తవ్యంగా ముందుకు వచ్చింది. ఒక ప్రాంతపు అభివృద్ధికిగానీ, ఒక అధికారి సమర్థతకుగానీ, ఒక బృందం పనితీరుకుగానీ వారు సాధించిన ఆర్థిక అభివృద్ధి అత్యున్నత ప్రాముఖ్యత గల అంశం అన్న బ్యానర్లు, కరపత్రాలు, ఫలకాలు అనిచోట్ల దర్శనమిచ్చాయి. దాంతో అభివృద్ధి అంటే ఆర్థిక అభివృద్ధే అనీ, అదే అన్ని సమస్యలకు విరుగుడు అనే భావన బలపడిపోయింది. వస్తూత్పత్తిలో సాధించే అభివృద్ధి సత్వర ఆర్థిక అభివృద్ధికి దారితీస్తుందనే భావాన్ని కేంద్ర, ప్రాంతీయ ప్రభుత్వాలు నొక్కివక్కాణించాయి. అయితే 1970-80-90ల వరకు కూడా దేశంలో పెద్దఎత్తున పరిశ్రమలు నెలకొల్పేటంతటి భూమి, భారీయంత్రాలు కొనుగోలు చేయగలిగిన శక్తి ప్రభుత్వానికి, సమాజానికి లేకపోయింది. అంతేకాదు కావలసిన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానము అందుబాటులో లేదు. అందుకని చైనా విదేశీ పెట్టుబడులకోసం తన చూపులు తిప్పింది. అదే సమయంలో చైనావంటి పెద్ద మార్కెటులో ప్రవేశించే అవకాశాలకోసం పశ్చిమ పెట్టుబడిదారులు ఎదురుచూస్తూ ఉండేవారు. విదేశీ పెట్టుబడి రాకతో ఒనగూరనున్న అపారమైన ఆర్థిక ప్రయోజనాలను, సాంకేతిక లభ్యతను చైనా నాయకత్వం సరిగ్గానే అంచనావేసింది. పెరగనున్న ఆదాయాలు, పన్నులద్వారా రాబడి, ఉద్యోగాలకల్పన, స్థానికుల ఆదాయంలో రానున్న అభివృద్ధి, పెరగనున్న ప్రజల కొనుగోలుశక్తి, దానివల్ల వచ్చే స్థానిక పురోగమనం వంటి అంశాలు మదింపుచేశారు. ఇవి తమ ఆర్థిక స్వావలంబనకు, స్వతంత్ర సంపూర్ణ అభివృద్ధికి దారితీసేలా నియమనిబంధనలు, ప్రణాళికలు సిద్ధం చేసుకున్నారు. దాంతో ప్రాంతీయ ప్రభుత్వాలు విదేశీ పెట్టుబడిని సమకూర్చుకోవాలని పోటీపడ్డాయి. విదేశీ పెట్టుబడిదారులకు ఆకర్షణీయమైన ప్రతిపాదనలు చేశారు. పారిశ్రామిక పెట్టుబడులలో రాయితీలు, కొంతకాలంపాటు పన్నులకు సెలవు, పరిశ్రమలకు కావలసిన భూమిని అతి తక్కువ రేట్లకే కేటాయించటం లేదా ఉచితంగానే భూమి సమకూర్చటం వంటివి అవలంబించారు. కొన్నిచోట్ల పర్యావరణ, కాలుష్య నివారణ నిబంధనలు కూడా సడలించారు. బాంకులు ఈ పరిశ్రమలకు తగిన ఆర్థిక వసతి, పరపతి సమకూర్చేలా చూశారు. ప్రభుత్వమే కొన్ని ఆర్థిక వేదికలు నిర్మించి వాటిద్వారా స్థానిక పరిశ్రమలకు, వాణిజ్యవేత్తలకు సహాయం అందించారు. ఇవన్నీ మౌలిక వసతుల పరికల్పనకు ఎంతో వూతమిచ్చాయి. దాంతో పారిశ్రామికవేత్తలు అనువైన చోట్ల ఇబ్బడిముబ్బడిగా పరిశ్రమలు స్థాపించారు. ఫలితంగా ఆర్థికవ్యవస్థ శీఘ్రంగా పురోగమించింది. పది శాతాన్ని మించిన జిడిపి వృద్ధిరేటు నమోదు అయ్యింది. గొప్ప మౌలిక వసతులు సమకూరాయి. పట్టణాలు, గ్రామాలు అనే తేడాలేకుండా

వస్తూత్పత్తి పెరిగిపోయింది. ఇంత భారీ స్థాయిలో జరుగుతున్న అభివృద్ధి క్రమంలో నూతన పరిస్థితులకు చెందిన కొన్ని దుష్పరిణామాలు కూడా బయల్పడసాగాయి.

పారిశ్రామిక అవసరాలకోసం భూమిని ఉచితంగానో, తక్కువధరకో కేటాయించటం వల్ల వ్యవసాయ భూమి తరిగిపోసాగింది. భూముల లావాదేవీలలో కొన్నిచోట్ల లంచగొండితనం చోటు చేసుకుంది. విదేశీ పెట్టుబడిదారులు తమ స్వప్రయోజనాలకోసం స్థానిక అధికారులకు, బ్యాంకులకు అవినీతి ఎరలు వేయసాగారు. ఈ సమస్యలను ముందుగానే ఊహించిన, గమనించిన ప్రభుత్వం ఎప్పటికప్పుడు తగు నివారణ చర్యలు తీసుకుంది. 'ఆర్థిక అభివృద్ధి' అనే ప్రధానలక్ష్యం అమలులో తలయెత్తుతున్న కార్యనిర్వాహక పొరపాట్లను సరిదిద్దింది.

## రాజకీయ, సామాజిక స్థిరత్వం

నలభై సంవత్సరాలుగా, బ్రహ్మాండమయిన వేగంతో సాగుతున్న చైనా అభివృద్ధికి మూలకారణమైన మరో అంశం అక్కడి రాజకీయ, సామాజిక స్థిరత్వం అని చెప్పుకోవాలి. దేశప్రజలు, ఇతర దేశస్తులు కూడా ఒప్పుకునే అంశం "చైనా సమాజం స్థిరంగా వుంది. జీవించడానికి కావలసిన భద్రతను అది కల్పిస్తుంది" అని. ప్రపంచంలో అత్యధిక జనాభా వున్నదేశం, 91% హాన్ జాతి ప్రజలతోపాటు గుర్తింపుగల మొత్తం 56 అల్పసంఖ్యాక ప్రాచీన జన సముదాయాల ప్రజలుగల దేశంలో ఈ సామాజిక స్థిరత్వం ఎలా సాధ్యమయింది? అల్ప సంఖ్యాకుల ప్రయోజనాలు ఎలా కాపాడబడుతున్నాయి? శాంతి భద్రతలు, జీవన రక్షణలు ఎలా కాపాడబడుతున్నాయి? దీనికి నాలుగు ముఖ్యమైన కారణాలు కన్పిస్తున్నాయి.

1. కమ్యూనిస్టు పార్టీ యొక్క కేంద్రీకృత ఐక్య నాయకత్వం – చైనాలో పరిపాలన సాగించే ఏకైక పార్టీ చైనా కమ్యూనిస్టు పార్టీ. ఈ పార్టీ నాయకత్వం క్రిందే మిగిలిన రాజకీయ పార్టీలు రాజ్య వ్యవహారంలో పాల్గొంటాయి. ఈ ఏర్పాటు దేశంలోని రాజకీయ సుస్థిరతకు ఒక ముఖ్య కారణం. కమ్యూనిస్టు పార్టీకి దేశవ్యాప్తంగా వున్న శాఖల నిర్మాణం వల్ల, అన్ని యూనిట్లు ఒకే విధమయిన విధానాలు, నియమాలు పాటించడం వలన దేశవ్యాప్తంగా పాలనా విధులు నిర్వహించటం పార్టీకి సాధ్యమవుతుంది. సుదీర్ఘ చరిత్ర కలిగిన పార్టీ, విప్లవాన్ని విజయవంతం చేసినపార్టీ, విదేశీదాడులను, దోపిడీని తిప్పికొట్టగలిగిన పార్టీ దేశ పరిస్థితులకు అనుగుణంగా పరిపాలన సాగించగల అనుభవాన్ని సంతరించుకున్నది. సాంస్కృతిక విప్లవ కాలంలో చేసిన తప్పిదాలనుండి, గతంలో జరిగిన పొరపాట్లనుండి పాఠాలు నేర్చుకుని, ధైర్యంగా కొత్త ఆలోచనలు స్వీకరిస్తూ తననుతాను సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా మలచుకుంటూ, చైనా ప్రజల విశాలమైన మద్దతును, విశ్వాసాన్ని కూడగట్టుకుని ముందుకు నడిపిస్తున్నది చైనా కమ్యూనిస్టు పార్టీ. మార్క్సిజం మూలసూత్రాలను తమ సమాజ గతిరీతులకు అనుగుణంగా అన్వయిస్తూ, సామ్యవాద నిర్మాణానికి నాయకత్వం వహిస్తుంది.

2. చైనా ప్రభుత్వము, కమ్యూనిస్టు పార్టీ అన్ని స్థాయిలలోను సామాజిక స్థిరత్వానికి ప్రాధాన్యతనిస్తాయి. "అన్నింటికన్నా స్థిరత్వానికి ప్రాధాన్యత" అన్న నినాదం చైనా ప్రజల నమ్మకాన్ని ప్రతిబింబిస్తుంది. నిలకడైన సమాజంలేనిదే మనం దేన్నీ సాధించలేము అని ఆ ప్రజల విశ్వాసం. ఈ స్థిరత్వాన్ని సాధించటం కోసం తన నిర్మాణాలను, పాలనా వ్యవస్థలను దేశవ్యాప్తంగా విస్తరించింది. బలమైన పోలీసు, సాయుధ బలగాల వ్యవస్థను ఏర్పాటు చేసి విచ్ఛిన్నకర, తిరుగుబాటు శక్తులను అదుపుచేస్తుంది. తద్వారా శాంతి భద్రతలను, సామాజిక స్థిరత్వాన్ని నిలబెట్టుతుంది.

3. సామాజిక స్థిరత్వాన్ని నిలబెట్టగల ప్రధాన ఆధారం ప్రజల మెరుగైన ఆర్థికస్థితి. సమాజంలో అసంతృప్తులు, ఆర్థికసంక్షోభాలు, ఈతిబాధలు అన్నీ అస్థిరత్వానికి దారితీస్తాయి. చైనా సమాజంలో పౌరులకు జీవనభద్రత ఆర్థిక తోడ్పాటు వుండటమేకాదు, ఆపత్కాలంలో ఆదుకునే ఆర్థిక వెసులుబాట్లు వున్నాయి. ఈ రకమయిన ఆర్థికదన్ను సామాజిక స్థిరత్వాన్ని నిలబెట్టడంలో చాలా ముఖ్యమయిన భూమిక నిర్వహిస్తుంది.

4. అనూచానంగా వస్తున్న సంస్కృతి, సంప్రదాయాలు కూడా సామాజిక స్థిరత్వానికి ప్రోదిచేస్తాయి. ఉదాహరణకి సంస్కృతిపరంగా చైనా ప్రజలు సామరస్యానికి, మైత్రికి అధిక ప్రాధాన్యతనిస్తారు. సంఘర్షణలలో మధ్యే మార్గానికి, సామరస్యానికి, సంతృప్తికి ఎక్కువ విలువనిస్తారు. అనవసరపు వివాదాలను, ఉగ్రవాదాలను నిరసిస్తారు. అలాంటివారిని నిరుత్సాహపరుస్తారు. ఈ లక్షణాలవల్ల సామాజిక స్థిరత్వం దృఢంగా నిలుస్తుంది.

## అభివృద్ధి పథకాల రూపకల్పన

ఏ రంగానికి సంబంధించిన విషయంలోనయినా, చైనా విస్తారంగా క్షేత్రస్థాయి పరిశీలన చేసి సమస్యలను పరిష్కరించే ఉపాయాలను కనిపెడుతుంది. ఆచరణ సాధ్యమయ్యే విధానాలను రూపొందిస్తుంది. పార్టీ పనివిధానాలకు ప్రణాళికలుంటాయి. ప్రభుత్వ పని నిర్వహణకు ప్రణాళికలుంటాయి. అన్ని సామాజిక కార్యకలాపాలకు కూడా నిర్దిష్ట ప్రణాళికలు వుంటాయి. మూడు, నాలుగు దశాబ్దాలకు విస్తరించే దీర్ఘకాలిక లక్ష్యాలుంటాయి. ఐదేసి సంవత్సరాలకు సరిపడ నిర్వహించవలసిన మధ్యకాలిక పథకాలు వుంటాయి. అంతేకాదు, వార్షిక, త్రైమాసిక తక్షణ లక్ష్యాలు, వాటిని సాధించే కార్యాచరణ పద్ధతులు వుంటాయి. ఇవన్నీ ఒకదానితో మరొకటి అనుసంధానించబడి కూడా వుంటాయి. అన్నింటికన్నా ముఖ్యంగా నిర్దేశించుకున్న లక్ష్యాలను అక్షరాల అమలుపరిచి తీరుతారు. అంటే కాగితం మీది రాతలను తమ దీక్షాదక్షతలతో వాస్తవాలుగా మార్చుతారు.

1949 నుండి చైనా 13 పంచవర్ష ప్రణాళికలు పూర్తి చేసింది. ఆ ప్రత్యేక సమయంలో దేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలను గుర్తించడం, వాటిని ఎదుర్కొని, పరిష్కరించే

స్పష్టమయిన విధానాలను రూపొందించటం, ఈ ప్రణాళికల ఉద్దేశ్యం. సర్వ యంత్రాంగమూ ఈ విధానాలను అమలుచేసి, లక్ష్యాలను పరిపూర్తి చేయటం జరుగుతుంది. ఈ విధానంవల్ల కలిగే గొప్ప మేలు ఏమంటే దేశం మొత్తానికి స్పష్టంగా తమముందున్న లక్ష్యం ఏమిటో తెలుస్తుంది. వాటిని అమలుచేయటంలో అనుకూలతలను సాధించటానికి, ప్రతికూలతను అధిగమించటానికి సన్నద్ధమవుతారు. అందువల్ల జనాభా యావత్తు తమ శక్తినంతా సమీకరించి యుద్ధ ప్రాతిపదికన లక్ష్యం చేరటానికి కృషిచేస్తారు. జనచైనా ఆవిర్భావం తరువాత వారు అనేక అడ్డంకులను అధిగమించారు. విజయంనుంచి విజయానికి అవిశ్రాంతంగా ప్రయాణించారు. ఈ ప్రణాళికలను అమలు చేస్తూనే చైనా ఈనాటి స్థానానికి చేరుకున్నది.

నాలుగు దశాబ్దాల చైనా ప్రగతిపథాన్ని సమీక్షించినట్లయితే చైనా ప్రజల మొక్కవోని దీక్షదక్షతలు, వారి కఠోరశ్రమ కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. వారి దేశభక్తి, త్యాగశీలత, అంకితభావం కనిపిస్తాయి. చైనా విజయయాత్ర గురించి ఏది మాట్లాడినా ఆ ప్రజల అకుంఠిత కార్యదీక్షను ప్రశంసించకుంటే అదంతా అర్థవిహీనం కాక తప్పదు. అలాగే కమ్యూనిస్టు పార్టీ నిరంతరం నేర్చుకోవటానికి సిద్ధంగా వుంటుంది. తమ అనుభవాలను ఎప్పటికప్పుడు సమీక్షించి తనతో మిళితం చేసుకుని, సృజనాత్మకంగా తమదేశానికి అన్వయించుతుంది. ఆ జ్ఞాన సంపత్తితో తననుతాను సాయుధం చేసుకుని, సమస్యలను పరిష్కరిస్తూ ముందుకు సాగుతోంది చైనా కమ్యూనిస్టు పార్టీ.

## సామ్యవాదంలో జీ జిన్‌పింగ్ ఆలోచనా విధానం

'నూతనశకానికై చైనా లక్షణాలుగల సామ్యవాదం' అనే సరికొత్త సైద్ధాంతిక చేర్పును చైనా కమ్యూనిస్టు పార్టీ తన 19వ మహాసభలలో (2017) అందించింది. గతంనుంచీ అనుసరిస్తున్న వారి అభివృద్ధి పథం సామ్యవాద నిర్మాణంలో వర్తమాన ప్రపంచవాస్తవాలను పరిగణిస్తూ నూతన యుగ అవసరాలను సంలీనంచేస్తూ కామ్రేడ్ జీ జిన్‌పింగ్ అందించిన ఆలోచనల సారం ఈ సైద్ధాంతిక చేర్పు. ఈ విధానమే వారి ఆచరణక్రమానికి మార్గదర్శకత్వం వహిస్తోంది. అంచలంచెలుగా విజయాలను సాధిస్తూ అంతిమంగా చైనా సుదృఢమైన శక్తిగా నిలుస్తుందని, అభివృద్ధి చెందిన అధునాతన సోషలిస్టు సమాజమనే తన గమ్యాన్ని చేరుకుంటుందనీ ఆశిద్దాం.

జనచైనా పురోగమనం మనవంటి దేశాలకు లక్ష్యసూచకంగా నిలుస్తుంది. వారి అనుభవాలనుండి మనదేశ కాలమాన పరిస్థితులకవసరమయిన, అనుగుణమైన, విలువైన పాఠాలను స్వీకరించి మన పురోగమనానికి ఉద్యమించటానికి ఉద్యుక్తులమవుదాం.

*– జనవరి, 2018*

# 15.

# చైనాలో ప్రజాస్వామ్యం

*(ప్రొఫెసర్ యు కెపింగ్ బీజింగ్ యూనివర్సిటీలోని రాజకీయ, ఆర్థిక విషయాల తులనాత్మక అధ్యయనం చైనా సెంటరులో ఆచార్యులు. హార్వర్డ్ యూనివర్సిటీ యాష్ సెంటరులో సీనియర్ ఫెలోగా వుంటూ చైనాలో ప్రజాస్వామ్యం గురించి విశేషంగా రాసిన వ్యక్తి. మార్చి 2016లో Democracy in China: A Challenge or Opportunity అని ఆయన రాసిన పుస్తకాన్ని World Scientific Publishing Company-Singapore (WSPC) పబ్లిషర్సు ప్రచురించారు. ఆ వ్యాసాల ప్రధాన అంశాలు ఈ అనువాద వ్యాసానికి ముఖ్య ఆధారం. మరికొంత సమాచారం జోడించిన రచన ఇది. ఇందులో ఉదహరించిన చైనా నాయకుల అభిప్రాయాలు, ఉల్లేఖనలు మూల రచయిత ప్రొఫెసర్ యు సమకూర్చినవే.)*

చైనాలో ప్రజాస్వామ్యం వుందా? చైనా ప్రజాస్వామ్య దేశమా అని అడిగితే పరస్పర విరుద్ధమైన జవాబులు లభిస్తాయి. ఈ ప్రశ్నను ఒక అమెరికన్ లేక పాశ్చాత్య వ్యక్తిని అడిగితే బహుశ 'లేదు' అని సమాధానమిస్తాడు. అదే ఒక చైనీయుని అడిగితే 'వుంది' అనే సమాధానం రావొచ్చు. అమెరికాలో చదువుకొంటున్న ఒక చైనా యువతిని అడిగితే "మాకు పాశ్యాత్య దేశాలలోవున్న మాదిరి ప్రజాస్వామ్యమే వుండాలని మీరెందుకు భావిస్తున్నారు?" అని ఎదురు ప్రశ్న వేసింది. ఈ విషయంలో ఈ ఎదురుప్రశ్నే ప్రధాన అంశమని నాకనిపిస్తుంది.

చైనా నాయకత్వం, పాశ్చాత్యదేశాలు అమలు చేస్తున్న ప్రజాస్వామ్యమే ప్రజాస్వామ్యపు అంతిమ రూపమని భావించడంలేదు. "మా లక్ష్యం సామ్యవాద ఆధునికీకరణ. కొన్ని పెట్టుబడిదారీ దేశాలు సాధించిన ఆర్థిక అభివృద్ధిని మేమూ సాధించటం, మరింత ఉన్నతస్థాయి ప్రజాస్వామిక విలువలు నెలకొల్పడం, రాజకీయాలలో ఆ దేశాలను మించిన సారాంశాన్ని సమాజానికి అందించడం మా గమ్యం." అని చైనా మహోన్నత నాయకులలో

ఒకరైన డెంగ్ సియావో పింగ్ ఏనాడో ప్రకటించాడు. "అన్ని దేశాల సాంస్కృతిక విజయాలను పరిశీలించి మేము నేర్చుకుంటాము. అయితే గుడ్డిగా పాశ్చాత్య దేశాలను అనుకరించము". అని అక్కడి నాయకత్వం చెబుతుంది.

చైనా ఆధునిక చరిత్రలో విశిష్ట నాయకులుగా పరిగణించతగిన సన్ ఎట్ సేన్, మావో జెడాంగ్, డెంగ్ సియావో పింగ్‌లు ప్రజాస్వామ్యం గురించి ఎంతో మాట్లాడారు. విభిన్న అభిప్రాయాలు చెప్పారు. అయితే ఈ ముగ్గురూ అంగీకరించిన విషయం – ప్రజాస్వామ్యమనేది దానంతట అదే ఒక గమ్యంకాదు. మహా అయితే అది ఒక గమనం మాత్రమే – అన్నది. దేశ అభివృద్ధిక్రమంలో ప్రజాస్వామికీకరణ అనేది ఒక దశారూపం మాత్రమే అనేది వారి అవగాహన. చైనా అసలు లక్ష్యం "ఏ విదేశీ శక్తుల అధికార ప్రాభవాలకు లోబడకుండా, ఒక సర్వసత్తాక సార్వభౌమశక్తిగా నిలబడటమే. తమ ప్రజలే తమ దేశ యజమానులుగా కొనసాగడమే. వారి సర్వతోముఖ అభివృద్ధిని సాధించడమే." అని లక్ష్యప్రకటన చేశారు. అనేక వేల సంవత్సరాల సాంస్కృతిక చరిత్ర కలిగిన చైనాలో వచ్చిన అనేకానేక మార్పులను లోతుగా పరిశీలించకుండా, వారి చరిత్రను, భవిష్యత్ లక్ష్యాలను పరిగణించకుండా, ప్రజాస్వామ్యంపట్ల వారి అభిప్రాయాలను అవగతం చేసుకోలేము.

శతాబ్దాల రాజరికంలో అనేక పాలనా వ్యవస్థలు వాళ్ళు చూశారు. అనేక పోరాటాలు చేశారు. అనేకమంది తత్వవేత్తలు వారి ఆలోచనా ధోరణులను ప్రభావితం చేశారు. వ్యవస్థతో సంబంధంలేకుండా, చరిత్రతో సంబంధం లేకుండా ఏ భావనా ఉద్భవించదు. దానికి ఆదరణ లభించదు అని మనం గమనించాలి. ఆధునిక చైనా జాతీయ నాయకుడు, క్వింగ్ వంశపు రాజరికానికి చరమగీతం పాడిన ప్రజాతంత్ర ఉద్యమ నాయకుడు, కొమింటాంగ్ ప్రభుత్వ తొలితరం నాయకుడు సన్‌ఎట్‌సేన్ "ప్రజాస్వామ్యం అనేది నాగరికతా పరిణామంలో, ప్రగతిపథంలో అత్యంత కీలకమయిన అంశం" అని భావించాడు. "ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తేనే సంపద్వంతమవుతాం. దాన్ని కాదంటే నశించిపోతాం" అన్నాడు. ఈ ప్రజాస్వామ్య భావనల వికాసంగానే రిపబ్లిక్ ఆఫ్ చైనా (ఆర్‌ఓసి) ఏర్పడింది. అయితే కొద్దికాలంలోనే కొమింటాంగ్ పాలకులు, సన్‌ఎట్‌సేన్ వారసులు రాజరికంతో దోస్తీ చేశారు. జాతీయ ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరించారు.

అప్పుడే కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో అనేక త్యాగాలు చేస్తూ, వీరోచిత పోరాటాలుచేస్తూ, జపాన్ సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధాలు చేస్తూ చైనా ప్రజలు పురోగమించి జనచైనాను (పిఆర్‌సి – పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా) స్థాపించుకున్నారు. ఈ ఉద్యమాల వరకు విప్లవాల అంతస్సారం ప్రజల ప్రజాస్వామ్య ఆకాంక్షలే. 1919 మే 4 ఆందోళన నాటి ఛెన్ డిజియా నాయకత్వం నాటినుండి మావో నాయకత్వాన సాగిన ప్రజల ఆకాంక్ష ప్రజాస్వామ్యమే. విప్లవ విజయానికి నేతృత్వం వహించిన మావో జెడాంగ్ సిద్ధాంతం నిజమైన ప్రజాస్వామ్యమే. వారు చేసినదే నూతన జనతా ప్రజాస్వామిక విప్లవం. వారు నిర్మించినదే జనచైనా రాజ్యం.

90%గావున్న శ్రామికప్రజలకు అధికారం సిద్ధించటమే ప్రజాస్వామ్యం. విశాలమైన జనరాసులపై కొద్దిమంది పెత్తందారుల దోపిడీ పాలనకు చరమగీతంపాడి వారు మళ్ళీ తలెత్తకుండా ఆ వర్గాలను ప్రజలు నిరంతరంగా నిర్దాక్షిణ్యంగా అణచివేయడమే శ్రామికవర్గ నియంతృత్వం. దోపిడిదారులపై నిరంకుశత్వం అత్యధిక ప్రజలకు ప్రజాస్వామ్యమే జనతా ప్రజాస్వామ్యం. జనావళికి శుభం పూచే పాలన నెలకొల్పుకోవటమే నిజమైన ప్రజాస్వామ్యం.

మావో నాయకత్వంలో నిజమైన ప్రజాస్వామ్యం నెలకొల్పటానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. భూస్వామ్య వ్యవస్థ రద్దు, వంశపారంపర్య హక్కుల రద్దు, స్త్రీ పురుష సమానత్వం, అట్టడుగు స్థాయిలోవున్న కర్షకులు, కార్మికులకు రాజ్యపరిపాలనా అధికారం లభించటం, ఇదీ వారనుసరించిన నూతన ప్రజాస్వామ్యం. "ప్రజాస్వామ్యం పేరుచెప్పుకుంటూ ఆర్థిక అభివృద్ధిని గానీ, సామాజిక అభివృద్ధిని గానీ సాధించలేకపోతే ఆయా ప్రభుత్వాలు విఫలమైనట్లే. అది ఆ ప్రభుత్వాల చట్టబద్ధతను, న్యాయబద్ధతను ప్రశ్నార్థకం చేస్తుంది. సామాజిక అసంతృప్తి, అశాంతి ప్రభుత్వాలపై నిరసనకు దారితీస్తుంది. అలాంటి ప్రభుత్వాలు ఎన్నుకోబడినప్పటికీ వాటిని ప్రజావ్యతిరేకమైన వాటిగానే పరిగణించాలి" అనే భావం మావోది. అయితే సాంస్కృతిక విప్లవ కాలంలో రాజకీయ అతివాదం పెచ్చరిల్లింది. ఫలితంగా అధికారవర్గం ప్రజాతంత్ర దృక్పధాన్ని కోల్పోయింది. సాధారణ ప్రజాస్వామ్యం మృగ్యమై ఏకచ్ఛత్రాధిపత్యానికి దారితీసింది. శ్రామికవర్గ అధికారం స్థానంలో పార్టీలోని ఒక ముఠా నియంతృత్వం నెలకొంది. అయితే మావో ఈ కాలంలో జరిగిన కొన్ని లోపాలను గమనించి హెచ్చరించినా, సరియైన రాజకీయ పంథాను పునరుద్ధరించి ఈ పరిణామాలు నివారించలేక పోవడం ఒక చారిత్రక వాస్తవం.

ఆతర్వాత 1978 నుండి డెంగ్ సియావో పింగ్ నాయకత్వంలో రాజకీయ అతివాదాన్ని పరిహరించి, రాజకీయ పంథా పునర్‌నిర్వచించబడింది. కేంద్రీకృత ప్రజాస్వామ్య పద్ధతులు పునరుద్ధరించి పార్టీ నిర్మాణం సరిచేయబడింది. సరియైన రాజకీయ విధానంవల్ల, నాయకత్వంవల్ల ప్రజాస్వామిక పద్ధతులు ఆచరించబడ్డాయి. ప్రభుత్వ నిర్వహణ కూడా ప్రజాస్వామికంగా మారింది. "ప్రజాస్వామ్యాన్ని ఆచరిస్తేనే ఏ ప్రభుత్వమయినా భద్రంగా స్థిరంగా వుంటుంది. ప్రజాస్వామ్యం ద్వారానే పరిపాలన సుస్థిరంగా నిలబడగలుగుతుంది. చైనా కలగంటున్న గొప్ప పునరుత్థానాన్ని తీసుకురాగలిగేది ప్రజాస్వామ్య పరిపాలనే" అని ఆయన భావించాడు. ఆయన నాయకత్వంలో సంస్కరణలు, ఓపెన్‌అప్ అనే విధానాలు చేపట్టి 1978నుండి 2008 వరకు ఒక గొప్ప ఆర్థిక విప్లవాన్ని సాగించారు. ఆర్థిక అభివృద్ధి ఒక విస్ఫోటనంలా జరిగింది. 3640 కోట్ల నుండి 30 లక్షల కోట్ల యువాన్లకు వారి స్థూల ఉత్పత్తి (జిడిపి) పెరిగింది. తలసరి ఆదాయం 54 డాలర్లనుండి 3,228 డాలర్లకు చేరుకుంది*.

** 2019 లెక్కల ప్రకారం చైనా తలసరి ఆదాయం 10,153 డాలర్లు. (తలసరి పిపిపి ప్రకారం 19,520 డాలర్లు). మనదేశంలో 2017లో తలసరి ఆదాయం 1,940 డాలర్లు.*

ప్రపంచంలో రెండవ పెద్ద ఆర్థిక వ్యవస్థగా రూపుదిద్దుకుంది. ఇది కేవలం ఆర్థిక ఆధునికీకరణ మాత్రమేకాదు. ప్రధానంగా నాలుగు అనుల్లంఘనీయ సూత్రాలను అనుసరించిన రాజకీయ ప్రజాస్వామికీకరణ ఫలితమే. గాడితప్పిన రాజకీయ విధానాలను తిరిగి సామ్యవాద రాజకీయాలవైపు మరలించిన విజ్ఞత ఫలితమిది. 'రాజకీయమే ఆర్థిక వ్యవహారాలను నిర్దేశించే అధినేత. అదే సమాజపు ఆత్మ. అదే అన్ని కార్యకలాపాలలో రక్షారేఖ' అన్న మావో సూక్తిని అక్షరాల ఆచరించి చూపుతున్న ప్రస్తుత నాయకత్వం తమ దేశానికనుగుణమైన రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక మార్పులను ప్రవేశ పెడుతోంది.

మూడు దశాబ్దాలలో చైనా వూహించలేనంత సర్వతోముఖాభివృద్ధిని సాధించింది. కోట్లాది దేశప్రజలు ఆమోదించకుండా, పాల్గొనకుండా, దానికోసం శ్రమించకుండా ఈ వ్యవస్థాగత అభివృద్ధి సాధ్యమా? కోట్లమంది జనాన్ని భాగస్వాములుగా చేసి సాగుతున్న ఈ ప్రక్రియను ప్రజాస్వామ్యం కాదనగలమా? బహుళపార్టీ వ్యవస్థ, సార్వత్రిక ఎన్నికలు, పాలకపక్షం మీద పరిమితులు, ఆంక్షలవంటి కొన్నిఅంశాలలో భిన్నంగావుంది కనుకా, తమను పోలిలేదు కనుకా చైనాది ప్రజాస్వామ్యం కాదంటున్నారు పాశ్చాత్య పండితులు. చైనా రాజకీయ వ్యవస్థ విశిష్టతను, ప్రత్యేక లక్షణాలను, అవగతం చేసుకోక పోవడం లేదా అపార్థం చేసుకోవడంవల్ల వస్తున్న అనర్థం ఇది. అదీగాక సర్వాన్ని తమ పాశ్చాత్య రంగుటద్దాలనుండే చూసి విమర్శించే హ్రస్వదృష్టికూడా ఒక కారణం.

కామ్రేడ్ డెంగ్ "పాత భావాలనుండి బయటపడటం, మేధస్సును విముక్తం చేసుకోవడం (Emanicipation of the mind) అత్యంత ప్రధానమైనదనీ, తమ రాజకీయ, ఆర్థిక సంస్కరణలకు అదే పునాది కాగలదని" భావించాడు. దానికి ఆలంబనగా, ప్రజాస్వామ్యయుతంగా అశేష జనవాహినిని చైతన్యపరచడమే మార్గం అని అన్నాడు. "పార్టీ కేడరు, ప్రజలు తమ పాత భావాలను విడనాడకపోతే ప్రగతిరథం ఒక్క అడుగు కూడా ముందుకు కదలద"ని చెప్పి ప్రజలందరినీ సామాజిక కార్యాచరణలో భాగస్వాములను చేశాడు. ఇంతకుమించిన ప్రజాస్వామ్యం మరేముంటుంది?

"పాత కొత్త భావాల సంఘర్షణ, అభివృద్ధిపట్ల శాస్త్రీయ దృక్పథం, చైనా విశిష్టతలతో కూడిన సోషలిజాన్ని క్రమంగా నిర్మించడం" అనే మూడు అంశాలను అవగతం చేసుకుని ఆ చిర తపస్సులో నిత్యం పాల్గొంటున్నది చైనా ప్రజానీకం. "మన సంస్కరణలు విజయవంతం కావడమనేది మనరాజకీయ సంస్కరణల విజయంపైననే ఆధారపడి వుంది" అనే రాజకీయ చైతన్యం కల్పించాడు కామ్రేడ్ డెంగ్. పాత, కొత్త భావాల సంఘర్షణలో భాగంగానే కొత్త భావాలు, ప్రజల పక్షం వహించే ప్రభుత్వం, మానవ హక్కులు, ప్రైవేటు ఆస్తి, చట్టబద్ధ పరిపాలన, పౌర సమాజం పాత్ర, సామాజిక సామరస్యం, ప్రభుత్వ విధానాలలో నవ్యవ్యక్తీకరణలు, సృజనాత్మక వైఖరులు, రాజకీయ నాగరికత, ఆధునికత, ప్రపంచీకరణ అవకాశాలు వంటి అంశాలు దేశమంతా చర్చించబడుతున్నాయి. ఎప్పటికప్పుడు

సమీక్షించబడుతున్నాయి. అవసరమైన మార్పులు చేయబడుతున్నాయి. సంస్కరణలకు పూర్వం 'పెట్టుబడిదారీ భావజాలం' అని గుడ్డిగా కొట్టివేయబడ్డ అంశాలు కొన్ని పునస్సమీక్షించ బడుతున్నాయి. అవసరమయిన వాటిని తమ కార్యాచరణలో సమన్వయం చేస్తున్నారు. ఇదంతా ప్రజాస్వామిక ప్రక్రియ కాదా?

'కమ్యూనిస్టు పార్టీ ఏకచ్ఛత్రాధిపత్యం వుంది. వాక్‌స్వాతంత్ర్యం లేదు. స్వతంత్ర న్యాయవ్యవస్థ లేదు. స్వేచ్ఛా సమాజపు గుర్తులయిన ఎన్నికలు లేవు. ఇంకా అనేక లక్షణాలు లేవు కనుక అది ప్రజాస్వామ్యం కాదు' అనే ధోరణిలో కొందరు పాశ్చాత్య విశ్లేషకులు విమర్శిస్తారు. ఈ విశ్లేషకులకు తమ దేశాలలో జరుగుతున్న అక్రమాలు పట్టవు. వాళ్ల దగ్గర అమలవుతున్న బూర్జువా నియంతృత్వం అర్థమేకాదు. వాళ్ల అనైతిక రాజకీయాలు, ధనాఢ్యవర్గాల సమయానుకూల రాజకీయపు ఎత్తులు, జిత్తులు, ఎన్నికల్లో జరుగుతున్న మాయోపాయాలు ఏవీ కనపడవు. వారి వ్యవస్థలు బడుగు బలహీన దేశాలపట్ల ప్రదర్శించే పెత్తందారీ ధోరణులు, చేస్తున్న ఆర్థిక దోపిడీలు అంతా ప్రజాస్వామ్యమే కాబోలు. 1982నుండి అమలులోవున్న నేటి చైనా రాజ్యాంగం ప్రజలకు హక్కులను, విధులను నిర్ధారించింది. ఆ రాజ్యాంగంలో మాట్లాడేస్వేచ్ఛ, సమావేశమయ్యే హక్కు, సమూహాలుగా, సంస్థలుగా ఏర్పడే హక్కు, తమ అభిప్రాయాలను ప్రకటించుకునే హక్కు అన్నీ వున్నాయి. కానీ జాతీయ ప్రయోజనాలకు భంగం కలిగించరాదనే షరతు విధించడంవల్ల ఆ హక్కులన్నీ అర్థవిహీనమే అని మన విమర్శకులు వాదిస్తారు. అయితే ఏ దేశంలోనైనా ప్రజలు, వ్యవస్థలు ఆ జాతీయ ప్రయోజనాలకు భిన్నంగా వ్యవహరించడాన్ని అనుమతిస్తారా? దోపిడీ వర్గాన్ని నిర్మూలించి సమాజమంతా సంపద్వంతం కావాలని ప్రజలందరూ కలిసి సాగిస్తున్న మహా యజ్ఞం వీరికి మానవ హక్కుల ఉల్లంఘనగా కనపడుతుంది. చైనా జాతీయ లక్ష్యమైన సోషలిజం నిర్మాణానికి వ్యతిరేకంగా నిలిచేవారికి, అవినీతిపరులకి, దేశ విచ్ఛిన్నకులకి ఏమాత్రం హక్కులు వుండవు. కానీ కోట్లాది ప్రజలు మెరుగైన జీవితాలతో, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో సుఖంగా, సామరస్యంగా జీవిస్తున్న విషయం ఈ కబోదులకు కనిపించదు.

చైనా న్యాయవ్యవస్థ స్వతంత్రమైనది కాదని, న్యాయమూర్తులు కమ్యూనిస్టు సూత్రాలకు అనుగుణంగానే తీర్పులు చెబుతారనీ కనుక చైనా న్యాయవ్యవస్థ ప్రజాతంత్రమైనది కాదని కొందరంటారు. సారాంశంలో అది కమ్యూనిస్టు పార్టీ నియంతృత్వమే అని వాదిస్తారు. ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలలో మొనగాడుగా చెప్పుకుంటున్న మనదేశంలో ప్రాథమిక హక్కులు ఏమేరకు అమలుచేస్తున్నారనేది మనకు తెలుసు. న్యాయవ్యవస్థ ఇక్కడ ఎంత స్వతంత్రంగా వ్యవహరిస్తున్నదీ, జడ్జీల నియామకాలలో నిత్యం జరుగుతున్న రభసలు, తెరచాటు భాగవతాలు మనకు తెలియనివికావు. ప్రభుత్వ విధానాలను ఏమాత్రం విమర్శించినా మన దేశభక్తినే శంకిస్తున్నారు. భౌతికంగా దాడులు చేస్తున్నారు. మానసికంగా హింసిస్తున్నారు. ఇదంతా ప్రజాస్వామ్యంగానే కనబడుతున్నవారికి ఈ వ్యవస్థలు స్వేచ్ఛగాను, స్వతంత్రంగాను వున్నాయని

భావిస్తున్నవారికి చైనాలో అమలవుతున్న నిజమైన ప్రజాతంత్ర భావనలు అర్థంకాక పోవడం ఆశ్చర్యమేమీ కాదు.

చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో అత్యధిక ప్రజలు విశ్వాసం కలిగివుండటం, వారు విధేయులుగా వ్యవహరించడం, వారనుసరిస్తున్న జనతా ప్రజాస్వామ్య పాలన ఫలితమే. 'ప్రజలపాలన, చట్టపరమయిన పాలన' అన్న రెండు అంశాలను మేళవించడం, ప్రజా కాంగ్రెసుల వ్యవస్థ, బహుపార్టీల ఉనికి, వాటి సహకారం, అన్ని పక్షాలతో సదా సంప్రతింపులు జరిపి నిర్ణయాలు తీసుకోవటం, అల్ప సంఖ్యాకులు అధికంగా నివశించే ప్రాంతాలకు, ప్రాచీన జన సముదాయాలకు స్వయంప్రతిపత్తి కల్పించటం, గ్రామీణ ప్రాంతాలకు స్వయంగా నిర్ణయాలు చేసుకునే స్థానిక ప్రభుత్వాలు ఏర్పరచడం, స్థానిక, ప్రాంతీయ ప్రభుత్వాలకు విస్తృత అధికారాలు కల్పించటం, కొన్ని ప్రాంతాలను అటానమస్ ప్రాంతాలుగా పరిగణించటం*, ఒకదేశంలో రెండు వ్యవస్థల ఉనికిని అంగీకరించడం (మకావో, హాంగ్‌కాంగ్) వంటి అనేకానేక అంశాలు తమ ప్రజాస్వామ్య లక్షణాలుగా చైనా చెబుతుంది. పార్టీలోని అంతర్గత ప్రజాస్వామ్యం, అనేక దశలలో, అనేక స్థాయిలలో జరిగే చర్చలు అత్యధిక ప్రజల అభిప్రాయాన్ని స్పష్టంగా ప్రతిబింబిస్తాయని వారంటారు. ఆ ప్రజాభిప్రాయ పునాదిపైనే పార్టీ నాయకత్వం తమ విధానాలు రూపొందిస్తున్నదనీ, వాటిని ఆచరించటంలో ప్రజలకు నాయకత్వం వహిస్తుందనీ, అదే తమ ప్రత్యేకత అని చైనీయులు వివరిస్తున్నారు. వీటన్నింటికీ ప్రజల ప్రయోజనమే గీటురాయిగా వుంటుంది కనుక తమది నిజమైన ప్రజాస్వామ్యమని వారి విశ్వాసం.

ప్రపంచమంతా చెప్పుకుంటున్నట్లు ఎన్నికలే ప్రజాస్వామ్యానికి బండగుర్తు అయితే ప్రపంచంలో మరెక్కడా లేనంతమంది ఓటర్లు చైనాలో ఎన్నికలలో పాల్గొంటున్నారు. 1980ల నుంచి ప్రతి 3 సంవత్సరాలకు ఒకసారి గ్రామీణ సభలకు ఎన్నికలు జరుపుతున్నారు. స్థానిక ప్రభుత్వాలను ఎన్నుకుంటున్నారు. దాదాపు 90 కోట్ల మంది గ్రామీణ ఓటర్లు తమ ప్రతినిధులను ఎన్నుకొంటారు. 18 సంవత్సరాలు దాటిన వారికందరికీ ఓటు హక్కు వుంది. ఈ ఎన్నికలు పార్టీల ప్రాతిపదిక లేకుండా జరుగుతాయి. రహస్య బాలెట్‌ద్వారా ఎన్నికలు

---

** చైనాలో ఐదు ప్రాంతాలను (Provincial level) స్వయంపాలిత ప్రాంతాలుగా గుర్తిస్తారు. అవి టిబెట్ (టిబెటన్లు), ఇన్నర్ మంగోలియా (మంగోల్సు), జియాన్‌జింగ్ (యూగార్లు), నింగ్సియా (హూయీ), గ్వాంగ్‌సీ (ఘువాంగ్). ఆయా అల్పసంఖ్యాక జనజాతులు అధికంగా నివశిస్తున్న ప్రాంతాలలో వారికి శాసన అధికార ప్రతిపత్తి కల్పించటం వీటి లక్ష్యం. ఇవికాక స్వయంపాలిత పాలనా విభాగాలు కొన్ని వున్నాయి. మండల స్థాయిలో (Prefectures) 30, కౌంటీ స్థాయిలో (Counties) 117లతోపాటు మరికొన్ని ప్రత్యేక ఎథినిక్ టౌన్‌షిప్‌లు కూడా వున్నాయి. ఆయా ప్రాంతాలలోని మైనారిటీ గ్రూపుల, బృందాల స్వతంత్ర అభిలాషలు, ప్రాధాన్యతలు గుర్తించి వాటిని నెరవేర్చటానికి ఈ ఏర్పాటు చేశారు.*

జరుగుతాయి. ఇవి చాల పోటాపోటీగా జరుగుతాయి. పార్టీల ప్రమేయంలేని, సమర్థులైన వ్యక్తులతో గ్రామకమిటీలు ఏర్పడతాయి. గ్రామస్థాయి అభివృద్ధి పనులు, గ్రామీణుల ఆశలు, ఆకాంక్షలు, వారి అవసరాలు, బలాలు, బలహీనతలు అన్నీ స్థానిక నాయకులకు తెలుస్తాయి. వారు గ్రామ సంబంధిత విషయాలలో బాధ్యతగా వ్యవహరిస్తారు. నిర్మాణ కార్యక్రమాలలో ఏవయినా కొద్దిపాటి లోపాలున్నా అవి స్థానికంగానే ప్రభావం చూపుతాయి కనుక వాటి పైస్థాయి సంస్థలు సరిదిద్దగలుగుతాయి. ప్రజాశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, అంకితభావంతో పనిచేసే ఏ కార్యకర్త అయినా ఈ కమిటీలలో స్థానం సంపాదించ గలుగుతాడు. ఇది ప్రజలస్థాయి ప్రజాస్వామ్యం. ఇది పునాది స్థాయిలో వినిపించే సామాన్యుల అధికార స్వరం. 'ప్రజలే యజమానులు' అన్న ప్రజాస్వామిక సూత్రానికి సరిఅయిన వ్యక్తీకరణ ఈ గ్రామకమిటీల పరిపాలన అని భావించవచ్చు. ఇలా ప్రత్యక్షంగా ఎన్నికైన గ్రామసభల సభ్యులు తమ పైస్థాయి ప్రభుత్వాలను ఎన్నుకుంటారు.

ఒక వ్యక్తి-ఒక ఓటు అనే పద్ధతిలో నాయకులను ఎన్నుకోవటం వొక్కటే ప్రజాస్వామ్య పద్ధతి అని బూర్జువా ప్రజాతంత్ర వాదుల నమ్మకం. అదొక్కటే నైతికంగా సరైనదని మిగతావన్నీ అనైతిక పద్ధతులని వాళ్ళు భావిస్తారు. మరే ప్రత్యామ్నాయ పద్ధతినీ వాళ్ళు ప్రజాస్వామ్యంగా అంగీకరించరు. అయితే ప్రపంచదేశాలు తమ సమాజాలకు అనువైన మెరుగైన పద్ధతులలో ప్రజాస్వామ్యాన్ని అమలు చేసుకుంటారని గమనించాలి. చైనాలో ప్రత్యక్షంగా, పార్టీల ప్రమేయం లేకుండా ఎన్నుకోబడ్డ గ్రామ కమిటీలు, మండల, రాష్ట్ర ప్రజా కాంగ్రెసులను ఎన్నుకుంటాయి. రాష్ట్రాల ప్రజాకాంగ్రెసులు జాతీయ ప్రజా కాంగ్రెసును (ఎన్‌పిసి) ఎన్నుకుంటాయి. ప్రస్తుతం దాదాపు మూడువేలమంది డెప్యూటీలతో జాతీయ కాంగ్రెస్ పనిచేస్తోంది. వీరినుండి 150-200మంది సభ్యులుగల స్టాండింగ్ కమిటీ (ఎన్‌పిసియస్‌సి) ఎన్నుకోబడుతుంది. వీరు దేశాధ్యక్షుడిని, ప్రధానిని ఎన్నుకుంటారు. ఇలా ప్రత్యక్ష, పరోక్ష ఎన్నికల కలయికగా వారి ప్రభుత్వం ఏర్పడుతుంది. ఈ అన్ని స్థాయిలలోని సంస్థలు కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రాలకు కట్టుబడి పనిచేస్తుంటాయి.

ఇక పైస్థాయిలో అధికారుల నియామకంగానీ, పార్టీసభ్యుల, బాధ్యుల ఎంపికగానీ ఆషామాషీ వ్యవహారం కాదు. ఒక ప్రత్యేక పద్ధతి ప్రకారం పరీక్షించిన తరువాతనే బాధ్యతలు అప్పగిస్తారు. మొదట పబ్లిక్ సర్వీస్ కమీషను వంటి పరీక్ష నిర్వహిస్తారు. ఇది వారి సాంకేతిక నిపుణతను నిర్ధారిస్తుంది. మరో పరీక్ష వారి సిద్ధాంత పరిజ్ఞానాన్ని పరీక్షిస్తుంది. ముఖ్యంగా పార్టీలో సభ్యులు, నాయకులు కాదలచుకొన్నవారు చైనా చరిత్ర, ఆర్థిక సామాజిక అంశాలు, మార్క్సిజం మూలసూత్రాలు, సోషలిస్టు ఆలోచనావిధానం చాలా లోతుగా అధ్యయనం చేయవలసి వుంటుంది. ఇక మూడవ పరీక్ష అభ్యర్థుల ఆచరణాత్మక సంసిద్ధతను పరీక్షించేది. సేవారంగానికి కావలసిన మానసిక పరిపక్వతా, వారి మానవీయ వైఖరి, సమస్యలను పరిష్కరించగల కుశాగ్రత, వారిలో ప్రజలపట్ల సహానుభూతి ఏమేరకు వున్నదీ పరీక్షిస్తారు. ఈ

అన్ని అంశాలలో కృతార్థులయిన వాళ్ళే పార్టీలోగానీ, ప్రభుత్వంలోగానీ ఉన్నత పదవులకు ఎంపిక అవుతారు. అంటే వారి రాజకీయ నాయకులను కూడా ప్రతిభా పాటవాల ఆధారంగానే ఎంపిక చేస్తారు. ఉదాహరణకి ఈనాటి చైనా అధ్యక్షుడు జిన్ పింగ్ 16 దశల వడపోతల పరీక్షలలో తన సమర్థతను నిరూపించుకున్నవాడే. బహు పార్శ్వాలలో పరిపాలనా అనుభవం సంపాదించటానికి మండలస్థాయి, నగరస్థాయి, రాష్ట్రస్థాయి కమిటీలలో పనిచేశారు. ఆ తర్వాత సెంట్రల్ కమిటీ, పోలిట్ బ్యూరో, స్టాండింగ్ కమిటీలలో బాధ్యతలు నిర్వహించి జనరల్ సెక్రటరీగాను, దేశ అధ్యక్షునిగాను ఎదిగారు. ఇది దాదాపు మూడు దశాబ్దాల గమనం.

ఇతర నాయకత్వం కూడా ఇలాంటి గమనం ద్వారానే ఉన్నతస్థాయికి చేరుకుంటుంది. దీని ప్రాథమిక రూపం 6వ శతాబ్దపు సూయి వంశపు రాజుల కాలంనుండి వుంది. ఇలాంటి బల పరీక్షలు, ప్రతిభా పరీక్షలు జరిపి అధికారులను ఎన్నుకునే వారట. అయితే అది రాజుల పరిపాలనా చిహ్నంగా భావించి, 1905లో ఈ విధానాన్ని రద్దుచేశారు. కానీ తిరిగి 30 సంవత్సరాలుగా ఈ పద్ధతిని ఆధునీకరించి, మెరుగుపరచి అనుసరిస్తున్నారు. తమ సంస్కృతిలో భాగంగా భావించి ఈ విధానాన్ని ప్రజలు ఆమోదించారు. గతంలో ఉద్యోగవర్గం రాజభక్తి పరాయణులై వుండేవారు. వారి సమర్థత, నిపుణత రాజరికానికి ఊడిగం చేయటంలో పునీతమయ్యేది. ప్రస్తుత ఉద్యోగవర్గం ప్రజాసేవానురక్తితో పనిచేసే నిపుణులు. వీరి సమర్థత, నిపుణత ప్రజల భాగస్వామ్యంతో వారిని అభివృద్ధి వైపు అంగలు వేయించడంలో కృతార్థత చెందుతుంది. “ఈ విధానంవల్ల ఒక వ్యక్తి ఉన్నతస్థాయికి చేరటానికి కనీసం 30 సంవత్సరాలు పడుతుంది. తమ పరిజ్ఞానం, రాజకీయ నైపుణ్యం, సమర్థత పెంచుకోవటానికి ఈ సమయం అవసరమౌతుంది. వారు తమ పదవిలో ఎదగటానికి డబ్బు, సమయం వృధాచేయరు. ఇది చైనా సంస్కృతికీ, చారిత్రక సంప్రదాయాలకూ, ఆధునిక అవసరాలకు అనుకూలంగా మలచి అవలంబిస్తున్న పద్ధతి అని కొనియాడారు ప్రొఫెసర్ డేనియల్ బెల్ (షాన్ డంగ్ యూనివర్సిటీ). దీనిని ఆయన ‘రాజకీయ ప్రతిభాస్వామ్యం’ (పొలిటికల్ మెరిటోక్రసీ) అని అభివర్ణిస్తారు.

అన్ని సందర్భాలలోను ఈ విధానం లోపరహితంగా అమలవుతుందా అని నిత్యశంకితులు ప్రశ్నిస్తుంటారు. ఆచరణలో ఎక్కడైనా ఏవైనా లోపాలు కనిపిస్తే వెంటనే వాటిని సరిచేసే నాయకత్వం, పార్టీ పర్యవేక్షణ అక్కడ ఉన్నాయి. కొన్ని సందర్భాలలో కమ్యూనిస్టుపార్టీ నాయకుల పిల్లలు, ధనవంతులు కొందరు సాపేక్షికంగా ఉన్నత విద్యావంతులు కావటం వల్ల, విదేశీవిద్యలు చదివి వుండటంవల్ల ముందుగా అవకాశాలు అందిపుచ్చుకున్నారు. వీరిసంఖ్య పరిమితమే. క్రమంగా “ప్రజాసేవానురక్తి” అనే సూత్రం పటిష్టంగా అమలుచేయటంతో గ్రామీణ ప్రాంతాలనుండి కూడా అనేకమంది వివిధ స్థాయిలలో నాయకత్వస్థానాలకు చేరుకుంటున్నారు. ఒకోసారి ప్రజాశ్రేయస్సుకు ప్రాధాన్యత ఇచ్చే నాయకులకు మార్పుపై

అవగాహన లేకపోవచ్చు. అంకిత స్వభావం కలవారే అయినా సృజనాత్మక భావాలను సత్వరం అందిపుచ్చుకునే స్వభావం తక్కువగా వుండవచ్చు. ప్రజాశ్రేణులను కదిలించి, నడిపించే మోటివేషన్ కొందరిలో తక్కువగా వుండవచ్చు. ఇలాంటి పలు అంశాలను గ్రహిస్తూ ఎప్పటికప్పుడు కావలసిన మార్పులు తెస్తున్నారు. అంతేకాదు ఉన్నతస్థాయిలో సంయుక్త నాయకత్వాన్ని (కలెక్టివ్ లీడర్‌షిప్) అభివృద్ధి చేస్తున్నారు.

కార్మికవర్గ సిద్ధాంతమైన మార్క్సిజాన్ని కరదీపికగా పట్టి ఆరితేరిన 7గురు సభ్యులుగల స్టాండింగ్ కమిటీదే పార్టీలో అత్యున్నత అధికారం. దీనివల్ల ఏ వొక్క నాయకుడు ఒకస్థాయి, పరిమితిని మించి నిర్ణయాలు తీసుకోలేడు. ఒక సమిష్టి బాధ్యతను, ఉమ్మడిగా నిర్ణయాలను తీసుకునే విధానాన్ని అమలు చేస్తున్నారు. పార్టీలో ఎప్పుడూ సమిష్టి నాయకత్వమే వుంది. కేంద్రీకృత ప్రజాస్వామ్యమే పార్టీ నిర్వహణావిధానం. గతంలో కొంతకాలం రాజకీయ పంథాలో వచ్చిన అతివాద తప్పిదంవల్ల ఈ విధానం కొంత దెబ్బతిన్నది. మావో అత్యంత ప్రభావశీలమైన విప్లవ నాయకుడు కావటంతో ఆయన నిర్ణయాలను కొన్ని సందర్భాలలో తగినంత చర్చ లేకుండా ఆమోదించటం జరిగింది. అలా తప్పునిర్ణయాలు చేయటంలో మిగిలిన నాయకులు తమ బాధ్యతను విస్మరించటం ఒక కారణం అంటారు కామ్రేడ్ డెంగ్. ప్రస్తుతం ఆ స్థితిని సంస్కరించారు. పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం పునరుద్ధరించారు. క్రింది శాఖలనుండి పై వరకు ఆలోచనలు, అభిప్రాయాలు పంచుకునే స్వేచ్ఛ, ప్రజాస్వామ్య పద్ధతి వుంటుంది. వాటి ఆధారంగా నిర్ణయాలు జరుగుతాయి. ఆ తర్వాత వాటిని అమలుచేయటంలో, పై కమిటీల నిర్ణయాలకు  కింది కమిటీలు కట్టుబడివుండే క్రమశిక్షణాయుత కేంద్రీకృత అధికారం అమలవుతుంది. ప్రజాస్వామ్యం అరాచకంగా మారకుండా పై కమిటీల కేంద్రీకృత అధికారం, కేంద్రీకృత అధికారం నియంతృత్వ పద్ధతులకు దిగకుండా అంతర్గత ప్రజాస్వామ్యం తోడ్పడుతాయి. పార్టీలోనే కాదు ప్రభుత్వ నిర్ణయాలలో కూడా వివిధ స్థాయిల ప్రభుత్వ సంస్థలలో ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు. రాజకీయ సంస్కరణలలో భాగంగా జీవితకాలపు అధికారం, శాశ్వత నాయకత్వం అనే స్థితిని మార్చి నాయకులకు 10 సంవత్సరాల పదవీకాలం నిర్ణయించారు. ఆయా పరిస్థితులలో జరిగిన పొరపాట్లను సవరించుకోవడానికి, సమయానికి తగిన నిర్ణయాలు చేయటానికి విమర్శ, ఆత్మవిమర్శల వెలుగులో చైతన్యయుతంగా చైనా కమ్యూనిస్టుపార్టీ సదా పాటుబడుతుందని ఇది తెలియజేస్తుంది. ఇటీవల మళ్ళీ కొన్ని పదవులమీద 10 సంవత్సరాల ఆంక్షను ఎత్తివేశారు. దీంతో జిన్‌పింగ్ శాశ్వత ఆధ్యక్షునిగా స్థిరపడటానికి మార్గం సుగమం చేసుకున్నారనీ, 'జిన్‌పింగ్ శాశ్వత అధ్యక్షుడు' అని హెడ్డింగులుపెట్టి పాశ్చాత్య పత్రికాప్రపంచం, మన దేశ పత్రికలూ దుష్ప్రచారం చేశాయి. కాలపరిమితి ఎత్తివేశారేకానీ జిన్‌పింగ్ శాశ్వత అధ్యక్షుడని ఎక్కడా, పార్టీ, ప్రభుత్వం ప్రకటన చేయలేదు.

మనదేశంలో జరుగుతున్న వంశపారంపర్య పాలనను, తనకుటుంబ సభ్యుల మధ్యనే ఉన్నత రాజకీయ అధికారాన్ని పంచుకునేవారినీ, ఒక చిన్న సర్పంచు పదవి దక్కినా ఇంకెవరినీ

ఆ పదవి దరిదాపులకు రానివ్వకుండా కుట్రలు చేసేవారిని, ఏకవ్యక్తి పాలన, ఏకవ్యక్తి అభీష్టానుసారం నడిచే ప్రాంతీయపార్టీలను, వ్యక్తుల పేరిట ఏర్పడిన అనేక సేనలను నోరెత్తకుండా ఆమోదిస్తున్నవారు కూడా చైనా పద్ధతులను వక్రీకరించి విమర్శిస్తారు. సంస్థల మేలుకోరి కొన్ని సందర్భాలలో సమర్థుడయిన నాయకుణ్ణి దీర్ఘకాలం కొనసాగించడము అసమంజస మైనదేమీ కాదు. ఆయా నాయకులు తలపెట్టిన ఉత్కృష్ట చర్యలు, సామాజిక మార్పులు సాకారం చేయటానికి ఒక్కోసారి కాలపరిమితి అడ్డంకిగా మారుతున్న సందర్భాలను ఎవరూ కాదనలేరు. అందువల్ల సమయానుకూలంగా, నూతన శకాలకు చెందిన భవిష్యత్ ప్రణాళికలు రచించటానికి ఒక్కోసారి సమర్థుడయిన నాయకుణ్ణి మరి కొంతకాలం కొనసాగించవలసిన అవసరం ఏర్పడుతుంది అనేది వాస్తవం కాదా! మనదగ్గర కొన్ని పార్టీలకు శాశ్వత అధ్యక్షులు, శాశ్వత అధిష్టానవర్గాలు వుండటం సర్వసామాన్యమే. ఇదంతా ప్రజాస్వామ్యమే అని నిరభ్యంతరంగా ఒప్పుకుంటున్న వాళ్ళు కూడా చైనా అధ్యక్షుడు మరోసారి పోటీచేసే అవకాశం తీసుకుంటే మాత్రం అది నియంతృత్వం అనీ, వ్యక్తి ఆరాధన అనీ ముద్రవేస్తున్నారు.

మనదేశంలో రాజకీయ నాయకులంటే అవినీతిపరులనీ, స్వప్రయోజన పరులనీ, పదవీ వ్యామోహ పరులనీ ఒక అభిప్రాయం స్థిరపడింది. మన దగ్గర వున్న బహుళ పార్టీల వ్యవస్థలో ఏ పార్టీ ఎప్పుడు అధికారంలోకి వస్తుందో తెలీదు. ఏ నాయకుడు ఎప్పుడు ఏ పార్టీలో వుంటాడో తెలియదు. అధికార ప్రాప్తికోసం అలమటిస్తూ ఎప్పటికప్పుడు ప్రజాకర్షక పథకాలు, అమలు చేయలేని వాగ్దానాలు, ఎన్నికల రిగ్గింగులు భారీగా వండివార్చుతూ ప్రజలను భ్రమలలో ముంచితేల్చుతారు. మన బహుపార్టీల వ్యవస్థ పరస్పరం వివాదాలు, పోటీలు, కలహాలలో మునిగి తేలుతూవుంటుంది. అదే చైనాలోవున్న బహుపార్టీల వ్యవస్థ సంప్రదింపులు, సహకారం అనే విధానంలో నడుస్తోంది. ఆ సమాజపు లక్ష్యమైన సోషలిస్టు నిర్మాణ సిద్ధాంతానికి లోబడి శ్రామికవర్గ నాయకత్వాన్ని అంగీకరించి వ్యవహరిస్తారు. శ్రామికవర్గ పార్టీ నాయకత్వంవల్ల అధికారం కోసం వెంపర్లాట వుండదు. చైనాలో రాజకీయ నాయకులపట్ల వారు గుణవంతులనీ, సామాజిక గమనాన్ని నిర్దేశించే నేతలని, భవిష్యత్ నిర్మాణదక్షులనీ ఒక నమ్మకం వుంది. నాయకులు పొరపాట్లు చేయవచ్చునేమో కానీ వారు ప్రజాద్రోహులుకారనే ఒక విశ్వాసంవుంది. అందువల్ల పార్టీకి, నాయకులకు అక్కడి ప్రజల దైనందిన సమస్యలు తీర్చటం, సామాజిక వైరుధ్యాలు పరిష్కరించటం, అభివృద్ధి పథంలో నడిచేలా ప్రజలకు నాయకత్వం వహించటం, భవిష్యత్ నిర్దేశం చేయటం బాధ్యతగావుంది. ప్రజల అంచనాలను అందుకునేలా కృషిచేసి తమ రాజకీయ కర్తవ్యాలను పూర్తిచేస్తోంది అక్కడి నాయకత్వం.

ఆ బాధ్యతలలో భాగంగానే అనేక నూతన ఆలోచనలను చిన్నచిన్న ప్రాంతాలలో ప్రయోగాత్మకంగా అమలుచేసిచూస్తారు. విజయవంతమైన వాటిని విశాల ప్రాంతాలకు

విస్తరిస్తారు. ప్రత్యేక ఆర్థికమండలి (సెజ్) అనే ప్రక్రియను షాన్‌జెన్‌లో క్షుణ్ణంగా అమలుచేసిన తరువాతనే ఇతర ప్రాంతాలకు విస్తరించారు. సోషలిస్టు మార్కెట్‌దృష్టిగల విధానాలు, సహకార వైద్యవిధానం రూపకల్పన, ఆరోగ్యరంగంలో ప్రవేశపెట్టిన అనేక సంస్కరణలు, ప్రభుత్వేతర గ్రూపులను ప్రభుత్వ విధానాల అమలులో ఉపయోగించుకోవటంవంటి అనేక అంశాలను ప్రాథమికంగా కొన్నిచోట్ల పరిశీలించి, ప్రజల అభిప్రాయాలను, విమర్శలను స్వీకరించి తదనుగుణంగా లోపాలు సవరించి, సత్ఫలితాలు సాధించాక దేశమంతా ప్రవేశపెట్టారు. ఇవి నిరంకుశ పోకడలు కావు. నియంతృత్వ విధానాలు కావు. అచ్చమయిన ప్రజాస్వామ్య సంస్కృతి అడుగులు. అంతేకాదు. సోషలిస్టు వ్యవస్థ నిర్మాణంకోసం కేంద్రప్రభుత్వం సాగిస్తున్న ప్రయత్నాలకు, ప్రణాళికలకు అనుసంధానించబడి రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రాంతీయ ప్రభుత్వాలు తమ ప్రాంతాల అవసరాల కనుగుణ్యంగా, విధానాలు అమలు చేసుకునే స్వేచ్ఛా వాతావరణం కల్పించారు. హాంగ్‌రైనా వంటి ప్రాంతాలు పర్యావరణ పరిరక్షణకు ప్రాధాన్యతనిస్తే, చెంగ్డూ ప్రాంతం గ్రామీణ, పట్టణవాసుల మధ్యవున్న ఆదాయపు వ్యత్యాసాలను తగ్గించడానికి ప్రాధాన్యతనిస్తోంది. ఒక రాష్ట్రం పర్యాటకరంగానికి పెద్దపీటవేస్తే, మరో రాష్ట్రం పారిశ్రామికీకరణకు, మరో రాష్ట్రం ఎలక్ట్రానిక్ వస్తువుల తయారికి సిద్ధమవుతున్నాయి. ఇవన్నీ ఆయా ప్రాంతాల ప్రజల ప్రయోజనాలు కాపాడుతూ, వారి ఆకాంక్షలమేరకు, వారి అవసరాలమేరకు తీర్చిదిద్దబడుతున్న అభివృద్ధి పథకాలు. ఇవన్నీ ప్రజాస్వామ్య పరిపాలనయొక్క ముఖ్యలక్షణాలు కావా?

చైనా రాజ్యాంగం సోషలిస్టు నిర్మాణానికి జనతా ప్రజాస్వామిక నియంతృత్వాన్ని అమలుచేసే రాజ్యాంగం. సామ్యవాద ప్రజాతంత్రాన్ని, సామ్యవాద న్యాయవ్యవస్థని నెలకొల్పడం, కార్మిక కర్షకమైత్రి ఆధారంగా శ్రామికవర్గ నాయకత్వంలో ప్రజల అధికారం రాజ్యం చేస్తుంది. అచంచలమైన ఈ ఆశయానికి లోబడి రాజ్యాంగాన్ని అవసరాలకనుగుణంగా మలిచి అన్వయించుకోగలగడం వారి విశిష్టత. అందువల్లా, వివిధ స్థాయిల ప్రభుత్వాల అధికారంలో పైవారి జోక్యం లేకపోవటం వల్ల, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సహకారం, ఉమ్మడి బాధ్యత వుండటంవల్ల అప్రతిమాన అభివృద్ధి సాధ్యపడుతోంది. మనదగ్గర కేంద్రంలోని పార్టీకి, రాష్ట్రంలోని పార్టీకి ఎడముఖం-పెడముఖమైతే, ఏ సమస్యలూ పరిష్కరించక పోవటం అటుంచి కొత్త సమస్యలను సృష్టించడం, ఒక ప్రభుత్వం మొదలెట్టిన పథకాలను మరో ప్రభుత్వం నిలిపి వేయటం లేక నీరుకార్చటం మనం నిత్యం చూస్తున్నదే గదా! రాష్ట్రాలను బలహీనం చేయటం, బలమైన కేంద్రప్రభుత్వాన్ని ఏర్పాటుచేయటం కోసం మనదగ్గర ఆధిపత్య వర్గాలు ప్రయత్నిస్తున్నాయి. సమాలోచన-సహకారం అక్కడి పార్టీల విధానమైతే, వివాదం కక్షపూరిత పోటీ మన దగ్గర పార్టీల నైజం. చైనాలో కేంద్రంలో సుస్థిరమైన, పటిష్టమయిన ప్రభుత్వం వుండటంతోపాటు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రాంతీయ ప్రభుత్వాలకు స్పష్టమయిన అధికారం వుంది. వారి ప్రణాళికలననుసరించి ముందుకుసాగే స్వేచ్ఛ వుండటంవల్ల ప్రణాళికలు పటిష్టంగా అమలు చేస్తున్నారు. దీర్ఘకాలిక ప్రణాళికలను ఏ ఆటంకమూ లేకుండా

అమలు చేయగలుగుతున్నారు. ప్రజలను ఆకర్షించే పథకాలుగాక, వారి అవసరాలకు అనుగుణ్యమయిన అభివృద్ధి పథకాలకు, సృజనాత్మక ప్రయోగాలకు చోటు దొరుకుతుంది. ప్రజా ప్రయోజనమే పరమలక్ష్యంగా చైనాలో విధానాలు రూపుదిద్దుకుంటాయి.

1979లో కా॥డెంగ్ సియావో పింగ్ ప్రకటించిన నాలుగు ప్రధాన సూత్రాలు పాలకులను, ఆ పాలనావ్యవస్థను నడిపిస్తున్న నాలుగు కాంతిపుంజాలు. 1) సామ్యవాద మార్గానికి కట్టుబడివుండటం, 2) జనతా ప్రజాస్వామ్య నియంతృత్వానికి లోబడి వుండటం, 3) చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని అంగీకరించటం, 4) మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాన్ని ఆచరించటం అనే ఈ నాలుగు సూత్రాలను ఔదలదాల్చి చైనా ప్రభుత్వం తన విధానాలు నిర్ణయించుకుంటుంది. ఎన్ని మార్పులు, సంస్కరణలు వచ్చినా అవి ఈ నాలుగు లక్ష్యాలకు లోబడి మాత్రమే. ఈ నాలుగు సూత్రీకరణలకు అంకితమై వుండటంవల్ల ఒక సైద్ధాంతిక స్థిరత్వం, కార్యక్రమాలలో ఒక నిరంతరత, ఒక ధర్మబద్ధత, ప్రజారాసులపట్ల తమ కర్తవ్యాలను నిర్వహించటంలో బెసగని దృఢదీక్ష, తమ లక్ష్యాలపట్ల అతి స్ఫష్టమయిన దృక్పథం అక్కడి నాయకత్వానికి సిద్ధించింది. వారి అచంచలమైన కమ్యూనిస్టు విశ్వాసమే ఆ సమాజ గమనాన్ని తీర్చి దిద్దుతోంది. నాలుగు ప్రధాన సూత్రాల వెలుగు చైనా అభివృద్ధికి దారితీసిన మౌలిక అంశం. సామ్యవాద ఆధునికతను సాధించటానికి అదే ప్రాతిపదిక. అందుకే అది ప్రతిభావంతుల పాలనా దక్షతలతో, కార్మికవర్గ తాత్వికతగా, శ్రామిక శ్రేయోరాజ్యంగా వర్ధిల్లుతోంది.

శరవేగంగా తీసుకున్న అనేక సంస్కరణలు, ఆర్థిక విధానాల ఫలితంగా మంచితోపాటు కొంత చెడుకూడా పోగుపడింది. మిగతా ప్రపంచంనుండి వేరుగావుంచబడిన చైనా, ఓపెన్ పాలసీ ప్రవేశపెట్టడంతో పాశ్చాత్య ధోరణులు అనేకం ప్రవేశించాయి. 'కిటికీలు తెరిచినప్పుడు గాలి వెలుతురుతోపాటు దుమ్ముదూగర కూడా ప్రవేశిస్తుంది. దాన్ని శుభ్రం చేసుకోవలసింది మనమే' అనే ఎరుక వారికివుంది. ఆనూహ్యామైన ఆర్థిక లావాదేవీల వల్ల పాశ్చాత్య పెట్టుబడిదారీ వ్యాపారులతో వొప్పందాలవల్ల వారి పద్ధతులు కూడా ప్రవేశించడంవల్ల కొంత అవినీతి అనివార్యంగా చోటుచేసుకుంది. "ప్రజాసంస్థలను వ్యక్తిగత ప్రయోజనాలకు వాడుకోవటమే అవినీతి" అని చైనా నిర్వచించింది. బూర్జువా ప్రజాస్వామ్య వ్యవస్థలో అవినీతిని ఎదుర్కొనే బాధ్యత ప్రజలమీదే వుందని చెబుతారు. ఎన్నికలలో, అవినీతి రాజకీయవేత్తలను ఓడించటం, లేక పదవీచ్యుతులను చేయటం ద్వారా ప్రజలు వారిని శిక్షించగలరని ప్రచారం చేస్తారు. చైనాలో ఇటువంటి అవకాశం లేదని చెబుతారు. అయితే రాజకీయ పార్టీలు ఎన్నికలలో అన్నిరకాల ప్రలోభాలు, వాగ్దానాలు కుమ్మరించి, కుల, మత, ప్రాంతీయ భావోద్వేగాలను రెచ్చగొట్టి, ప్రజల దృష్టిని నిజమైన సమస్యలనుండి మరల్చి, అవినీతిని అసలు ఎన్నికల అంశమే కాకుండా చేయటం జరుగుతోంది. దాంతో అవినీతిపరుల ఆటలు నిరాటంకంగా సాగుతున్నాయి. చైనా వ్యవస్థలో ప్రజల అత్యున్నత చైతన్యరూపమైన కమ్యూనిస్టు పార్టీ మీద, ఆ నాయకుల మీదే అవినీతిని అరికట్టే బాధ్యతవుంది. తాము అవినీతికి

పాల్పడకపోవటం, అవినీతిపరులను ఏరివేయటం, అవినీతిని అరికట్టడం వ్యవస్థాపరంగానే జరుగుతుంది. ప్రజాపర్యవేక్షణ బృందాల నిఘా, అవినీతిపరులకు కఠినమైన శిక్షలు విధించటం, అధికారుల జీవన ప్రమాణాలను పెంచేరీతిలో హెచ్చు జీతభత్యాలు కల్పించటం వంటి అనేక చర్యలద్వారా అవినీతిని అరికడుతున్నారు. మనలాంటి దేశాలలో అవినీతిని గృహ పరిశ్రమనుండి, భారీ పరిశ్రమగా మార్చి, దానిని ఒక జీవనశైలిగా అనుసరిస్తున్నారు. ప్రపంచమంతా అవినీతి వుందని ప్రచారం చేస్తూ, తమ అవినీతి అనేది ఒక అంశమేకాదనట్లు ప్రవర్తిస్తున్నారు. అందువల్ల అవినీతి నిరోధక వ్యవస్థలు కూడా వారి చెప్పుచేతల్లో వుంటూ, అవినీతిమయమై పోయాయి. అయితే చైనాలో కమ్యూనిస్టు పార్టీ ఒక రాజకీయ సంకల్పంతో ప్రజా వ్యవస్థలను అవినీతికి వ్యతిరేకంగా తీర్చిదిద్దుతున్నాయి. ఒకే రకంగా అనిపించే వ్యవస్థలు, ఏర్పాట్లు రాజకీయ సంకల్పాన్నిబట్టి ఎలాంటి విరుద్ధ ప్రయోజనాలు నెరవేర్చుతాయో చూడండి.

చైనా అధ్యక్షుడు జీ జిన్‌పింగ్ అవినీతి వ్యతిరేక పోరాటం తన ప్రభుత్వ ప్రధాన కర్తవ్యాలలో వొకటిగా ప్రకటించారు. సుదీర్ఘ అవినీతి వ్యతిరేక పోరాటం చేస్తూ వ్యవస్థను ప్రక్షాళనం చేస్తున్నారు. అవినీతి కళంకం వుంటే పోలిట్‌బ్యూరో స్థాయిలో వున్నవారిని, రాష్ట్ర పార్టీ సెక్రటరీలను సైతం శిక్షలకు గురిచేస్తున్నారు. అయితే ఈ కఠినమైన చర్యలవల్ల శిక్షింపబడిన అవినీతిపరులు ఇవి ముఠా పోరాటాలని ప్రభుత్వ వ్యతిరేక ప్రకటనలు చేస్తున్నారు. వారు తమ అవినీతిని కప్పిపెట్టి ఒక ఎత్తుగడగా తమ 'మానవ హక్కుల' గురించి యాగీ చేస్తున్నారు. ఇటువంటివారిని పాశ్చాత్య మీడియా పైకెత్తి విపరీతంగా ప్రచారం చేస్తున్నది. అయితే అలాంటివాళ్ల పౌరహక్కులు, రాజకీయహక్కులు ప్రభుత్వం తొలగించి వేస్తుంది. అవినీతిపరులకు, సంఘ విద్రోహులకు ఏ హక్కులూ వుండవని ఆ ప్రభుత్వం స్పష్టంగా చెబుతోంది. ఎక్కడైనా కొందరి ఎడల పొరపాట్లు జరగవచ్చునేమో కానీ, స్థూలంగా ఈ విధానం ప్రజల మన్ననలు పొందుతోంది.

1970-1990ల మధ్య చైనా ప్రాధాన్యత పేదరికాన్ని తరిమి వేయడం మీదనేవుండేది. తగినంత ఆర్థిక సౌష్టవం చేకూరినాక ఇప్పుడు సామాజిక జీవితంలోని అన్ని రంగాలకు తగినంత చోటు కల్పిస్తున్నారు. గృహవసతి, ఆరోగ్యం, విద్యవంటి అన్నిరంగాలలో తగినంత శ్రద్ధ, లక్ష్యశుద్ధితో నూతన విధానాలు అవలంబిస్తున్నారు. అలా ప్రాముఖ్యత వహిస్తున్న అంశం పర్యావరణ పరిరక్షణ. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాతో కలిసి కా॥జిన్‌పింగ్ పర్యావరణ విషయంగా తమ ప్రపంచ బాధ్యతలలో భాగంగా 20 సంవత్సరాల కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ కార్యక్రమానికి ఎవరు కట్టుబడివున్నారంటే చైనా మాత్రమే. ట్రంప్ అధికారంలోకి వచ్చాక ఇది తమమీద ఆర్థికభారం అని చెప్పి ఈ పర్యావరణ పరిశుద్ధి కార్యక్రమంనుండి తప్పుకున్నాడు. కానీ చైనా మరింత పట్టుదలతో ప్రపంచ పర్యావరణ శత్రువైన కాలుష్యభూతాన్ని తరిమికొట్టే ప్రయత్నం చేస్తున్నది. ఇదీ ప్రపంచ ప్రజలపట్ల ఆ నాయకులకున్న బాధ్యత.

ప్రపంచ అభివృద్ధి, శాంతి స్థాపనల విషయంలో తమదేశ ప్రజలనేకాదు ప్రపంచ ప్రజల అభీష్టాలను సైతం గుర్తించి, గౌరవించి, తమ పంథాను రూపొందించుకుంటున్నది చైనా ప్రభుత్వం. శాంతియుత పరిస్థితికి అభివృద్ధి సాధనకు అవినాభావ సంబంధం వుందని వారు భావిస్తారు.

చైనా పద్ధతి ప్రజాస్వామ్యం అంటే స్థూలంగా

(1) ప్రాథమిక పరిపాలనకై గ్రామాలలో ప్రజాస్వామ్య ఎన్నికలు

(2) ప్రజాస్వామ్య పద్ధతిలో నిర్ణయాలు

(3) ప్రజాస్వామ్య పద్ధతిలో సంస్థల, వ్యవస్థల నిర్వహణ

(4) ప్రజాతంత్రయుతమైన సంప్రతింపులు, పర్యవేక్షణలు

కొందరు దీనిని "చర్చల లేక సంప్రతింపుల ప్రజాస్వామ్యం" అని వ్యవహరిస్తున్నారు. అది సోషలిస్టు వ్యవస్థ. సోషలిస్టు నిర్మాణంకోసం అంకితమయిన కమ్యూనిస్టు పార్టీ మాత్రమే అధికారం కొనసాగించ గలుగుతుంది. ఆ ప్రాథమిక, మౌలిక అంశానికి లోబడి అన్ని ప్రజాస్వామ్య పద్ధతులు అనుసరించటం జరుగుతోంది. నూతన, ఆధునిక సూత్రీకరణలు రూపొందించటం జరుగుతున్నది. పాశ్చాత్య ఉదారవాద, బూర్జువా ప్రజాస్వామ్యం కాదు. నిజమైన ప్రజల ప్రజాస్వామ్యంవైపు అడుగులు వేస్తోంది జనచైనా.

ప్రపంచ పరిణామాల్లో శీతలయుద్ధ కాలం ముగిసాక, సోవియట్ సోషల్ సామ్రాజ్యవాద రాజ్యం క్షీణించి పతనమయ్యాక, ప్రాచ్య పాశ్చాత్య మేధావులు, రాజకీయ పండితులు పెట్టుబడిదారీ వ్యవస్థ (కాపిటలిజం) ఆఖరి విజయం సాధించింది అని ప్రకటించారు. ఫ్రాన్సిస్ ఫుకుయామా అయితే "ఇక అనివార్యంగా పాశ్చాత్య ఉదారవాద ప్రజాస్వామ్య వ్యవస్థ అన్ని దేశాలలో నెలకొంటుంది. అదే చారిత్రక మార్పులకు ఆఖరి అధ్యాయం. అదే అంతిమ వ్యవస్థ" అని శెలవిచ్చాడు. అయితే ఆమాదిరి పరిణామాలు ఏవీ జరగలేదు. అమెరికన్లు చెబుతున్న 'ప్రజాస్వామ్యం' అటు రష్యాలోకానీ, తూర్పు యూరప్ దేశాలలోకానీ వికసించలేదు. ఆయా దేశాలలో గతంలోని వ్యవస్థ (కమ్యూనిస్టు?) నశించినా పాశ్చాత్య ప్రజాస్వామ్యం ఆవిర్భవించలేదు. అనేక ఆసియాదేశాలు (ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, ఫిలిప్పైన్స్) లాటిన్ అమెరికన్ దేశాలు పాశ్చాత్య ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పాలని చూస్తే అనేక సమస్యలు ఉత్పన్నమైనాయి. అంతేకాదు పాశ్చాత్య ప్రజాస్వామ్యమే నేడు సంక్షోభంలోవుంది. అమెరికా సామ్రాజ్యవాదం ఆయా దేశాల అంతర్గత వ్యవహారాలలో తలదూర్చి 'ప్రజాస్వామ్య పరిరక్షణ' పేర, 'మానవహక్కుల' పేర తమకు అనుకూలమైన ప్రభుత్వాలను కొనసాగనిస్తూ, అలా లేనివాటిని కూల్చివేసే 'ప్రజాస్వామ్య ఆందోళనలను' రెచ్చగొడుతోంది. ఆయా దేశాల వ్యవస్థలను అస్థిరపరుస్తోంది. ఇదే సమయంలో చైనాలో జనతా ప్రజాస్వామ్యం విజయవంతంగా అమలవుతున్నది. ఇతర దేశాల అంతర్గత విషయాలలో జోక్యం

చేసుకోకుండా వారిని సమాన హోదాతో గౌరవిస్తోంది. అందువల్ల క్రమంగా దేశాలు సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని అవలంబిస్తున్నాయి. తమకు అనుకూలమైన పద్ధతులను రూపొందించుకుంటున్నాయి. జనచైనా నాయకత్వ స్ఫూర్తితో ఏకమవుతున్నాయి.

సోవియట్ రష్యా శ్రామికవర్గపు సిద్ధాంతాలకు తిలోదకాలిచ్చి, పెట్టుబడిదారీ పునరుద్ధరణకు దిగి, వారి కుహనా విలువలు తలకెత్తుకున్నందువల్ల ఆర్థికాభివృద్ధిని, సామాజిక అభివృద్ధిని సాధించటంలో విఫలమై, సామ్రాజ్యవాద పోకడలతో ఒక సైనికశక్తిగా మారి, అంతర్గత ప్రజాస్వామ్యమూ కోల్పోయి చివరకు కూలిపోయిందనే వాదన బలంగా వుంది. ఆ చారిత్రక గుణపాఠంతోనే చైనా ముందుగా ఆర్థికాభివృద్ధిని సాధించి, దేశంనుండి పేదరికాన్ని పూర్తిగా తరిమివేసి, జనజీవన ప్రమాణాలను ఉన్నతీకరించి, మెరుగైన వ్యవస్థను నిర్మిస్తూ, మానవీయ విలువలను, సామాజిక సామరస్యాన్ని నెలకొల్పే ప్రయత్నం చేస్తున్నది. నిజం ఆలోచిస్తే, కోట్లాదిమంది ప్రజలను పేదరికం కోరలనుండి, ఆకలి, అవిద్య, నిరుద్యోగం పీడలనుండి విముక్తం చేసిన ఆ వ్యవస్థను మించిన ప్రజాస్వామ్య వ్యవస్థ మరేముంటుంది?

సోవియట్ రాజ్యం, జనచైనా, రెండూ ప్రపంచంలో శ్రామికవర్గ రాజ్యాలుగా మొదలైనా, రష్యా శ్రామికవర్గ చేతనత్వాన్ని కోల్పోయి పతనమయింది. చైనా ఆ సిద్ధాంతాన్ని సృజనాత్మకంగా అమలుపరిచి, తన విశిష్టలక్షణాలతో మేళవించి, సోషలిస్టు నిర్మాణంలో విజయవంతంగా ముందుకుసాగుతూ జనతా ప్రజాస్వామ్యాన్ని ఎత్తిపట్టటం ప్రజాస్వామ్య వాదులందరూ గమనించవలసిన చారిత్రక పాఠం. నిత్య సంక్షోభాలలో చిక్కుకుని తల్లడిల్లుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ తమ విధానాలే అంతిమ సత్యాలని మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తుంటే, విజయవంతంగా ప్రపంచ శాంతిసామరస్యాలను కాపాడుతూ అభివృద్ధిని సాధిస్తున్నప్పటికీ చైనా తనది అత్యుత్తమ, అంతిమ వ్యవస్థాస్వరూపమని కానీ, పాలనా వ్యవస్థలోని అన్ని లోపాలను అధిగమించామని కానీ చెప్పుకోవటంలేదు. మరింత ఉన్నతస్థాయి ప్రజాస్వామ్యంవైపు, సోషలిస్టు నిర్మాణంవైపు మానవజాతి సాగిస్తున్న మహాప్రయాణంలో వారనుసరిస్తున్నదొక ఉత్తమదశగా మనం భావించవచ్చు. వారి అనుభవాలను పరిశీలించి, ఆకళింపు చేసుకోవలసిన అవసరాన్ని గుర్తించాలి.

అనేక దేశాలలో నేడు కానవస్తున్నది బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యం. ఇది దేశ ప్రజలందరు ఎన్నుకొన్న ప్రభుత్వం అనే రూపంలో వుంటుంది. కానీ సారంలో అది పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గంలో పిడికెడుమంది దోపిడీదారుల ప్రయోజనాలకోసమే పని చేస్తుంది. ఆ పది శాతం ధనవంతుల అధికారం పదిలంగా వుండేందుకు రాజ్యయంత్రం ఊడిగం చేస్తుంటుంది. అధికశాతం ప్రజలపై కొద్దిమంది నిరంకుశ అధికారమే ప్రజాస్వామ్యం పేరుతో చలామణీ అవుతోంది. చైనావంటి వ్యవస్థలలో 90 శాతం సామాన్య ప్రజల అభీష్టాలకు, ఆకాంక్షలకు రూపమిస్తూ పది శాతం దోపిడీ అనుకూల శక్తులను అణచివేస్తారు. తమది శ్రామికవర్గ నియంతృత్వమని వారు స్పష్టంగా ప్రకటిస్తారు. ఆ నియంతృత్వం 90

శాతం ప్రజలకు ప్రజాతంత్ర అధికారం కల్పిస్తుంది. దోపిడీశక్తులపై మాత్రం నిరంకుశాధికారం ప్రయోగిస్తుంది. వారిని అణచివేస్తుంది. అందువల్ల బూర్జువాల పాలిటికది నియంతృత్వమే. విస్తృతార్థంలో చూస్తే బూర్జువా ప్రజాతంత్రం సామాన్యులపై కొనసాగుతున్న బూర్జువా నియంతృత్వమని, శ్రామిక నియంతృత్వం సారంలో జనతా ప్రజాతంత్రమని అర్థమవుతుంది.

చైనా ఆధునికీకరణ అనేది బహుళ స్థాయిలలో జరుగుతున్న సంతులిత అభివృద్ధి క్రమం. ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక ఉన్నతీకరణలను సఫలీకృతం చేసిన ఒక ప్రగతిపథం. అత్యధిక ప్రజల ఆకాంక్షలు నెరవేర్చే జనతా ప్రజాతంత్రం అది. అదే మెరుగైన ప్రజాస్వామ్యం. వర్గదోపిడి ప్రాతిపదికగా, దానికి రక్షణగా నిలుస్తున్న బూర్జువా ప్రజాస్వామ్యమే ప్రజాస్వామ్యమని మనిషి ఆగిపోనక్కరలేదు. వర్గరహిత, దోపిడీరహిత సామ్యవాద వ్యవస్థ నిర్మాణంలో అందివచ్చే ప్రజాతంత్ర పద్ధతులన్నింటినీ సమయోచితంగా అన్వయించుకుంటూ ప్రజారాజ్య స్థాపనకోసం పురోగమించటమే ప్రజాతంత్రం అనిపించుకుంటుంది. చైనా అమలు చేస్తున్నది ఈ ప్రజాస్వామ్యమే.

–జూలై, 2018



# 16.

# వాణిజ్య యుద్ధం

*[పెకింగ్ యూనివర్సిటీలో అంతర్జాతీయ వ్యవహారాలు, అమెరికా అధ్యయన కేంద్రంలో ప్రొఫెసరుగా పనిచేస్తున్న వాంగ్ యోంగ్, చైనా డైలీ పత్రిక ఆర్థిక వ్యవహారాల నిపుణుడు ఫెంగ్ వీ జియాంగ్ వ్యాసాలు, (a) 10 Truths about US-China Trade, 7th August, 2018 china.org.cn (b) China and United States must avoid a new coldwar, 11th July, 2018 మరియు ఇంటర్నెట్ నుండి సేకరించిన మరికొన్ని వివరాల ఆధారంగా]*

డొనాల్డ్ ట్రంప్ అధ్యక్షతన అమెరికా ప్రభుత్వం గత కొద్దికాలంగా ఈ ప్రపంచంలో ఒక వ్యాపారయుద్ధం ప్రారంభించింది. కొంతకాలంగా అమెరికా సంయుక్తరాష్ట్రాలు తీవ్రమయిన ఆర్థిక సంక్షోభంలో మునిగిపోవటం, చైనావంటి దేశాల సహాయంతోనే కొంతలోకొంత బయటపడటం అందరికీ తెలిసిందే. కోల్పోతున్న తన ఆర్థికశక్తిని, తత్ఫలితంగా దెబ్బతింటున్న ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి ఏదో చిట్కా ప్రయత్నాలు చేస్తూనేవుంది అమెరికా. అయితే సంక్షోభంలోవున్నా ఇప్పటికీ అమెరికా ఆర్థికవ్యవస్థ ప్రథమ స్థానంలోనే వుందని మరచిపోకూడదు.

"అమెరికానే నా మొదటి ప్రాధాన్యం" అనీ, "అమెరికాను ఆర్థికంగా బలోపేతం చేయటమే ప్రధానమ"ని చెప్పి అధికారం కైవసం చేసుకున్న పెద్ద వ్యాపారవేత్త ట్రంపు. "అమెరికా ఉద్యోగాలు అమెరికన్లకే" అంటూ వీసా నిబంధనలు కఠినం చేయటం, ఉగ్రవాదాన్ని వ్యతిరేకిస్తున్నామనే పేర జాత్యహంకార విధానాలు ప్రవేశపెట్టడం, వృథా ఖర్చు అంటూ పర్యావరణ పరిరక్షణకు అభివృద్ధి చెందిన దేశంగా తాను నిర్వర్తించవలసిన ప్రపంచ బాధ్యతలకు తిలోదకాలివ్వడం, అదే సమయంలో కొత్త సమస్యలు రేకెత్తించి, అనవసరపు వివాదాలు

పెంచిపోషించి యుద్ధభయం నెలకొల్పడం, యుద్ధ ఆయుధ సామాగ్రి వ్యాపారం పెంచుకోవటం ఆయన ప్రభుత్వం నిత్యం చేస్తున్నదే. తమతో వాణిజ్యం సాగిస్తున్న వాళ్ళు ఎక్కువగా లాభాలు పొందుతున్నారని, అమెరికా నష్టపోతున్నదని చెప్పి దేశ ప్రయోజనాలకోసం దిగుమతి సుంకాలు (టారిఫ్‌లు) పెంచుతున్నట్లు ప్రకటించారు. ముఖ్యంగా స్టీలుపై 25%, అల్యూమినియం ఉత్పత్తుల మీద 10% మేరకు సుంకాలు పెంచారు. ఇవి అన్ని దేశాల ఉత్పత్తులకు వర్తిస్తాయని చెప్పారు.

ఈనాడు ప్రపంచంలో అతిపెద్ద ఎగుమతిదారు చైనా. అతిపెద్ద దిగుమతిదారు అమెరికా. మొదటినుంచీ అమెరికాకు దిగుమతులు ఎక్కువగానూ, ఎగుమతులు తక్కువగానూ వుంటాయి. కనుక సహజంగానే వారికి వాణిజ్యలోటు వుంటుంది. దీనికి ఇప్పుడు చైనాను నిందించి ఏం లాభం? అమెరికా చైనాల మధ్య వాణిజ్యం 1985లనుండి ప్రారంభమైందనుకోవచ్చు.

**అమెరికా–చైనాల మధ్య వాణిజ్య గణాంకాలు** *(మిలియన్ డాలర్లలో)*

*1 మిలియన్=10 లక్షలు; 1 బిలియన్=100 కోట్లు; 1 ట్రిలియన్=100000 కోట్లు*

| *సంవత్సరం* | *అమెరికా ఎగుమతులు* | *చైనానుండి దిగుమతులు* | *వాణిజ్యలోటు* |
|---|---|---|---|
| 1985 | 3855.7 | 3861.7 | –6.0 |
| 1990 | 4806.4 | 15237.4 | –10431.0 |
| 1996 | 11992.6 | 51512.8 | –39520.2 |
| 2000 | 16185.2 | 100018.2 | –83833.0 |
| 2005 | 41192.0 | 243470.1 | –202278.1 |
| 2010 | 91911.1 | 364952.6 | –273041.6 |
| 2015 | 115873.4 | 483201.7 | –367328.3 |
| 2017 | 129797.6 | 505220.2 | –375422.6 |
| 2018 | 120148.1 | 539675.6 | –419527.4 |

*(Source: United States Census Bureau)*

1990లో అమెరికా దిగుమతుల మొత్తంలో చైనాది ఒక్క శాతం మాత్రమే. ఈనాడు అది 10,200 కోట్ల డాలర్లు పెరిగింది. 1990లో చైనాలో దిగుమతుల సుంకం సుమారు 40% శాతం వుండేది. అయితే ప్రపంచ వాణిజ్య ఒప్పందాలు, నిబంధనలమేరకు చైనా తన సుంకాలు క్రమంగా తగ్గిస్తూ 2005 నాటికల్లా 10 శాతానికి తగ్గించి వేసింది.

అమెరికా 2018 మార్చిలో తన దిగుమతులపై సుంకాలు పెంచుతూ చేసిన ప్రకటన ముందుగా చైనాతో 500 కోట్ల డాలర్ల విలువగల వ్యాపారానికి మాత్రమే వర్తిస్తుందన్నారు. ఆ తరువాత (ఆగస్టు ప్రకటన) అది దాదాపు 2,000 కోట్ల డాలర్లకు పెరిగింది. తరువాతి రోజుల్లో

5,000 కోట్ల డాలర్ల వ్యాపారానికి విస్తరిస్తున్నట్లు చెప్పారు. ఈ సుంకాల అమలుతో జూలై 6, 2018న అమెరికా ఈ యుద్ధం ప్రారంభించింది. 3,400 కోట్ల డాలర్ల సుంకాలు ఈ సూత్రాల ప్రకారం వసూలు చేయసాగారు. 1,600 కోట్ల డాలర్లు సుంకాలను ఆ చిట్టాకు అదనంగా చేర్చారు. ట్రంప్ ప్రకటన వెలువడగానే యూరప్ యూనియన్ దీన్ని వ్యతిరేకించింది. తమ దేశాలలో వేలాది ఉద్యోగాలు గల్లంతయిపోతాయని కనక అందరూ కలసి సమిష్టిగా, గట్టిగా వ్యవహరించి అమెరికాకు తగిన జవాబు చెప్పాలని నిర్ణయించారు. అమెరికానుంచి యూరపుకు దిగుమతి అవుతున్న స్టీలు, వస్త్రాలు, పారిశ్రామిక ఉత్పత్తులపై వాళ్ళు కూడా 25% దిగుమతి సుంకం విధిస్తున్నట్లు ప్రకటించారు. అమెరికా ప్రభుత్వం చైనా నుండి దిగుమతి అవుతున్న 1,300 వస్తువుల పై సుంకాలు ఏప్రిల్ నెలలో పెంచివేసింది. చైనా కూడా దానికి జవాబుగా 5,000కోట్ల డాలర్ల విలువగల 106 అమెరికా వస్తువులపై టారిఫ్ పెంచింది. అంతేకాదు ప్రపంచ వాణిజ్య సంస్థ (WTO)లో అమెరికా ఏకపక్ష చర్యలపై ఫిర్యాదు చేసింది. ఇక ఇండియా కూడా అమెరికానుంచి వచ్చే 30 వస్తువులపై (2,400 లక్షల డాలర్ల మేరకు) దిగుమతి సుంకం పెంచవలసి వుంటుందని చెప్పింది. మే 18న ఇండియా WTOకి 20 వస్తువుల జాబితా సమర్పించింది. దాని వల్ల 1660 లక్షల డాలర్ల అదనపు సుంకాలు వసూలు అవుతాయని అంచనా! అమెరికా ప్రకటనలు, దానికి ప్రతిక్రియగా వచ్చిన ప్రకటనలతో ప్రపంచ వాణిజ్యంలో ఒక అనిశ్చితి, ఒక యుద్ధ వాతావరణం నెలకొంది. పోటాపోటీ ప్రకటనలవల్ల బెదింరింపులవల్ల చర్య, ప్రతిచర్యగావున్న టారిఫ్‌ల విధింపులవల్ల, ప్రకటనలకూ వాస్తవంగా అవి అమలవుతున్న తేదీలకూ మధ్య వ్యత్యాసం వల్ల అనేక రకాల గణాంకాలు లభ్యమవుతున్నాయి. క్రింది పట్టిక అమెరికా–చైనాల మధ్య ప్రస్తుతం వాస్తవంగా అమలవుతున్న పెంచిన టారిఫ్‌లను తెలుపుతుంది.

*(టారిఫ్‌లు పెంచిన వాణిజ్య విలువ – కోట్ల డాలర్లలో)*

| | అమెరికా | చైనా |
|---|---|---|
| జూలై 2018 | 3,400 | 3,400 |
| ఆగస్టు 2018 | 1,600 | 1600 |
| సెప్టెంబరు 2018 | 20,000 (10% చొ॥) | 6,000 (25% చొ॥) |
| మే 2019 | 20,000 (25% చొ॥) | – |
| జూన్ 2019 | – | 6,000 (25% చొ॥) |

*(బిబిసి రిసెర్చ్ రిపోర్టు, వికీపీడియా)*

అంతర్గతంగా దేశంలోను, అంతర్జాతీయంగాను అమెరికాకు దీనివల్ల చాలా ప్రతికూలత వ్యక్తమయింది. దాంతో ట్రంపు కొన్ని దిద్దుబాటు చర్యలు చేపట్టాడు. చైనాతో విడతల వారీగా చర్చలు జరిగాయి. కొంతమేరకు ట్రంపు దూకుడు తగ్గింది. అలాగే ఆయన యూరప్ యూనియన్‌తో (ఈయూ) చర్చించి ఒక అంగీకారానికి వచ్చాడు. యురప్ నుంచి అమెరికా

దిగుమతి చేసుకుంటున్న వస్తువులపై సుంకాలు ఎత్తివేయటానికి ట్రంప్ అంగీకరించాడు. ఆ రెండు ప్రాంతాలమధ్య వ్యాపారానికి వున్న ఆటంకాలు, అవరోధాలు తగ్గించటానికి చురుకైన చర్యలు తీసుకోవాలని నిశ్చయించారు. దాదాపు 99% సుంకాలు ఎత్తి వేయాలనుకున్నారు. యూరప్ దేశాల కూటమి జపాన్‌తో కూడా దాదాపు ఇలాంటి ఒప్పందమే చేసుకుంది. వాటి సాధ్యాసాధ్యాలు, ఎవరు ఎంత చిత్తశుద్ధితో వాటిని అమలు పరుచుతారు అనే సంగతి పక్కనవుంచి చూస్తే, అమెరికా, యూరప్, జపాన్‌లు చైనా వ్యాపారాన్ని దెబ్బకొట్టాలని భావించినా ప్రస్తుతం ఈ వివిధ సామ్రాజ్యవాద దేశాలు వారి స్వప్రయోజనాల దృష్ట్యా ఏకం కాలేకపోతున్నారని, వారి మధ్య విబేధాలు తలయెత్తుతున్నాయని, అమెరికా ప్రభావం క్షీణిస్తోందని అర్థమవుతోంది.

అతిశీఘ్రంగా అభివృద్ధిని సాధించి నేడు ప్రపంచంలో రెండవ పెద్ద ఆర్థికశక్తిగా ఎదిగిన చైనాను అమెరికా సహించలేకపోతున్నట్లుగా వుంది. తమలోగల అంతర్విభేదాలను ఆవలపెట్టి యూరపు దేశాలను తనవైపు సమీకరించుకోవాలని అమెరికా ప్రయత్నిస్తోంది. అభివృద్ధి చెందుతున్న చైనాను అరికట్టే ప్రయత్నమే అమెరికా ప్రకటించిన వాణిజ్యయుద్ధం. తమలోతమకు వాణిజ్యంలో సున్నా సుంకాలు, సున్నా రాయితీలు, సున్నా ఆటంకాలు అని చాటుకొంటున్నాయి పెట్టుబడిదారీ దేశాలు. అయితే ఈ అభివృద్ధి చెందిన దేశాల ఐక్యతే ఒక పెద్ద బూటకంలా కనిపిస్తోంది. ప్రస్తుత వాణిజ్య ఒప్పందాలను సైతం ఎవరికి వారు తమకు అనుకూలంగా అన్వయించుకుని వ్యాఖ్యానిస్తున్నారు. వాళ్ళు ప్రతిపాదిస్తున్నవి ఒక ఊహాత్మక స్థితే కానీ ఆచరణలో సాధ్యంకాదు. సున్నా సుంకాలు, సున్నా రాయితీలు ఏ కొద్ది రంగాలకో, ఏ కొద్ది కాలానికో అమలు చేయవచ్చు కానీ ఇది సర్వదా చేయగలిగిన వ్యాపారం కాలేదు. ఇప్పుడు కూడా యూరప్ యూనియన్ అమెరికానుంచి దిగుమతి అయ్యే సోయా ఉత్పత్తులకు మాత్రమే సుంకాలు ఎత్తివేస్తానని చెప్పింది తప్ప అన్ని ఉత్పత్తులకూ కాదు.

అయితే యూరప్ యూనియన్‌లోని (ఈయూ) కొన్ని దేశాలు చైనాపట్ల వ్యతిరేకత చూపించటంలేదు. కొన్ని దేశాలు డబ్ల్యూటిఓలో చైనా వ్యాపార పద్ధతులమీద కొన్ని ఫిర్యాదులు చేస్తున్నాయి. అయితే ఆ దేశాలు కూడా చైనామీద అమెరికా విధిస్తున్న టారిఫ్‌లను వ్యతిరేకిస్తున్నాయి.

2016-17 సంవత్సరంలో యూరపు, అమెరికానుండి 160 కోట్ల డాలర్ల విలువగల సోయాను దిగుమతి చేసుకుంది. అదే సమయంలో చైనా అమెరికానుండి 1400 కోట్ల డాలర్ల విలువైన సోయాను దిగుమతి చేసుకుంది. ఇక యూరప్ యూనియన్ దిగుమతులు ఎంత పెంచాలనుకొన్నా, వాగ్దానాలు చేసినా అది దౌత్యపరమయిన సఖ్యతకు సూచికేతప్ప అంతిమంగా దిగుమతులను దేశ అవసరాలు, మార్కెట్ హెచ్చుతగ్గులే నిర్ణయిస్తాయనేది తెలుసుకోవాలి! వారు దిగుమతి చేసుకుంటున్న నాచురల్ గ్యాస్, లిక్విడ్ గ్యాస్‌లు అమెరికానుంచి వస్తే చాలా ఖరీదు. ఫ్రాన్సు, జర్మనీలు వాటిని పక్కనేవున్న రష్యా నుండే దిగుమతి చేసుకుంటామని చెప్పాయి. అంతేకాదు ఫ్రెంచి అధ్యక్షుడు ఇమ్మాన్యుయల్ మాక్రాన్ ఏకపక్షంగా అమెరికా విధించిన సుంకాల

పెంపును వ్యతిరేకించాడు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థకు ఇలాంటి వాణిజ్య పద్ధతులు మేలు చేయవనీ, వాణిజ్య యుద్ధంలో ఏ పక్షానికీ విజయం లభించదనీ అన్నాడు. అసలు అమెరికా, యూరప్, జపాన్ ఒకేలాంటి వస్తువులు, ఉత్పత్తులతో వ్యాపారం చేస్తున్నాయి. భారీ యంత్రసామాగ్రి, రవాణా సాధనాలు (కార్లు, ట్రక్కులు) వంటివే వారు ఎగుమతి చేసేవి. అమెరికా ఎగుమతులలో 40%, జపాను ఎగుమతులలో 60% ఇటువంటి వస్తువులే వున్నాయి. కనక ఈ మూడు శక్తుల మధ్య పరస్పరం ఆ వస్తువులు మార్పిడి చేసుకోవలసిన అవసరం లేదు. అంతేకాదు ఈ మూడు గ్రూపులు చైనా నుంచి తీసుకునే దిగుమతులు కూడా ఒకేలా వున్నాయి. వాళ్ళ ఎగుమతులకు కానీ, దిగుమతులకు కానీ పెద్ద వ్యాపార భాగస్వామిగా చైనా తప్ప మరో పెద్ద మార్కెటులేదు.

తమ మొత్తం దిగుమతులలో అమెరికా 17.4%, జపాన్ 24.5%, యూరప్ 20% చైనా నుండి తీసుకుంటారు. ఇక ఎగుమతులలో జపాన్ 20%, యూరప్ 10% చైనాకు పంపిస్తున్నాయి. అంటే తమ వ్యాపార ప్రపంచం నుండి చైనాను బహిష్కరించాలంటే వాళ్ళకు సాధ్యంకాదు. అంత పెద్ద మార్కెట్ మరోటి దొరకాలి కదా. ఇండియా, ఇండోనేషియా, బ్రెజిల్, వియత్నాం దేశాల మార్కెట్లపై అభివృద్ధి చెందిన దేశాలు తమ కన్నువేశాయి. అయితే ఈ అన్ని మార్కెట్లు కలిపినా చైనా మార్కెట్‌కు సాటి కాలేవు. చైనా వ్యాపార స్థాయిలో ఇండియా 18.2%, వియత్నాం 10.4%, బ్రెజిల్ 9%, ఇండోనేషియా 8% మాత్రమే చేరుకోగలరు. వీరందరి వ్యాపారం కలిపినా చైనా వ్యాపారంలో 35% (మూడవ వంతు) మాత్రమే వుంటుంది. అంతేకాదు చైనాలో ఉత్పత్తి సామర్థ్యం, దేశీయ మార్కెట్ డిమాండ్ కూడా చాల ఎక్కువ. 140 కోట్ల జనాభా, దాదాపు 9500 డాలర్లకు చేరువయిన తలసరి జాతీయ ఆదాయంతో అభివృద్ధి చెందుతున్న అతిపెద్దమార్కెట్ చైనా. ఈ మార్కెటును వదులుకోవటానికి యూరప్ దేశాలు సిద్ధంగాలేవు. వారు కావాలనుకున్నా ఆ దేశాన్ని ప్రపంచపటంనుండి ఏ రంగంలోనూ తొలగించలేరు. ఈ వాస్తవాన్ని అమెరికా గ్రహించలేదనుకోకూడదు. కానీ, అమెరికా ప్రభుత్వాలది, పాలకవర్గాలది ఆధిపత్యరాజకీయం. తన మాటే చెల్లాలనే పెత్తాందారీతనం. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత తాను ఆర్థికంగా సాధించిన ఉన్నత స్థానానికి, ప్రపంచ శాసనకర్తగా తనకుతానే ఆపాదించుకున్న స్థానానికి ఏ మాత్రం భంగం కలిగినా ఓర్చుకోలేదు. ప్రపంచంలో ఏమూల అభివృద్ధి జరిగినా అది తన కనుసన్నలలో, తన ప్రయోజనాల కనుగుణంగానే జరగాలని కోరుకునే నైజం. ఎవరు, ఎప్పుడు, ఎలా, తనను దెబ్బతీస్తారో అని అనుక్షణం భయపడుతూ బతుకుతోంది. చిన్న గాలి విసిరినా ఉలిక్కిపడుతుంది. గతంలోనూ ఇలాంటి ఆర్థిక యుద్ధాలు అది అనేకం ప్రకటించింది.

ఒకనాటి సోవియట్ రష్యా సోషలిస్టు పథంలో పయనిస్తూ అభివృద్ధిని సాధించి అమెరికా ఆధిపత్యానికి సవాలుగా నిలిచింది. అమెరికా జాతీయ ఉత్పత్తిలో 60 శాతాన్ని మించిన స్థాయికి రష్యా చేరుకోగానే ఆ అభివృద్ధికి అడుగడుగునా అడ్డుతగిలింది. కమ్యూనిజాన్ని నిరోధించే

ప్రయత్నంలో భాగంగా కొంతకాలం, ప్రపంచాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకునే సామ్రాజ్యవాద పక్షాల కీచులాటల్లో భాగంగా కొంతకాలం అమెరికా రష్యా అభివృద్ధిని నిలువరించే, నిరోధించే ప్రయత్నాలు చేసింది. రష్యాకూడా తన సోషలిస్టు పథం విడిచివేసి, తానో సోషల్ సామ్రాజ్యవాదిగా ఎదిగి యుద్ధ రాజకీయాలలో మునిగిపోయింది. అది చేసిన తప్పిదాలు, సూత్రరాహిత్య పద్ధతులు, అపసవ్యమైన పెట్టుబడిదారీ ఆర్థిక నిర్వహణకు తోడు, అమెరికాతో బహుముఖాలుగా వచ్చిన పోటీని, ఒత్తిడిని తట్టుకోలేక పోయింది. సోవియట్ యూనియన్ క్రమంగా చితికిపోయింది. మరో ఉదాహరణగా, రెండవ ప్రపంచయుద్ధంలో పూర్తిగా నాశనమయిన జపాన్ కాలక్రమంలో విస్మయకర అభివృద్ధిని సాధించింది. అమెరికాతో వ్యాపారం చేస్తూనే బలమైన ఆర్థికశక్తిగా ఎదిగింది. అమెరికా వాణిజ్యానికి ఒక ప్రత్యమ్నాయ శక్తిగా ఎదుగుతూ తన జాతీయ ఉత్పత్తిని బాగా పెంచుకోగలిగింది. వెంటనే అమెరికా రంగంలోకి దిగి జపాన్‌వారి ఉదారవాద ఆర్థిక విధానాలు, తక్కువ నిబంధనలతో సాగే పారిశ్రామికీకరణను పక్కదారి పట్టించి వారిని రియల్ ఎస్టేట్ వ్యాపారాల వైపు తిప్పింది. పెరిగిపెరిగి ఆ బుడగ పగిలిపోయేలా పావులు కదిపింది. ఇదంతా ప్లాజా ఒప్పందం కింద జరిగింది. దాంతో జపాన్ "కోల్పోయిన దశాబ్దం" కింద నలిగిపోయింది.

ఈ రెండు ఉదాహరణలు అమెరికా నైజాన్ని, వ్యవహారాన్ని కళ్ళకు కడతాయి. వేరెవరూ తన దరిదాపులకు రాకుండా తన 60% అనే ఎర్ర గీతను గీసి, ఆ గీత దాటిన వాళ్ళను శిక్షించేవిధానం అమలు చేస్తోందా? అనిపిస్తుంది. ఈ దాడికి ప్రత్యర్థి మిత్రుడా? శత్రువా? పెట్టుబడిదారుడా, సామ్రాజ్యవాదా? సామ్యవాదా? అనే తారతమ్యం లేదు. ఆయా దేశాలు అమెరికాపట్ల తీసుకునే వైఖరితో కూడా సంబంధంలేదు. "అమెరికానే ప్రథమం" అనే వైఖరి ఇది. ప్రస్తుతం చైనాపై తన పడగఎత్తింది అమెరికా ట్రంప్ ప్రభుత్వం. గతంలో జపాన్ మీద ఎలా కుయుక్తులు పన్నిందో తిరిగి అలాంటి ప్రయత్నాలు చేస్తోంది. ఒకనాడు జపాన్ నుండి వస్తున్న, గృహోపకరణాలు, స్టీలు, రవాణా వాహనాలు, టెలీ కమ్యూనికేషన్ వస్తువులు ఇలా అన్నింటిమీద వ్యాపార తగదాలు సృష్టించి, ఆయా రంగాలను అతలాకుతలం చేసింది. ఏ రంగాలలో జపాన్ మొదటి స్థానంలోవుందో వాటిన్నింటిలో తొక్కివేసే ప్రయత్నం మొదలెట్టి "సెక్షను 301 నేరాలు" అంటూ అనవసరపు వివాదాలు సృష్టించింది. దానివల్ల జపాన్ ఎగుమతులు తగ్గిపోయాయి. ఉత్పత్తులు తగ్గించుకోవలసి వచ్చింది. అనేక జరిమానాలు చెల్లించింది. సమస్యలనుండి బయటపడటానికి అనవసరపు చెల్లింపులు, అవసరంలేని దిగుమతులు చేసుకోవటం జరిగింది. తత్ఫలితంగా జపాన్ ఆర్థిక ప్రాభవాన్ని కోల్పోయింది. కానీ అమెరికా ఆకాంక్షలకు వ్యతిరేకంగా తిరిగి పుంజుకుని పెద్ద ఆర్థికశక్తిగా ఎదిగింది.

చైనా కూడా ఇప్పుడు రెండవ పెద్ద ఆర్థిక శక్తిగా ఎదిగి వచ్చింది. 2014లో చైనా అమెరికా వాళ్ళ 60% ఎర్రగీతను దాటింది. అమెరికా ప్రత్యర్థులెవరూ ఇంతవరకూ సాధించలేనంత ఆర్థిక అభివృద్ధిని సాధించి రాబోయే కొద్దికాలంలోనే అమెరికాను అధిగమించే సూచనలు

పుష్కలంగా కనిపిస్తున్నాయి. అందుకే అమెరికాకు గంగవెర్రులెత్తుతున్నాయి. 2017 ఆగస్టు నుంచీ "సెక్షను 301 పర్యవేక్షణ నేరాలు" అనే ఆయుధం చైనాపై ప్రయోగిస్తోంది. ఆర్థికంగా కట్టడిచేయాలని ప్రయత్నిస్తోంది. చైనా అక్రమపద్ధతులు ఉపయోగించి వ్యాపారం చేస్తోందని ఆరోపించింది. చైనాకు పాఠం చెప్పటానికే సుంకాల కొరడా ప్రయోగిస్తున్నానని అమెరికా అంటోంది. 2016-17 సంవత్సరం అమెరికా చైనానుండి 50 వేల కోట్ల డాలర్ల విలువగల వస్తువులు దిగుమతి చేసుకుంది. అదే సమయంలో 13 వేల కోట్ల డాలర్ల విలువగల వస్తువులు చైనాకు ఎగుమతి చేసింది. అంటే వ్యాపార పరిమాణంలో చైనాకు 37 వేల కోట్ల డాలర్లు మిగులు వుందన్నమాట. ట్రంప్ దీనినే చైనా చేస్తున్న ఆర్థిక దోపిడిగా వర్ణిస్తాడు. అమెరికాలోని ఆర్థికవేత్తలేమో ఈ వ్యాపారంవల్ల అమెరికాకు ఏమాత్రం నష్టం రాదంటున్నారు. ట్రంప్ చెబుతున్నదానికి భిన్నంగా ఇరుదేశాలమధ్య పారదర్శకంగా, స్వేచ్ఛగా సక్రమవ్యాపారం జరుగుతోంది. ఈ సందర్భంలో కొన్ని వాదనలు, వాస్తవాలు మనం పరిశీలించాలి!

(1) చైనా అభివృద్ధి చెందుతున్న దేశం కనక, తన స్వంత పరిశ్రమల అభివృద్ధిని దృష్టిలో వుంచుకుని అది అమెరికా దిగుమతులపై విధించే సుంకం, చైనా వస్తువులపై అమెరికా విధించే దానికంటే కొంచెం అధికంగానే వుంటుంది. అయితే అమెరికా వస్తువులపై మనదేశంతో సహా ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలు విధించే సుంకాలకంటే చైనా విధించే సుంకం తక్కువే వుంది. అమెరికా ఎగుమతులకు అతి త్వరితంగా ఎదుగుతున్న మార్కెట్ చైనాయే. 2001 నుండీ (WTO లో ప్రవేశించిన నాటినుండి) చైనా అనేక మార్పులు చేస్తూ ప్రపంచ వాణిజ్య సంస్థ నియమ నిబంధనలను అమలుపరిచే ప్రయత్నం చేస్తూన్నది. దేశీయంగావున్న వ్యాపార అడ్డంకులను చాలావరకు తగ్గించుకుంటూ వస్తూన్నది. అమెరికాలోని ఎగుమతిదారులు మూర్ఖులేమీ కాదు గదా! వాళ్ళు అవకాశం కనపడితే వొదిలే రకం కూడా కాదు. చైనాలోని పరిస్థితులపట్ల పూర్తి అవగాహనతోనే వారు వ్యాపారం చేస్తున్నారు. చైనా వాణిజ్య మంత్రిత్వశాఖవారి 2017 గణాంకాల ప్రకారం అమెరికా ఉత్పత్తులలో 56% సోయాబీన్సు, 26% బోయింగ్ విమానాలు, 17% రవాణా వాహనాలు చైనాలోనే అమ్ముడుపోతున్నాయి.

(2) అమెరికా దిగుమతిదారులు కూడా తెలివితక్కువ వారు కాదు. చైనా వస్తువులు కొనకతప్పదని వారిని ఎవరూ బలవంతం చేయలేరు కూడా. అయితే చవకగావున్న చైనా వస్తువులు అమెరికా మధ్యతరగతి వారికి అందుబాటులోవుండి వారికి ఊరటనిచ్చాయి. అనేక సంవత్సరాలుగా వారి ఆదాయాలు ఎదుగుబొదుగూ లేకుండా వుండిపోయాయి. వారి పరిమిత ఆదాయాలతో వారు చైనా వస్తువులనే కొనగలుగుతున్నారు.

(3) చైనా, అమెరికా వస్తువులపై విధించే ఆంక్షలకన్నా అమెరికా తన ఎగుమతిదారులకు కల్పిస్తున్న విధినిషేధాలు, పరిమితులవల్లే అమెరికాకు వ్యాపారలోటు ఏర్పడుతున్నది. చైనాలోవున్న అత్యధిక కార్మిక జనాభా, సాపేక్షికంగా, చవకగా దొరికే శ్రమశక్తి చైనాకు అనుకూల అంశమైతే, అమెరికా దగ్గరవున్న పెట్టుబడి, భూమివనరు దానికి అనుకూల అంశం. అందువల్ల శ్రామిక

ఉత్పాదనలు చైనా అమెరికాకు ఎక్కువ ఎగుమతి చేస్తూంటే, వ్యవసాయ ఉత్పత్తులు, సాంకేతిక సామర్థ్యంగల వస్తువులు అమెరికా చైనాకు ఎక్కువ ఎగుమతి చేస్తున్నది. జర్మనీ తదితర యూరప్ దేశాలు, జపానుల కంటే అమెరికా ఎగుమతి విధానాలు క్లిష్టమైనవి, కఠినమైనవి. ఏది, ఎంత, ఎప్పుడు ఎగుమతి చేయాలనేది ఫెడరల్ ప్రభుత్వ విధానంపై ఆధారపడివుంటుంది. విమానాలు, విమానాల మోటార్లు, నావిగేషన్ పరికరాలు, లేసర్స్, ఫైబర్ ఆప్టిక్ వస్తువులువంటి 20 ఉన్నత సాంకేతిక ఉత్పాదనలపై ఎగుమతి ఆంక్షలు లేకపోతే చైనా వీటిని పెద్దయెత్తున దిగుమతి చేసుకుంటుంది. దానితో వారిమధ్య వాణిజ్యలోటు తగ్గుతుంది.

(4) లోటుకు సంబంధించిన వాస్తవాన్ని గణాంకాలు పూర్తిగా చిత్రించలేవు. ఆ అంకెలు ఒక విధంగా వాస్తవాలను మరగుపరిచి వంచన చేస్తాయి. ఉదాహరణకు ఆపిల్ ఐఫోనును అమెరికా చైనానుంచి దిగుమతి చేసుకుంటుంది. అమెరికా చేరేసరికి దీని ఖరీదు చాలా ఎక్కువ. అందులో 60% బ్రాండుపేరుకి, సాంకేతికతకు దక్కుతుంది. చైనాలోని అమెరికా కంపెనీలు ఫోన్ల తయారీకి అవసరమైన విడిభాగాలను చైనానుండికాక అంతర్జాతీయ సరఫరా కేంద్రాలద్వారా ప్రపంచంలోని ఇతర ప్రాంతాలనుండి తెప్పించుకుంటాయి. కనక విడిభాగాల విక్రయాలవల్ల ఆదాయం ఇతర దేశాలకు పోతుంది తప్ప చైనాకు ఎలాంటి లాభమూ చేకూరదు. ఫోను విలువ అమెరికాలో 240 డాలర్లు వుంటే అందులో చైనా వాటా 9–10 డాలర్లే వుంటుంది. కానీ ఈ అధికవెల అంతా చైనా ఎగుమతుల విలువకు జోడించటంతో చైనా ఎగుమతుల విలువ ఎక్కువగా వున్నట్లు తప్పు సమాచారం నమోదవుతోంది.

(5) వాణిజ్య లోటు గురించి మాట్లాడే అమెరికాలోని స్థానిక వ్యాపారాల సంరక్షణవాదులు కావాలనే కొన్ని విషయాలు విస్మరిస్తారు. సర్వీసురంగం, ప్రయాణాలు, పర్యాటకాలు, బ్యాంకింగ్, ఇన్సూరెన్సు, రాయల్టీ తదితర ఖర్చులను లెక్కలోకి తీసుకోరు. ఈ ఖర్చంతా ఎగుమతి విలువకే అంటగడతారు. ఇలాంటి ఖర్చులు 2017లో చైనా గణాంకాల ప్రకారం 5,400 కోట్ల డాలర్లు వుంది.

(6) సంరక్షణవాదులు కావాలని లెక్కించని మరో విషయం, చైనాలోవున్న అమెరికా కంపెనీల వ్యాపారం. అది దాదాపు 50 వేల కోట్ల డాలర్లు పైచిలుకు వుంది. అమెరికా, చైనాలమధ్య వాణిజ్యబంధం వుండబట్టే అమెరికాకు ఈ ఆదాయం వస్తోందన్న విషయం మరుగుపరుస్తారు. వేగంగా పెరుగుతున్న చైనా మార్కెటును ఉపయోగించుకొని అమెరికా కంపెనీలు పేరుకి చైనాలో స్థాపించినా వాటికి కావలసిన ముడి సరుకులు, సగం తయారి వస్తువులు అమెరికానుంచి నేరుగా తెప్పించుకుని పూర్తియిన వస్తువులను చైనా వస్తువులుగా తమ దేశానికి పంపిస్తున్నాయి. వాస్తవంలో ఇవి అమెరికాకు వెళుతున్న అమెరికా వస్తువులే, లెక్కమాత్రం చైనా ఎగుమతుల ఖాతాలో పడుతోంది.

(7) మేధోసంపత్తి విషయంలో ట్రంప్ పదేపదే ఒక పాట పాడుతాడు. చైనా, అమెరికా నుండి సాంకేతిక విజ్ఞానాన్ని చౌర్యం ద్వారా కొల్లగొడుతున్నదని. చైనా కంపెనీలు సాంకేతికత

బదిలీని ఎక్కువగా కోరుతుంటాయని. 1990ల నుంచి చైనాలో మేధోహక్కుల చట్టాలు పట్టిష్టంగా అమలుచేస్తున్నారు. అవసరమైన సాంకేతికతను వాళ్ళు కొనుగోలు చేస్తున్నారు. ఒక్క 2017లోనే బయటనుంచి వచ్చిన సాంకేతిక విజ్ఞానం కోసం వాళ్ళు 2860 కోట్ల డాలర్లు చెల్లించారు. ఇది 2001 నాటితో పోలిస్తే 15 రెట్లు ఎక్కువ ఖర్చు. ఇంత డబ్బు ఇచ్చి కొనుక్కున్నది చౌర్యం ఎలా అవుతుంది. ఇంత సొమ్ము అమెరికాలోని మేధోహక్కుదార్లకు చెందటం వారికి లాభకరమే గదా!

(8) సాంకేతిక పరిజ్ఞానం బదిలీకొరకు చైనా పరిశ్రమలు ఒత్తిడి చేస్తాయన్నది అమెరికా చేసే మరో వాదన. అయితే సంయుక్త రంగంలో వచ్చిన సంస్థలు (జాయింట్ వెంచర్లు), విడివిడిగా తమతమ భాగస్వామ్య ప్రయోజనాలకు అనుగుణంగా ఒప్పందాలు చేసుకుంటాయని అందరికీ తెలుసు. అలాంటి సందర్భాలలో చైనా భాగస్వాములు సాంకేతిక పరిజ్ఞానం బదిలీ చేయమనడం వింతకాదు, నేరమూ కాదు. దీనికి అమెరికా కంపెనీలు ఇష్టపడి, అంగీకరించవచ్చు లేక తిరస్కరించవచ్చు. చైనా మార్కెట్‌లో ప్రవేశించడమే తమకు గొప్ప ప్రయోజనకారి అని భావించి సాంకేతికతను బదిలీచేస్తే దాన్ని నేరమనో, ఒత్తిడి అనో భావించటం సబబేనా? ఉదాహరణకి ఫోర్డు కంపెనీ, జనరల్ మోటర్సు తమ సాంకేతికతను కొంత బదిలీచేసి చైనా మార్కెటులో ప్రవేశించాయి. ఈనాడు చైనాలో ఈ రెండు కంపెనీలు భారీ పరిశ్రమలుగా నిలదొక్కుకున్నాయి. పెద్ద ఎత్తున లాభం పొందాయి. ఇదంతా అమెరికాకు ఆదాయమే గదా!

(9) 'మేడిన్ చైనా 2025' పథకాన్ని ఆపివేయాలని ట్రంప్ భావిస్తున్నాడు. ఇది చైనా కంపెనీలకు ఆ ప్రభుత్వం అందిస్తున్న ఒక రాయితీల పథకం. ఆ పరిశ్రమల ఆధునీకరణకు ఉపయోగడాలని చైనా ఉద్దేశం. ఇది ఒక విధంగా 'రాజ్యం పెట్టుబడి' అని అమెరికా అక్షేపిస్తుంది. అయితే ఈ పథకం WTO నియమాలకు విరుద్ధం కాదు. అంతేకాదు చైనాలోవున్న విదేశీ కంపెనీలకు కూడా ఈ పథకం కింద రాయితీలు దక్కుతాయని చైనా వాదిస్తోంది. అమెరికా కూడా తన దేశంలో ఇలాంటి పథకాలను అమలు చేస్తోందని గమనించాలి. రక్షణరంగ ఖర్చులు సబ్సిడీలవల్ల, ఇంటర్నెట్, పౌర మిలటరీ రంగాలలో, రోదసీ పరిశోధనలు, సెమీకండక్టర్లు, అణు విద్యుత్ ప్లాంట్లవంటివి బాగా అభివృద్ధి చెందాయి.

(10) ప్రపంచ వాణిజ్య సంస్థ WTO పర్యావేక్షణకు ఒప్పుకుని, ఆ నియమాల ప్రకారమే చైనా వ్యాపారం చేస్తున్నది. అమెరికాలాగానే చైనా కూడా ప్రతి 2 సంవత్సరాలకొకసారి WTO పరిశీలనలకు గురి అవుతుంది. ఆచరణలో ఎక్కడైనా చిన్న అవకతవకలు, కొన్ని ఉల్లంఘనలు కనిపించవచ్చు. అలాంటి కేసులు చైనాపై 40 వుంటే, అందరిమీద ఫిర్యాదులు చేసే అమెరికా మీద WTOలో 80 కేసులు వున్నాయి. ఇలాంటి కేసుల్లో తీర్పు తమకు వ్యతిరేకంగావస్తే చైనా అధికారులు సరిదిద్దుకుంటున్నారు. కానీ అమెరికా మాత్రం పెత్తందారీతనంతో ఆ తీర్పులను ఆమలు చేయటం లేదు.

ఇలా తర్కానికి నిలవని అవాస్తవాలు, అభూతకల్పనలు చేసి ట్రంప్ ప్రభుత్వం చైనా మీద వ్యాపారదాడి మొదలుపెట్టింది.

మే 10, 2019 నాటికి 20 వేల కోట్ల డాలర్ల చైనా ఉత్పత్తులపై ట్రంప్ సుంకాలను భారీగా (25%) పెంచటంతో చైనా కూడా 6 వేలకోట్ల డాలర్ల అమెరికా ఉత్పత్తులపై 25% సుంకాలు పెంచింది. అమెరికా చైనా వాణిజ్యయుద్ధంతో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ దెబ్బతింటుందనీ, 2019 వృద్ధిరేటు తగ్గిపోతుందనీ ప్రపంచబ్యాంకు, ఐయమ్ఎఫ్ సంస్థలు హెచ్చరించాయి. ఈ చర్యలవల్ల చైనాకు 123 వేలకోట్ల డాలర్ల నష్టం జరుగుతోందని అది 1% అభివృద్ధిని నిరోధించగలదని చైనా పార్టీ పొలిట్ బ్యూరోనుంచి వాంగ్ యోంగ్ 17 మే, 2019న ప్రకటించారు. అమెరికా చైనాల మధ్య ఇప్పటికే 12 రౌండ్ల చర్చలు జరిగాయి. కానీ సుంకాల యుద్ధం ముగింపుకు రాలేదు. ట్రంప్ బూకరింపులు, బెదిరింపులు, నిషేధాలు ఆగలేదు. ప్రపంచంలో రెండవ అతిపెద్ద చైనా మొబైల్‌ఫోన్ల తయారీ సంస్థ 'హువావీ'ని అమెరికా నిషేధించింది. ఆ సంస్థపై గూఢచర్యంనుంచి సాంకేతిక చౌర్యం వరకు అనేక ఆరోపణలు చేసింది. ఈ కంపెనీ చైనా ప్రభుత్వంకోసం సాంకేతిక గూఢచర్యానికి పాల్పడుతోందని అమెరికా భద్రతకు, రక్షణకు ఈ కంపెనీ ప్రమాదకారి అని ట్రంప్ ప్రకటించాడు. అయితే ఇకపై అమెరికా ఉత్పత్తులపై ఆధారపడకుండా విడిభాగాల స్వంతతయారీకి తాను ఉపక్రమిస్తున్నట్లు ఆ కంపెనీ తెలిపింది. పరికరాల కొనుగోలుకే ఈ కంపెనీ 7వేల కోట్ల డాలర్లు ఖర్చుచేస్తుంది. ఇందులో 1100 కోట్ల డాలర్ల విలువగల విడిభాగాలు అమెరికా కంపెనీల నుండి కొనుగోలు చేస్తుంది. అందుకేనేమో ఈ కంపెనీపై నిషేధాన్ని మూడు నెలలపాటు వాయిదా వేస్తున్నట్లు ట్రంపు ప్రభుత్వం ప్రకటించింది. చైనా తన దిగుమతులు పెంచుకుంటానని చెబుతోంది కానీ అలా పెంచుకోవటం లేదనీ, సంభాషణలనుండి కూడా వైదొలగిపోతోందనీ, అమెరికా ఏకపక్షంగా ప్రకటిస్తున్నది. నిజానికి చైనా చర్చించటానికి సిద్ధంగావుంది. జి-20 శిఖరాగ్ర సమావేశాల సందర్భంలోనూ, డబ్ల్యూటివో కి విజ్ఞప్తులద్వారానూ తన ఉన్నతస్థాయి అధికారులను వాషింగ్టన్‌కు పంపించటం ద్వారానూ తన సంసిద్ధతను తెలియజేస్తోంది. తానిచ్చిన వాగ్దానాల అమలులో భాగంగా జూన్ 2019 వరకు అనేక మిలియన్ టన్నుల సోయాబీన్స్‌ను అమెరికానుంచి ఖరీదు చేసింది. ఆగస్టు 2019నాటికి ఉన్న పరిస్థితి - ఇరుపక్షాలు ప్రకటించిన సుంకాలు పూర్తిగా అమలుజరిగితే అమెరికా చైనా దిగుమతులపై సరాసరిన 24% అధిక సుంకం వసూలు చేస్తున్నట్లవుతుంది. ఈ యుద్ధానికిముందు అది 3% వుండేది. దాదాపు చైనానుండి వస్తున్న అన్ని వస్తువులపై సుంకం విధించినట్లే. ఇక చైనా అమెరికానుండి దిగుమతి చేసుకుంటున్న వాటిలో 65% వస్తువులపై దాదాపు 26% సుంకం విధించినట్లే. చైనా ఇతర దేశాల వస్తువులపై సుమారు 6.5% సుంకం మాత్రమే విధిస్తోంది. చైనాకు ముక్కుతాడు వేయాలనుకునే ట్రంప్ ధోరణి మారనంతవరకు ఈ యుద్ధం కొనసాగే సూచనలు కనిపిస్తున్నాయి. అయితే చైనా ప్రత్యామ్నాయమార్గాలలో తన సుస్థిర ప్రయాణం కొనసాగిస్తుంది.

ట్రంప్ మొదలెట్టిన ఈ యుద్ధం కొనసాగాలని చైనా కోరుకోవటం లేదు. ఈ స్థితి ప్రపంచాన్నంతా ఒక అస్థిరత్వంలోకి లాగుతుందనీ, అభివృద్ధి శకటం మందకొడిగా కదులుతుందనీ చైనా అభిప్రాయం. అయితే తనపై దాడినుంచి చైనా తననుతాను రక్షించుకోవాలి! అలా రక్షించుకుంటుంది కూడా! ఈ సంక్షోభస్థితిని ఎదుర్కోవటానికి చైనా సిద్ధంగా వుంది. గతంలో రష్యా, జపాన్‌లు అమెరికా ఆర్థిక యుద్ధానికి బలైపోయినట్లుగా చైనా ఓటమి చెందబోదని కచ్చితంగా చెప్పవచ్చు. ఇప్పటివరకూ అమెరికా అనుకున్నట్లుగా సాగిన కథలో ఇకపై మలుపులు, ముగింపు చైనా పలుకుతుంది. దీనికోసం ప్రధానంగా చైనా తన ప్రజల శక్తిపైన తన దేశీయ మార్కెటుపైన, పెరిగిన తన ప్రజల కొనుగోలు శక్తిపైన ఆధారపడుతున్నది. ఇతర విదేశీ పెట్టుబడిదారులను విశ్వాసంలోకి తీసుకుంటోంది. ట్రంప్ విధానాలు ఇలాగే కొనసాగితే అమెరికా చైనాలో పెట్టుబడులు పెట్టే అవకాశం కోల్పోతుంది. అ ఖాళీని పూరించడానికి ఇతర పెట్టుబడిదారులు సిద్ధంగానే వున్నారు. 1930ల నాటి 'స్మూత్ హాలే' సుంకాల విధానాన్ని* అమెరికా మళ్ళీ అవలంబిస్తున్నట్టుగా కనిపిస్తోంది. అప్పటి కరెన్సీయుద్ధం, వాణిజ్యయుద్ధం చివరికి రెండవ ప్రపంచ యుద్ధానికి దారితీసాయన్న చరిత్ర మనం మరిచిపోలేము. అందుకే ఒక్క చైనా మాత్రమే కాదు. ఇతర దేశాలన్నీ, ముఖ్యంగా అమెరికా ప్రజలు, చారిత్రక అనుభవంతో ట్రంప్ విధానాలను వ్యతిరేకించి యుద్ధాన్ని నివారించాలి! ఇది చైనాకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడినదే. అయితే ఈ వ్యాపార యుద్ధంవల్ల మిగతా దేశాలమీద ప్రభావం ఏమిటి అనేది కూడా పరిశీలించాలి! ప్రపంచంలోని మొదటి, రెండవ ఆర్థిక శక్తుల మధ్య వివాదం రాజుకుంటే అది ప్రపంచం మొత్తం మీద ప్రభావం చూపకుండా ఎలా వుంటుంది?

ఇల్లు కాలుతుంటే చుట్ట అంటించుకునే వాళ్ళు వున్నట్లుగా చైనా, అమెరికాల ఎగుమతి దిగుమతి వ్యాపారంలో ఏర్పడే మిగులు, లోటువల్ల తమకు వ్యాపారం దక్కుతుందేమో, తమ ఆర్థికస్థితి బాగుపడుతుందేమో అని చూసేవాళ్ళు వున్నారు. అనేక వ్యాపార కూటములు, కొత్త

---

** స్మూత్ హాలే సుంకాల విధానం – ఇది ఒక రక్షణాత్మక సుంకాల విధానం. విదేశాల వ్యాపారాన్ని నియంత్రిస్తూ, తమ ఆదాయం పెంచుకోవటానికి రిపబ్లికన్ ప్రభుత్వం 1930లో 20 వేల వస్తువుల దిగుమతులపై దిగుమతి సుంకాలు పెంచింది. 30% దిగుమతులపై అధికంగా 60% సుంకాలు, 60% శాతం దిగుమతులపై 20% సుంకాలు విధించారు. ఆనాటి ఆర్థిక సంక్షోభంలో అనుసరించిన ఈ విధానంవల్ల అమెరికా దిగుమతులు, ఎగుమతులు సగానికిపైగా తగ్గిపోయాయి. స్థానిక పరిశ్రమలకు ప్రోత్సాహం ఇవ్వటానికీ, ఉత్పత్తులు పెంచుతూ అమెరికాలోని శ్రామికులకు జీవనాధారం కల్పించటానికి సుంకాలు పెంచటం జరిగిందన్నారు. ఆర్థికవేత్తలు దీన్ని 'ఆర్థిక మూర్ఖత్వమని, దుర్మార్గపు దోపిడీ' అని అభివర్ణించారు. దీనికి ప్రతిచర్యగా కెనడావంటి వ్యాపార భాగస్వాములు తమ సుంకాలు 30% పెంచారు. అంతిమంగా ఈ చర్యలు ఆర్థిక సంక్షోభాన్ని మరింత తీవ్రం చేశాయి. దాంతో 1934లో ఈ అధిక సుంకాలను అమెరికా తగ్గించింది.*

సమీకరణలు మొదలవుతున్నాయి. భారతదేశంతో సహా కొన్ని దేశాలు, పెట్టుబడిదారీ సంస్థలు ఇలాంటి అవకాశంకోసం ఎదురు చూస్తున్నాయి. 2018–19లో వియత్నాం, అమెరికాకు చైనానుంచి తగ్గిన ఎగుమతుల స్థానంలో తన ఎగుమతులను పెంచి లాభపడిందని ఒక వుదాహరణగా చూపిస్తున్నారు. అయితే ప్రస్తుతం ప్రపంచమంతా అలుముకున్న ఆర్థికతిరోగమనం వల్ల వియత్నాం వ్యాపారం తగ్గిపోయింది. అందుచేత, తక్షణం కొంత లాభించవచ్చేమోకానీ దీర్ఘకాలంలో అది ఆర్థిక తిరోగమనానికి దారితీస్తుందని, ప్రపంచ పరిణామాలకు చోదకులుగావున్న అభివృద్ధి చెందుతున్న దేశాలకు అది తీరని నష్టమని ఎక్కువమంది భావిస్తున్నారు.

మరి ఈ స్థితిలో మన దేశం పరిస్థితి ఏమిటి? చైనా, అమెరికాలమధ్య జగడంలో మనం వేచి వుండాలనీ అమెరికాతో వ్యాపార సంబంధాలు మరింత పెరుగుతాయనీ కొందరు ఆర్థికవేత్తలు అంటున్నారు. అమెరికా నుంచి సోయాబీన్ దిగుమతులను చైనా కోల్పోతుంది కనక ఇండియా చైనాకు అవి ఎగుమతి చేయటంవల్ల లాభపడవచ్చని సోయాబీన్ రైతు సంఘాలు ఆశపడుతున్నాయి. తాను కోల్పోయిన మార్కెటును ఇండియాలో సాధించుకోవాలని అమెరికా, ఇండియాకు సోయాబీన్సు ఎగుమతి చేస్తుందనీ, అలా ఒత్తిడి చేస్తుందనీ మరికొందరు భయపడుతున్నారు. చైనా సోయాబీన్ దిగుమతులు దాదాపు వంద మిలియన్ టన్నులు. అందులో స్వదేశీ వినియోగంపోగా మిగిలిన దానిని ఆయిల్‌గాను, ఇతర ఆహార పదార్థాలుగాను మార్చి మళ్ళీ చైనా ఎగుమతి చేస్తోంది. కనక ఇండియాకు ఈ విషయంలో పెద్దగా లాభకరమైన పరిస్థితి వుండకపోవచ్చు అని ఎగుమతిదార్లు అంటారు. కానీ వియత్నాం అనుభవాన్ని మనం గమనించాలి. అమెరికాది దిగజారుతున్న ఆర్థిక వ్యవస్థ, ఈ యుద్ధంలో చైనా బలంగా కొట్టే దెబ్బలకు అమెరికా కకావికలంకాక తప్పదనీ, కనుక చైనాలో అమెరికా ఖాళీ చేసే స్థానాన్ని భర్తీ చేయాటానికి ఇండియాకిది అనుకోని అవకాశమని కొందరు వాదిస్తున్నారు.

ఇండియా ప్రపంచంలో 5వ పెద్ద ఆర్థికశక్తిగా పురోగమిస్తోంది. కానీ వ్యాపారంలో మన పరిమాణం చాల కొద్దిది. ఈ ఆర్థిక పరిణామాలవల్ల ప్రపంచంలో తలఎత్తే ఆర్థిక మాంద్యం, నోట్ల ముమ్మరం, తిరోగమించే అభివృద్ధివల్ల మన ఆర్థికస్థితి అనేక ప్రతిష్టంభనలకు దారితీస్తుంది. పరోక్షంగా మనం చాల నష్టపోతాము.

అమెరికాలో ఏ సమస్య వచ్చినా వాళ్ళు డాలరును స్థిరీకరించే ప్రయత్నాలు చేస్తారు. మన రూపాయి మారకంవిలువ పడిపోతుంది. మన అప్పులవిలువ పెరిగిపోతుంది. వాళ్ళు వడ్డీరేట్లు పెంచుతారు. ట్రెజరీబాండ్లు అమ్ముతారు. 1200 కోట్ల డాలర్ల బాండ్లు, 800 కోట్ల డాలర్ల తనఖా పత్రాల అమ్మకాన్ని ఇంకా పెంచుతారు. మామూలుగానే అమెరికా మార్కెట్‌లో ఏ చిన్న మార్పు జరిగినా, అది భారత ఆర్థికవ్యవస్థపై చాలా ప్రభావం చూపిస్తుంటుంది. పెరిగిన సుంకాలు, పెరిగిన వడ్డీరేట్లు, పెరిగిన ట్రెజరీబాండ్ల అమ్మకంవల్ల మన ఆర్థికవ్యవస్థ తప్పనిసరిగా దెబ్బతింటుంది. ముఖ్యంగా మన బ్యాంకింగ్ వ్యవస్థ కుదేలవుతుంది. 2018 జనవరినుంచి మార్చి త్రైమాసికంలో అమెరికాలో వడ్డీరేట్లు 1.5% నుండి 2.8%కు పెరిగాయి. అంటే

అమెరికాలో పెట్టుబడులపై అధిక ఆదాయం వస్తుంది. దాంతో మన మార్కెట్‌నుండి పెట్టుబడులు ఉపసంహరించి అమెరికాకు తరలించారు. ఆ త్రైమాసికంలో 20 వేల కోట్లు ఇలా నష్టపోయాము కూడా! ఇక ముందుముందు ఈ పరిస్థితి మరింత తీవ్రం కావచ్చు. అయితే యశ్వంత్ సిన్హా (గత ఆర్థిక మంత్రి) లాంటివారు కూడా, 'అటు చైనా, ఇటు అమెరికా రెండింటికీ మన మార్కెట్ అవసరం. మన మార్కెట్ విలువగురించి మనం ప్రచారం చేసుకోవలసిన అవసరమే లేదు. నేటి జియోపాలిటిక్స్‌లో (ప్రపంచ రాజకీయాలలో) మనది విస్మరించవీలులేని మార్కెట్. కనుక ఈ స్థితిలో మనం చైనాతోను, అమెరికాతోను కూడా ఒక బలమైన స్థానంలో కూర్చుని ఒప్పందాలు చేసుకోవచ్చు. ఒకవిధంగా మన షరతులకు వాళ్ళను ఒప్పించేలా వ్యవహరించవచ్చు' అని చెబుతున్నారు. ఈ అభిప్రాయం ఒక వాస్తవమైన అంచనాలనుంచి కాక జాతీయ దురంహంకారంనుంచి వచ్చినదే. విరుచుకుపడుతున్న ఆర్థిక తిరోగమనం అనే సునామీని గుర్తించకుండా, జాతీయ ప్రయోజనాల పేరిట ప్రపంచ కల్లోలజలాలలో మనం చేపలు పట్టుకోవాలని భావించటమే.

మన వస్తువుల పెద్ద దిగుమతిదారు అమెరికా (4226 లక్షల డాలర్లు). మనకు పెద్ద ఎగుమతిదారు చైనా (5100 లక్షల డాలర్లు). ఈ ఆర్థిక వాస్తవం ఎంత అనుకూల అంశమో అంతే ప్రతికూల అంశం కూడా. మనం, మన మార్కెటు అమెరికా, చైనాలకు ఎంత అవసరమో మనకు వాళ్ళతో వాణిజ్యం అంతకన్నా ఎక్కువ అవసరం. నేటి ఆధునిక ఆర్థిక వ్యవస్థల లావాదేవీలు ఈ విధమైన పరస్పర ఆధారితస్థితిని కల్పిస్తాయి. అయితే స్వతంత్ర, జాతీయ విధానాలు అవలంభిస్తే ఆర్థికస్థితిని మనకు అనుకూలంగా మార్చుకోగలము. కానీ మన భారత పాలకవర్గాలు, ఆర్థికశక్తులు మొదటినుండి దళారి పాత్రనే నిర్వహిస్తున్నాయి. ఆయా సందర్భాలలో ఏ సామ్రాజ్యవాద శక్తి బలంగావుంటే వాళ్ళముందు మోకరిల్లటం ఒక విధానంగా అనుసరిస్తూన్నాయి. కనక ఈ సందర్భంలో వాళ్ళు ఒక స్వతంత్ర జాతీయ ఆర్థిక విధానం అనుసరిస్తారనేది కల్ల. అమెరికాతో చెట్టాపట్టాలు వేసుకుని వాణిజ్యయుద్ధంలో వారిపక్కన చేరితే మనకు నష్టమే. ఈనాడు తన స్వతంత్ర విధానాలతో బలమైన శక్తిగా, పెద్ద ఆర్థిక శక్తిగా ఎదిగిన చైనా మన ముందు కనిపిస్తున్నా, భారత పాలకులు దాన్ని గమనించటంలేదు. చైనాతో సహకార వైఖరితో అమెరికా ఆర్థిక పెత్తందారీతనాన్ని వ్యతిరేకించగల అవకాశం ఉపయోగించుకోవటం లేదు. అమెరికా రథానికే మన ఆర్థిక వ్యవస్థను కట్టివేసి, ఆ రథచక్రాల క్రింద అణచి వేస్తున్నారు. భారత్‌తో వాణిజ్యంలో చైనావారి ఎగుమతులు చాలా ఎక్కువ. దిగుమతులు తక్కువ. కనక చైనా ఎగుమతులు తగ్గించి వాటిని వేరేచోట్లకు ఎగుమతి చేయవచ్చు. అది మనకు చాల నష్టం. ఇక అమెరికాతో వ్యాపారం ఏ స్థాయికి వెళుతుందో చెప్పలేము. ప్రస్తుతం చైనా, అమెరికాకు చేస్తూన్న ఎగుమతుల వంటివి (సరకులు) మనం చేయగలమా అనేదికూడా ఒక ప్రశ్న. మన దగ్గర అధికంగా వున్న ఉత్పత్తి ఖర్చులవల్ల, సాంకేతిక పరిజ్ఞాన లేమివల్ల, నాణ్యత తక్కువగా వుండటంవల్ల చైనాలాగ వస్తువులను సరసమైన ధరలకు సప్లై చేయలేము. కనుక అమెరికా మన ఎగుమతులను ఇష్టపడకపోవచ్చు.

అమెరికా ఇండియాకు ప్రయోజనకరంగా వ్యవహరిస్తుందని ఏ మాత్రం భావించలేము. మనం ఎగుమతులను పెంచటానికి అవలంబించే సహాయకచర్యలపట్ల కూడా అమెరికాకు e‹Ü\$¿Ûáీ~. ‡ \$wŸ ãÆýËeTq*•€ <ŠÆø WTOలో అనేకసార్లు సవాలు చేసింది. లోహాల తుక్కు (స్క్రాప్) వ్యాపారం, కేవలం 100 లక్షల డాలర్లేవున్నా దాన్నికూడా ఇబ్బందులపాలు జేస్తోంది. అలా అమెరికా ఎప్పుడూ ఒక పెత్తందారు పాత్రనే నిర్వహిస్తూ ఇండియాను తన చెప్పుచేతల్లో వుంచుకునే ప్రయత్నం చేస్తోంది. ఇదే సమయంలో చైనా మనకు అనుకూలంగా, బాస్మతి రకం కాని బియ్యం, కొన్ని ఔషధాలు, ముఖ్యంగా క్యాన్సర్ మందులపై సుంకాలు తగ్గించింది. నీటి పారుదల రంగపు వివరాలు, హైడ్రో విద్యుత్తు ఉత్పత్తి వివరాలు మార్పిడి చేసుకునేందుకు వీలు కల్పించింది.

ఇదివరకు అమెరికా మార్కెట్‌లో ఏ తిరోగమనం వచ్చినా మన పాలకులకు, పరిశ్రమాధిపతులకు దడ పుట్టేది. అంతగా మన ఆర్థిక వ్యవస్థ అమెరికా రథానికి కట్టి వేయబడివుంది. అయితే గత సంవత్సరం చైనా సానుకూలపాత్రవల్ల, ఫార్మారంగంలో ఈ స్థితి తప్పిపోయింది. అమెరికాకు చేసే ఎగుమతులలో 8% ప్రతికూల వృద్ధివున్నా, ఫార్మా ఎగుమతులు మొత్తం మీద 3% పెరిగి 1725 కోట్ల డాలర్లకు చేరాయి. "చరిత్రలో ఇలా జరగటం ఇదే ప్రథమం. చైనాకు ఎగుమతులు 37% పెరిగి 20 కోట్ల డాలర్లకు చేరుకున్నాయి. ఇక అమెరికా ఆటుపోట్లకు దిగులు చెందకుండా ఫార్మా ఎగుమతులు జరుగుతాయి" అని ఫార్మెక్సిల్ జనరల్ డైరక్టరు చాల స్పష్టంగా విశదీకరించారు. 138 క్యాన్సర్ మందులలో 103 ఔషధాలను సున్నా సుంకాలతో చైనా దిగుమతి చేసుకుంటోంది. ఇండియా ఎగుమతులకు ఇది ఎంతో ప్రోత్సాహకరం. ఈ వైఖరితో చైనా మనతో వాణిజ్యం పెంచుకోవటానికి సిద్ధంగావుంది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని భారత పారిశ్రామికాధిపతులు కొందరు భావిస్తున్నారు. అయితే మరోవర్గం మన ఎగుమతులు ఎక్కువగా వెళ్ళేది అమెరికాకు కనక, చైనాలాగ మనం అమెరికాను వ్యతిరేకించలేము అని అంటున్నారు. అయితే వీరు చైనాకు కూడా పెద్ద దిగుమతిదారు అమెరికానే అనే వాస్తవాన్ని విస్మరిస్తున్నారు. ఇక భారత పాలకులు కూడా ఈ దళారి అభిప్రాయాన్నే వ్యక్తపరుస్తున్నారు. అమెరికా విచ్ఛిన్నకర పాత్రను, దానివల్ల మనకు కలుగుతున్న నష్టాన్ని కప్పిపెట్టి అమెరికా, భారత్‌ల వ్యూహాత్మక భాగస్వామ్యం గతకొద్ది రోజులుగా చాల బలంగా తయారయిందని మురిసిపోతున్నారు.

ఒక వంక ట్రంప్ అమెరికాలోవున్న భారత ఉద్యోగులను, వారి కుటుంబాలను ఇబ్బందిపేట్టే చర్యలు తీసుకుంటూ, వీసాలను కఠినతరం చేస్తూంటే, భారత్, అమెరికాల భాగ్యోదయానికి ట్రంప్ ప్రతిపాదిసున్న సూచనలు చాల అనుకూలంగా వున్నాయని తానెంతో సంతోషిస్తున్నానని 12 ఆగస్టు 2018న కూడా మోడీ ప్రకటించారు. ఉగ్రవాదాన్ని ఎదుర్కోవటం, ఇండో పసిఫిక్ ప్రాంతంలో స్థిరత్వం, అభివృద్ధి కోసం అమెరికా చర్యలతో తాను పూర్తిగా ఏకీభవిస్తూన్నానని ఆయన అంటారు. ఇదంతా ప్రపంచ గమనాన్ని, ప్రజాభిప్రాయాన్ని ప్రగతిశీల భావనల్ని ఖాతరు చేయకుండా అమెరికా సామ్రాజ్యవాద, ఆధిపత్య అహంకారానికి మన దేశాన్ని తాకట్టుపెట్టటమే

కదా! జాతీయ ప్రయోజనాలకన్నా, జాతీయవాద భావనలకన్నా సామ్రాజ్యవాద ప్రభుభక్తిని మిన్నగా ప్రదర్శించటం కాదా!

చైనాతో కలసి వస్తూన్న అనేక ఆసియా, ఆఫ్రికా దేశాలలాగ మనం చైనా జట్టున నిలబడి అమెరికాను గట్టిగా వ్యతిరేకించాలని కొందరు కోరుతున్నారు. 2018 మార్చిలో ట్రంప్ ప్రకటన తర్వాత మనం కూడా అమెరికా నుంచి వస్తూన్న 29 వస్తువులపై సుంకాలు పెంచవలసిన స్థితిని గుర్తుచేస్తూ మన ప్రమేయం లేకుండానే మనం అమెరికాను వ్యతిరేకించే శిబిరంలో వుండవలసి వస్తుందని కొందరు వ్యాపారవేత్తలు అంటున్నారు. WTOలో చురుకైన పాత్ర నిర్వహించి ఇండియావంటి దేశాలు, ఈ సంక్షోభాన్ని పరిష్కరించటంలో తోడ్పడాలని కొన్ని వ్యాపారసంస్థలు కోరుతున్నాయి.

ఈనాడు చైనా తన స్వదేశీ మార్కెట్‌ను బలోపేతం చేసుకోవటం వల్ల ఎగుమతులు తగ్గినా నిలబడగల సత్తా కలిగివుంది. అంతకుమించి చైనా పాలకులకు సామ్యవాద దృష్టి వుంది. సామ్రాజ్యవాద వ్యతిరేకత వుంది. యుద్ధ విముఖత వుంది. ప్రపంచంలో పేదదేశాల, బడుగుప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా వ్యవహరించే తెగువవుంది. ప్రపంచ ప్రజలను సమీకరించి, సామ్రాజ్యవాదాన్ని చావుదెబ్బ కొట్టగలమనే విశ్వాసం వుంది. అనవసరపు వివాదాలు నివారించే, చర్చలు సాగించి, సంక్లిష్టతలు తొలగించే సంయమనం వుంది. పరస్పర గౌరవం, సహకారం, ఇరుపక్షాలకు విజయం ప్రాతిపదికగా ఈ ప్రపంచం చేరుకోవలసిన సమిష్టి అభివృద్ధి గమ్యంపట్ల దార్శనిక దృష్టి వుంది. తన ప్రయత్నాలకు సానుకూలంగా స్పందించి సహకరించే దేశాల మద్దతువల్ల ఇనుమడించే సుదృఢమైన పూనికవుంది. OBOR (ఒక రోడ్డు, పథకం) వల్ల పెరిగిన అంతర్జాతీయ సంబంధాల బలం వుంది. ఇప్పటికే ఈ నిర్మాణాల చుట్టు 45700 లక్షల యువాన్ల వ్యాపారం జరుగుతోంది. (ఇది ప్రపంచ వాణిజ్యంలో 27.3%). మరి అమెరికాతో చైనా వాణిజ్యం విలువ 22800 లక్షల యువాన్లు మాత్రమే. కనుకనే అమెరికా బెదిరింపులకు చైనా జంకదు.

అమెరికా వ్యూహాలకు ఒకనాటి రష్యా, జపాన్‌లవలె చైనా తలవొగ్గదు. అక్కడలేని నూతన ప్రజాస్వామిక వ్యవస్థ చైనాలోవుంది. పటిష్టమైన, సంక్షోభరహితమైన రాజకీయవ్యవస్థ, నాయకత్వం వుంది. దీర్ఘకాలిక వ్యూహాల ప్రకారం నడుస్తున్న ఆర్థికవ్యవస్థ వుంది. నిర్మాణ కార్యక్రమాలలో ప్రజల భాగస్వామ్యం వుంది. ఇదంతా గతానికి భిన్నం. తాను స్వయంగా పెట్టుబడిదారీ పునరుద్ధరణలో ఉండి ఆర్థికంగా తిరోగమనంలోకి జారిపోవటంతో రష్యా, రాజకీయ అస్థిరతవల్ల జపాన్[1] అమెరికా విసిరిన వాణిజ్యయుద్ధంలో నిలువలేకపోయాయి. అమెరికా ఆడింది ఆట, పాడింది పాటగా వ్యవహరించింది. మరి ప్రస్తుతస్థితి దీనికి పూర్తిగా భిన్నం. అమెరికాకు దీటుగా, ఆధిపత్య విధానాలను ప్రతిఘటిస్తూ, అభివృద్ధి చెందుతున్న సుమారు 80–90 దేశాల సహకారంతో చైనా అమెరికాకు చుక్కలు చూపిస్తోంది. అమెరికా వాణిజ్య గర్జనలు బీరాలాపాలుగా ముగిసి పోవటం తప్పదు.

మన జాతీయ ప్రయోజనాలకు అనుకూలంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సూత్రబద్ధ వైఖరితో మనం వ్యవహరించాలి. ఈ ప్రపంచం మీద వాణిజ్యయుద్ధాన్ని రుద్దిన అమెరికా సామ్రాజ్యవాదాన్ని



[1](1989–2000 మధ్య కాలంలో జపానులో 4 పార్టీలు, 7గురు ప్రధానమంత్రులు వెంటవెంటనే మారిపోయారు.)

నిర్ద్వంద్వంగా ఖండించాలి. మనమీద ఆర్థిక పెత్తనం చేస్తున్న అగ్రరాజ్య దురహంకారాన్ని ప్రతిఘటించాలి. సహకార వైఖరితో చైనా చేస్తున్న వాణిజ్య ప్రతిపాదనలకు సానుకూలంగా ప్రతిస్పందించాలి. ప్రపంచానికి ముప్పుగా పరిణమించిన ఈ యుద్ధాన్ని సమర్థవంతంగా ఎదుర్కుంటున్న చైనాతో మనం కూడా కలిసి నడవాలి.

చైనాపై అరుణతార ప్రతికూల పరిస్థితులలో మరింత ప్రకాశవంతంగా వెలుగుతుంది. ఈ ఉజ్వలకాంతిలో మనం భాగస్వాములు కావటమా? లేక సామ్రాజ్యవాద తాబేదార్లుగా చరిత్ర చెత్తబుట్టలోకి జారిపోవడమా అనేది మన పాలకులు నిర్ణయించుకోవాలి!

*–సెప్టెంబరు, 2018, తొలి ముద్రణ*

*(– ఆగస్టు 2019 వరకు జరిగిన పరిణామాలను, గణాంకాలను ఇప్పుడు చేర్చాము).*



# 17.

# చైనా అభివృద్ధి వల్ల ఈ ప్రపంచానికేమి లాభం జరిగింది?

*(కేంబ్రిడ్జి యూనివర్సిటీ అంతర్జాతీయ, రాజకీయాల అధ్యయనశాఖలో పనిచేస్తూన్న మేధావి మార్టిన్ జాక్విస్, 2018 అక్టోబరు 16న గ్లోబల్ టైమ్స్ పత్రిక ప్రతినిధికి ఇచ్చిన ఇంటర్వ్యూ మరియు అక్టోబరు 19న చైనా డైలీ పత్రికలో ఝూన్ జువాంగ్‌లీ రాసిన వ్యాసంలోని అంశాల ఆధారంగా విస్తరించిన ఈ వ్యాసం చైనాలో ఓపెన్ అప్ విధానాలు, సంస్కరణలు ప్రవేశపెట్టిన నలభైవ వార్షికోత్సవ సందర్భంగా...)*

చైనాలో అభివృద్ధి జరిగితే ఈ ప్రపంచానికేమి ఒరుగుతుంది? ఇది పెద్ద ప్రశ్నేమీ కాదు గానీ ఈ మధ్య అమెరికా పరిశోధకులు కొందరు దీనికి ఒక అసంగతమయిన జవాబిచ్చారు. ఉజ్వలంగా చైనా వెలగిపోతుంటే దాని వల్ల జరుగుతున్నది 'ఒక ఆర్థిక దురాక్రమణ, ప్రాంతీయ రాజకీయాల విస్తరణ, అంతర్జాతీయ నియమాల విధ్వంసం' అని ఒక అసంబద్ధమయిన సమాధానం చెప్పారు. ఇదే అమెరికా అధికారిక అభిప్రాయంగా కానవొస్తోంది. అమెరికా అధ్యక్షుడు ట్రంప్ సెప్టెంబరు17న చైనా ఉనికి అమెరికా ఆర్థిక సౌష్టవానికి దీర్ఘకాలపు పెనుసవాలు అని ప్రకటించాడు. ఇక అమెరికా ఉపాధ్యక్షుడు మైక్ పెన్స్ అక్టోబర్ 4న ఒక ప్రకటనలో 'ఈ నాటి చైనా ఆర్థిక విజయాల వెనక ఆ దేశంలో అమెరికా పెట్టిన పెట్టుబడుల పాత్ర వుందనీ, గత 25 సంవత్సరాలుగా చైనాలో జరుగుతున్న పునర్నిర్మాణం అమెరికా చలవ వల్లనే' అని బీరాలు పోయాడు. అంతేకాదు పెన్స్ చైనాను ఒక ఆర్థిక దురాక్రమణదారునిగా వర్ణిస్తూ, స్వేచ్ఛ వ్యాపార నియామాలకు, స్వచ్ఛ వ్యాపార విలువలకు పొసగని అనైతిక వ్యాపార పద్ధతులు అనుసరించి చైనా అభివృద్ధి సాధించినదని ఆరోపించాడు. బీజింగ్‌లో చైనా, వారి స్వంత వస్తూత్పత్తి కేంద్రాలను ప్రోత్సహిస్తూ, ఇతర దేశాల – మరీ ముఖ్యంగా అమెరికా వారి

– పరిశ్రమలను దెబ్బతీస్తోందని, చైనా వ్యాపార పద్ధతులవల్ల అమెరికాకు చాలా నష్టం జరిగిందనీ ఆరోపించాడు. ఇకనైనా చైనా తన పద్ధతులు మార్చుకోవాలని హెచ్చరించాడు. ఈ ఆరోపణలలోని నిజానిజాలు తేల్చేముందు అసలీ ప్రకటనలు ఏ సందర్భంలో వస్తున్నాయో గమనించాలి!

1978 నుంచి చైనాలో సంస్కరణల పర్వం మొదలయ్యింది. వారు ఓపెన్‌అప్ విధానాలను అనుసరిస్తూ ప్రపంచమంతటితోనూ సజావయిన సంబంధాలు నెలకొల్పుకుని తమదైన పద్ధతిలో సోషలిస్టు ఆర్థిక నిర్మాణం కొనసాగిస్తూన్నారు. ఈ నూతన విధానాల ఆరంభానికి, ఈ సంవత్సరం 40వ వార్షికోత్సవం జరుపుకుంటున్నారు. 1949 నుంచి, కా॥మావో నాయకత్వంలో ఏర్పడిన జనచైనా సామ్యవాద వ్యవస్థ నిర్మాణానికి కంకణం కట్టుకొని ముందుకు సాగుతోంది. అర్ధవలస, అర్థ భూస్వామ్య దేశాలలో అనుసరించవలసిన 'ప్రజాయుద్ధ పంథా' అనే విప్లవ మార్గాన్ని ఈ ప్రపంచానికి అందించింది. మార్క్సిజం – లెనినిజంలకు మావో అలోచనా విధానాన్ని జతచేసింది. నానాటికీ సంక్లిష్టమవుతూ, శరవేగంగా మారిపోతున్న ప్రపంచ పరిస్థితులను అవగాహన చేసుకుని మానవాళి అభివృద్ధికి తోడ్పడే సిద్ధాంత దార్శనికతను అందించింది.

మహామేధావి డెంగ్ సియావో పింగ్ నాయకత్వంలో తమదేశ సాంఘిక, చారిత్రక, సాంస్కృతిక నేపథ్యాలను పరిగణిస్తూ, 1949 నుంచీ అనుసరిస్తున్న సోషలిస్టు నిర్మాణ పథంలో తగు మార్పులు చేసుకొని 1978లో నూతన విధానాలకు అంకురార్పణ చేసింది. 'సరియైన రాజకీయ నాయకత్వం అంటే ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి ప్రజల భౌతిక సంపత్తి పెరుగుదలకు సాంస్కృతిక జీవనంలో పురోభివృద్ధికి దారితీయాలి. ఒక సోషలిస్టు దేశంలో అభివృద్ధి వేగం, పెట్టుబడిదారీ దేశంలోకంటే సుధీర్ఘకాలం వెనకబడివుంటే సామ్యవాదవ్యవస్థ ఆధిక్యంగురించి మనం ఏం చెప్పగలుగుతాం?' అని ప్రశ్నించి కామ్రేడ్ డెంగ్ నూతన విధానాల ఆవశ్యకతను ఎత్తిచూపారు. కమ్యూనిస్టు సంప్రదాయాలలో ఒక పెద్ద మార్పుగా, ఒక గొప్ప మౌలిక ఆలోచనా విధానానికి పాదుగా కా॥డెంగ్ ప్రతిపాదనలు వచ్చాయి. ఆ ఆలోచనలు పెట్టుబడిదారీ పునరుద్ధరణ అనీ, సోషలిజానికి తిలోదకాలు అని విమర్శలు ముంచెత్తాయి. సోషలిజం అంటే ప్రభుత్వ యాజమాన్యమనీ, ప్రభుత్వ ప్రణాళికలే అనీ, అవి సోషలిజానికి పర్యాయపదాలుగా అధిక ప్రచారంలో వున్నాయి. సోషలిజం అనేది ఒక ఆర్థిక సామాజిక వ్యవస్థ. ఉత్పత్తి శక్తులపై సామాజిక యాజమాన్యం వుంటుంది. ఈ యాజమాన్యం సంయుక్త, సహకార రూపాలలో ప్రజల చేతుల్లో వుంటుంది. రాజ్య వ్యవహారాల నిర్వహణకూడా శ్రామికవర్గ నాయకత్వం చేతిలో వుంటుంది. ఉత్పత్తి, పంపిణి, మార్పిడి మొత్తం సమాజపరమై వుంటుంది. అది ప్రభుత్వ యాజమాన్య రూపంలో వుంటుంది. అయితే సోషలిజంలో రాజ్య ప్రణాళికలను, వాణిజ్య మార్కెట్లను అనుసంధానించ వలసివుంది అని కామ్రేడ్ డెంగ్ ప్రతిపాదించారు. సంపద సృష్టికీ, సంపద పంపిణీకి, ఉత్పత్తి శక్తుల పురోగతికివున్న తార్కిక

సంబంధాన్ని, వర్గ చైతన్యాన్ని సృజనాత్మకంగా అన్వయించి కా॥మేడ్ డెంగ్ దేశాన్ని అభివృద్ధి పట్టాలపైన నడిపించారు. చైనా తనను తాను ఈ మొత్తం ప్రపంచంలో ఒక భాగంగా చూసుకోవాలనీ ప్రపంచంతో సంబంధం లేకుండా విడిగా వుండిపోవటం సాధ్యంకాదనీ ఎత్తిచూపారు. ఈ ప్రపంచంలో సోషలిస్టు శక్తులతోపాటు కాపిటలిస్టు శక్తులు కూడా చుట్టూ కమ్ముకుని వున్నాయని గమనించమన్నారు. సోషలిస్టు శక్తులు, ఈ పెట్టుబడిదారీ ప్రపంచంలోనే, వారి సరసననే నిలబడి వుండవలసిన వాస్తవస్థితిని గుర్తించారు. “వారిపక్కనే వుండాలి! వారితోనే పోటీపడాలి! వారి నుంచి కూడా నేర్చుకోవాలి! అలా నేర్చుకుంటూనే వారిని అధిగమించాలి! అనూహ్య విజయాలు సాధించాలి” అని దిశానిర్దేశం చేశారు.

“ప్రపంచం ప్రతిరోజూ మారిపోతున్నది. నిరంతరం కొత్త అంశాలు వుద్భవిస్తున్నాయి. మనం తలుపులకు తాళాలు వేసుకుని కూర్చోలేము. మన బుర్రలు వాడటాన్ని తిరస్కరిస్తూ ఎప్పటికీ వెనుకబడి వుండలేము.” *(కా॥డెంగ్ సెలెక్టెడ్ వర్క్స్, 1984 ఎడిషన్, పేజి 143)* అని చైనాలో సంస్కరణలు, ఓపెన్ విధానాలు అవలంబించారు. అవి చైనాను ఎంతో మార్చివేశాయి. అభివృద్ధిపథంలో పరుగులు తీయించాయి.

ఇది ఒక విధంగా మేధోపరమయిన విప్లవంగా చెప్పుకోవాలి! దీనికి చాలా లోతయిన సామాజిక పరిశోధన, అనేక కార్యక్రమాల సమీక్ష అవసరమయ్యాయి. ఒక నూతన ఆవిష్కరణ వంటి సరికొత్త ఆలోచన, దానిని ఆచరించే బలమయిన పట్టుదల అవసరమయ్యాయి. మిత్రులనుంచి సంశయాలు, శత్రువు నుంచి దాడులు, సమన్వయం చేసుకుంటూ కృతనిశ్చయంతో తమ సైద్ధాంతిక చైతన్యంపట్ల అచంచల విశ్వాసంతో ముందుకు సాగిపోయారు. జ్వాజ్వల్యమానమైన భవిష్యభివృద్ధికి 1978 ఒక నిప్పురవ్వలా భాసించింది. అందుకే “20వ శతాబ్దపు ముఖ్యమైన సంవత్సరాలలో అది ఒక చెరగని గుర్తు” అని అనేకమంది సామాజిక వేత్తలు ప్రస్తుతిస్తున్నారు.

చైనా అభివృద్ధి 1990ల నుండే ప్రపంచాన్ని కూడా మార్చివేయసాగింది. ఇక ప్రపంచం గతంలో వున్నదానికి భిన్నంగా ఆలోచించవలసి వచ్చింది. ఇది చైనా ప్రభావం అని గుర్తించక తప్పదు. ప్రపంచ పరిణామాలకు ఒక ముఖ్య చోదకశక్తిగా, అభివృద్ధి ఇంజనుగా చైనా పాత్ర గణనీయంగా పెరిగిపోతున్నది. 80కోట్ల మంది ప్రజలను పేదరికం కోరల నుండి విముక్తి చేసి, 140 కోట్ల మంది జనాభాగల పెద్ద సమాజాన్ని ఒక స్థాయి సౌకర్యవంతమయిన జీవనస్థాయికి తీసుకు వెళ్ళింది. ఈ 40 సంవత్సరాలలో ప్రపంచంలో రెండవ పెద్ద ఆర్థిక శక్తిగా ఎదిగింది. కొన్ని ప్రాతిపదికలపై చైనాదే మొదటి స్థానంగా కూడా వుంది. దేశీయంగా పేదరికం, అవిద్య, అనారోగ్యం, నిరుద్యోగం వంటి బాధలను తొలగించి ప్రజల అభిమానానికి దగ్గరగా జరిగింది. మార్కెట్ శక్తులను దేశాభివృద్ధికి మార్గంగా మలచటంలో చైనా విజయం సాధించింది. 21వ శతబ్దపు అవసరాలను ముందుగా పసికట్టి, రూపమిచ్చిన ఆలోచనగా, సగం ప్రపంచాన్ని తన వైపు సమీకరించుకున్న సదవగాహనగా డెంగ్ విధానాలు నిరూపించుకున్నాయి.

చైనా ఆలోచిస్తోంది. ప్రయోగాలు చేస్తోంది. నిరంతరం నేర్చుకుంటోంది. తనను తాను సమయోచితంగా మార్చుకుంటోంది. ప్రపంచ పరిస్థితుల పెను ఉరవడిలో తాను నిలదొక్కుకుంటూ, సోషలిస్టు నిర్మాణంలో మార్గదర్శిగా నిలుస్తోంది. అసలు సోషలిజం అంటే ఏమిటో సరిగా అర్థం చేసుకోవాలి. ఈ పదాన్ని రకరకాల ఉద్దేశ్యాలతో ప్రయోగిస్తుంటారు. ఊహాజనిత సోషలిజంనుంచి శాస్త్రీయ సోషలిజం వరకు అనేక అవగాహనలు వున్నాయి. మనదేశంలో కూడా పాలకపార్టీలనుండి విప్లవకారుల వరకు సోషలిజమే లక్ష్యమని చెబుతుంటారు. ప్రపంచవ్యాప్తంగా కూడా ఇదే పరిస్థితి. మరి చైనా చెబుతున్న సోషలిజం ఏమిటి? అది శాస్త్రీయ సోషలిజం. చారిత్రక ఆర్థిక ఘటనల క్రమాన్ని పరిశీలించి రెండు విరుద్ధప్రయోజనాలు గల వర్గాల (శ్రామిక-బూర్జువా) సంఘర్షణ ఫలించి ఉద్భవించే అనివార్యమైన ఫలితం ఇది. వర్గ దోపిడికి తావులేని ఆర్థిక వ్యవస్థను నిర్మించటమే సోషలిజం. శాస్త్రీయ సోషలిజం అంటే శ్రామికవర్గ విప్లవాల సైద్ధాంతిక ప్రకటన. శ్రామికవర్గం రాజకీయ అధికారం చేబట్టి ఉత్పత్తి సాధనాల యాజమాన్యాన్ని రాజ్యానికి అధీనం చేస్తుంది. పెట్టుబడిదారీ వర్గాన్ని కూలదోసి, కమ్యూనిజాన్ని స్థాపించే పరిణామక్రమంలోని వొక దశ. సోషలిజం అంటే పేదరికాన్ని సమానంగా పంచుకోవటం కాదనీ, సంపదను సృష్టించటం, శ్రమకు తగ్గ ఫలితమన్న సూత్రం ఆధారంగా సక్రమ పంపిణీ చేయటమనీ; ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేయటం, వాటిని విముక్తి చేయటం అభివృద్ధికి ప్రాతిపదిక అని చైనా తేల్చి చెప్పింది. సోషలిస్టు పథంలో గమ్యాన్ని ఎలా చేరుకోవాలో తెలిపే మార్గసూచికలు కొన్నే వున్నాయి. సిద్ధంగా కాంక్రీటు రహదారి ఒకటి నిర్ధారించబడిలేదు. "ప్రవాహంలోకి దిగి కాళ్ళ కింద రాళ్ళను తడుముకుంటూ ఒక్కో అడుగు ముందుకు సాగుతూ నదిని దాటడమే" కర్తవ్యం. ఏమాత్రం అజాగ్రత్త వహించినా ఆ ప్రవాహంలో కొట్టుకుపోవడం ఖాయం. అందుకే చైనా ఒక బలమైన (సామ్యవాద) సిద్ధాంత భూమికను అభివృద్ధి పరిచింది. సోషలిజం అంటే ఏమిటో నిర్వచించింది. కమ్యూనిస్టు ఉద్యమంలోని తప్పుడు అవగాహనలను సరిదిద్దింది. సోషలిస్టు సిద్ధాంతాన్ని అభివృద్ధి చేసింది. దాన్ని సాధించటానికి దశలవారీగా పటిష్టమైన ఆచరణను జోడించి ప్రయాణం సాగిస్తోంది. గణనీయమైన విజయాలు సాధిస్తోంది. అందువల్ల ప్రతిదేశము చైనాను, చైనా అనుభవాలను శ్రద్ధగా అధ్యయనం చేయవలసి వుంది. అభివృద్ధి సాధనలో చైనా అనుభవం ఒక ముఖ్యమైన, ఆసక్తికరమయిన ఉదాహరణ.

భూస్వామ్యపు విషకోరల నుండి గ్రామాలను పట్టణాలను, సామ్రాజ్యవాద ధృతరాష్ట్ర కౌగిలినుండి దేశాన్ని విముక్తిచేసి, జనస్వామ్య చింతనతో శ్రామిక శ్రేయోరాజ్యంగా సోషలిజం ప్రధమదశ నిర్మాణంలో చైనా చేస్తున్న ప్రయాణం ఒక స్ఫూర్తిదాయక పాఠం. అభివృద్ధి చెందుతున్న దేశాలు అనేకం ఈ విషయాన్ని అర్థం చేసుకున్నాయి. చైనాతో స్నేహంగా నిలుస్తున్నాయి. అయితే కొన్ని పాశ్చాత్య (పెట్టుబడిదారీ) దేశాలు, పాక్షిక దృష్టితోను, పూర్తి తిరస్కార ధోరణితోను చైనా పాత్రను తృణీకరిస్తున్నాయి. నిజానికి 1860 నుండి 1914ల

మధ్య అమెరికాలో వచ్చిన అనేక మార్పుల* కన్నా ప్రాముఖ్యతగల మార్పులు 1978 నుంచి చైనాలో సంభవించాయి. కానీ అమెరికా అగ్రరాజ్యం, దాని అనుకూల ప్రపంచం ఈ చారిత్రక ప్రాధాన్యతను అర్థం చేసుకోకుండా అజ్ఞానంతో, అహంకారంతో కళ్ళు మూసుకుంటోంది. వీలయిన మేరకు చైనాను అప్రతిష్టపాలు చేయాలనీ, దాని ప్రభావం తగ్గించాలనీ ప్రయత్నిస్తోంది. అందుకే అమెరికా పాలకులు అనేక అవాకులు చవాకులు ప్రచారం చేస్తున్నారు. అయితే వాస్తవ చిత్రం దీనికి భిన్నంగావుంది.

**1. చైనాది వ్యాపార దురాక్రమణ కాదు:** ఎక్కడయినా వ్యాపారం అనేది ఇరుపక్షాలు పరస్పరం అంగీకరిస్తేనే సాగేది. అమెరికా నుంచి చైనా ఏదీ బలవంతంగా కొనలేదు, అలాగే బలవంతంగా అమెరికాకు ఏదీ అమ్మలేదు. అమెరికా చైనాల మధ్య వ్యాపారంలో చైనా ఎక్కువ దిగమతులు చేసుకోవటంలేదని అమెరికా ఆరోపణ. అయితే అమెరికా గణాంకాల ప్రకారమే 2017లో అమెరికా చైనాకు 12వేల 987 కోట్ల డాలర్ల విలువగల ఎగుమతులు చేసింది. 2001లో జరిగిన ఎగుమతుల కన్నా ఇది 511% అధికం ఈ కాలవ్యవధిలో అమెరికా ఇతర దేశాలకు చేసిన ఎగుమతులలో వృద్ధి 112% మాత్రమే. నిజానికి అమెరికా వ్యాపారస్తులు చైనాకు ఎగుమతులు పెంచాలనుకున్నా, ఫెడరల్ ప్రభుత్వం అందుకు అంగీకరించడంలేదు. కఠిన తరమయిన నిబంధనలు విధించి ఎగుమతులను నిరుత్సాహపరుస్తోంది. బ్రెజిల్‌వంటి దేశాలకు వర్తిస్తున్న నియమాలను అమలుచేస్తే చైనాతో వ్యాపారలోటు 24% తగ్గుతుందనీ, అదే ఫ్రాన్సువంటి దేశాలతో అమలు చేస్తూన్న ఎగుమతి నిబంధనలు చైనాకు అనువర్తిస్తే ఆ లోటు 34% తగ్గేదని అమెరికన్ పరిశీలకులు చెబుతున్నారు. అంటే అమెరికా ప్రభుత్వానికే, చైనాకు ఎగుమతులు చేయటం ఇష్టంలేదేమో అని భావించవలసి వస్తోంది.

ఉన్నత సాంకేతిక విలువలుగల వస్తువులు చైనాకు ఎగుమతి చేయకుండా అమెరికా ఎంతగానో ప్రయత్నించటం జగమెరిగిన సత్యం. ఇక సర్వీసు సెక్టారులో వ్యాపారం 2007లో 1314 కోట్ల డాలర్లుగా వున్నది, 2017లో 5763 కోట్లకు పెరిగింది. గత దశాబ్దిలో అమెరికా తన ప్రొసెసింగ్, అసెంబ్లీ యూనిట్లను అనేక ఇతర దేశాలకు తరలించింది. డిజైనింగ్, మార్కెటింగ్‌ను మాత్రం తన చేతుల్లోనే వుంచుకుంది. ఈ విధానంలో భాగంగానే కొన్ని యూనిట్లు చైనాకు కూడా వచ్చాయి. ప్రపంచీకరణ విధానంలో భాగంగా ఇది జరిగింది. ఈ మార్పుల లాభనష్టాలను కూడా ఆర్థిక ప్రపంచీకరణలో భాగంగానే గుర్తించాలి. అనేక మల్టీ నేషనల్ కంపెనీలు చైనాలో ఉత్పత్తి చేయటం, చైనానుంచి వాటిని ఎగుమతిచేయటం

---

* (1815 నుండి 1860 వరకు అమెరికాలో అత్యంత వేగంగా ఆర్థికాభివృద్ధి జరిగింది. రవాణా సదుపాయం పారిశ్రామికీకరణ, పట్టణీకరణ శీఘ్రంగా పెరిగిపోయాయి. నల్లప్రజల బానిసత్వం సమస్యపై ఉత్తరాది, దక్షిణాది అమెరికా రాష్ట్రాల మధ్య తీవ్ర అంతర్యుద్ధం జరిగింది. 1914 మొదటి ప్రపంచయుద్ధం వచ్చేవరకు దీని ప్రకంపనలు కనిపించాయి. దీన్ని ప్రపంచ చరిత్రలో గొప్ప అధ్యాయంగా వర్ణిస్తారు. అయితే చైనాలో వచ్చిన మార్పులు అంతకంటే ప్రాముఖ్యం కలిగినవి. పాశ్చాత్య ప్రపంచం దీని ప్రాముఖ్యతను గుర్తించటం లేదు.)

జరుగుతోంది. ఈ ప్రక్రియలో అత్యధికలాభం ఆయా మల్టీ నేషనల్ కంపెనీలకు, స్వల్పభాగమే చైనాకు అందుతున్నది. అయితే చాలా శీఘ్రంగా జరుగుతున్న అభివృద్ధివల్ల 2013 నుండీ ప్రపంచ ఆర్థిక అభివృద్ధిలో దాదాపు 30% చైనానుంచి వస్తోంది. ఇది అమెరికా కంటే రెట్టింపు అని తెలుసుకోవాలి!

చైనా అభివృద్ధివల్ల ప్రపంచానికి ఒక పెద్ద మార్కెట్ లభించింది. 2007 నుండి 2017 వరకు చైనా దిగుమతులు ఏటా 13.5% పెరుగుతూ వచ్చాయి. ప్రపంచ సరాసరి దిగుమతి రేటు కంటే ఇది రెండురెట్లు ఎక్కువ. ప్రపంచవ్యాప్తంగా సర్వీసు రంగాలలో దిగుమతులు సరాసరిన 8.5% - 10% పెరిగాయి. అదే చైనాలో ఐతే 16% పెరిగాయి. మరి అమెరికాలో 0.5% పాయింట్లు దిగజారి పోయాయి.

ప్రపంచవ్యాప్తంగా ఉద్యోగాల కల్పనలో చైనా ముందంజలో వుంది. ఇటీవల దాదాపు 80 ఆర్థిక, వ్యాపార, సహకార మండళ్ళను రోడ్ & బెల్ట్ మార్గంలో ఏర్పాటు చేసింది చైనా! దాంతో ఆ దేశాల స్థానికులకు 2,44,000 ఉద్యోగాలు దొరికాయి. “2005-2016 మధ్య ఆఫ్రికాలో చైనా 1,30,000 ఉద్యోగాలు కల్పించింది. అమెరికా కల్పించిన ఉద్యోగాలకన్నా ఇది మూడురెట్లు ఎక్కువ” అని ఎర్నెస్ట్ & యంగ్ సంస్థ సర్వే చెబుతోంది. ‘అంతర్జాతీయ కార్మిక సంస్థ’ ప్రకారం చైనా చేసిన వ్యాపారం, పెట్టుబడులు, మౌలిక వసతుల కల్పనవల్ల 1990 నుంచి 2016 వరకు లాటిన్ అమెరికా దేశాలలో కనీసం 18 లక్షల ఉద్యోగాలు సృష్టించబడ్డాయి. ఈ విధంగా తన దేశంలోనేకాదు వివిధ ఇతర దేశాలలో సైతం నిరుద్యోగ భారాన్ని తగ్గించగలుగుతుంది చైనా. అయితే, అమెరికా వారి ఉద్యోగాలను చైనా కొల్లగొడుతోందని కొంతమంది దుష్ప్రచారం చేస్తూంటారు. కానీ యు.ఎస్.-చైనా బిజినెస్ కౌన్సిల్ 2017లో ఒక ప్రకటన చేసింది. ఇరుదేశాల మధ్య వ్యాపారం జరగడంవల్ల అమెరికాలో సుమారు 26 లక్షల ఉద్యోగాలు నిలదొక్కుకున్నాయని అది చెప్పింది. 1979 నుంచీ చూస్తే అమెరికాలో 70 లక్షల మేరకు ఫ్యాక్టరీ ఉద్యోగాలు తగ్గిపోతూవచ్చాయి. ఇలా కోల్పోయిన ఉద్యోగాల్లో 88% రోబోట్లను వినియోగిస్తున్నారు. ఉత్పత్తి విధానంలో, సాంకేతికతలో, యంత్ర సామాగ్రిలో వారు తెచ్చిన మార్పులవల్ల మనుషులు పాల్గొనే అవసరంలేని పద్ధతులు అమలులోకి వచ్చాయి. అమెరికాలో నిరుద్యోగానికి అది కారణమని బాల్‌స్టేట్ యూనివర్సిటీ సెంటరువారు 2015లో తేల్చిచెప్పారు. అయినా చైనాను ఆడిపోసుకోవటం మానరు కొందరు అమెరికా పరిశీలకులు. ఫ్యాక్టరీలు, పరిశ్రమలు ఎక్కడ పెట్టాలనేది ఆయా అధిపతులు తమ లాభాల దృష్ట్యా నిర్ణయించుకుంటారు తప్ప అందులో చైనా ప్రమేయం ఏమి వుంటుంది? ఆర్థికాభివృద్ధిలో చైనాది ఒక దురాక్రమణ ధోరణికాదు, అది అభివృద్ధికి దోహదకారి మాత్రమే.

ఐక్యరాజ్య సమితి ప్రకటించిన మిలీనియం లక్ష్యాలను సాధించటంలోను, 2030కి సాధించవలసిన నిలకడైన అభివృద్ధి గమ్యాలను చేరుకోవటంలోనూ అనుసరించవలసిన విధానాలకు చైనా తోడ్పడుతోంది. అభివృద్ధి, స్వేచ్ఛ అనే ఇరులక్ష్యాలను సాధించదలచిన అనేక

దేశాలకు, 88% ప్రపంచ జనాభా నివసిస్తున్న అభివృద్ధి చెందుతున్న దేశాలకు, ఒక ప్రత్యమ్నాయ అభివృద్ధిమార్గాన్ని చూపించింది. కెన్యాలోని పాలకపార్టీ జనరల్ సెక్రటరీ రాఫెల్ తుజు, "చైనా విజయాలు మానవ చరిత్రలోనే సాటిలేని అనుపమానమైన ఉదాహరణ. అవి ఆఫ్రికా ప్రజల ముందువున్న చీకటి సొరంగాల ఆవలితీరాన్ని చూపించే ఆశారేఖలు" అని వర్ణించాడు.

ఈ విధానాల ఫలితమే చైనా అభివృద్ధి. చైనా అసమాన విజయాలు కేవలం అమెరికా పెట్టుబడుల ఫలితం కావు. అమెరికా పెట్టుబడులవల్ల చైనా లాభపడినట్లుగానే చైనాతో వ్యాపారంవల్ల అమెరికా కూడా లాభపడిందనేది వాస్తవం. చైనాలోని మొత్తం విదేశీ పెట్టుబడులను 1980ల నుంచి లెక్క చూస్తే అమెరికా పెట్టుబడులు 10% మించవు. 140 కోట్ల చైనా ప్రజల అకుంఠిత దీక్ష, అంకితభావం, కఠోరశ్రమ, చైనా కమ్యూనిష్టు పార్టీ నాయకత్వం, దాని సిద్ధాంత గరిమ, వారి దార్శనికతవల్ల సాధించిన అద్భుత విజయం నేటి చైనా.

**2. చైనాది విస్తరణ వాదం కాదు, శాంతి పథం:** చైనా రుణదౌత్యం నిర్వహిస్తోందని ఇతర దేశాలను అప్పులఊబిలోకి లాగి తన ప్రభావప్రాంతాలను పెంచుకుంటోందని అమెరికా పదేపదే చైనాను నిందిస్తూవుంటుంది. దీనికి ఒక ఉదహరణగా శ్రీలంకను చూపిస్తుంది. మరి 2018 అక్టోబరులోనే చైనాలోవున్న శ్రీలంక రాయబారి కరుణసేన, "చైనా శ్రీలంకకు ఇచ్చిన రుణాలను, మమ్మల్ని అప్పులవలలో ఇరికించటానికేనని ఎవరయినా భావిస్తే నేను అంగీకరించను. చైనా మద్దతుతో అభివృద్ధి చెందుతున్న హాంబన్‌తోట రేవు రక్షణ, పూర్తిగా శ్రీలంక రక్షణదళాల చేతుల్లోనే వుంద"ని ప్రకటించాడు.

సాధారణంగా అమెరికా, ఒక దేశాన్ని, తమ వ్యూహాలలో భాగస్వామిగానో లేకపోతే శతృవుగానో అంచనావేస్తుంది. వారి దృష్టిలో ఇతరదేశాలకు మరోవైఖరి వుండే అవకాశమే లేదు. ప్రభుత్వాలలో కలిగే అస్థిరత, అనిశ్చితి సమాజశాంతికి, ప్రపంచశాంతికి భంగంకలిగించే అవకాశం వుంది. అమెరికా ఇలాంటి అనిశ్చితిని ప్రపంచదేశాల మీద రుద్దుతూ వుంటుంది. ఆయా ప్రభుత్వాలను అస్థిర పరుస్తూ వుంటుంది.

చైనా, ఇతర దేశాల అంతర్గత వ్యవహారాలలోను, వారి ప్రభుత్వాల ఎన్నిక, మనుగడలలోను జోక్యం చేసుకోదు. ఒక వంకవున్న అమెరికా బెదిరింపుల ధోరణిని, మరోవంక వున్న చైనా శాంతి పరిరక్షణ కృషిని మనం వేరు చేసి చూడగలగాలి. స్థిరత్వాన్ని నెలకొల్పే ప్రయత్నాలను, సంఘర్షణలు రగిలించే ప్రవర్తనను విడిగా గుర్తించటం కూడా అవసరం. చైనా చొరవవల్ల ఏర్పడుతున్న రోడ్ & బెల్ట్, చైనా వారి ప్రయోజనం కోసమే అనీ, ఇది చైనా అధికార విస్తరణవాదమే అనీ అమెరికాబృందం నిత్యం ఆడిపోసుకుంటూ వుంటుంది. అయితే రోడ్ & బెల్ట్ పథకం (బిఆర్ఐ) 103 దేశాలు, అంతర్జాతీయ సంస్థలు

అంగీకరించి, పాల్గొంటున్న ఒక విశ్వపథకంగా రూపుదిద్దుకొంది. వీరి మధ్య 118 ఒప్పందాలు జరిగాయి. ఈ పథకము, దాని లక్ష్యము అనేక అంతర్జాతీయ అవగాహన పత్రాలలో ఉదహరించబడుతోంది.

ఐక్యరాజ్య సమితి, జి-20, ఆసియా పసిఫిక్ ఆర్థిక సహకార సంస్థ, షాంఘై సహకార సంస్థ (యస్‌సిఓ) వంటి బృహత్ సంస్థలు ఈ 'రోడ్డు, బెల్ట్' పథకాన్ని ఒక ఆచరణాత్మక మార్గదర్శనంగా స్వీకరించాయి. శాంతియుత సహకారం, పరస్పర అవగాహన, పరస్పర ప్రయోజనం, సమీకృత అభివృద్ధి, పారదర్శకత, ఇరుపక్షాలకు లాభం, ఉమ్మడి భాగస్వామ్యం గల భవిష్యత్తు అనే సప్తస్వరాలతో, చైనాతో గొంతుకలిపి, అభివృద్ధిచెందుతున్న దేశాలు ఆలపిస్తున్న బృందగానం అది. ఈ గానంలో కొన్ని అభివృద్ధి చెందిన దేశాలుకూడా తమ గొంతు కలుపుతున్నాయి. భౌగోళిక, ఆర్థిక విస్తరణవాదానికి పూర్తిగా భిన్నమైన మౌలిక అవగాహనగల ప్రపంచ దృక్పథం అది. చైనా తన స్వంత అభివృద్ధి ద్వారా సాధించిన స్థాయి, సంపదలను ప్రపంచంలో అభివృద్ధి సాధనకు, శాంతిస్థాపనకు, శాంతి పరిరక్షణకు వినియోగించి మానవాభివృద్ధికి తోడ్పడుతున్నది.

చైనా, ఐరాస సెక్యూరిటీ కౌన్సిల్ శాశ్వత సభ్యురాలిగా తన స్థానాన్ని ప్రపంచశాంతికి వినియోగిస్తున్నది. 2017 తొలిభాగంవరకే 24 ఐరాస శాంతి పరిరక్షక దళాలలో దాదాపు 35000 మంది చైనా సైనికులు పాల్గొన్నారు. ప్రపంచ దేశాల మధ్య సంబంధాలకు పంచశీల సూత్రాలు, శాంతియుత సహజీవనానికి కావలసిన సూత్రాలు ప్రభోధిస్తూ, వాటికి తాను కట్టుబడి వుంటోంది. తాను ఆధిపత్యం ప్రదర్శించక పోవటమే కాదు. ఆధిపత్య ధోరణులను ఎదిరిస్తున్నది. అలా వ్యతిరేకిస్తున్న ఇతర దేశాలకు మద్దతు ప్రకటిస్తున్నది. యథాశక్తి తన నైతిక పాదార్థిక సహాయం అందిస్తున్నది. తనకు కావలసిన వనరులకోసమో, ఇంధనం (ఆయిల్) కోసమో, చైనా ఏనాడూ యుద్ధజ్వాలలు రగిలించలేదు. ఇతర దేశాలను పరాజితులుగానో, ప్రపంచానికి కీడుగానో, పాయిఖానాలనో, దుర్మార్గులనో దుయ్యబట్ట లేదు. ఇలాంటి పొగరుబోతు వాచాలత, దేశాలమధ్య సత్సంబంధాలకు పెద్ద అడ్డంకిగా పరిణమిస్తోందనే అవగాహనతో, చిన్న దేశాలను కూడా చైనా మర్యాదగా, హుందాగా సమానస్థాయిలో పరిగణిస్తుంది. మరి యుద్ధోన్మాదులు ఈ పదాలను దేశాలకు యధేచ్ఛగా అంటకట్టి ఆ నెపంతో వారి మీద యుద్ధాలు రుద్దుతున్నారు.

ప్రపంచ షరీఫ్‌గా తనను భావించుకునే అమెరికా ఐరాస శాంతిదళాలలో నిజానికి చురుకుగా పాల్గొనాలి! శాంతి పరిరక్షణ తన బాధ్యతగా గుర్తించాలి! కానీ తద్భిన్నంగా రెండవ ప్రపంచ యుద్ధనంతరం అమెరికా శాంతి నెలకొల్పటం పేరిట దాదాపు 35 ప్రాంతీయ యుద్ధాలను ఆరంభించింది, లేదా పాల్గొన్నది. దాని క్షిపణులు, ఆయుధశక్తి ప్రపంచానికి తీవనష్టం కలిగించాయి. అమెరికా ఆరంభించిన ఇరాక్ యుద్ధం (2003-12)వల్ల 6,55,000 ఇరాక్ ప్రజలు, 2,765 అమెరికా సైనికులు చనిపోయారు. 20,000 అమెరికా

సైనికులు గాయపడి వికలాంగులుగా, పనికిరాని వారిగా మిగిలిపోయారు. సిరియా వివాదంలో అమెరికా జోక్యం వల్ల 2018కి 56 లక్షలమంది సిరియన్లు శరణార్థులుగా మారిపోయారని ఐరాస గణాంకాలు చెబుతున్నాయి. 2001లో మొదలెట్టిన అమెరికా, ఆఫ్ఘనిస్తాన్ యుద్ధం వల్ల 3,00,000 మంది మరణించటమో, తీవ్రంగా గాయపడటమో జరిగింది. ఈ సంఘర్షణ ఇంకా రక్తమోడుతున్న గాయంగానే వున్నది. ఈ వాస్తవాలన్నీ ఎవరు విస్తరణవాదులో తేటతెల్లం చేయటం లేదూ?

దేశీయంగా చూస్తే చైనా తన ప్రజలకు అత్యంత శ్రేష్టమయిన భద్రతకల్పిస్తున్న బలమైన ఆర్థికశక్తులలో వొకటిగా నిలుస్తోంది. 2018లో జరిపిన సర్వేలో 'గ్లోబల్ లా అండ్ ఆర్డరు రిపోర్టు' ప్రకారం పర్యాటకులకు అత్యంత భద్రత గల ప్రదేశంగా చైనా గుర్తించబడింది. అదే అమెరికాలో ఒక 2017లోనే తుపాకులు ప్రయోగించి చేసిన నేరాలు 61,813 నమోదయ్యాయి. అందులో 15,637 మంది హతులయ్యారు. 2014 నుండి చూస్తే ఈ తుపాకి కాల్పులు ఏటా 5% పెరుగుతున్నాయి. అమెరికాలో ప్రతిరోజు కనీసం 170 మంది తుపాకి కాల్పులకు గురయి గాయపడటమో, మరణించడమో జరుగుతోంది. పౌరుల రక్షణ విషయంలో అమెరికా ఎంత అధమస్థాయిలో వుందో తెలుస్తోంది గదా! అందుకే అంతర్గతంగానూ, అంతర్జాతీయంగాను శాంతికి కట్టుబడి వుంది చైనా అనీ, శాంతి పరిరక్షణలో ఐరాస దళాలలో అత్యంత ముఖ్యమైన, ప్రధాన శక్తిగా చైనా వ్యవహరిస్తోందనీ అంతర్జాతీయ సమాజం కొనియాడుతోంది.

ఈనాడు ప్రపంచశాంతితో అనేక అంశాలు ముడిపడివున్నాయి. ముఖ్యంగా ఆయాదేశాల ఆర్థిక సౌష్టవం, ఆయా వ్యవస్థల భద్రత. దేశాల మధ్య వ్యవహారాలలో ఆటంకాలు ఎంత తక్కువవుంటే, వాణిజ్యంలో వాటిమధ్య సహకారం అంత ఎక్కువగా వుంటుంది. అది ఆర్థిక స్థిరత్వాన్ని సుగమం చేస్తుంది. ప్రపంచ వాణిజ్యంలో చైనా వివాదాలకు పూనుకోవటం లేదు. ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఓ) నియమాలను కచ్చితంగా పాటిస్తోంది. ఆ సంస్థకు తాను ఇచ్చిన వాగ్దానాలకు కట్టుబడి వుంటోంది. అభివృద్ధి చెందుతున్న దేశాలతో, ఇరుపక్షాలకు ఉపయోగపడే రీతిలో తన వ్యాపారం నిర్వహించుకుంటోంది. సభ్య దేశాలకు సరళమైన షరతులతో సహాయం అందిస్తోంది. మార్చి 2018 వరకు అంతగా అభివృద్ధి చెందని సభ్యదేశాలనుంచి దిగుమతి చేసుకున్న వస్తువులలో 97% మీద సుంకాలు రద్దుచేసింది (సుంకం శూన్యం) తన మార్కెట్లను మరింత ఓపెన్‌గా వుంచుతానని, ఎక్కువమందికి మార్కెట్లను అందుబాటులోకి తెస్తానని ప్రకటించింది. ఇలాంటి చర్యల ద్వారా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలను తీవ్ర ప్రకంపనలకు గురి కాకుండా చూస్తోంది చైనా.

అమెరికా వైపు చూస్తే ప్రపంచ దేశాలతో ఒక ఆర్థిక యుద్ధం చేస్తూన్నట్లుగా వుంది. అనేక కోట్ల విలువగల దిగుమతి సుంకాలు విధిస్తోంది. తమ జాతీయ ప్రయోజనాలు, జాతీయ పరిశ్రమల రక్షణ, అంతర్గత భద్రతవంటి ముసుగు నినాదాలు ఉపయోగించి మార్కెట్లను

మూసివేస్తోంది. తనకు అనుకూలమయిన వారితో, తన ఇష్టం వచ్చిన ఏకపక్ష నిబంధనలతో వ్యాపారం చేస్తూ, మూసివేస్తూ ఇతర దేశాల ఆర్థిక వ్యవస్థలను అతలాకుతలం చేస్తోంది. అనేక శాఖల అధికారులతో ముఖ్యంగా గూఢచార విభాగం వారితో కమీషన్లు వేసి, తమ ఎగుమతి దిగుమతి వ్యాపారాన్ని త్రీవమయిన ఆంక్షలకు గురి చేస్తోంది. ఒక్క 2017లోనే ఈ కమీషన్లు దాదాపు 20 విదేశీ కంపెనీల వ్యాపారాన్ని నిరోధించాయి. అందులో కనీసం 10 కంపెనీలు చైనావి. అమెరికా, చైనా రెండూ డబ్ల్యూటిఓ సభ్యదేశాలే. ఆసంస్థ నియమాలే వీరికి శిరోధార్యం కావాలి! ఆ పరిధిలో వాళ్ళ వివాదాలు పరిష్కరించుకోవాలి! అయితే అమెరికా దూకుడుగా, అహంభావంతో నిబంధనలన్నీ తుంగలోతొక్కి ఇతర దేశాల వ్యాపారాన్ని అడ్డుకుంటోంది. ముఖ్యంగా చైనా వ్యాపారాన్ని నిరోధించే ప్రయత్నం చేస్తోంది. ఇది అంతర్జాతీయ మౌలిక అవగాహనలకే విరుద్ధమయిన ప్రవృత్తి. తానైతే దొంగతనం చేయవచ్చు కానీ ఎదుటివాడు కన్నెత్తి కూడా చూడరాదు అనే అహంకారం, దుడుకుతనం ప్రదర్శిస్తున్నది అమెరికా. తద్విరుద్ధంగా అంతర్జాతీయ సమాజం ప్రయోజనాలకు అనుగుణంగా నడుస్తున్నది చైనా!

**3. ప్రపంచ వ్యవస్థల క్రమానికి విఘాతంకాదు, వాటిని కాపాడుతున్నాదే చైనా:** అంతర్జాతీయ న్యాయ సూత్రాలను, మార్గదర్శకాలను చైనా ఉల్లంఘిస్తోందని అమెరికా నిత్యం నిందిస్తూ ఉంటుంది. చైనా చర్యలు అంతర్జాతీయ నియమాలకు విరుద్ధమని, భంగకరమని దూషిస్తుంది. అయితే వాస్తవాల చరిత్ర మరోలా వుంది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఏర్పడిన ఐరాసలో 1971 వరకు చైనాను భద్రతామండలికి దూరంగా వుంచినా, ఈ సంస్థలో తన న్యాయబద్ధమైన స్థానం సుస్థిరం చేసుకుంది. అన్ని అంతర్జాతీయ సంస్థలలోను, సదస్సులలోనూ పాల్గొంటున్నది. దాదాపు 400 బహుళపక్ష ఒప్పందాలు చేసుకుంది. అంతర్జాతీయ వేదికలపై ఇతర ప్రభుత్వాలతో జరిగే చర్చలలో 90% సందర్భాలలో పాల్గొన్నది. ఫ్రాన్స్, జర్మనీ వంటి దేశాలు అంతర్జాతీయ సంస్థలతో ఎలా సంబంధాలు కలిగివుంటారో చైనా కూడా అలాగే అంతర్జాతీయ సంబంధాలు నెరపుతోంది. అంతర్జాతీయ ఆర్థిక, సామాజిక వ్యవహారాలలో ఇంత చురుకుగా పాల్గొంటున్న మరో దేశమేదీ లేదని 2017 యు.ఎన్.ఓ. ఇయర్‌బుక్ ప్రస్తుతించింది.

అధికాధికంగా అనేక దేశాలు, ప్రపంచ వ్యవహారాల నిర్వహణలో చైనా నిర్ణయాత్మక పాత్ర వహించాలని కోరుకుంటున్నాయి. ఆ బాధ్యత అది నిర్వహించగలదని భావిస్తున్నాయి. ఈ మధ్య చైనా ప్రతిపాదించి, నిర్మిస్తున్న రోడ్డు & బెల్ట్ పథకం – సంప్రదింపులు, సహకారం ద్వారా, ఉమ్మడి అభివృద్ధిని సాధించే ఉద్దేశానికనుగుణంగా వుంది. వర్తమాన పరిస్థితుల కనుగుణంగా రూపుదిద్దుకున్న 'ఆసియా మౌలిక వసతుల కొరకు పెట్టుబడుల బ్యాంకు' (AIIB) ప్రధానంగా చైనా చొరవ ఫలితమే.

్రాచైనా అనేక అంతర్జాతీయ శిఖరాగ్ర సమావేశాలలో పాల్గొంటున్నది. స్వయంగా వాటికి ఆతిథ్యమిచ్చి నిర్వహిస్తోంది. ఆర్థిక వ్యవహారాల నాయకుల సమావేశం, జి20 సమావేశం,

రోడ్&బెల్ట్ ఫోరం ప్రథమ సమావేశం, బ్రిక్స్ దేశాల 9వ శిఖరాగ్ర సమావేశంవంటి అనేక అంతర్జాతీయ ఘటనలకు నెలవు అయ్యింది. తన సహకారం అపారంగా అందించింది. ఇలాంటి అన్ని సందర్భాలలోను తాను మరింత వేగవంతంగా సంస్కరణలు అమలు పరుస్తానని, ఓపెన్ విధానాలను మరింత విస్తృత పరుస్తామని ప్రకటించింది. తమ అభివృద్ధిని పరిశీలించమని కోరింది. ఈ చర్యలన్నింటినీ అంతర్జాతీయ సమాజం హృదయపూర్వకంగా ఆహ్వానించింది. అమెరికా అనుసరిస్తూన్న ఏకధృవ ప్రపంచపు విధానాలకు సరిఅయిన సమాధానంగా, చక్కని ప్రత్యామ్నాయంగా చైనాను పరిగణిస్తున్నారు. ఇలా చైనా మిత్రుల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతుంది.

ఇదే సమయంలో అమెరికా వ్యవహారం ఎలా వుందో చూద్దాం. రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా ఒక పెద్ద ఆర్థికశక్తిగాను, ప్రపంచ నాయకునిగాను ఎదిగింది. పెట్టుబడిదారీ దోపిడీదారుల కుట్రలతోనూ, యుద్ధ వ్యాపార లాభాలతోనూ, ఒక పెత్తందారుగా మారిపోయింది. ప్రజావ్యతిరేక శక్తిగా బుసలుకొడుతోంది. తన సామ్రాజ్యవాద ధోరణితోను, అగ్రదేశ అహంకారంతోనూ, ప్రస్తుత ప్రపంచ దేశాల ఆలోచనలకు, ఆకాంక్షలకు శతృవుగా తయారయ్యింది. అంతర్జాతీయ సంస్థలనుండి తొలగిపోవడమో, నిష్క్రమిస్తానని బెదరించడమో చేస్తోంది. ప్రపంచం తన చెప్పుచేతలలో లేదనే ఆక్రోశపు ప్రకటనలే అవి. కొన్ని సందర్భాలలో ఆయా సంస్థలను మూసివేస్తోంది. చేసుకున్న ఒప్పందాలనుండి ముఖం చాటుచేస్తోంది. పర్యావరణ రక్షణ కోసం చేసుకున్న పారిస్ ఒప్పందం నుండి తప్పుకోవడం ఒక తాజా ఉదాహరణ. వాతావరణ విపరిణామాలకు వ్యతిరేకంగా సాగవలసిన కృషిని వొదిలివేసింది. ఐరాస మానవ హక్కుల కౌన్సిల్ నుండి, వలసలపై అంతర్జాతీయ ఒప్పందంనుండి, ఇరాన్‌తో అణుశక్తి ఒప్పందాలు వంటి వాటినుండి తప్పుకోవడమో, తప్పుకుంటానని బెదరించడమో చేస్తోంది. ఒకప్పుడు ఏడు అభివృద్ధి చెందిన దేశాల కూటమి (ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, ఇంగ్లండ్, జపాన్, కెనడా, అమెరికా దేశాలు) అమెరికా ఆధ్వర్యంలో బలమైన జి7 గ్రూపుగా వుండేది. ప్రపంచ పరిణామాలపై, సమస్యలపై నిర్ణయాలు ప్రకటిస్తుండేది. కొంతమేరకు తన ప్రభావం చూపేది. ఇప్పుడది అంతర్విరోధాల పరిష్కారాలకే పరిమితమయి పోయింది. తనప్రభావం తగ్గిపోతున్నకొద్దీ తనమాట చెల్లుబాటు కావటంలేదని అమెరికా, వ్యవస్థీకృతమై పటిష్టంగా సాగుతున్న అనేక ఏర్పాట్లను వ్యతిరేకిస్తోంది.

ఐరన్, స్టీలు, ఆటోమొబైల్ పరిశ్రమలు యూరప్, జపాన్ దేశాలలో సువ్యవస్థితమై వున్నాయి. వాటిని తిరగదోడి తనకనుకూలంగా పునర్విభజించాలని అమెరికా కుటిలయత్నం చేస్తోంది. దీంతో ఆయా దేశాలలో ఆందోళన, అస్థిరత నెలకొంటోంది. తన స్వప్రయోజనాల కోసం అమెరికా అంతర్జాతీయ సంస్థలను ఛిన్నాభిన్నం చేస్తూంటే చైనా ఆయా వ్యవస్థలను అభివృద్ధి చెందుతున్నదేశాల కనుకూలంగామార్చి, వాటిని కాపాడే ప్రయత్నం చేస్తోంది. మెరుగైన ప్రత్యామ్నాయ వ్యవస్థల నిర్మాణంవైపు చైనా అడుగులు వేస్తోంది.

ఈనాటి ప్రపంచంలో ఏకపక్ష వాదానికి గానీ, 'ఒకరికి లాభం అంటే మరొకరికి నష్టమే' అనే మనస్తత్వానికిగానీ భవిష్యత్తు లేదు. ప్రపంచ మార్పులను గమనిస్తూ చైనా అంతర్జాతీయ సమాజంతో కలసి ప్రయాణిస్తోంది. కచ్చితమైన అవగాహనతో, అంకితభావంతో నూతన అంతర్జాతీయ సంబంధాలకు రూపుదిద్దటానికి, మానవాళి ఉజ్వల భవిష్యత్తు కోసం, అందరి భాగస్వామ్యంగల వ్యవస్థ నిర్మాణంకోసం కృషి చేస్తోంది చైనా. ఇప్పటిది ఒక సంక్లిష్ట దశ. ఆర్థికంగా చైనా వ్యవస్థ చాలా వృద్ధిపొందింది. ప్రపంచం మీద చైనా ప్రభావం ఎన్నో రెట్లు విస్తరించింది. దేశీయంగాను అంతర్జాతీయంగాను పరిగణించవలసిన అంశాలు చైనాముందు ఎన్నో వున్నాయి. అలాగే చైనా విధానాలు చాల భిన్నమైనవి, విశిష్టమైనవి. మునుపటి సోవియట్ రష్యా మొదట్లో అనుసరించిన సోషలిస్టు నిర్మాణ పద్ధతులకు మాత్రమే పరిమితం కానివి. నేటి పశ్చిమ పెట్టుబడిదారీ విధానాలకు అతీతమైనవి. చైనా పశ్చిమ ప్రపంచం నుంచి చాలా నేర్చుకుంది. దాన్ని చాలా విభిన్నంగా, విశిష్టంగా తన పరిస్థితుల కనుగుణంగా మలచుకొంది. ఈ ప్రత్యేక సామ్యవాద దృష్టిని నిలబెట్టుకోవడం చైనాకు చాల ప్రాముఖ్యతగల అంశం. అనేక ప్రాంతాల నుంచి, అనేకుల అనుభవాలనుంచి చారిత్రక, సాంస్కృతిక వారసత్వ సంపదలనుండి మేలైనఅంశాలను ఏరుకుని, సమన్వయపరచి నేటికి ఆచరణసాధ్యమయిన కార్యక్రమంగా మలచగలగిన శక్తి, సిద్ధాంత పరిజ్ఞానం, శాస్త్రీయ దృష్టి చైనా విజయాల వెనుకవున్న మూలసంపద. సామ్యవాద నిర్మాణానికి అంకితమై పనిచేయటం, జనతా ప్రజాతంత్రానికి కట్టుబడివుండటం, శ్రామికవర్గ పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన్ని అంగీకరించి అనుసరించటం, మార్క్సిజం-లెనినిజం - మావో ఆలోచనా విధానాలకు కట్టుబడివుండటం అన్న నాలుగు ఆధారాలపై జనచైనా నిర్మించబడుతోంది. అత్యధిక ప్రజల ప్రయోజనమే లక్ష్యంగా సామ్యవాద ఆధునికీకరణను సాధిస్తోంది. సామ్రాజ్యవాద అమెరికావంటి దేశాలను ఎదుర్కొంటూ తన ప్రస్థానం సాగిస్తోంది.

చైనా అమెరికాలా వుందనుకునేవారు కొందరు, అలా వుండాలనుకునేవారు కొందరున్నారు. చైనా అభివృద్ధి మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థలో సాధించిన అభివృద్ధిగా భావించేవాళ్ళు కొందరున్నారు. అమెరికా విడిచిన చెప్పుల్లో చైనా కాళ్ళుపెట్టిందనే వాళ్ళు ఇంకొందరున్నారు. వీరంతా చైనా పాలకులు అచంచలంగా అనుసరిస్తున్న సామ్యవాద సిద్ధాంతాలను పరిగణించటం లేదు. ఈ రెండు దేశాల వ్యవస్థలమధ్య వున్న తేడాలను, మానవాళి భవిష్యత్తు గురించిన లక్ష్యాలపై వారిమధ్య వున్న అంతరాన్ని గమనించటం లేదు. ఈనాడు అమెరికా పీకల్లోతు కష్టాలలో మునిగితేలుతోంది. దీర్ఘకాలపు పతనావస్థకు చేరుకుంది. అదే సందర్భంలో చైనా దినదిన ప్రవర్ధమానమవుతోంది. ప్రపంచ పీడిత ప్రజల ఆశల కేంద్రంగా మారుతోంది. దేశం తర్వాత దేశం చైనాతో మైత్రికి ముందుకు వస్తున్నాయి. క్షీణిస్తున్న అమెరికా ఏకదృవ ప్రపంచానికి సమాధానంగా, ఉమ్మడి భాగస్వామ్యంగల అభివృద్ధిపథం రెక్కలు విప్పు కుంటోంది. సోషలిస్టు నిర్మాణంలో చైనా అనుసరిస్తూన్న నూతన

మార్గావిష్కరణలు, వారి సంస్కరణలు, ఓపెన్ విధానాలు ఆరంభం అయిన 40వ వార్షికోత్సవంలో అందుకే అనేక దేశాలు చైనాకు జేజేలు పలుకుతున్నాయి.

1990ల నుండి భారతదేశం ఆర్థిక సంస్కరణలు చేపట్టిందని చెబుతారు. ప్రపంచీకరణం, ఉదారవాదం, ప్రైవేటీకరణ మంత్రాలుగా అభివృద్ధి సాధిస్తోందని, ఇదే ప్రపంచమార్గమని పెట్టుబడిదారీ శక్తులు సంకీర్తనం చేస్తున్నాయి. ఇదంతా ప్రజాస్వామ్య బద్ధంగా జరుగుతున్నదని వక్కాణిస్తారు. కానీ మన దేశంలో అత్యధిక జనం సమస్యల నిత్యాగ్నిహోత్రంలో సమిధలుగా కాలిపోతున్నది వాస్తవం. ఆర్థికంగా పరాధీనంగా వుంటూ నిత్యం విదేశీ పెట్టుబడులకోసం అంగలార్చుతూ వుండటం నిజం. స్వతంత్ర పారిశ్రామికీకరణలో వెనుకబడి 'మేక్ ఇన్ ఇండియా' అంటూ కేకలు వేస్తూండటం నిజం. శాస్త్ర సాంకేతిక రంగాలలో వెనుకబడి వుండటం నిజం. ప్రపంచ ఆకలి సూచికలో మనది 106వ స్థానం అంటే సిగ్గుచేటు కాదా! పెట్టుబడిదారీ యజ్ఞఫలాలు పిడికెడుమంది సామ్రాజ్యవాద తొత్తులకు, బడాపెట్టుబడిదారులకు, భూస్వామ్య వర్గాలకే అందుతున్నది నిజం. ఈ నేపథ్యంలో, మనం చైనా అభివృద్ధిక్రమపు 40వ వార్షికోత్సవ సందర్భంలో నేర్చుకునేదేమయినా వుందా?

చైనా అభివృద్ధి ఈ ప్రపంచానికి ఏమి ఇచ్చిందో గమనించండి. అర్ధవలస, అర్ధభూస్వామ్య దేశాలకు విప్లవ మార్గాన్నిచ్చింది. మూడవ ప్రపంచ దేశాలకు అభివృద్ధి నమూనాను ఇచ్చింది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వారసత్వాన్నిచ్చింది. దురహంకార అగ్రదేశాలకు ఎదురునిలిచి వారిని గెలిచే ధైర్యాన్నిచ్చింది. తమతమ జాతీయ అభివృద్ధి పంథాలను నిర్ణయించుకుని, కొనసాగించే లక్ష్యాలనిచ్చింది. ఉమ్మడి భాగస్వామ్యంతో మానవాళి చేరుకోవలసిన భవిష్యత్ వ్యవస్థల నిర్మాణానికి అంకురార్పణ చేసింది! మానవాళిని నిర్వీర్యంగా, స్వార్ధ సంకుచితంగా చేస్తూన్న పెట్టుబడిదారీ వ్యవస్థలకు ప్రత్యమ్నాయంగా, రానున్న సామ్యవాద భవిష్యత్తు చిత్రానికి రూపురేఖలు దిద్దుతోంది. అందుకే ప్రజలనుండి నీరాజనాలు అందుకుంటోంది.

*–డిసెంబర్, 2018*



# 18.

# 70 సంవత్సరాల జనచైనా ఉజ్జ్వల ప్రస్థానం

(జనచైనా ఆవిర్భవించిన 70వ వార్షికోత్సవం సందర్భంగా, ఢిల్లీలోని చైనా రాయబారి కార్యాలయం నుండి సమాచారము, చైనా రాయబారి సన్-వి-డాంగ్ సందేశము కలిపి 26 సెప్టెంబరు, 2019న కొన్ని ఇంగ్లీషు దిన పత్రికలలో ప్రచురించారు. "ది హిందూ"లో వచ్చిన ఆ ప్రచురణలోని కొన్ని ముఖ్యభాగాలకు తెలుగు అనువాదం ఇది.)

2019 అక్టోబరు 1వ తేదీ జనచైనా ఆవిర్భవించిన 70వ వార్షికోత్సవం. ఇది చాలా ప్రాధాన్యతను సంతరించుకున్న సందర్భం. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో అనేక విషమ పరిస్థితులను అధిగమిస్తూ, అకుంఠిత కృషితో చైనా ప్రజలు గణనీయమైన ప్రగతిని సాధించారు. ఒకదాని తరువాత మరొకటిగా అనేక అద్భుత విజయాలను సృష్టించారు. చైనా భవిష్యత్తును, గమ్యాన్ని ప్రాథమికంగా మార్చి వేశారు. ఆ ఆర్థిక పురోభివృద్ధి స్థిరంగా, బలంగా, సౌష్టవంగా, నిరంతరాయంగా ముందుకు సాగుతున్నది. చట్టబద్ధమైన పాలన మెరుగులు దిద్దుకుంటోంది. భిన్న స్థానిక ప్రాచీన జనసముదాయాల (ఎత్నిక్ గ్రూపుల) మధ్య ఐక్యతను, వారిని అభివృద్ధి చేయడంలో గణనీయమైన ప్రగతినీ సాధించారు. ప్రజల జీవన ప్రమాణాలు నిరంతరం మెరుగుపడుతున్నాయి. 2018లో స్థూల జాతీయ తలసరి ఆదాయం 10వేల డాలర్లకు చేరువయ్యింది. 85 కోట్లమంది ప్రజలు దారిద్ర్యంనుండి బయటపడ్డారు. చైనా సామ్యవాద పంథాకు తన విశిష్టలక్షణాల వన్నెలు అద్దింది.

## మహత్తర ప్రయాణం (01.10.1949 నుండి 01.10.2019):

70 సంవత్సరాల నిర్విరామ కృషితో, చైనా ప్రజలను ఐక్యంచేసి, వారి అద్భుతమైన ప్రయాణానికి నాయకత్వం వహించిన చైనా కమ్యూనిస్టుపార్టీ అపరిమితమైన వేగంతో పరివర్తనలను సాధించింది. దేశం లేచి నిలుచున్నది. సంపన్న దేశంగా ఎదిగింది. ఇప్పుడు బలమైన శక్తిగా మారుతోంది. చైనా విశిష్ట లక్షణాలుగల సామ్యవాదపథం నిర్ధారించబడింది. అభివృద్ధి చేయబడింది. నానాటికీ మరింత మెరుగులు దిద్దుకుంటోంది. చాలీచాలని తిండీ,

బట్టా, అన్న స్థాయినుండి మధ్యస్థమైన సంపదగల స్థాయికి చైనా ప్రజలు పెద్ద ముందంజవేశారు. చైనా దేశం పూర్తిగా కొత్తదైన ఒక నవీన అభివృద్ధి పంథాలో నడిచి, తూర్పు ప్రపంచంలో మహోన్నతంగానూ, బలిష్టంగానూ నిలబడివుంది నేడు.

చైనా ప్రజలు లేచినిలబడ్డారు --

1949 అక్టోబరు 1వ తారీఖున తియానన్‌మెన్ స్క్వేర్‌లో 5 నక్షత్రాల అరుణ పతాకాన్ని ఎగురవేశారు. మావో జెడాంగ్ తమ ప్రధాన ప్రతినిధిగా చైనా కమ్యూనిస్టులు తమ ప్రజలను నూతన జనతా ప్రజాతంత్ర విప్లవంలో విజయంవైపు నడిపించారు. జనచైనా రాజ్యాన్ని స్థాపించారు. మౌలికంగా సామ్యవాద వ్యవస్థను నెలకొల్పారు. ఆధునిక చరిత్రలో అనేక కఠినమైన సంఘర్షణలను ఎదుర్కొని అంతిమంగా తమ రాజ్యం తిరిగి ఆవిర్భవించన అరుణోదయాన్ని వాళ్లు వీక్షించారు. జనచైనా ఆవిర్భావంతో ప్రజలు తమ దేశ అధినేతలయ్యారు. తమ గమ్యానికి, సమాజ గమనానికి తామే నిర్ణేతలయ్యారు. తమ దేశాన్ని ఒక బలమైన, భాగ్యవంతమైన దేశంగా మార్చాలనే కలను సాకారం చేసుకోవటానికి వారు సుదీర్ఘ ప్రయాణానికి సిద్ధమయ్యారు. ప్రజలు నిండు గౌరవంతో, ఆనందంగా బ్రతికే జాతీయ పునరుజ్జీవనానికి నడుం బిగించారు.

## సంస్కరణలు - ఓపెన్‌అప్ విధానాల వసంత సమీరం

1978, చైనా కమ్యూనిస్టుపార్టీ 11వ మహాసభల మూడవ ప్లీనరీ సమావేశాలనుండి కామ్రేడ్ డెంగ్ సియావో పింగ్ నాయకత్వంలో చైనా ఒక చారిత్రక ప్రక్రియను ఆరంభించింది. అదే సంస్కరణల పర్వమూ ఓపెన్‌అప్ విధానము దేశ ఆర్థిక వ్యవస్థను అంతర్జాతీయ వాణిజ్యానికి తెరచివుంచటం, సంస్కరణలను ప్రవేశపెట్టడం అనేది, చైనా కమ్యూనిస్టు పార్టీకీ ఒక గొప్ప మేలుకొలుపు. చైనా ప్రజల చరిత్రలోను, దేశ అభివృద్ధిలోను అది ఒక విప్లవాత్మక పరివర్తన. అంతకుముందు ఎన్నడూచూడని లోతైన మార్పులకు దారితీసిన గొప్ప పరిణామం అది. ఇతర ప్రపంచానికి తమ తలుపులు తెరచివుంచటం. సంస్కరణలను అమలు చేయడం అనేవి సమకాలీన చైనా యొక్క అత్యంత విశిష్ట లక్షణంగా మారాయి. నేటి చైనా గమ్యాన్ని నిర్దేశించే రెండు శతాబ్ది లక్ష్యాలను (Centenary Goals) సాధించడానికీ, చైనా జాతీయ పునరుజ్జీవనానికి కారణమైన కీలక అంశాలు ఈ సంస్కరణలు, ఓపెన్‌అప్ విధానాలు.

## కొత్తయుగంలోకి ముందడుగు

18వ జాతీయ మహాసభల నుండి కామ్రేడ్ జి జిన్‌పింగ్ నాయకత్వంలో చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సామ్యవాద పతాకను సమున్నతంగా నిలబెట్టడానికి దేశంలోవున్న వివిధ ప్రాచీన జన సముదాయాలను ఐక్య పరిచింది. నూతన యుగానికి అవసరమైన చైనా విశిష్టతలు గల సామ్యవాద పంథాకు, కామ్రేడ్ జి జిన్‌పింగ్ ఆలోచన

మార్గదర్శకంగా వుంది. ఐదు రంగాలలో ఒక సమగ్ర అభివృద్ధి పంథాను (Five Sphere Integrated Plan) సమన్వయంతో అమలు చేయడాన్ని ప్రోత్సహించింది. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, సామాజిక, పర్యావరణ రంగాలలో నాలుగు ముఖాలుగా విస్తరించిన సమగ్ర వ్యూహం (Four Pronged Comprehensive Strategy) అమలుచేశారు. అన్ని రంగాల్లో మధ్యస్థాయిని చేరుకునే సంపన్న సమాజ నిర్మాణం, సంస్కరణలను లోతుగా అమలుపరచటం, చట్టబద్ధమైన పాలనను పెంపొందించటం, పార్టీమీద సంపూర్ణమైన, ఖచ్చితమైన పాలన అమలుచేయడం అనేవి నాలుగు ముఖాల కార్యక్రమం. ఓపెన్‌అప్ విధానాలు, సంస్కరణలవల్ల సహకారంతో సామ్యవాద ఆధునికీకరణ అనే చారిత్రాత్మక విజయాన్ని సాధించారు. అందువల్ల చైనా లక్షణాలుగల సామ్యవాద నిర్మాణం నేడు నూతన దశకు చేరుకుంది. శాంతి, అభ్యుదయం ఇరుపక్షాలకు లాభకరమైన సహకారం అనే తన పంథాకు చైనా కట్టుబడి ఉంటుంది. తన విజ్ఞతను, వివేకాన్ని, శక్తిని ప్రపంచంలో శాంతియుత అభివృద్ధిని పెంపొందించటానికి వినియోగిస్తుంది. చైనా, ప్రపంచ ప్రజలు కలసి మానవాళికి ఉమ్మడి భాగస్వామ్యం గల భవిష్యత్ సమాజాన్ని నిర్మించాలని, సంయుక్తంగా అందరికీ ఉజ్వల భవిష్యత్తును నెలకొల్పగలమనీ భావిస్తోంది.

ఈనాడు చైనా ఒక గొప్ప ఆరంభం వద్ద నిలబడివుంది. ఎన్నో గొప్ప విజయాలు సాధించినప్పటికీ ఎక్కవలసిన గిరి శిఖరాలు ఇంకా ఎన్నోవున్నాయి. దాటవలసిన సముద్ర జలాలు, దారినిండా పరుచుకుని వున్నాయి. చైనా కమ్యూనిస్టు పార్టీ, చైనా ప్రజలు తమ సోషలిస్టు పంథాను కొనసాగిస్తారు. తమ విశిష్ట లక్షణాలతో, నూతనశకంలో అద్భుత విజయాలను ఆవిష్కరిస్తూ, మానవాళి పురోగతికి తోడ్పాటునందిస్తారు.

## ఏడు దశాబ్దాల చైనా విజయాలు

### 1) ఆర్థికం

గత 70 సంవత్సరాలలో చైనా శరవేగంగా ఆర్థిక అభివృద్ధిని సాధించింది. మొత్తం స్థూల జాతీయ ఉత్పత్తి (,,,) ఏటా 8.1% రేటున వృద్ధి పొందింది. 1979 నుండి 2018 వరకు చైనా సరాసరిన ఏటా 9.4% ఆర్థికాభివృద్ధిని సాధించింది. ఇది ప్రపంచసగటు అభివృద్ధి రేటు 2.9%కంటే ఎంతో ఎక్కువ. 1952లో చైనా స్థూలవుత్పత్తి 3వేల కోట్ల డాలర్లు మాత్రమే వుండేది. 2018కి అది 13.61 లక్షల కోట్ల డాలర్లకు పెరిగింది. అంటే 452.6 రెట్లు వృద్ధి జరిగింది. 1978లో చైనా ఆర్థిక వ్యవస్థ ప్రపంచంలో 11వ స్థానంలో వుండేది. అయితే 2010కి అది 2వ స్థానానికి చేరుకుంది. 2018కి తలసరి జాతీయోత్పత్తి 9732 డాలర్లు అయ్యింది. ఇది మధ్యస్థాయి ఆదాయంగల దేశాలకంటే ఎక్కువ. 2018లో చైనా 3.07 లక్షల కోట్ల డాలర్ల విదేశీ మారకనిల్వలతో ప్రపంచంలో ప్రథమ స్థానంలోవుంది. గత 13 సంవత్సరాలుగా చైనా ఈ మొదటి స్థానంలోనే వుంటూవస్తున్నది. అదే 1952లో ఈ నిల్వలు 1080 లక్షల డాలర్లు మాత్రమే వుండేవి.

## 2. రాజకీయం

దశాబ్దాల తరబడి సాగించిన కఠోర శ్రమవల్లనే చైనా లక్షణాలతో సామ్యవాదం ఈనాడు కొత్తయుగంలోకి ప్రవేశించింది. చైనా దేశం ఒక అద్భుతమైన పరివర్తనను సాధించి, దేశ పునరుజ్జీవనంలో ఒక కాంతివంతమైన దృశ్యాన్ని ఆవిష్కరిస్తోంది. మేము సామ్యవాద ప్రజాతంత్రాన్ని చురుకుగా పెంపొందించాము. చట్టపరమైన పరిపాలనను అభివృద్ధిచేశాము. ఈ మార్గం, సిద్ధాంతం, వ్యవస్థ, చైనా విశిష్టతలుగల సామ్యవాద సంస్కృతి నిరంతరం అభివృద్ధి చెందుతూ వచ్చాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల ఆధునికీకరణకు అనుసరించదగ్గ కొత్తదారులను వెలుగులోకి తెచ్చాయి. సోషలిజాన్ని ఎత్తిపట్టి దాన్ని అభివృద్ధిచేసే గురుతరమైన బాధ్యతను నిర్వహించటమంటే సోషలిజాన్ని ఆధునికీకరిస్తూ, దేశ పునరుజ్జీవనానికై కృషి చేయడమే. సర్వతోముఖంగా మధ్యస్థాయి సంపన్న దేశంగా ఎదగడంకోసం రెండు అంచెల అభివృద్ధిపథాన్ని అనుసరించడమే. ఆధునిక సోషలిస్టు రాజ్య నిర్మాణమంటే దనవంతము, శక్తివంతము, ప్రజాతంత్రయుతమూ అయిన ఉన్నత సాంస్కృతికవిలువలుగల, సామరస్య పూరితమైన అందమైన సమాజాన్ని ఈ శతాబ్ది సగానికల్లా (2050) సాధించే కృషి కొనసాగించటమే.

## 3. సంస్కృతి

2019లో ప్రపంచ సాంస్కృతిక వారసత్వ ప్రదేశాలుగా చైనాలో 55 ప్రాంతాలు ఎన్నికైనాయి. దాంతో చైనా మొదటి స్థానం పొందుతుంది. సాంస్కృతిక (బృందాల) మార్పిడివల్ల, ఈ సంవత్సరం ఇతరదేశాలతో రాకపోకలవల్ల, సమాచార సంబంధాలవల్ల చైనా మంచి ఫలితాలు పొందింది. 2017 చివరికి 157 దేశాలతో సాంస్కృతిక సహకార ఒప్పందాలు చేసుకుంది. దాదాపు 800 సాంస్కృతిక మార్పిడుల ప్రణాళికలు సిద్ధం చేసింది. విదేశాలలో చైనా సాంస్కృతిక కేంద్రాలు, కన్ఫ్యూషియస్ అధ్యయన సంస్థలు తెరిచారు. చైనా సాంప్రదాయ సాంస్కృతిక కార్యక్రమాలు, శరీర విన్యాసాలు (ఆక్రోబాటిక్స్), పోరాటవిద్యలు (మార్షల్ ఆర్ట్స్), అందమైన దస్తూరి (కాలిగ్రఫీ), బీజింగ్ నృత్యనాటికలు (ఓపెరాలు), తాయ్‌చీ కళలు ప్రపంచమంతా పరిచయమయ్యాయి. 2017కల్లా విదేశాలలో ఉన్న చైనా సాంస్కృతిక కేంద్రాలలో దాదాపు 4వేల ప్రదర్శనలిచ్చారు. 80 లక్షలమంది ఈ కార్యక్రమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. 2017 చివరికి 146 దేశాలు, ప్రాంతాలలో 525 కన్ఫ్యూషియస్ అధ్యయన నిలయాలు, 1113 కన్ఫ్యూషియస్ తరగతి గదులు నెలకొల్పబడ్డాయి.

## 4. సమాజం

130 కోట్ల చైనీయులకిక ఏమాత్రం ఆహార కొరతగానీ, వస్త్రాల కొరతగానీ లేదు. 85 కోట్లమంది పేదరికంనుండి బయటపడ్డారు. 77 కోట్లమంది ఉద్యోగాలు చేస్తున్నారు. తొమ్మిది సంవత్సరాల నిర్బంధ ఉచిత విద్యావిధానం పిల్లలకోసం అమలవుతుంది. చైనాలోని

వైద్యరంగం - సార్వత్రిక ఆరోగ్య పరిరక్షణ, సామాజిక భద్రతా పథకాలవల్ల - ప్రపంచస్థాయిలో ముందంజలో ఉంది. 1949లో సగటు ఆయుర్దాయం 35 సంవత్సరాలుగా వుండేది. 2018కి అది 77 సంవత్సరాలకు పెరిగింది. మాతాశిశు మరణాల రేటుకూడా గణనీయంగా తగ్గిపోయింది. గర్భిణీస్త్రీల మరణాలు 70 సంవత్సరాలనాడు 10వేల కాన్పులకు 1500గా వుండేది. నేడది 183కు తగ్గిపోయింది. అలాగే శిశుమరణాలు 200/1000 వుండేది. 2018కి అది 6/1000కి తగ్గిపోయింది. ఈ రెండు అంశాలలో, మిలీనియం అభివృద్ధి లక్ష్యాలను గడువుకన్నా ముందుగానే అందుకున్నారు. 1978లో 77కోట్లమందిగా వున్న నిరుపేదల సంఖ్య 2018లో 1.6 కోట్లకు పడిపోయింది. దారిద్ర్యరేటు 97.5% నుండి 1.7%కి తగ్గిపోయింది. "2020కల్లా మేము గ్రామాలలో ప్రస్తుతం దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్న వారందరినీ పేదరికంనుండి విముక్తి చేయగలుగుతాము. దానితో పూర్తిగా పేదరికాన్ని నిర్మూలించినట్లవుతుంది. అది ప్రపంచంలోనే అభివృద్ధి సాధనలోనూ, బీదరికం నిర్మూలనలోనూ 'అత్యద్భుతం' అవుతుంది". అలా శతాబ్దపు మొదటిలక్ష్యం - అంటే సర్వరంగాలలోనూ మధ్యస్థాయి సంపన్న దేశంగా చైనాను మార్చటం - పూర్తవుతుంది.

## 5. పర్యావరణ నాగరికత

చైనా పర్యావరణ కాలుష్యాన్ని అరికట్టటానికి, నివారించటానికి చాలా కఠినమైన పర్యావరణ చట్టాలను, సమస్య కేంద్రకంగా పనిచేసే పర్యవేక్షక విధానాలను గట్టిగా అమలుచేస్తోంది. తనదైన నూతన, సృజనాత్మక, సమన్వయ పూరితమైన హరితరక్షణ ప్రణాళికలను పారదర్శక క్రమంలో అందరి భాగస్వామ్యంగల అభివృద్ధి పంథాను అమలు పరచటానికి తీవ్రంగా కృషి చేస్తోంది. సరియైన పర్యావరణం సృష్టించటానికి, కర్బన ఉద్గారాల విడుదలను తగ్గించటానికి, ఇంధన శక్తిని సంరక్షించడానికి, వాయుకాలుష్యం, జల కాలుష్యాలను నివారించటానికి, వాటివల్ల తలెత్తే సమస్యలను పరిష్కరించటానికి చైనా తీసుకుంటున్న చర్యలు సత్ఫలితాలనిచ్చాయి. 10,000 యువాన్లు (1500 డాలర్లు) విలువగల జాతీయ ఉత్పత్తిని సాధించడానికి విడుదలయ్యే కార్బన్-డై-ఆక్సైడ్ వాయువును, 2018లో 4 శాతానికి తగ్గించగలిగారు. తిరిగి వాడుకునే రీతిలో ఇంధన ఉపయోగం 7 లక్షల 28 వేల మెగావాట్లకు చేరుకుంది. ఇది సంవత్సరానికి 12% చొప్పున పెరిగింది. 2000 నుండి ప్రపంచ హరితపత్ర పెంపుదలలో చైనా దాదాపు 25% సమకూర్చింది. గత 40 సంవత్సరాలలో అడవుల పెంపకంలో 10% నుండి 21.66% వరకు వృద్ధి సాధించింది. ప్రస్తుతం మన భూగోళంమీద మనిషి పెంచిన అడవుల విస్తీర్ణం అత్యధికంగా ఉన్న దేశం చైనా.

## 6. దౌత్యం

దౌత్యరంగంలో చైనా కొన్ని విశిష్ట లక్షణాలుగల సాంప్రదాయాన్ని ప్రవేశపెట్టింది. చైనా విదేశనీతిలో కీలకాంశం వారి స్వతంత్రవైఖరి. మానవాళి ఉమ్మడి శ్రేయస్సు, సమాన నీతి

న్యాయాలను స్థాపించటం, న్యాయం సాధించటం, ఇరుపక్షాలకు లాభకరమైన విధానాలకు కట్టుబడి వుండటం, దేశీయ అభివృద్ధిని సాధించటం, చైనా జనావళికి శుభం పూయించటం సమ్మిళితమైనది ఈ సాంప్రదాయం. కామ్రేడ్ జి జిన్‌పింగ్ ఆలోచనా విధానం, నేటి చైనా విదేశాంగనీతికి మౌలిక దిశానిర్దేశం చేస్తున్నది. ఒకవంక దేశ సార్వభౌమాధికారాన్ని, దేశ భద్రతను, అభివృద్ధి ప్రయోజనాలను పరిరక్షిస్తూ, మరోపక్క విదేశాలతో సరికొత్త అంతర్జాతీయ సంబంధాలను నెలకొల్పుకొని, మానవాళి ఉమ్మడి భవిష్యత్తుకై అందరి భాగస్వామ్యంగల సామరస్యపూరిత సమాజాన్ని నిర్మించటానికి చైనా అంకితమైవుంది. ప్రపంచశాంతిని ప్రోత్సహించేదిగా, ప్రపంచ పురోగతికి తోడ్పడేదిగా, అంతర్జాతీయ క్రమాన్ని ఎత్తిపట్టేదిగా చైనా విస్తృత ప్రశస్తిని పొందుతూ, అంతర్జాతీయ వేదికలమీద కేంద్రబిందువుగా మారుతోంది. 1990లనుండి ఐక్యరాజ్యసమితి చేపట్టిన 30 శాంతి పరిరక్షక కార్యక్రమాల్లో 40వేలమంది శాంతి పరిరక్షకులను సమకూర్చి తనవంతు పాత్రను పోషిస్తోంది.భద్రతాసమితిలోని 5గురు శాశ్వత సభులలో మరెవరూ ఇంతగా పాల్గొనలేదు. ప్రపంచంలోని ఉద్రేకభరిత సమస్యలను తీర్చడంలో తనవైన నిర్మాణాత్మక పరిష్కారాలను సూచిస్తూ చైనా అంతకంతకు ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తోంది. బెల్ట్ అండ్ రోడ్ పథకాన్ని ప్రతిపాదించి ఖండాంతరాలను చేరువచేసే మార్గాలను, వారధులను, సహకారాన్ని ప్రోత్సహిస్తున్నది. బహుపక్ష వాణిజ్య వ్యవస్థను, వ్యాపార నిర్వహణలోను, పెట్టుబడులలోను ఉదారంగా వ్యవహరించటాన్ని, వెసులుబాట్లు కల్పించటాన్ని చైనా ప్రోత్సహిస్తోంది. ఈ విషయంలో సుదృఢంగా వ్యవహరిస్తోంది. ఇక దేశాల, ప్రాంతీయ, ఉపప్రాంతీయ సహకారం పెరిగేందుకు వీలుగా 17 స్వేచ్ఛావాణిజ్య ఒప్పందాలు చేసుకుంది చైనా. ఇలా సరికొత్త అంతర్జాతీయ సంబంధాలతో, బహుళపక్ష సహకారం ప్రాతిపదికగా, ప్రపంచశాంతి, అభ్యుదయాలకై పాటుపడుతోంది చైనా. ప్రపంచశాంతి, ప్రగతి, స్థిరత్వాలకోసం తన వివేకాన్ని జోడించి నూతన పరిష్కారాల దిశగా పురోగమిస్తోంది.

చైనా, ఇండియాలు ఇరుగుపొరుగు దేశాలు, నదులు, పర్వతాలు ఇద్దరినీ కలుపుతున్నాయి. ఇరుపక్షాలకు ప్రయోజనం సిద్ధించే వ్యవహారాల భాగస్వాములు ఒకరితో ఒకరు చేయిచేయి కలిపి ముందడుగు వేయాలి. మనమిద్దరం అభివృద్ధి చెందుతున్న పెద్దదేశాలం. మన జాతీయ స్వాతంత్ర్య పోరాటాలకాలంలో ఇరుదేశాల ప్రజలు పరస్పరం హాగా సహకరించుకున్నారు. ఒకరికొకరు మద్దతు తెలిపారు. ఈ మధ్యకాలంలో కూడా చైనా ఇండియాతో తన సంబంధాలను మరింత ఉన్నతస్థాయికి తీసుకు వెళ్ళాలని చూస్తోంది. చైనా, ఇండియాకు అవసర సరుకుల వ్యాపారంలో అతి పెద్ద భాగస్వామి. అలాగే దక్షిణాసియాలో ఇండియా చైనాకు అతి పెద్ద వ్యాపార భాగస్వామి. 1000కి పైగా చైనా కంపెనీలు ఇండియాలో వాణిజ్యం నిర్వహిస్తున్నాయి. ఇండియాలో ఆ కంపెనీలు 800 కోట్ల డాలర్ల పెట్టుబడులు

పెట్టాయి. స్థానికులకు దానివల్ల దాదాపు 2 లక్షల ఉద్యోగాలు అందుబాటులోకి వచ్చాయి. అలాగే చైనాలో వున్న భారతీయ కంపెనీలు 2/3వంతులు లాభాలు ఆర్జిస్తున్నాయి.

చైనా, ఇండియాలు కలసి ప్రపంచ జనాభాలో 40% శాతం వున్నారు. అందువల్ల ఇరుదేశాలమధ్య మరెంతో సహకారం అభివృద్ధి చెందటానికి విశాలమైన పరిధి, విస్తృతమైన సంభావ్యత (అవకాశం) వున్నాయి. ఈ అవకాశాలను మనం ఇరువురం పూర్తిగా వినియోగించుకోవాలి. రాబోయే సంవత్సరం మన ఇరుదేశాల మధ్య దౌత్య సంబంధాలు ఏర్పడిన 70వ వార్షికోత్సవ సందర్భం. ఆ ఉత్సవ అవకాశాన్ని పూరిగా వినియోగించుకుందాం. మన ఇరుదేశాల అధినేతలు, (వూహాన్ సమావేశంలో) ప్రకటించిన ఏకాభిప్రాయాన్ని అమలుచేస్తూ, సహకారంపై దృష్టి కేంద్రీకరించి ఉమ్మడి ప్రయోజనాలు నెరవేరే అభివృద్ధిని సాధిస్తూ భారత చైనా మైత్రీ చరిత్రలో కొత్త అధ్యాయాన్ని రచిద్దాం.



# China Aagamanam

*- An Anthalogy of Essays by* **Dr. S. Jatin Kumar**



చైనా అభివృద్ధి ఈ ప్రపంచానికి ఏమి ఇచ్చిందో గమనించండి.

అర్ధవలస, అర్ధభూస్వామ్య దేశాలకు విప్లవ మార్గాన్నిచ్చింది. మూడవ ప్రపంచ దేశాలకు అభివృద్ధి నమూనాను ఇచ్చింది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వారసత్వాన్నిచ్చింది. దురహంకార అగ్రదేశాలకు ఎదురునిలిచి వారిని గెలిచే ధైర్యాన్నిచ్చింది. తమతమ జాతీయ అభివృద్ధి పంథాలను నిర్ణయించుకుని, కొనసాగించే లక్ష్యాలనిచ్చింది. ఉమ్మడి భాగస్వామ్యంతో మానవాళి చేరుకోవలసిన భవిష్యత్ వ్యవస్థల నిర్మాణానికి అంకురార్పణ చేసింది! మానవాళిని నిర్వీర్యంగా, స్వార్ధ సంకుచితంగా చేస్తూన్న పెట్టుబడిదారీ వ్యవస్థలకు ప్రత్యమ్నాయంగా, రానున్న సామ్యవాద భవిష్యత్తు చిత్రానికి రూపురేఖలు దిద్దుతోంది.

**India-China Friendship Association**
Hyderabad.